## నెం. 2

మమ్ము పరిహాసమొనరించె । మగువనిడుదంచువచియించె
క్షత్రియోత్తములజూచెను । క్రొత్తధర్మంబువిడచెను
విప్రునకుకన్నెనిచ్చెను । వీనికిమదంబుహెచ్చెను
అపుడుకౌరవులుదలపడిరి । ద్రుపదునిజుట్టుముట్టిరి
వేగద్రుపదుండుగాంచెను । విప్రులనుశరణుబొందెను
అపుడుబ్రాహ్మణులుజూచిరి । అజినదండమునుదీసిరి
అర్జునుడువారినాపెను । అరయుడనిధనువుదీసెను
బాణములువేయసాగెను । వాయుతనయుండులేచెను
తరువునొకదానిబెరికెను । దండహస్తుడైనిలచెను
శల్యుడాభీముదాకెనూ । సమరమతిభయముదోచెను
కర్ణుడర్జునునిదాకెను । కరినశరములజాబరపెను
పార్థుడతికోపమందెను । బాణవర్షంబుగురిపెను
శరములాకసమునిండెను । తరణికిరణములగప్పెను
నరునిశరములకునొచ్చెను । నరునికర్ణుండుమెచ్చెను
వినుమునాముందుయింద్రుడు । వీరుడౌపరశురాముండు
అర్జునుడువీరుముచ్చురు । అనియొనర్పంగజాలుదురు
గావునన్నీవెవండవు । కదనమొనరింపనెల్చెదవు
పార్థుడంతలొబలికెను । వారిలోవాడగాననెను
బ్రాహ్మణుడనిన్నుగొలిచెదను । బ్రహ్మతేజంబుజూపెదను
వినుచుకర్ణుండునిలచెను । విప్రుడనినంతజంకెను
భీమశల్యుండుదలపడిరి । భీకరంబుగాపోరిరి
మల్లయుద్ధంబుజేసిరి । మర్మతాడనముజేసిరి
పవనజునిదెబ్బదాకెను । బవరమునశల్యుడోడెను
శల్యుడవనిపైద్రెళ్ళను । చల్లగాలేచివెళ్ళను

## నెం. 5

వీరిజాడతెలుగుటకై కురుపతి వేచియుండెనయ్యా
అంతలోకృష్ణుడచటికేతెంచి యపుడుబల్కెనయ్యా

మత్స్యయంత్రంబుచెగనేసియు యామగుపనుగొనెసయ్యా
శల్యకర్ణులీరణమునసేడిరి జయముపిరిదయ్యా
మిరలీరణమందుసనిల్చిన మేలుగలుగదయ్యా
అనివినికౌరవులనికిదలపడక యపుడువెడలిరయ్యా
భీమార్జునులంతద్రౌపతినిగొని వేగవెడలిరయ్యా
తల్లికిమ్రొక్కుచుభిక్షదెచ్చితిమి దయుగనుమనిరయ్యా
అనుభవింపుడైదుగురనిబల్కుచు యపుడుజూచెసయ్యా
కన్నెనుగనిలజ్జించిధర్మజుని గాంచిపలికెనయ్యా

## నెం. 1

అనృతమునానోటికివిరాదు । అధర్మమార్గమునకుబోదు
యేవురకిదిసతియౌననుచు । యెరిగివ్యాసుడనెమునుగనుచు
బుద్ధికర్మకనుగుణమౌను । మునివచనముసమ్మగనౌను
అంతయన్నతోకృష్ణుండు । అటకుజేరెప్రియబంధుండు
కుంతీధర్మజులనుగాంచి । సంతసమునసుతులొసరించి
భీమాదులనటురావించి । బ్రీతితోడబలికెనుమించి
మేనమామసుతులనుగాంచి । మీకుకీడునాలోచించి
జేసెదానిఫలమునుగనును । గాసిజెందకుడుశుభమగును
మత్స్యయంత్రమేసినవాడు । మహాబలముగలిగినవాడు
యెవరివాడొతెలియగలెమ్మ । యేగిరమ్మువేగమెటొమ్మ
అనధృష్టద్యుమ్నుడువినెను । అపుడురహస్యంబుగజనెను
అంతదెలసితండ్రినిగనెను । అదిదెలిపెదవినుమనియనెను

## నెం. 5

కన్నెనుగొనిచనితల్లితోడ భిక్షముతెచ్చితిననెను
అదివినియేవురుసమమగునట్టుల యనుభవింపుడనెను
తక్కినవారలుభిక్షముగొనియా తల్లికిచ్చిరయ్యా
రెండుభాగములుజేసియొక్కనికి తిండికిసగమయ్యా
తక్కనభాగంబార్గురుగుడిచిరి త్వరగబండిరయ్యా
ధనుర్విద్యాప్రసంగంబులనె యనుకొనిరోయయ్యా

ఆనవినిఁగుదయమునందురథంబుల నచటికంపెనయ్యా
నాలుగుజాతులసామగ్రుల భూపాలుడంపెనయ్యా
యేసామగ్రులగోరుదురోయపుడు యేర్పడుకులమయ్యా
అనుచుబంపగాక్షత్రియవస్త్రము లపుడుగట్టిరయ్యా
ఘనుధారులైదివ్యతేజులై త్వరగవచ్చిరయ్యా
ధర్మజుడనుమానించి(ద్రుపదుగని తానిట్లనెనయ్యా
ధర్మ॥-పాండుతనయులమునేనుధర్మజుడ పవనజుడతడయ్యా
యంత్రంబునుచెగనేసినవాడె యర్జునుడతడయ్యా
కుంతీభోజునకుబిడ్డమాతల్లి కుంతియీపెనయ్యా
అనుమానింపకునకులసహదేవులసగ వీరలయ్యా
వినిసంతసించిద్రుపదుడువారికి వెగబలికెనయ్యా
నాయదృష్టమునబ్రతికియుంటి రినాటికిశుభమయ్యా
ధార్తరాష్ట్రులన్యాయమొనర్పగ వలచియుండిరయ్యా
ఆఫలంబనుభవింపకతప్పదు అదినిశ్చయమయ్యా
పెద్దవారలవివాహితులుండగ పిన్నకెట్టులయ్యా
ఇష్టమున్నచోనీకెకన్నియ నిచ్చెదగొనుమయ్యా
అనగధర్మజుడుబలికెమాతల్లి యాజ్ఞయిచ్చెనయ్యా
కన్నెనేవురముపెళ్లియాడెడము కావధర్మమయ్యా
సకలమంతవినితమతమమదిలో సంశయించిరయ్యా
తపోధనుండగువ్యాసమౌని మోదమునవచ్చెనయ్యా
వచ్చినమౌనికితగువిధపూజలు వారుజేసిరయ్యా
అంతద్రుపదుడనెసతియొక్కతె పతులైదుగురెటులయ్యా
ధర్మవేత్తయిదిదప్పోయొప్పో త్వరగజెప్పుమయ్యా
అనగవ్యాసుడనెకుంతీధర్మజు లన్నృతమాడరయ్యా
వ్యాసు-వారివాక్కులేవేదవాక్కులని (ప్రతినిసేతునయ్యా
పంచేంద్రోపాఖ్యానమనుకథను బలకెగవినుమయ్యా

## నెం. 1

భార్వమువొదల్యునిభార్య । పోల్పెంచెనుపతిహితచర్య
ఇంద్రసేనయనెడుపేరున · ఇంతిపతినిగొల్చెముదమున

కుష్టురోగియైననాథుని । కురూపియౌముసలివానిని
అతికోపముగల్గినవాని । ఆరాధించెనుదయబూని
అతనిని సేవించెడువేళ । అసహ్యంబుదలపకబాల
అతడుభుజియించుచునుండ । అతనివేలులుచెగిపడియుండ
పతిగాంచియుయూరకయుండె । సతిగనియన్నముదినుచుండె
మదియసహ్యమొందనిదాని । మగడుజూచియనెదయబూని
బహుసంతసమాయెనుకాంత । వరమిచ్చెదగొనుసుస్వాంత
మగనినిగనిసతియిట్లనెను । మదనబాధనొందితిననెను
అతిసుందరరూపముగాంచి । అదియైదువిధములొసరించి
నాతోసుఖియించుముస్వామి । నాపైదయబూడవదేమి
అనుచునూరకుండినగాంచె । అయిదురూపములధరియించె
దివ్యవిమానమునిర్మించె । నవ్యవిభవములసృష్టించె
దానిపైనసతినెక్కించె । తానెక్కియుబోవగనెంచె
దేవలోకమందునునిలచె । దేవేంద్రుడువానినిగొలచె
దేవనదినిస్నానముసలిపి । భావజహరునిన్మదిదలపి
వేయేళ్లిగతిక్రీడించి । విసుకుజెందివాటిద్యజించి
హరినిగూర్చితపమొనరించె । హరిసాన్నిధమ్మునుగాంచె
భోగతృప్తికాంతకుగాక । వేగమెమరపెంచెనుగాక
కాశీరాజుకుజన్మించె । కన్యాత్వంబునచింతించె
తనకుమగడుదొరకకగాంచె । దౌర్భాగ్యంబనుచువలంచె
హరునిగూర్చితపమొనరించె । హరిమయుడుముందగుపించె
అంతధర్మదేవతజనెను । ఆపెకడకువాయువుజనెను
అశ్వినికుమారులుజనిరి । అందరుసతినొకటిగోరిరి

## నెం. 5

మాయంశమ్ములబుట్టినవారికి మగలగుదురుజుమ్మా
అన్యజన్మమునయీవరమగుటకు యాజ్ఞసేయుమమ్మా
మారుమాటాడకుండుటగాంచి మరలిపోయిరయ్యా
ఏకపాదముననిల్చితపంబా యింతిజేసెనయ్యా
కొంగ్రొత్తకాలముజలానిలంబులగొని తపమొనరించె

పంచాగ్నినికొంతకాలమః౦డి తపంబునుజరిపించె
ఉగ్రతపంబొనరంపగవచ్చిన యుగ్రుముందుగాంచె
సంతసమునయైదుమార్లుపతినాసతి హరుయాచించె
దేహాంతమ్మునపతులైదుగురని యాహరుడువచించె
తన్వీబల్కెతప్పాప్పుసేయఁగా ధర్మహానిగాదా
నలుగురిలోయపకీర్తినిడుపరమ్ము నాకిడమర్యాదా
హరుడనెనావరమొందుముఁ ధర్మహానిరాదుకొమ్మా
అధర్మమార్గముమావచనమ్ములు యరుగవుమాయమ్మా
అనగసతిబలికెనొక్కకపతితో ఘనసుఖమిడుమయ్యా
పతిసుశ్రూషయుకౌమారత్వము నుతింతునిడుమయ్యా
అనగశివుడనెనుఇంద్రునిదొడ్కొని క్షణమునరమ్మనెను
ఇంద్రునిదొడ్కొనిసతిరాజలమున ఇంతిగనంబడెను
శోకించెడునాబాలనింద్రుండు శోకమేటికనెను
అనగనావెంటరమ్మనియింద్రుని నాపెగొనుచుజనెను
జలమునవరుఃఋనిబోలినశర్వుని సహస్రాక్షుడనెను
అహంకారముననునుగనలేవనియా ఖండలుడనెను
ఇంద్రునిగర్వముగనిశర్వుడుసతి నింద్రుబట్టుమనెను
మగువముట్టగానిశ్చేష్టితుడై మహాస్థలింబడెను
హరుడుబల్కెగర్వించితివింద్రా యద్రిలేపుమనెను
అద్రినొకడెత్తలేకరూపముల నైదిటిగ్గికొనెను
మనుజులైపుట్టుడనిశాసించియు మహేశుండుజనెను
హరునిమాయకింద్రుండాశ్చర్యం బంతటగొనిజనెను
అయింద్రులుధర్మపవనాశ్వినుల యంశలగొనిరయ్యా
అవనిధర్మభీమపార్థుఁనకుల సహదేవులయిరయ్యా
అసాధ్వీమణిహోమగుండమఁదయోనిజన్మించె
కృష్ణయనుపేరనీభవనంబున కీర్తిఁతనువుగాంచె
అనివ్యాసుడుదివ్యదృష్టినింద్రుల నందరిజూపించె
ఘోరతపంబొనరించుచున్న యాకోమలిజూపించె
బహుసంతసపడిద్రుపదుడువారికి పరిణయమొనరించె
ధౌమ్యుడుపురోహితుండైప్రీతిగ తగువిధినొనరించె
వ్యాసుడాశీర్వదించిజనిన ద్రుపదుడుసంతసించె

దేవదుందుభులుమ్రోగెసుమవృష్టి దేజరిలుచుమించె
పాండవులొకసంవత్సరమందున వసియించినరయ్యా
అనేకవస్త్రాభరణాదులగొని హరివెడలినదయ్యా
ప్రియబాంధవులనుగనికట్నములిడి ప్రీతినుండెనయ్యా
పాండవులుండుటచేనాదేశము ప్రబలమాయెనయ్యా
హరిభక్తులునివసించినయచ్చట యతిసుఖమగునయ్యా
పాండవులుబ్రతికిరనువార్తను కురుపతికిదెలిసెనయ్యా
చింతనొందితండ్రిచెంతకుజని వంతదెల్పెనయ్యా

# నెం. 1

విదురునిబల్కులువినకయ్యా। విదురునినమ్మగతగదయ్యా
పాండుసుతులుద్రుపదునుజేరి। బహుబలంబుగూర్తురుమీరి
బలకృష్ణులుపాండవహితులు। బలముమిగులగల్గినఘనులు
పాండవులకుద్రుపదునిబలము। పాండవులకుజూడదబలము
అపుడువీరినోర్చెడివారు। అవనీతలమందునలేరు
గానవారిలోబేధంబు। కల్పించెదనిపుడునిజంబు
యేవురొక్కభార్యనుగూడ। యెన్నోయాపదలౌజూడ
అంతఃకలహముసృజియింతు। అద్రౌపతినెడబాపింతు
భీమునిపేరెత్తినయపుడు। భీతిగల్గునూర్గురకిపుడు
గానభీమునిజంపింతు। కడురహస్యముగనొనరింతు
వైశం॥-వినిధృతరాష్ట్రుండిటులనెను। భీష్మాదు...దుగదమనెను
భీష్మద్రోణులరావించి। విదురునంతలోపిలపించి
తనయునియోచనవినుపించే। ఘనుడుభీష్మడతిచింతించే
అంధరాజుతోనిట్లనెను। అందరువినుడిదిశుభమనెను
భీష్మ-అన్నతమ్ములుభయులుమీరు। అతిప్రేమగల్గినవారు
సమదృష్టినిబెంచితిమిమ్ము। సమభాగంబాతనికిమ్ము
అతనిపుత్రులేలెదరయ్యా। మతిమంతులుపాండవులయ్యా
వారిపైనకోపంబేలా। వారినిగారించుటయేలా
అపకీర్తినిబొందగవలదు। అందునసౌఖ్యంబేగలదు
వైశం॥-ద్రోణుడుదుర్యోధనుగనెను। దుష్టబుద్ధితలపకుమనెను

తాతవాక్యములనాలించు । తగురీతిగపనిసాధించు
యెల్లవారలట్లేయనిరి । యిదియేధర్మంబగుననిరి
విదురునంతబొమ్మనియనెను । వివిధభూషణంబులనిడెను
ధృత॥-వారినిటకుదోడ్కొనిరమ్ము । పలయుచరథంబులగొనిపొమ్ము
వైశం॥-సకలజనముసంతసపడెను । సత్వరంబుగవిదురుడుజనెను

## నెం. 5

జనిశ్రీకృష్ణునిపదములకుమ్రొక్కి సంతసించెనయ్యా
భక్తవత్సలుండగుశ్రీకృష్ణుని ప్రార్థించినదయ్యా
ధృతరాష్ట్రుడుతసనంపినవార్తను ద్రుపదునికనెనయ్యా
ధర్మరాజాదులందరిప్పుడు తరలుమనినదయ్యా
పాండవులుద్రుపదునాజ్ఞనుగైకొని పయనంబైరయ్యా
అఖిలసైన్యములధృష్టద్యుమ్నుం డపుడుదెచ్చెనయ్యా
ద్రౌపతికుంతీవిదురపాండవులు త్వరగవెళ్లిరయ్యా
శ్రీకృష్ణుడుదృష్టద్యుమ్నుండును శీఘ్రముజనిరయ్యా
యెల్లరరాకనుదెలిసిద్రోణాదు లెదురువచ్చిరయ్యా
పరమవైభవంబులతోపురమున ప్రవేశించిరయ్యా
పాండుకుమారులుభీష్మాదులకును వందనమిడిరయ్యా
అతిసంతసమునకొన్నిదినంబులు యరుగుచుండెనయ్యా
శ్రీకృష్ణాదులుతమతమగృహముల జేరగజనిరయ్యా
అయిదుసంవత్సరములీవిధము యరిగియుండెనయ్యా
అంధరాజుపాండవులకురాజ్యం బథజామెచ్చెనయ్యా
త్వరగఖాండవప్రస్థమును రాజధానిజేసిరయ్యా
భీష్మాదులయాజ్ఞనుగొని పాండవవీరులేగిరయ్యా
యాదవోత్తముండగుశ్రీకృష్ణుడు యచటికేగెనయ్యా
జగన్నాయకునిగనిపాండవులు సత్కరించిరయ్యా
శచీనాయకునిశ్రీకృష్ణుడుమది సంస్మరించెనయ్యా
అమరనాయకుడుభయభక్తులచే నదియెరిగినదయ్యా
విశ్వకర్మదేవేంద్రునిపంపున వేగవచ్చెనయ్యా
అమరనాయకునిస్వర్గమువిధమున యతడుజేసెనయ్యా

ఇంద్రునిపురమునసున్నసౌఖ్యములు యచటనుండెనయ్యా
ఆదికారణముగఇంద్రప్రస్థంబనుచు వెలెసెనయ్యా
హరితనభక్తులకఖిలసుఖమ్ములు నచటనిల్పెనయ్యా
ధర్మరాజునకుపట్టముగట్టి ముదంబుసుగొనెనయ్యా
నారదుడువచ్చిచెప్పినవిధముప మీరుపడుపుడనెను
పుండరీకాక్షుడతిముదమంది పురమునకుఁజనెను
కొంతకాలమిటుజనిన నారదుండంతటజనుదెంచె
మునికిపాండవులుమ్రొక్కిరిద్రౌపతి మ్రొక్కగనేతెంచె
మునిదీవింపగద్రౌపతి యతఃపురమునకేతెంచె
రహస్యమునపాండవులనుగని నారదమునివచియించే
నారద-అతివనొక్కర్తునేవురుబొందుట యధర్మమగునయ్యా
తల్లియువ్యాసుడుహరియొప్పగ నిదిధర్మంబగునయ్యా
గానమీరుబేధబుద్ధిజెందక కలసియుండుడయ్యా
సుందోపసుందులనురక్కసులొక సుదతిసగనిరయ్యా
అన్యోన్యంబునబేధబుద్ధితో యంతమొందిరయ్యా
గానొకరొకరియింటవత్సరము కాంతనిలచునయ్యా
అతివనొకరింటనుండమరొక్కరు యటజనతగదయ్యా
యెరుగకపోయినతీర్థయాత్రనొక యేడువెళ్లుడయ్యా
అరయనాపల్కుమీరినచో మీకగునశుభంబయ్యా
ఇటులదెల్పినారదుడువెళ్ళ వారటులజరిగిరయ్యా
కొన్నాళ్ళకుచోరులొక్కవిప్రుని గోవులగొనిరయ్యా
విప్రుడర్జునునిగనిదుఃఖించుచు వెతజొచ్చెనయ్యా
విప్రునిబాధనుదీర్పనర్జునుడు వెడలదల్చెనయ్యా
యెరిగియునుధనువుగొనగ ధర్మజునియింటికిజనెనయ్యా
కోదండమొగొనిచోరులఁగెలచి గోవులగొనెనయ్యా
విప్రునికిడిమరలివచ్చియన్నను వీక్షించినదయ్యా

## నెం. 6

౧ భూమీసుతునిఁగాంచితినయ్యా ! బ్రోచుటకైమదిదలచితినయ్యా
కోమలితోన్నిద్రించితివయ్యా । కోదండముగొనివచ్చితినయ్యా

షామీసురదుఃఖంబుబాపితయ్యా । అన్నయ్యా
ారదవచనంబులదాటితిని । దారుణకర్మంబొనరించితిని
ఎరకపస్రితిననుమదిదలచితిని । మీయాజ్ఞనుగొననిటువేచితిని
మేలుగక్షేత్రంబులగనబోదలచితినీ । సమ్మతిని
ననగధర్మజుఁడువినియిట్లనెను । అతఁడారక్షణము పుణ్యంబనెను
నుమందునవిప్రునిరక్షింపను । వెడలిధర్మమునుగాచితివనెను
గనుకదురితమెటుగల్లుపున్నెమౌననెను । వలపనెను
ానప్రతిజ్ఞనుడప్పగలేదు । కలుషమబ్బుననిపలుపగరాదు
యౌనివచనంబువ్యర్థముగాదు । మహాక్షేత్రమ్ములుజనబనిలేదు
మానుముయాత్రనుమరియదివినరాదు । అనరాదు
అనినయర్జునుండదివినిఇలికెను । అఘముతేదంచునేనెరుగుదును
అయినయపకీర్తికినివెరచెదను । అఖిలజనమునిందింతురుమననెను
అరయవ్రతముపాలించుటకైయేగెదను । నీవయను
అనగధర్మజుండాజ్ఞనుయిచ్చెను । అతియోగ్యులవిప్రులవెనుగొనెను
అనఘుడగుధర్మజుసకుమ్రొక్కెను । అనేకక్షేత్రంబులనుగాంచెను
ఘనమగుగంగాద్వారముగనుగొనెను । నతులిడెను
సురనదిలోస్నానంబొనరించెను । సుఖముగాతీరముననివసించెను
పరమాత్మునిధ్యానంబొనరించెను । ప్రతినిత్యంబిటుజేయుచునుండెను
ఉరగరాజకన్యకయీతనిగనుగొనెను । గ్రక్కునను
గాంచిమాయచేసితనిగైకొనెను । కవలితనగృహంబునకుజేర్చెను
పంచశరునిబాధనొందినిల్చెను । పాథుఁడంతయూపెనుగనియనెను
అంచయానన్నెటికిదెచ్చితివనెను । యెవరనెను
నాగరాజకుతురనేననెను । నాపరిణయంబుగాలేదనెను
పగనినుగాంచమోహముగల్గెను । విసుకకనన్జేకొనుమనియనెను
ఆగజాలబ్రతుకజాలనిన్విడయనెను । మ్రొక్కుచును
వ్రతభంగంబగుననినదుడెంచెను । ప్రాణమువీడెదననయోచించెను
మతిమంతుండాయులూచిగొనెను । మదవతితోనారాత్రిసుఖించెను
సుతునిగాంచెసద్యోగర్భంబైగనెను । నరుడనెను
యాపుత్రునిగాపాడుమాయనెను । యిలావంతుడనిపేరగుననెను
నాపలుకులుమరువకుమాయనెను । సన్నాగనభవనముకురమ్మనెను
ఝాహగిరిసలిశిలొలినాసమ్మునకుజనెను । మూదమునను

౧౨. అరుగుచుహిమగిరిపార్శ్వంబునను । అగస్త్యపసభృగుగ్రసంగములగనెను
హిరణ్యబిందుక్షేత్రంబునను । యిచ్చెనుగోభూహిరణ్యంబులను
ధరామరులకునుగోసాహస్రములనిడెను । మ్రొక్కెడెను
౧౩. జనుచునైమిశారణ్యముగాంచెను । జగన్నాథునంతటదర్శించెను
వననిధిగంగాసంగముగనెను । ఘనపుగుగోదావరినిమునిగెను
అనఘుడుతూర్పునకావేరినిగనెను । ముదమనెను
౧౪. అనెకతీర్థంబులచరించెను । అంతపంద్రెండుమాసములాయెను
ఘనవిప్రులకతిదానములిడెను । గడచెవ్రతమనుచుసంతసపడెను
వినుముప్రవతాంతముమణులూరునుగనెను । ఘనమనెను
౧౫. చిత్రవాహనునిపుత్రినిజూచెను । చిత్తజుబాధలసంతటగనెను
చిత్రవాహనుండెరిగియిట్లనెను । పుత్రుడుపయింపతనకిమ్మనెను
చిత్రాంగదనరునకుపెండ్లిసలిపెను । ముదమునను
౧౬. చిత్రాంగదతోనరుడుసుఖించెను । జేరిసౌభద్రతీర్థంబునను
ఆత్మంబునమునుగుటకైజనెను । అచటిమునులువలదనగజొచ్చెను
చిత్రమొకమొసలిపాథుడాపదముగొనెను । బలిమిగను

## నెం. 1

వైశం॥-పాథుడడుకోపంబుజెందెను । బలిమినగొనిపైకిదెచ్చెను
పాదతాడనంబొనరించె । పడతిరూపమదిధరియించె
అర్జునుండుదానినిగాంచె । అతివమ్రొక్కియిటువివరించె
నం॥-మాచరితమువినగదయ్యా । మహాత్మ్యుండవివగుపయ్యా
సురవేశ్యలమేవురమయ్యా । చూడభూమికేగితిమయ్యా
అతిసుందరరూపులమయ్యా । అభిమానమునొందితిమయ్యా
ఒకవనమునజేరితిమయ్యా । ఒక్కమునినిగాంచితిమయ్యా
తపమొనరుపగాంచితిమయ్యా । తపముపాడుజేసితిమయ్యా
సంయమిమముగాంచినదయ్యా । స్వాధీనముగాలేదయ్యా
ఘనుడుతోపమొందినదయ్యా । గ్రాహంబులగమ్మనెనయ్యా
అప్పుడుతెలివినొందితిమయ్యా । అతిదుఃఖమునొందితిమయ్యా
ఆతడుమౌనమూనినదయ్యా । అంతవెడలిపోయితిమయ్యా
నారదుండుగన్పడెనయ్యా । ఘోరశాపమునుగనెనయ్యా

తపసినారదుండిటులనెను । పక్షిరాబ్ధిపోవలెననెను
నారద-ఘనుడుపంచతీర్థంబులను । గొనుడుమొసలిరూపంబులను
నూరుసత్సరములకుసరుడు । ఫేరుడువచ్చునుసుఖకరుడు
అతడుస్నానముందొనరించు । ఆతనిబట్టికోపముగాంచు
పాపతాపసంబొనరించు । బ్రాహ్మణశాపంబునశించు
అనుచునారదుడుజనెనయ్యా । ఆమేమిటజేరితిమయ్యా
సంపయనెతనామముస్వామి । నాచెల్లెండ్లనుగనవేమి
ఆకుందములందునగలరు । అందరునినుబట్టగగలరు
నీకుభయములేదోయయ్యా । నీవుమహాబలయుడవయ్యా
అనుచుబల్కపార్థుడుజనెను । ఆకుండములందునబడెను
వేగతననుబట్టినవారి । విసరిపైకివైచెనుమీరి
అందరిశాపంబులుజనెను । అర్జునుండుసంతసపడెను
త్వరగపార్థునాజ్ఞనుగొనిరి । తమతమనెలవులకుజనిరి
అచటిమౌనులద్భుతపడిరి । ఆపార్థునిబొగడసాగిరి
అర్జునుండుయింటికిజనెను । అతివతోడసుఖమునుగొనెను
బభ్రువాహనుండనుసుతుని । పడతిగాంచెయిష్టహితుని
చిత్రవాహనునకిడిజనెను । శీఘ్రముగోకర్ణముజనెను

## నెం. 5

అంతప్రభాసక్షేత్రమునకుజని యతివేషమునుగొనెను
అచటకిద్వారకసమీపమగుటని యందరనగవినెను
జనిపరాత్పరుండగుశ్రీకృష్ణుని గనుగొనవలెననెను
జన్మసార్థకంబగుటకుశ్రీకృష్ణుని సందర్శనమనెను
సుభద్రచక్కనిదనిమునువింటిని జూడవలయుననెను
సుభద్రనాకులభింపను హరిదయజూచినశుభమనెను
ఇటులనేజనినయాదవు లీపనికిసడింతురనెను
యతినిప్రేమింతురుయాదవులని తనమతినిసంతసిలెను
పద్మనాభచరణపద్మముల నతిభక్తిగధ్యానించె
భక్తవత్సలుండెరిగివెంగనే ప్రభాసమరుదెంచె
గనిపార్థుడుశ్రీకృష్ణునకుమ్రొక్కి మనవినివినిపించె

అర్జును-సకలతీర్థములస్నానమొనర్చితి జన్మముతరియించే
అంతటనినుగంటినియిటగంటిని యఘములునశియించే
వైశం॥-అతనిహృదయమానుభద్రపైగలదని హరిగ్రహియించే
వినుసుభద్రనిప్పించెదనని యతివేసమువేయించే
అతనితోడ్తెచ్చిరైవతపర్వతమందు ప్రేమనుంచే
పురమునకుజనిరైవతయాత్రకు బోవగసాటించె
అన్నతోడసకలయాదవులతో యచటికిజనుదెంచే
అతిసంతసమునరైవతకాద్రికి యర్చనచేయించె
ద్వారవతినర్జునుండున్నవార్త ధర్మజుకంపించె
బలరాముండెల్లరగొని యతిగనిపందనమొనరించె
చాతుర్మాస్యవ్రతమీపురమున సల్పగయాచించే
యతితోద్వారకజేరినివాసము నంతటకల్పించే
అంతఃపురమునసుంచిసుభద్రను యర్చనకంపించె
అఖిలజనంబునువినమచటికిజని యతీశుదర్శించె
రుక్మిణికర్జునుడనిరహస్యముగ కృష్ణుడుబోధించే
సుభద్రసేవలొనర్చుచుమాటికి జూచుచుయోచించె
నరునిలక్షణములితనికిగలవని నాతిసంశయించే
తెలియగోరియతిచెంతకుజని సతిపలుకారంభించె
ఇంద్రప్రస్థంబెన్నడైన మీరేగితిరాయనెను
అర్జునుడనియెడుపాండుమధ్యముని యరయుదురాయనెను
అతడుతీర్థయాత్రకుజని పురమునకరిగినడాయనెను
తపోధనులెరుగనట్టివార్తలీ ధరలోలేవనెను
అతిదయతోనాకెగింపుండన యర్జునుడిట్లనెను
పన్నర్జునుడనితెలియు మాచిన్నయన్నదెచ్చెననెను
క్షత్రియులకుగాంధర్వవివాహము శాస్త్రసిద్ధమనెను
అనగలజ్జించియంతఃపురమున కాపెత్వరగజనెను
సర్వజ్ఞుడుశ్రీకృష్ణుడెరిగి జననీజనకులకిట్లనెను
యతియెనరుడుసుభద్రాది పరిణయమ్ముజేతుననెను
బలరామునకీవార్తనుదెల్పగ భావ్యముగాదనెను
అనిజనియంతరద్వీపయాత్రకై యరుగుదమాయనెను
పశుపతినటసేవించివత్తమన బలరాముడువినెను

పరమసంతోషమందియెల్లరను బయనముగమ్మనెను
చెలియలుమొదలగుకొందరను యతినిజూచుచుండుడనెను
ఇటులజెప్పియెల్లరితోయాత్రకు వేగిముదముగొనెను
హరునిపూజించివిందారగింప యన్నకుయిట్లనెను
మీరువినోదక్రీడలొనరించి మెల్లగరండనెను
వసుదేవాక్రూరసాత్యకులగొని వడినగరికిజనెను
తనమదిసంకల్పించెనుపెండిలి త్వరగావలెననెను
సత్యసంకల్పుడగుహరితలపును శచీశుండుగనెను
సకలదేవమునిపరివృతుడై ద్వారకకుజేరుకొనెను
కశ్యపుండుహోమాదికర్మలను కడుపడిజేయించె
భరద్వాజాదిమునిగణ మాశీర్వాదముగావించె
దంపతులకలంకారంబుల సుత్రాముండొనరించె
వేలకట్నములశ్రీకృష్ణుండా విజయునకర్పించె
ధనుర్బాణములనిచ్చిరథంబున త్వరగాబంపించె
యమారువెడలగాపురపాలకు లత్యుగ్రులుగనిజనిరయ్యో
బలకృష్ణులెరుగకుండసుభద్రను బలిమిగొంటివనిరి
అనుచుయుద్ధసన్నద్ధులైన నరుడంతటయోచించె
అదిగనిసుభద్రపగ్గములగొని యరదమునునడిపించె
సంతసమొందుచునపుడువారితో సమరంబొనరించె
అతనిధాటికాగలేకసైన్యం బతిదీనతగాంచె
బలువేగముతోయరదం బింద్రప్రస్థంబరుదెంచె

# నెం. 1

దంపతులాకుంతినిగనిరీ । తగువిధముగవందనమిడిరి
ధర్మజునకువందనమిడిరి । దయనాశీర్వాదముగొనిరి
అర్జునుండుజరిగినదంత । అన్నకువిన్పించెనువింత
ద్వారకలోబలభద్రుండు । జేరివినెనురణరుద్రుండు
యాదవవీరులబిల్పించె । అపుడురణముసేయగనెంచె
అన్ననుగనెశ్రీకృష్ణుండు । అపుడుబల్కెశాంతికరుండు
ఘోలకోపమొందెదవన్న । యేలరణముకేగెదవన్న

ద్రోణాచార్యునిశిష్యుండు । స్థాణునిసముడెరుగుసరుండు
అపజయంబుగల్గనుమనకు । అఖిలసేవజచ్చుసుతుడపకు
చెల్లెలికిఁదగినవరుండే । చేకొనెననిముదమునసరుడె
మేనరికమునిల్చెనుగాద । మానుమురణమిదిసురా...
వైశం॥-అనుచుశాంతమునుబోధించె । అచటికిపలుసపముగాపి...
అఖిలబంధుజనములతోడ । అనేకకట్నంబులతోడ
ఇంద్రప్రస్థంబరుదెంచె । యెదురుగధర్మజుడేగెంచె
పెద్దలకుఁనుతులొనరించె । పిన్నలకుఁదీవసలుంచె
అందరుసంతసమునుగొనిరి । అఖిలవినోదంబులగనిరి
గజసహస్రమాహరియిడెను । కనకరథసహస్రంబిడెను
స్త్రీలనొకసహస్రంబిడెను । శిబికలొకసహస్రంబిడెను
తురగశతసహస్రంబిడెను । అర...లక్షగోవులనిడెను
పదిలక్షలసైన్యంబిడెను । ముదముసల్పివెళ్ళెదమనెను
యేడుదినములటనివసించె । యెల్లరితోపురికరుదెంచె
సుభద్రసంతసమునుగొనెను । విభునితోడసుఖములగనెను
అంతటగర్భంబుదాల్చెను । అతియోగ్యునిపుత్రునిగనెను
ధర్మజుండుసంతసపడెను । దానములతిశయముగనిడెను
అభిమన్యుండనుపేరుంచె । అనుదినంబువృద్ధినిగాంచె
ధౌమ్యుడువేదంబులజెప్పె । తండ్రిధనుర్వేదముజెప్పె

## నెం. 5

యేవురుపాండవులకుద్రౌపతి సుతులేవురగనెనయ్యా
ప్రతివింధ్యుండాధర్మరాజునకు సుతుడుగల్గెనయ్యా
శృతిసోముండాభీమునిపుత్రుడు మతిమంతుండయ్యా
శృతకీర్తియనువాడర్జునునకు సుతుడుగల్గెనయ్యా
శతానీకుడానకులునకుబుట్టె సత్పుత్రుండయ్యా
సుతుడుసహదేవునకుశృతసేనుడు సుగుణవంతుడయ్యా
పాండవులకుసుతులుపపాండవులని ప్రసిద్ధిగొనిరయ్యా
ఇంద్రప్రస్థమునందుసౌఖ్యముల నెల్లరొందిరయ్యా
శ్రీకృష్ణుండొకనాడానగరికి జేరవచ్చెనయ్యా

హరిసత్కారమునొందిసంతసిలి యచటనుండెనయ్యా
ఒక్కనాడునరుడుకృష్ణుడడవికి గ్రుక్కనజనిరయ్యా
శీతలచ్ఛాయనుండవిప్రుడటు బేరవచ్చెనయ్యా
అకలిగొనివచ్చితినిభూసురుడ యున్నంబిడుమ
అనవినివారనిరిష్టాన్నము నీపడుగుమిత్రుమయ్యా
అగ్నినిఖాండవవనముభుజింపగ నచటకేగితయ్యా
తక్షకుడనుసర్పరాజింద్రునకు తగుమిత్రుండయ్యా
వాడావనముననుండుశచిశుడు వనముగాచునయ్యా
ఖాండవమునునేభుజింపజన మేఘములబంపునయ్యా
మేఘబాధచేభుజింపనొల్లక మిన్నకుంటినయ్యా
అతిబలశాలులుమీరుమేఘముల నాపివేయుడయ్యా
కడుపునిండభోజనమిడుడావల గలుగుశుభంబయ్యా
అర్జున-వినినరుడనెమేఘములనాపనగు విల్లెలేదయ్యా
శస్త్రాస్త్రంబులుగలవునాకొక్క చాపంబిడుమయ్యా
రథాశ్వంబులుత్తమములులేమిని రణమెటులగునయ్యా
వైశం॥-అనవినివైశ్వానరుడావరుణున కంతజెప్పెనయ్యా
అక్షయతూణీరంబుచాపము రథాశ్వములిడుమయ్యా
అర్జునునకుబ్రహ్మనిర్మితములిడ యగునుశుభంబయ్యా
గదాచక్రములుశ్రీకృష్ణునికడి ముదంబుగనుమయ్యా
వైరులకభేద్యమైనవాటినావరుణుడిచ్చెనయ్యా
నరుడుగాండీవమనియెడుచాపము మురుయుచుగొనెనయ్యా
అశ్వంబులచేబూంచినరథంబు నంతనెక్కెనయ్యా
గదాచక్రములదాల్చెనుకృష్ణుడు కరములయందయ్యా
అరథమెక్కిశ్రీకృష్ణుడు సారథ్యంబుజేసెనయ్యా
అగ్నివనమునకంపివెనుక దామరిగియుండిరయ్యా

## నెం. 2

అనలుడంతలోవెడలెను । అవనముగాల్పజొచ్చెను
తరువులనుబూదిజేసెను । తక్షకునిసుతుడుజూచెను
అశ్వసేనుండుభయపడెను । అపుడుతల్లినిఁగొనిజనెను

ఆకసంబునకుబోయెను । అర్జునుడువారిజూచెను
సాయకంబొకటివేసెను । సత్వరముతల్లిగూలెను
వానిపుచ్ఛంబునరికెను । వహ్నిలొబడగజేసెను
మంటలాకసముబారెను । మిణుగురులుమింటమీరెను
దేవతలుగాంచివెడలిరి । దేవనాధునకుజెప్పిరి
ఖాండవముగాల్చెననలుండు । కదలుమనెవెళ్లెనిందు్రండు
తక్షకునిగావగాదలచె । తక్షణముమేఘములబిలచె
మేఘములునీళ్లువర్షించె । మిగులధారలనుగురిపించె
అప్పుడర్జునుడుజూచెను । అగ్నిజల్లారజొచ్చెను
బాణభవనంబునిర్మించె । వహ్నిముదమొందిభుజియించె
జూచిమేఘములువెళ్ళెను । సురపతికిజెప్పవచ్చెను
దేవసైన్యంబువచ్చెను । దేవనాధుడుమెచ్చెను
దివ్యశరములజావేసెను । దివ్యవజ్రంబువేసెను
అమరసైన్యంబుజూచెను । అఖిలశస్త్రములవైచెను
అర్జునుడువాటిఖండించె । అమరసైన్యమునునొప్పించె
కృష్ణుడొకవైపుదాకెను । జిష్ణుడొకవైపుదాకెను
అమరసైన్యంబుబారెను । అమరపతివేగపోయెను
మంటలన్నార్పజూచెను । మందరాద్రినిజెచ్చెను
నరుడుగిరినంతగూల్చెను । హరిహయుడుచింతించెను
అంతయాకసముబల్కెను । హరిహయానిల్వుమంచనెను
తక్షకుడుజావలేదనెను । ధర్మరక్షకులువీరనెను
అవనిభారంబుబాపెను । అద్భుతమునీకుజూపెను

## నెం. 1

అనగవినెనుదేవేంద్రుండు । హరినరులనువేడెఘనుండు
మయుడుగావుమనవినెనరుడు । దయనుగాచెపాండవఘనుడు
ఆయింద్రుడుపుత్రునిమెచ్చె । అనేకాస్త్రశస్త్రములిచ్చె
హరినిటొగడిస్వర్గముజనెను । అనలుడుబహుసంతసపడెను
జయముబొందుడనిదీవించె । జనితనలోకమునుంగాంచె
అంతమయునివెంబడిగొనిరి । అర్జునశ్రీకృష్ణులుజనిరి

జనిధర్మజునంతటగనిరి । జరిగినకథనెల్లదెల్పిరి
అంతధర్మజుడుమోదించె । ఆశ్రీకృష్ణునిపూజించె
హరిదయచేసుఖములగొనిరి । హరికిసేవజేయుచుమనిరి
జనమేజయుడీకథవినెను । సంతసంబుమదిలోగొనెను
ఆదిపర్వమియ్యదివింటి । అవ్వలికథవినియెదనంటి

## —: ఫ ల శ్రు తి :—

భారతవీరులచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుమదిని । విరచించెనుభక్తినిబూని
భావానందగురుకృపనుగొని । ప్రాసినాడుయీసత్కృతిని
సదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని

ఆదిపర్వము సమాప్తము.



శ్రీ కృష్ణాయ నమః

# తందనాన
# శ్రీమహాభారతము

## సభాపర్వము



## నెం. 1

శ్రీవైశంపాయనమౌని । చిత్తంబునభక్తినిబూని
భారతమనుసచ్చరితంబు । పంచమవేదసమానంబు
జనమేజయభూపునిగాంచె । సభాపర్వమిటువివరించె
వైశం॥-శ్రద్ధతోవినుమోరాజా । శశధరకులవారిధిరాజ
ధర్మజుకడకృష్ణార్జునులు । నిర్మలమతులుండిరిఘనులు
పార్థుణానిగనిమయుడిట్లనెను । ప్రాణదాతవీవనియనెను
మ॥-ప్రత్యుపకారముగొనుమయ్యా । బరగనభీష్టంబనుమయ్యా
దానవశిల్పినినేనయ్యా । తగురీతిగజేసెదనయ్యా
వైశం॥-అనగనరుడుకృష్ణునకనెను । అఖిలంబెరుగుదువీవనెను
అ॥-నీవుగోరినదియోగ్యంబు । నిర్మించుమమయుడునిజంబు
వైశం॥-అంతకృష్ణుడాలోచించె । అద్యంతంబులుయోచించె
కృ॥-కౌరవాంతకరబీజంబూ । గోరెనుభూభరహరణంబు
అన్యులెరుగకుండెడుదాని । అతివిచిత్రతరమగుదాని
సకలరత్నయుతమగుదాని । సభనొక్కటిజేయుముబూని
మ॥-వినిమయుడనెవృషపర్వునకు । ఘనసభనిచ్చితినీవరకు
దానికంటెయోగ్యముదాని । త్వరగజేసియిచ్చెదబూని
వైశం॥-భౌమాసురుడుబహుయోచించె । భయసంబగుగసనిర్మించె
శత్రుఘాతినామంబుంచె । సామీరికితగుననిపించె

మ॥-దేవదత్తమనుశంఖంబు । యీవిజయునకిడుదునిజంబు
వైశం॥-అనిమయుండువేగమెజనెను । హరియుద్వారవతికింజనెను
మయుడువేగవాటినిచెచ్చె । మహవీరులనిమదిమెచ్చె
సభనుధర్మరాజునకిడెను । శత్రుఘాతిభీమునకిడెను
శంఖముపాథునకిడిజనెను । సభనుధర్మజుడుగనుగొనెను
తగుముహూర్తమంతటగనెను । ధౌమ్యుడుధర్మజురమ్మనెను
సభాప్రవేశంబొనరించె । స్వర్గంబదియేయనిపించె
ధర్మరాజుసంతోషించె । దానంబులువేలొసరించె
తమ్ములతోసభగావించె । ధర్మముతప్పకపాలించె
భూమండలమేలెడువారు । భూపులుకట్నములిడినారు
ధర్మజుండుధర్మముగాచె । ధర్మముధర్మజునింగాంచె
అఖిలమౌనులచటకిజనిరి । ఆశీర్వాదంబులనిడిరి
శమనాత్మజుపూజలగొనిరి । సచ్చరితంబులనునుడివిరి

# నెం. 5

నారదమునియొకనాడుధర్మజుని జేరవచ్చెనయ్యా
వచ్చినమౌనినిగాంచిపాండవులు మెచ్చిమ్రొక్కిరయ్యా
తపసివారినిదీవించిధర్మజుని కపుడుబలికెనయ్యా
నా॥-అష్టలోకపాలకులసభలునే నరసిపచ్చితయ్యా
గానియీసభఁబోలినదొక్కటి గానుపించదయ్యా
వైశం॥-అనవిని ధర్మజుడతిసంతసమున యపుడుబల్కెనయ్యా
ధ॥-అష్టలోకపాలకులసభవార్త లానతీయవయ్యా
వైశం॥-అనగమునిబల్కెదేవేంద్రునిసభ అత్యద్భుతమయ్యా
నా॥-నూరుయోజనంబులవెడల్పు సొంపారుచుండునయ్యా
పొడవునూటయేబదియోజనములు కడుచిత్రంబయ్యా
హరిశ్చంద్రాదిసత్యజనులందు నిరతముందురయ్యా
సకలవైభవోపేతమైవెలగు శచీశుసభనయ్యా
శతయోజనవిస్తారమైజమునిసభవెలుంగునయ్యా
సిద్ధులుపిత్రుదేవతలాసభలో జెలగుచుందురయ్యా
ధర్మాధర్మవిమర్శలజేసెడి తపసులుందురయ్యా

నీజనకుండగుపాండురాజందు నిలచియుండెనయ్యా
పాండురాజునాతోడబల్కెను భక్తిగవినుమయ్యా
రాజసూయయాగంబొనరించిన రాజుకుసుఖమయ్యా
ఆయాగంబొనరించునృపులు సుఖమందుచుండిరయ్యా
పాం॥-భూలోకముజనినాపుత్రకులకు బోధచేయుమయ్యా
నాపూర్వులతోసకలసౌఖ్యములు నాకుగల్గునయ్యా
నా॥-యిటులదెల్పెమీజనకుండదివిని యిటకువచ్చితయ్యా
సల్పుమారాజసూయము నీచేజరుగునునిజమయ్యా
సకలరాజులజ్గెలువకున్ననిది శాంతముగాదయ్యా
ఘనకార్యంబిదిచేయకష్టమౌ గానియోగ్యమయ్యా
వైశం॥-అనుచుపెలపికలహాశనుడేగగ యమసుతుడనెనయ్యా
ధ॥-తమ్ములారనాపల్కులువినుడిది ధర్మమార్గమయ్యా
తండ్రికిసౌఖ్యముగలిగింపనిచో తనయులమెటులయ్యా
అఖిలకష్టములకోర్చియాక్రతువు నాచరింతమయ్యా
వైశం॥-అనగవ్యాసదౌమ్యాదులిదిసేయ యధికంబనిరయ్యా
తమ్ములునీసంకల్పంబుసేయగా దలచితిమనిరయ్యా
అంతధర్మజుండుసంతసంబుతో యందరికనెనయ్యా
ధ॥-శ్రీమన్నారాయణుడగుకృష్ణుని చిత్తమెరుగుడయ్యా
అతడుసంతసిలియొప్పుకొన్నచో యఖిలంబగునయ్యా
వైశం॥-అనుచుదివ్యరథమాకృష్ణునకై యపుడుబంపెనయ్యా
భక్తవత్సలుండదివినివేగము వచ్చియుండెనయ్యా
అంతహరినిసత్కరించి ధర్మజుడడిగెకుశలమయ్యా
ధ॥-మరమాత్ముండవుబంధుండవు నాపల్కులువినుమయ్యా

## నెం. 1

పాండురాజుయమలోకమున । బల్కెనిటులతిదైన్యమున
రాజసూయమొనరుపుమనెను । రాజసుఖముతనకగుననెను
నారదుడిటుజెప్పెనుగాన । నామదికదిగల్గెనుగాన
ధర్మరక్షకుండవునీవు । తగినవాడవైయున్నావు

నాసంకల్పంబొనరించు । ననునీవానిగమదినెంచు
వైశం॥-అనకృష్ణుండాలోచించె । అపుడివ్విధముగవివరించె
కృష్ణ॥-జరాసంధుడనియెడువాడు । చాలబలముగల్గినవాడు
శిశుపాలుడుబలవంతుండు । చిన్ననుండివానిసఖుండు
భగదత్తుండతిబలియుండు । భక్తినతనిగొల్చుచునుండు
పౌండ్రకుండుకపటమువాడు । బలయుతుండునాసరివాడు
జరాసంధునకుమిత్రుండు । సమరమందుబహుశూరుండు
నాకపకారంబొనరించె । నాతోసమరంబొనరించె
అక్షౌహిణులరువదిమూడు । అనికిసైన్యమునుగొన్నాడు
పదునెనిమిదిమార్లీవిధము । కదనంబొనరించెనుఘనము
నాల్గునూర్లయక్షౌహిణులట । నాశముసల్పితిసైన్యములట
నూరక్షౌహిణులిపుడుండె । కారణంబువేరైయుండె
ఐననీదుతమ్ములుఘనులు । అతిబలవంతులుసన్మతులు
నేననీకుసాయంబుందు । నీకార్యముసల్పెదముందు
వైశం॥-శమనాత్మజుడపుడిట్లనెను । జరాసంధుడెవ్వండనెను
వానిజన్మవృత్తాంతంబు । విన్పింపుముయతిభయదంబు
అనగకృష్ణుడదిమదిగనెను । అకథజెప్పెదవినుమనెను

## నెం. 5

కృ॥-తొల్లిబృహద్రథుడనియెడువాడొక దొడ్డవీరుడుండె
మగధదేశమునుపాలించుచు దుర్మార్గుండైయుండె
మూడక్షౌహిణిసేనలగైకొని పోరుసల్పుచుండె
అతనినెదిరింపలేకరాజగణ మార్తినిగనుచుండె
కాశీశునికదనమునవోడించి కన్నెలగొనియుండె
యిరువురుకన్నెలపెండ్లిసల్పుకొని నిరతముబ్బుచుండె
కన్యలనిర్వురసమముగగాంచుచు కడుసుఖమునసుండె
సంతతిగాంచకదానధర్మముల నంతజేయుచుండె
అటులైననుసంతానముగల్గమి యతడుచింతనుండె
సతులతోనడవికేగిమునీంద్రుల వ్రతముసల్పుచుండె
చండకౌశికుండనెడిమౌనినొక స్థలమునగనియుండె

తనవిధమంతయుదెల్పినరాజుకు తపసిబల్కుచుండె
చం॥-భూపాలకయీఫలమునుగొని నీపురముజేరుమయ్యా
అతిప్రీతిగలయొక్కభార్యకిడ నాత్మజుగనుసయ్యా
కృ॥-అనిఫలమిడరాజతిసంతసమున యపుడువెడలెనయ్యా
పట్టణముజేరిసతులకిర్వురకు ఫలంబునిడెనయ్యా
వనితలయందలిప్రేమచే మౌనివాక్కుదప్పెనయ్యా
ఫలభక్షణమునయిరువురు గర్భంబులనుదాల్చిరయ్యా
అతిసంతసమునభూపుడుదానము లనేకమిడెనయ్యా
నవమాసమ్ములునిండగతనయులు నాతులుగనిరయ్యా
ఒక్కపాదమొక్కభుజముగల్గిన దొక్కనిగనెనయ్యా
అతివయింకొకతియర్ధశరీరం బంతటగనెనయ్యా
అత్యాశ్చర్యంబతిదుఃఖంబును యాపెలుగనిరయ్యా
అర్ధశరీరంబిటులగాంచి వారపుడుపల్చిరయ్యా
యీశకలంబులురాజుకుజూపిన యేడ్చెదరనిరయ్యా
యూరిలోయొక్కమూలశకలములు బారవైచిరయ్యా
జరయనురక్కసియర్ధరాత్రమున దిరుగుచుగనెనయ్యా
శకలంబులుకదలుటగనిచేగొని సంధించినదయ్యా
అద్భుతంబయినధ్వనితో బాలుండపుడుయేడ్చెనయ్యా
ఆయేడ్పునువినిరాజుచిత్రపడి యచటజేరెనయ్యా
అబాలునిగొనిభూపాలుండపుడద్భుత పడెనయ్యా
జరయనురక్కసిమనుజవేశమున జనపతికనెనయ్యా
జర॥-శకలములిందునయెవరువైచిరో సంధించితినయ్యా
ఫలంబొక్కసతికిడకయిరువురకు భాగించితివయ్యా
మునిపల్కులుదాటితివిమోహమున తునకలాయెనయ్యా
నీక్షేమంబునుగోరితిగావున నేనుగూర్చితయ్యా
వజ్రదేహమొనరించితిగావున బలయుతుడగునయ్యా
కృ॥-అనుచుదెల్పగాసంతసించి నృపుడంతటజనెనయ్యా
జరాసంధుడనుపేరిడి పాలనసల్పుచుండెనయ్యా
చండకౌశికుండొకనాడచటికి జనుదెంచినదయ్యా
భూపునిచేసత్కృతుడైసుతుగని భూపునకనెనయ్యా
చం॥-బలముగలవాడువజ్రదేహుండు పరమశూరుడయ్యా

వెయ్యేటికిహరునంతటివాడై వెలయుచుండునయ్యా
కృ॥-అనిమునిజనగాజనపతి సంతసమందుచుండెనయ్యా
వయసునిగనిరాజ్యంబిడిసతితో వనికిజేరెనయ్యా
అతికఠినంబగుతపమొనరించియు హరునిగాంచెన య్యా
దురమునశస్త్రాస్త్రబాధనొందని వరమునొందెనయ్యా
అఖిలరాజులఁగెలచి బంధనములందునుంచెనయ్యా
ప్రతిదినంబొక్కరాజును గెడపుచు బలియొసంగునయ్యా
వానిజంపిక్షత్రియులరక్షింప వలయునుమనకయ్యా
అనిలజపార్థులఁలతోనేగెద నాకానతీయుమయ్యా

# నెం. 1

వైశం॥-అనగధర్మజుడుచింతించె । ఆకృష్ణునకిటువినిపించె
ధర్మ॥-బలముమిగులగల్గినవాడు । పశుపతివరమునుగొన్నాడు
అతనితోడయుద్ధముసేయ । అలవియగునెనోయదురాయ
నాతమ్ములనీకిడుదయ్యా । బ్రీతితోడగావగదయ్యా
వైశం॥-అనుచుదీపనలిడెనయ్యా । అంతవారువెడలిరయ్యా
సరయూగంగలగనినడచి । చాలాదేశంబులగడచి
గిరివ్రజముజేరిరివారు । పురముసంతలోగనినారు

# నెం. 5

తొల్లిగౌతముండౌశీనరియను తొయ్యలిపీక్షించె
కక్షీపాదాదులనియెడివారల ఘనుండుసృష్టించె
వారలనెల్లరజరాసంధుడొక ద్వారమందునుంచె
అద్వారంబునజనినవాడచట యుపజయముంగాంచె
అనిశ్రీకృష్ణుండెరుగుగాన యుటకరుగకయోచించె
ప్రాగ్ద్వారంబునవారలుందురని బాటనుదప్పించె
పశ్చిమద్వారమునజనిలోనికి ప్రవేశమొనరించె
చేరుచుండగాయచటిభేరులను శ్రీకృష్ణుడుగాంచె
కృ॥-తొల్లిమానుపాదంబనుయెద్దును ద్రుంచివైచిరయ్యా
దానిచర్మమునమూడుభేరులను త్వరగజేసిరయ్యా

ద్వారమునసుంచిరవినరులనుగని ధ్వనియొనర్చుసయ్యా
వీటినినశింపజేయకలోనికి వెడలగరాపయ్యా
వైశం॥-అనుచుముగ్గురామూడుభేరులను హతముచేసిరయ్యా
జేసియంతఃపురంబునకంతట జేరియుండిరయ్యా
బ్రాహ్మణవేషంబులతోనచటికి బ్రవేశించిరయ్యా
గంధమాల్యాద్యలంకారంబుల గాంచియుండిరయ్యా
సింహగుహయందుజింకలవిధమున జేరబోయిరయ్యా
అర్ధరాత్రమునవచ్చినవారల యాతడుగనెసయ్యా
అర్ఘ్యపాద్యమ్ములగొనియెదురుగ యతడువచ్చెనయ్యా
వచ్చిగాంచియర్ఘ్యంబులిడుటగని యిచ్చగించిరయ్యా
అర్ఘ్యములగొనకనిల్చినవారికి యతడుబల్కెనయ్యా
జరా॥-అర్ఘ్యములొల్లనివారుబ్రాహ్మణులు యగుదురెట్టులయ్యా
క్షత్రియువీరలుమీరుగావలయు సత్యంబనుడయ్యా
గంధాదులగొనియర్ఘ్యమొల్లని కారణమేమయ్యా
ప్రాగ్ద్వారంబునరాకయీవిధమున వచ్చుటేటికయ్యా
ధర్మజ్ఞుడనగునన్నువైరిగా దలపనేటికయ్యా
వైశం॥-అనుచుబల్కగాశ్రీకృష్ణుం డపుడతనికనియెనయ్యా
కృ॥-క్షత్రియజాతినిబుట్టినవారము శత్రుసములమయ్యా
శత్రువుచెంతకుప్రాగ్ద్వారము రాజనదుధర్మమయ్యా
శత్రువుచెంతకుపశ్చిమమార్గము జనుటయోగ్యమయ్యా
పుష్పగంధములలక్ష్మియుండెనని బొందియుంటిమయ్యా
ధర్మజ్ఞుడననిబల్కితివిగాన ధర్మజ్ఞుడవయ్యా
బలగర్వంబునక్షత్రియోత్తముల బలిమిదెచ్చితయ్యా
పశుపతిపూజకువారలజంపుచు బలియొసంగుదయ్యా
సాధుహింసలొనరించువారలె శత్రులగుదురయ్యా
నినుబోటులహింసాకార్యంబుల గనగజాలమయ్యా
ఘోరహింసకుడవగునీమదమును గూలజేతుమయ్యా
సత్కార్యంబొనరించువారికే సద్గతియగునయ్యా
దుష్కార్యంబొనరించినవారికి దుర్గతియగునయ్యా
కావునపాపల్కులువినిరాజుల నీవువదలుమయ్యా
వేనుకృష్ణుడనుపూర్వవైరినని నీవుదెలియుమయ్యా

భీముడవ్వాడుపాధుఁడుడువీడని వేగదెలియుమయ్యా
నీమదమడగింపగవచ్చితిమిటు నీవెరుంగుమయ్యా
వైశం॥-అనుచుధైర్యమునబల్కి సకృష్ణుని యాతడుగనినాడు
ప్రళయకాలరుద్రునివలెమండుచు వాడుబల్కినాడు
సేనలదెచ్చినసైన్యముతోడుత సిద్ధంబన్నాడు
ముగురునిలచిరణమునకురమ్మన్న బూనెదనన్నాడు
యిరువురతోనేరణముసల్పుమన యిదెతగునన్నాడు
యొక్కనితోనేరణముసేయుమన యొప్పితినన్నాడు
యుద్ధమేయాయుధంబునజేతురో సిద్ధంబన్నాడు
అనకృష్ణుంతనెముగ్గురితోనొక డధర్మమన్నాడు
ముగురిలోనొకనిగోరుమతనితో బోరగునన్నాడు
వీయాయుధమునుగొనకమల్ల రణమేతగునన్నాడు
అనజరాసంధుడామాటలువిని యపుడుబల్కినాడు
మాధవమునునాకోడిననీతో మార్కొననన్నాడు
అర్జునుండుపిన్నవాడగుటచే అదితగదన్నాడు
భీమసేనుడేతగినవాడనుచు వేగలేచినాడు

## నెం. 2

పుత్రునభిషిక్తుజేసెను । ముదితలనుగాంచివచ్చెను
మల్లవేసంబువేసెను । మంచిధైర్యంబుజేసెను
ప్రళయరుద్రునింబోలెను । బాహువులనప్పళించెను
వచ్చిభీమునిజాదాకెను । మెచ్చిభీముండుదాకెను
వజ్రదేహములగలవారు । బలముమిగులంగగలవారు
భీముడవ్వానిదాకెను । భీమునిజావాడుదాకెను
యుద్ధమతిఘోరమాయెను । ఉగ్రశబ్దంబుబుట్టెను
భూనభంబులనునిండెను । భూతగణమంతవడకెను
కార్తికప్రథమదినమునను । కదనమారంభమాయెను
భీమునిజంపమాగధుడు । బిట్టుగాగొట్టెశూరుండు
మాగధునిజంపభీముండు । మర్మములగొట్టెవీరుండు
వృత్రవాసవులయుద్ధంబు । విధముగానడచెభయదంబు

యిటులపదునాల్గుదినములు । యిరుపురనిబేసరతిఘనులు
నాటిరాత్రినా మాగధుడు । నడుపలేకుండెదుర్బలుడు
బలహీనుడైయోచించె । పద్మనాభుండువీక్షించె
అంతశ్రీకృష్ణుడిట్లనెను । అనిలజామేలుకొనుమనెను
వాయుతనయుండుదెలసెను । వాయుదేవునిదలచెను
దలపననిలుండుబలమిడెను । త్వరగభీముండుబొందెను
బలముగొనివానిజూచెను । పదములబట్టిద్రిప్పెను
నూరుమార్లతనిద్రిప్పెను । ధీరుడైనేలగొట్టెను
వాడురక్తంబుగ్రక్కెను । వసుధపైబడుచుజచ్చెను
భీముడొకబొబ్బజేసెను । భీతిచేజనముడొల్లెను
గర్భిణులుభీతిజెందిరి । దుర్భరంబనుచుదలచిరి
పవనుజుడువానితనువును । పట్టణముచెంతవైచెను
అంతసూర్యోదయంబాయె । హరికిమదిసంతసంబాయె

## నెం. 1

శ్రీకృష్ణుండంతటఁజనెను । చరసాలకుప్రేమనుగొనెను
బంధితులగురాజులవిడెను । పరమదయావృష్టినిగనెను
క్షత్రియులతిమోదముగొనిరి । శౌరిపాదములకుమ్రొక్కిరి
క్షII-దీనబాంధవుండవుదేవా । దిక్కునీవేగాసముభావ
వైశంII-అనకృష్ణుడువారలగాంచి । అనెశ్రీమదముసత్యజియించి
కృII-ధర్మపాలనముసేయుండి । తగువిధసౌఖ్యములందండి
వైశంII-యేగుడనుచుబలికినడయ్యా । మాగధపుత్రునిగనెనయ్యా
వానికిపట్టముగట్టించె । వాడిడురథమునుగ్రహించె
గరుడునిమదిలోస్మరియించె । త్వరగరాగనాతనిగాంచె
రథసారధిసేయగఁబంచె । రథమునుతానారోహించె
భీమనరులతోఁజనెనయ్యా । ప్రేమధర్మజునిగనెనయ్యా
విజయవార్తదెలిపినడయ్యా । భీమసేనుబొగడినడయ్యా
ధర్మరాజపూజలుగొనెను । ద్వారవతికివేగమెఁజనెను
ధర్మరాజుతమ్ములబిలచె । త్వరగనాల్గుదిశలకుఁబనిచె
జయమహొపామ్మనిదీవించె । జనుటకుబయనమ్మొనరించె

నెం. 5

ఉత్తరదేశంబునకువిజయుండు । యుబ్బుచుజనెనయ్యా
అగ్నిపత్త్రరథమెక్కిగాండీప । మంతటగొనెనయ్యా
వెడలిపుళిందేశ్వరునిగెల్చి । ప్రతివింధ్యుగెల్చెనయ్యా
ప్రాగ్జ్యోతిషపురిభగపత్తునితో । బవరమాయెనయ్యా
యెనిమిదిదినములురణముజేసి । బలహీనుడాయెనయ్యా
ఇంద్రసుతుడవీవింద్రసఖుడ । రణమేటికనియెనయ్యా
అనిలోనీకేనోడితిగోరిక । నడుగుమనియెనయ్యా
అనసరుడనెథసమిడియాగముగన । నచటికిరమ్మనెను
కదలినరుడంతఅనేకరాజుల । కట్నంబులగొనెను
గంధమాధనంబతిక్రమించుచు । గంధర్వులగనెను
నానావిచిత్రతరవస్తు । వాహనంబులగైకొనెను
అనేకధనములగైకొనిధర్మజు । నతడుజేరుకొనెను
పవనతనయుండుతూర్పుదిక్కునకు । బయనమాయెనయ్యా
అనేకదేశాధిపులగెల్చుకొని । ధనములంపెనయ్యా
చేదిదేశముసశిశుపాలునితో । స్నేహమాయెనయ్యా
నూరుకోట్లధనరాసులగైకొని । జేరవచ్చెనయ్యా
దక్షిణదిక్కుకుసహదేవుండతి । త్వరగనేగెనయ్యా
నయభయములచేరాజులగెలచి । ధనంబులగొనెనయ్యా
పడమటిదిక్కుకునకులుండంతట । పయమాయెనయ్యా
అనేకసేనలవెనుగొనిరాజుల । నతడుగెల్చెనయ్యా
లొట్టియలొకపదివేలుమోయు । ధనమట్టెదెచ్చెనయ్యా
నలుగురుతమ్ములునాల్గుదిక్కులను । గెలచివచ్చిరయ్యా
అసంఖ్యాతధనరాసులజెచ్చి । యచటనింపిరయ్యా
ద్వారవతినుండికృష్ణుండచటికి । త్వరగవచ్చెనయ్యా
అనేకరత్నంబులచేకొని । దానతనికెచ్చెనయ్యా
శ్రీకృష్ణునిసత్కరించియాగము । జేయదలచిరయ్యా
అఖిలదేశభూపాలులచ్చటికి । యరయగజనిరయ్యా
వ్యాసధౌమ్యాదిమౌనులచ్చటికి । వచ్చియుండిరయ్యా
భీష్మవిదురాదిసకలకౌరవులు । వేగవచ్చిరయ్యా

యాదవులఁగూడొక్కనిబలరాముం । డటకుబిలిచెనయ్యా
మునులబూజించియాగంబంతట । మొదలుబెట్టిరయ్యా
అగ్నికుండములయందుహోమముల । నాచరించిరయ్యా
హవిర్భాగములనొందిదీవించి । రమరులువిసుపుయ్యా
అఖిలజనంబులకన్నదానమట । యాచరించిరయ్యా
ధర్మజుండుభీష్మునిగనిముదమున । దానుబలికెనయ్యా
ధ॥-యెల్లరుగలరీసభలోనొక్కని । యేరిచెప్పుమయ్యా
అర్ఘ్యముగొనుటకుతగినయోగ్యునా । కానతీయుమయ్యా
మతిమంతుండవుధర్మాత్ముండవు । మాకుపెద్దవయ్యా
వైశం॥-అనగభీష్ముండుమదియోచించు । యాతనికనెనయ్యా
భీష్మ॥భక్తవత్సలుడుపరాత్పరుండీ । వాసుదేవుడయ్యా
భూభారంబుహరింపగవచ్చిన । పురుషోత్తముడయ్యా
మనుజుడెవ్వడీయర్ఘ్యముగొనగ । సమర్థుడగునయ్యా
హరినిపూజించియర్ఘ్యంబిడుటే । యజ్ఞఫలంబయ్యా
వైశం॥-అనగధర్మజుడుహరినిపూజించి । యర్ఘ్యంబిడెనయ్యా
అదిగనిశిశుపాలుండుకోపించి । యపుడుబలికెనయ్యా
శిశు॥-ధర్మరాజయీసభలోపెద్దల । దల్పకుంటివయ్యా
తెలియకవృద్ధనుకొంటివితని । వసుదేవుడుండెనయ్యా
ఘనుడనితల్చితినంటివేని । వ్యాసునిగనవేమయ్యా
గురువనిదలచితివేనిద్రోణకృప । గురువులుండిరయ్యా
రాజనిదలచినచోయాదవులకు । రాజ్యములేదయ్యా
పూజ్యులకవమానముసల్పినితని । పూజించితివయ్యా
తెలియకనపుంసకునకుసతినిడిన । తీరుజేసితయ్యా
చెవిటివానిగనిమధురగానంబు । జేసినట్టులయ్యా
గ్రుడ్డివానికిసురూపముజూపగ । గోరినట్టులయ్యా
కృష్ణునకర్ఘ్యంబొసగినందు । కపకీర్తిబొందితయ్యా
వృద్ధుండైమతిబోయినవాడీ । భీష్ముండగునయ్యా
అతనిపల్కులనువేదవాక్కులుగ । నాదరించితయ్యా
వైశం॥-అనుచులేచియనుచుండధర్మజుం । డతనినాపెనయ్యా
ధర్మ॥-అరుగనేలపరమాత్మునిదెలియని । యల్పబుద్ధివయ్యా
వైశం॥-అనవినిభీష్ముడుశిశుపాలునిగని । యపుడుబలికెనయ్యా

# నెం. 1

భీష్మ॥భూపతిసనిమదిగర్వించి । పురుషోత్తమునిటనిందించి
చరితముసంపాదించితివి । దుష్టతనముజూపించితివి
కోటిపయొప్పడ్డులకన్న । గోవిందుండధికుండెన్న
అతనిమూలమెరుగనివారు । మతివిహీనులనబడువారు
హరినిందనుజెసితివిందు । అఫలమందెదవికముందు
వైశం॥-అనసహదేవుండటుగాంచె । కనలిచారికటువిన్పించె
సహ॥-కృష్ణునకర్ఘ్యంబిచ్చితిమి । కృపనుబొంగగాదలచితిమి
శ్రీహరినిందించినవాని । శిరముసపదముంచెదబూని
వైశం॥-అనసహదేవునిపైనంత । ఘనసుమవర్షముబడెనింత
అనవినికలహాశనుడాడె । హరిజచర్మవీచుచుబాడె
సభాసదులుభీతినిగొనిరి । సహదేవునిభళిభళియనిరి
శిశుపాలునిసేనాధిపతి । శీఘ్రములోలేచెనుకుమతి
తమకుసాహ్యపడువారలను । తమసేనజగలవారలను
కనలిసిద్ధముగగావించె । కపటముచేయగతలపుంచె
యాదవగణముదివీక్షించె । ఆనికిసిద్ధపడికోపించె
ఉభయసముద్రంబులవిధము । ఉగ్రమగుచునుండెనుబలము
ధర్మజుడంతటవీక్షించె । త్వరగభీష్మునకువినిపించె
ధర్మ॥-యేలయూరకుండితివయ్యా । యిదిమాన్పగదలపగదయ్యా
అనిజరిగినయశుభంబయ్యా । యజ్ఞవిఘ్నమగునోయయ్యా
వైశం॥-అనగభీష్ముడపుడిట్లనెను । హరియుండగయటుగాదనెను
భీష్మ॥భగవంతుండీతడులేడా । భంగమైనజూచెడివాడా
వైశం॥-అదివినిశిశుపాలుండనెను । అగ్రహమునభీష్మునిగనెను
శిశు॥-నీవుబుద్ధిమంతుడవైన । నిన్నడుగకచేసిననైన
పాండవులకుకీర్తియొగగ్లు । ప్రభావంబుజగమునవెల్గు
వైశం॥-అదివినిభీముడుకోపించె । అంతకసన్నిభుడనిపించె
శిశుపాలునిజంపగలేచె । శీఘ్రమతనిపైబోజూచె
భీష్ముడుగాంచుచువారించె । భీమునికివ్విధివినిపించె

# నెం. 5

భీష్మ॥దమఘోషుండనుచేదిశుడు । సాత్వతియనుసతిగాంచె
ఫాలనేత్రుండుచతుర్భుజుండగు । బాలుడుజన్మించె
కొడుకుగార్ధభధ్వనియొనర్ప । దమఘోషుడువీక్షించె
భయవిస్మయములునొందుచుండ । యంబరమిటువిన్పించె
యితనినిరణమునజంపెడువాడీ । యిలలోలేడనెను
కరములురెండునుకన్నొక్కటియె । ఘనుడుముట్టజనును
తప్పకయితడేవీనిజంపుసన । ధమఘోషుడువినెను
శిశుపాలుండనిపేరుబెట్టి । దయచేతగాచుకొనెను
తనయింటికివచ్చినవారలకీ । తనయునిచ్చిగనును
ఇటులకొంతకాలముజనె । బంధుగులెల్లరుగనిరయ్యా
బలకృష్ణులుబంధువర్గముతో । బయనంబయిరయ్యా
తమమేనత్తనుసాత్వతిగనగా । దబ్బునజనిరయ్యా
సాత్వతితనమేనల్లుండ్లనుగని । సంతసపడెనయ్యా
విందునొసగితనతనయునిబలునకు । వేగనిచ్చెనయ్యా
గాంచిబలుడుసంతసపడికృష్ణుని । కరముసకిడెనయ్యా
మాధవుడుముట్టరెండుకరంబులు । మాయమాయెనయ్యా
ఫాలనేత్రంబుమాయమైన । యామగువగాంచెనయ్యా
సాత్వతిగనిభయమందుచుకృష్ణుని । సంస్తుతించెనయ్యా
సాత్వ॥దుష్టుడగుచునీకపకృతిజేసిన । దునుమగవలదయ్యా
అపరాధశతంబైనయంతనే । యపుడుజంపుమయ్యా
భీష్మ॥శ్రీకృష్ణునిచేతల్లియావరము । జెందియుండెనయ్యా
అటుగాకుండినదుర్భాషల । నెటులాలకింతునయ్యా
వరమునవాగితిగానియావరకె । వధనుజేతునయ్యా
శాంతించుముశ్రీకృష్ణునిచేనది । జరుగునుగనుమయ్యా
యతివపలుకులివివరకే । తొంబదితొమ్మిదాయెనయ్యా
వైశం॥-అంతశ్రీకృష్ణునింగనియాతడు । అపుడుబలికెనయ్యా
నాకిడుకన్నెనుదొంగవగుచు । గొన్నాడవనియెనయ్యా
హరికోపించుచుగనగసుదర్శన । మంతవచ్చెనయ్యా
కోటిసూర్యులఁబోలినకాంతిని । గూడివచ్చెనయ్యా

భగభగమంటలు గ్రక్కుచు రాసభ । వారు గాంచిరయ్యా
వ్రాసిన బొమ్మల విధము లైసభికులు । భయము జెందిరయ్యా
ప్రళయకాలమగు నేమోయనుచును । బలుకజొచ్చిరయ్యా
నిముసములోపల శిశుపాలుని । కంఠము నుగోసెనయ్యా
చచ్చిపడియున్న దేహములో । తేజంబు వెడలెనయ్యా
కడునద్భుతముగ కృష్ణుని తనువున । కలసిపోయెనయ్యా
సకల జనంబులు భక్తవత్సలుని । సంస్తుతించిరయ్యా
శతాపరాధములొసర్ప । మోక్షస్థానమిచ్చెనయ్యా
పయాసముద్రుండనెడి పేరు । సార్ధకము జేసెనయ్యా
ధర్మరాజు రాజసూయముపతి మోదమున । జరిగెనయ్యా
యాగాంతంబున యవభృథ । స్నానమాచరించిరయ్యా
తమతమ గృహములకెల్ల జనంబులు । తరలిపోయిరయ్యా
శ్రీకృష్ణుడు పూజలగొని । ద్వారకజేరబోయెనయ్యా
కౌరవులింద్రప్రస్థమున । కొంతకాలముండిరయ్యా

## నెం. 1

కురుపతి మయసభగననెంచె । అరయ ధర్మజుడు బంపించె
జనికురుపతి సభవీక్షించె । చాలగ సభలోన చరించె
తలపులేని ద్వారము గాంచె । తలపులున్నయటు యోచించె
దారిలేపనుచు వెనుజనెను । ద్వారంబింకొక్కటి గనెను
తలుపుగల్గు దానిని గాంచె । తలుపులేదనుచు బోనెంచె
అచట శిలాఘాతను జెందె । ఆర్తి బొందిమనమున గుందె
జలశూన్యము జలమను కొనెను । వలువను పైభాగము గొనెను
పాండుకుమారులు గనిరంత । పాంచాలియు గనె నవ్వింత
యెల్లరు నవ్వగ లజ్జించె । యెంతో యుపమానము గాంచె
ధర్మజునాజ్ఞను గైకొనెను । త్వరగ పురముకంత టుజనెను
అతిదీనత్వంబును గొనెను । అవనీపాలనమును విడెను
శకుని యతని చింతను గనెను । సంతాపము ఖనియెదననెను

# నెం. 5

మాయలమామనుగాంచియల్లుడొక । మాటబల్కినాడు
పాండుకుమారులసకలసౌఖ్యముల । బరగెడరన్నాడు
దుర్యో॥మాయసభగననేనేగితియంపుస । మసలితిసన్నాడు
తెలియలేకయందందువెర్రినై । తిరిగితిసన్నాడు
వైశం॥-ననుగనిద్రౌపతిపాండుకుమారులు । నవ్వెసరన్నాడు
ఆవైభవములులేవనిదుఃఖము । నందితినన్నాడు
శకునిబల్కివినివైభవములగొన । జాలుదువన్నాడు
చింతమానునీతండ్రికిదిజెప్పి । జేసెదమన్నాడు
అనదుర్యోధనుడతిముదమందుచు । యపుడేజనినాడు
జనకునిచెంతకుజనితనచింతను । చాలదెల్పినాడు
దు॥-పాండుకుమారులవైభవంబులను । బరగజూచితయ్యా
యెన్నడెరుంగనిరాజులు । కట్నములిచ్చిపోయినయ్యా
వేలురెండుమదగజములుదెచ్చియు । విరాటుడిడెనయ్యా
దశసాహస్రాశ్వములగొనిద్రుపదుడు । త్వరగనిచ్చెనయ్యా
పదునాల్గువేలదాసీజనముల । బరగనిచ్చెనయ్యా
ఒక్కవేయిమదగజములద్రుపదుడు । గ్రక్కుననిడెనయ్యా
గజములుపదునాల్గువేలుకృష్ణుడు । కరుణనిచ్చెనయ్యా
అఖిలరాజులిచ్చినవిజెప్పగా । యలవియెగాదయ్యా
వేయియేలస్వర్గవైభవంబులు । వెలసియుండెనయ్యా
ఘనమగుశంఖంబొకటిగలదచట । కడునద్భుతమయ్యా
ధరణీసురులొకలక్షభుజించిన । ధ్వనియొనర్చునయ్యా
నిముసమాత్రమాగకున్నశబ్దము । నేనువింటినయ్యా
ఆయాగంబునయెల్లకాలమిటు । లచటజరిగెనయ్యా
వారివైభవసహస్రములోనొక । భాగముమనదయ్యా
వైశం॥-త్వరగశకునిగనిబల్కిమాయజూ । దంబునాడుడయ్యా
శకు॥-నేనువారివైభవములగైకొని । నీకునిత్తునయ్యా
వైశం॥-వినిధృతరాష్ట్రుడుమదియోచించుచు । వేగబలికెనయ్యా
ధృత॥-విదురునియాలోచనగైకొని । గావింతునిల్వుమయ్యా
వైశం॥-అసగదుర్యోధనుండనెవిదురుని । యడుగనుడుగుమయ్యా

దు॥-యెప్పుడుపాండవపక్షపాతియై । యెనయుచుండునయ్యా
యీకార్యముగావింపకున్నచో । యేనుజత్తునయ్యా
విదురుడునీవిరాజ్యవిభవముల । ముదముసగొనుడయ్యా
వైశం॥-అనవినిధృతరాష్ట్రుడుమదిచింతిలి । యపుడుబల్కెనయ్యా
తప్పుకార్యమనిదెలసిప్రేమచే । యొప్పుకొనియెనయ్యా
శిల్పులచేసభసలంకారముగ । జేయించినదయ్యా
యేకాంతంబునవిదురునకియ్యది । వేగజెప్పెనయ్యా
విదురుడువినివిస్మయమునొందికలి । వేగముగనెనయ్యా
ద్వాపరాంతముసప్రాప్తమయ్యెను । దానెరిగినదయ్యా
అపుడంధునికనెజూటంబాడుట । యధర్మమగునయ్యా
విదు॥-పుత్రులపైమోహముసనీవనిక । బూసగవలదయ్యా
మాయాజూదముప్రజాక్షయముసకు । మార్గంబగునయ్యా
కురువంశమురక్షింపదలచితె । గూడదుపలదయ్యా
వైశం॥-అనధృతరాష్ట్రుండనెకలహంబెటు । లంకురమగునయ్యా
ధృత॥-భీష్ముడునీవేనుండగవారికి । భేదమెట్టులయ్యా
కావుననింద్రప్రస్థంబునకిపు । డీవువెడలుమయ్యా
ధర్మజాదులకాదోడ్కొనియిచటికి । త్వరలోరావయ్యా
వైశం॥-విదురుడువినినీయిష్టంబనిజని । భీష్మునిగనెనయ్యా
ధృతరాష్ట్రునిదుస్సంకల్పంబును । దెలియజేసెనయ్యా
వినిభీష్ముండిదికలిధర్మంబని । వెతనుజెందెనయ్యా
ధర్మజాదులనుగొనిరావిదురుడు । తరలిపోయెనయ్యా
ఇంద్రప్రస్థముజేరగపాండవు । లెదురువచ్చిరయ్యా
విదురుడుకుశలంబడిగితనువచ్చు । విధముదెల్పెనయ్యా
ధర్మజుండువినిమదిచింతించుచు । త్వరగబల్కెనయ్యా

## నెం. 1

ధర్మ॥-మాకొరకైసభజేయించె । మముదోడ్కొనిరానినుబంచె
నీయాజ్ఞనుదాటగలేము । నినునమ్మినవారము మేము
జూదమధర్మంబగుగాద । భేదములకుమూలముగాద

జననీదుపల్కులువినెద । అచటికబయసమ్మెజనెద
వైశం॥-తమ్ములతోద్రౌపతితోడ । త్వరగపరిజనంబులతోడ
ధౌమ్యుడుతనవెంబడిరాగ । తరలెధర్మజుండతివేగ
పాండుసుతులుకరిపురిజనిరి । భక్తిగభీష్మాదులగనిరి
వారికివందనములనిడిరి । వారిప్రేమనంతటగొనిరి
ఆదినంబుసుఖములగొనిరి । అంతప్రభాతంబునుగనిరి
స్నానదానములనుజేసిరి । సభనుజూడసందరుజనిరి
దుర్యోధనుడంతటజనెను । దుష్టబుద్ధితోనిట్లనెను
ధర్మరాజుతోనిట్లనెను । త్వరగజూదమాడుదమనెను
ధర్మరాజువినియిట్లనెను । తగదుజూదమునువలదనెను
ధర్మ॥-దానిచేతకలహముబెరుగు । ధర్మబుద్ధియంతటపరుగు
సుఖములేదుమానగరాద । జూదంబాడుటమర్యాద
వైశం॥-అనగశకునిదానిట్లనెను । అదియెక్షత్రధర్మంబగుసు
శకుని॥-జూదంబునపాపమురాదు । జూదముతగదనవిసరాదు
ఇష్టములేకుండినవలదు । ఇదివిలాసపరులకుగలదు
వైశం॥-అనగధర్మజుడుయోచించె । ఆరబ్ధముబొదనియెంచె
తెలసెజూదమాడగనిలచె । దైవంబునుమదిలోదలచె

## నెం. 5

జూదమాడుటకుదర్మజుడెల్లర । జూచిపల్కెనయ్యా
యెవరుజూదమాడుదురోవేగమె । యిటురమ్మనెనయ్యా
అనదుర్యోధనుడనెయీశకునియె । యాటలాడునయ్యా
దు॥-అతనియోడుటేనాయోడుటయగు । ననుచుచెలుయుమయ్యా
అతనిగెలుపేనాగెలుపగునని । యీయాటనాడుమయ్యా
వైశం॥-అనగధర్మజుడుమంచిదని । జూదమాడజొచ్చెనయ్యా
అతిముదమునగనుగొనుచు । భీష్మాదులచటనుండిరయ్యా
ధర్మజుండురథగజతురగంబుల । త్వరగనోడెనయ్యా
ధనధాన్యకోశములనోడుచు । తనధరణినోడెనయ్యా
అతిబలశాలులుతమ్ములపటుమిడి । యుపుడోడినడయ్యా

అదిగనవిదురుఁడుదుర్యోధనునకు । యపుడుబలికెనయ్యా
వి॥-అన్యాయంబొనరించివైభవము । లంపబూచితయ్యా
అన్యాయార్జితధనమును । నీధనమంతంబగునయ్యా
నాపల్కులవినిజూదంబాడుట । యాపుజేయుమయ్యా
బలవంతులతోవిరోధించుటను । బాధగలుగునయ్యా
వైశం॥-అనిధృతరాష్ట్రునిదిక్కుమొగంబై । యపుడుబలికెనయ్యా
వి॥-పాండుకుమారులవైభవములగొన । పాపంబగునయ్యా
కొడుకుపైనమోహంబునువీడుచు । కులముగాచుమయ్యా
ఒక్కనివీడినతక్కినసుతులీ । యుర్వినుందురయ్యా
యిప్పటికైనజూదంబాడుట । యిావుమాన్పుమయ్యా
నాపలుకులువినకున్నచో । సర్వనాశనమగునయ్యా
వైశం॥-సూనునిపైమోహముచేనంధుడు । మౌనముానెనయ్యా
దుర్యోధనుడతికుపితుడైవిదురు-। దూరిపల్కెనయ్యా
దు॥-పాండవపక్షంబెపుడుబలికెదవు । దండివాడవయ్యా
కుడిచినయింటికిచిచ్చుబెట్టఁగు । క్రూరుడవీవయ్యా
మరిమరియీావిధముగననుబల్కుట । మానియుండుమయ్యా
వైశం॥-అనవినివిదురుడుమౌనముానగా । యాటసాగెనయ్యా
ద్రౌపదినొకపంజెమ్మిడియోడుచు । దానోడెనయ్యా
చాలఁదుష్టుడైధర్మజుడాటను । చాలించినయ్యా
భీష్మద్రోణాదులుమౌనముచే । విస్మితులయిరయ్యా
కాలగతులుతప్పింపరాదంచు । గాంచుచుండిరయ్యా
అచటనున్నసభవారెల్లరు । దుఃఖాంబుధిబడిరయ్యా
దుష్టబుద్ధిగలవారువిలాసము । తోడనుండిరయ్యా
అంతదుర్యోధనుండులేచియిటులనె । నదివినుమయ్యా
పాండుకుమారులునాకుదాసులని । పలికియుండెనయ్యా
ద్రౌపదితోదాస్యంబుజేయింతు । త్వరగజూడుడయ్యా
అనుచువిదురునిజూచిద్రౌపదిని । గొనిరమ్మనెనయ్యా
వినివిదురుండనెయకృత్యమునకీ । వనుపగదగదయ్యా
విదు॥-తెలిసిసర్పములగదలించెదవగు । దీనిఫలంబయ్యా
గొప్పపతివ్రతనిచటికిదెమ్మన । కూడనిపనియయ్యా
మూలవినాశంబయ్యెడిపనియని । బుద్ధిదెలియుమయ్యా

కర్మలొనర్చెడివేళసౌఖ్యమే । గనుపడువినుమయ్యా
అనుభవించునపుడతికష్టంబై । యలరుచుండునయ్యా
వైశం॥-అనవినిదుర్యోధనుండువిదురుని । యసుపకుండెనయ్యా
పాంచాలినిగొనితెమ్మనిబంపెను । ప్రాతిగామిసయ్యా
సూతనందనుడుజని ద్రౌపదినిఁజూ । జూచిపలికెనయ్యా
ప్రా॥-సుదతిధర్మజుడుదుర్యోధనుతో । జూదమాడెనమ్మా
అఖిలసంపదలతమ్ములనిన్నును । యాతడోడెనమ్మా
కురుపతినిన్నుసభలోనికిప్పుడె । గొనిరమ్మనెనమ్మా

## నెం. 3

వైశం॥-అపలుక్కులుద్రౌపదివిని । శ్రీ । అతిదుఃఖముపుదినిగొని
సతిశోకించుచుబల్కెను । సతినిపందెమెటుబెట్టెను
జూదముధర్మజుడాడెను । సుదతినందుగోల్పోయెను
యేయుగముననెవరైనను । యీవిధంబుజేయరనెను
ద్రౌ॥-ప్రాతిగామివినుమయ్యా । పలికెదనదిదెల్పుమయ్యా
ననుమొదలేపందెమిడిన । ననుజూదంబుననోడిన
అయిదుగురకుసతినగుదును । అతడొకడెటులోడనగును
అటుగాకనుతనపందెము । అదిమంచేననుకొందము
అందునతానోటుబడెను । ముందుపందెమెటులిడును
ఎరుగుదేనిజెప్పుమయ్యా । యెరుగకున్నదెలియుమయ్యా
వచ్చిమరలదెలుపుమయ్యా । వార్త వినగనుంటినయ్యా

## నెం. 5

వైశం॥-అంతసభకుజనిధర్మజునింగని । యద్దిదెల్పెనయ్యా
మారుమాటాడకతడుదుఃఖించి । మౌనమూనెనయ్యా
కురుపతివినిబల్కెనుద్రౌపదినిటు । గొనిరమ్మనెనయ్యా
సంశయముదీర్పపెద్దలుగలరన । చయ్యనజనెనయ్యా
ధర్మజుమౌనముజెప్పగాసాధ్వి । దరలివచ్చెనయ్యా
జనికురువృద్ధునివెనుకభాగమున । సాధ్వినిల్చెనయ్యా
తన్వినిగాంచుచుపాండుకుమారులు । తలలువంచిరయ్యా

సంతసిల్లిదుర్యోధనుండు । దుశ్శాసనుగనెనయ్యా
భీమసేనుగనిప్రాతిగామిజన । భీతిజెందునయ్యా
నీవుద్రౌపదినిదోడ్కొనియిచటికి । దేవలెజనుమయ్యా
వినిభీతిలిద్రౌపదిగాంధారీ । వెనుకకేగెనయ్యా
దుశ్శాసనుండయ్యదిగనిజనియా । తొయ్యలికనెనయ్యా
చులకనగాజనుచెంచుముకురుపతి । బిలచినడనెనయ్యా
కరునాథునియర్థంబువైతివని । చురచురగనెనయ్యా
పాంచవసతిసన్నిభమజెందకుమని । పట్టగజనెనయ్యా
అంతటద్రౌపదిబల్కెరజస్వల । సంటకుమనెనయ్యా
ద్రౌప॥-ఏకవస్త్రనాసభకురాజాల । నింతదెలియువయ్యా
వైశం॥-అనగకోపించిదుశ్శాసనుడా । యతివకనియెనయ్యా
ఒక్కబట్టగలదంటివదిలేక । యున్నదప్పదనెను
అవభృథశుద్ధములగుకేశంబుల । నతడుబట్టుకొనెను
పాపకార్యమనిదలపకదానిని । బట్టియీడ్చెనయ్యా
అంతసభకుగొనిరాగజనంబులు । యపుడువెరచిరయ్యా
విడిపోయినవెంట్రుకలుద్రేలాడ । వెలదియేడ్చెనయ్యా
కోపశోకములనొందిసభికులఙ । గూర్చిపలికెనయ్యా
ద్రౌప॥-ధర్మజుండుదైవయోగమున । జూదమునవోడెనయ్యా
పాపుడుసన్నీడ్చితెచ్చుటనుగని । బలుకకుంటిరయ్యా
భరతవంశగౌరవమీనాటికి । భంగమాయెనయ్యా
యీఫలంబుమిమ్మంటకపోదు । దహింపకవిడదయ్యా
వైశం॥-అనిమౌనమూనిశ్రీకృష్ణుని । దనయాత్మదలచెనయ్యా
కనులుమూసిశ్రీకృష్ణునిపద । పంకజములధ్యానించె
భక్తవత్సలాగావరాయంచు । ప్రార్థనగావించె
అనాధురాలైసనాథయయ్యెను । యార్తినివినిపించె
దీనులగావగదీక్షనుబూనిన । దేవాయనియెంచె
కనులయశ్రుధారలొలుకద్రౌపది । కడువడిశోకించె
విలాపమొందెడిపాంచాలినియా । భీముడువీక్షించె
అతిదుఃఖావేశంబునధర్మజు । నంతటనిందించె
భీము॥-అకటనీజూదకారణమున । యీయాపదగనుపించె
అఖిలవైభవంబులనుక్షణములో । యంతముగావించె

అతిబలశాలులమైనమాకు । యీాయుపమతిపాప్తించె
కొనకుకాంతకిసభనవమానము । గూడసంభవించె
గాననీచేయిగాల్చినపాపము । గాదనివిలపించె
వైశం॥-అర్జునుడంతటశాంతిసల్పి । దాసపుడుబల్కెనయ్యా
అర్జు॥-ధర్మజుండుధర్మంబుదప్పగా । ధరణిపడకునయ్యా
విలాసజూదంబనుచుబిల్వగా । వెడలివచ్చెనయ్యా
ధర్మజుండువెలియనివాడనగా । ధర్మముగాదయ్యా
దైవయోగంబుదప్పింపగవిధి । తరంబుగాదయ్యా
వైశం॥-అనగవికర్ణుండంతటేచి । సభనరసిబలికెనయ్యా
వికు॥-పడతిసంశయమువినిపింపగవిని । బల్కరిదేమయ్యా
ధర్మాధర్మంబెరగిపలుకగా । తప్పగునేమయ్యా
వైశం॥-కర్ణుడంతలోయూరకుండుమని । కనలిపలికెనయ్యా
పెద్దలెరుంగనియర్థముదెలిపితి । పిన్నవునీవయ్యా
కుపితుడగుచుదుర్యోధనుడనుజుని । గూర్చిపలికెనయా
పాండుసుతులవస్త్రంబులొలువుమని । బలుకసాగినాడు
పాంచాలీవస్త్రముగొనుమని । సూచించిబలికినాడు
వినిపాండుకుమారులుపైవలువలు । విడచివేసినారు
అదిగనిసభాసదులుతమమదిలో । యార్తిబొందినారు
దుశ్శాసనుడాద్రౌపదిచెంతకు । తొందరజనినాడు
సాధ్వీమణియనిశంకింపక । వస్త్రంబునీడ్చినాడు
కనులుమూసిబాహ్యంబుదెలియక । కాంతనిలచెనయ్యా
ఆర్తశరణ్యుండగుశ్రీకృష్ణుని । యాపెవేడెనయ్యా
సతిధరించువస్త్రంబును । దుశ్శాసనుండీడ్చెనయ్యా
యింకొకవస్త్రముగనిపింపగనది । యీడ్చివేసెనయ్యా
అనేకవలువలనొలచియొక్కచో । నతడువేసెనయ్యా
గిరవలెగన్పడెదుశ్శాసనునకు । కేలునొచ్చెనయ్యా
సిగ్గునొందివలువలీడ్వజాలక । చిన్నబోయెనయ్యా
అపుడురక్తాక్షుడైభీముండా । యుధమునిగనెనయ్యా
ప్రతినవినుడనిసభికులువినగా । బల్కసాగెనయ్యా
భీము॥-ద్రౌపదీవస్త్రములనుహరించిన । పాపుడువీడయ్యా
దురపమునమీపలుజూడగనీతని । దునిమివేతునయ్యా

వక్షముబగిల్చిరక్తముద్రావెద । వాయుసుతుడనయ్యా
కనలియిటుసేయకున్నపూర్వజుల । గతినిదప్పుదయ్యా
వైశం॥-యతనిపలుకులకుసభవారెల్లరు । యుద్భుతపడిరయ్యా
ద్రుపదాత్మజసభికులనెల్లరగని । యుపుడుబల్కెనయ్యా
యిపుడింతటియవమానమునొందుట । యెరిగితిరనెనయ్యా
అదిగనిదుర్యోధనుడుద్రౌపదిని । యురసుబల్కెనయ్యా
నాతొడపైగూర్చునుటకురమ్మని । నాతిననియెనయ్యా
కదనభీముడాభీముడువిని । యిక్కరణిబల్కినాడు
భీము॥-తొడపైగూర్చుండుటకుద్రౌపదిని । చెడుగుబిలచినాడు
వీనితొడలుఖండింతురణములో । వినుడిదియున్నాడు
వైశం॥-అనుచుకోపముసగదాదండమును । యుతడుగాంచినాడు
అన్నముఖంబునుసభికులముఖమును । యంతజూచినాడు
సభికులుసమయముగాదనిచెప్పిన । శాంతమొందినాడు
అపుడుమహోత్పాతంబులుగల్గెను । యువిజెప్పెదనయ్యా
నక్కలేడ్చెయగ్నిజల్లారె । జననాయకవినుమయ్యా
కౌరవకాంతలమదిలోదుఃఖము । కల్పనాయెనయ్యా
కౌరవులిండ్లనుకాకఘూకములు । గలసియొర్లెనయ్యా
విదురభీష్మాదులంతపెదవులను । విరచియుండిరయ్యా
కౌరవనాశంబగుననిమదిలో । గాంచియుండిరయ్యా
అదియెరింగిగాంధారిపతికి । యదియంతదెల్పెనయ్యా
అంతధృతరాష్ట్రుడాత్మజుసకు । ముదమారబలికెనయ్యా
ధృ॥-ద్రౌపదిమానవభామినిగా । మదిదలపకుమోయయ్యా
అయోనిసంభవనిటుదుర్భాషల । నాడగతగదయ్యా
వైశం॥-అనుచుసుతునిబుజ్జగించిద్రౌపది । కపుడుబలికెనయ్యా

## నెం. 1

ధృ॥-నీపుపతివ్రతవోయమ్మా । నిన్నారడిబెట్టిసరమ్మా
అగ్రహంబునొందకుమమ్మా । అతిదయమదిలోగొనుమమ్మా
అతిసంతసమందితినమ్మా । అడుగుపరంబిచ్చెదనమ్మా
వైశం॥-అదివినిద్రౌపదియిట్లనెను । అనఘుడుధర్మజువిడుమనెను

అనధృతరాష్ట్రుండిటులనెను । అడుగుమురెండపపరమనెను
వినిసతియనెతక్కినపతులకు । విడువుమనెనుసాయుధకరులకు
భూపుడుమూడవదిడుదనెను । పాలతిగోరుకొమ్మనియనెను
వరశతంబువిప్రాంగనకు । వరద్వయమురాజాంగనకు
వరత్రయమువైశ్యాంగనకు । వరచతుష్టయముశూద్రజకు
అరుగధర్మశాస్త్రములేదా । అధికమడుగనదిమర్యాద
అనగసాధ్వియివ్విధమనెను । అధర్మమౌవలదనియనెను
ధృతరాష్ట్రుడుసంతసపడెను । చతురునిధర్మజురమ్మనెను
ధృ॥-ఇడితివిభవములగొనుమయ్యా । ఇంద్రప్రస్థముజనుమయ్యా
పూర్వమువలెనుండగదయ్యా । బుద్ధియుక్తుడవునీవయ్యా
మదినికోపమూనకుమయ్యా । మాకుశలంబెరుగగదయ్యా
విదురుపల్కులాలించితిని । వృథాజూదమాడించితిని
విలాసార్థమనిచలచితిని । వృద్ధుడనైమతిదప్పితిని

## నెం. 5

వైశం॥-అంతభీముడదిగనికోపించుచు । యపుడుబల్కెనయ్యా
భీము॥-పాండుసుతులకీనాటికి । సతిసంపాదనగతియయ్యా
పురుషులైపుట్టిపాలతిధనంబును । భుజింతురెటులయ్యా
గదాదండమునశత్రులజంపి । సుఖంబుగొందుమయ్యా
వైశం॥-అతనిశాంతమొనరించిధర్మజుడు । యరుగదలచెనయ్యా
ఇంద్రప్రస్థంబునకుజని । సౌఖ్యమెల్లరుగనిరయ్యా
కౌరవపతికర్ణశకునిసైంధవ । వీరులకనెనయ్యా
చేజిక్కినపాండవులుబోయిరని । చింతజేసెనయ్యా
వారియాలోచనగొనిజనకుని । పాలికేగెనయ్యా
దు॥-పాండుకుమారులకెంతజేసినను । బగరమగుదుమయ్యా
సవ్యసాచిగాండీవహస్తుడై । జంపవచ్చునయ్యా
గదగొనిభీముడునూర్వురనుజంప । కదలివచ్చునయ్యా
యెట్టులైనవైరబీజముభయుల । కేర్పడెవినుమయ్యా
మరలజూదమాడించియోడింతు । మార్గముగనుదయ్యా
విదేశవాసులనొనర్చిమదిగల । భీతినివిడుదయ్యా

దీనికినీవొదబడుమనితండ్రికి । చెల్పిపోయెనయ్యా
వైశం॥-అనుద్యూతార్థమూహ్వానంబును । యపుడుబంపెనయ్యా
ధర్మజుడెల్లరగొనిపయనంబై । త్వరగవచ్చిరయ్యా
విధిదప్పింపగరాదనిసభలో । పెద్దలగనెనయ్యా
వీరిరాకగనిసకలజనంబులు । వెతనుజెందిరయ్యా
మరలయేమివింతబుట్టునోయని । మదినిదల్చిరయ్యా
అంతలోశకునిధర్మరాజుగని । యపుడుబల్కెనయ్యా
శకు॥-ఒక్కపందెమిప్పుడుబెట్టుటమది । గ్రక్కునవినుమయ్యా
ఓడినవారడవినిపన్నెండేండ్లుండ । పలయునయ్యా
అజ్ఞాతంబొకయేడుసల్పపలె । ననునదిపణమయ్యా
జాడలెరింగినపూర్వముపలెనే । సల్పపలయునయ్యా
ఇదినీయిష్టంబైనజూదంబు । నిపుడాడుదమయ్యా
వైశం॥-ధర్మజుడొప్పుచుజూదంబాడగ । దలచినిలచెనయ్యా
దైవవిధిచేతనొక్కపందెమున । త్వరగనోడెనయ్యా
ఓడిపాండపులుసకలసౌఖ్యములు । వీడదలచిరయ్యా
భీష్మద్రోణాదులువారలగని । విలాపించిరయ్యా
విదురుడిట్లనెనుకుంతియుడవికై । వెడలగవలదయ్యా
విదు॥-నాసదనంబుననుంచుకొందునిది । నాసమ్మతమయ్యా
అడవిలోనబహుకష్టంబులు । మీరందుచుందురయ్యా
హరిభక్తులుమీకేయెడలోపము । జరుగదుజనుడయ్యా
తెలివితోనుండుడంతట । మీకాపైపముగలదయ్యా
నీవారలతోనుంటివద్దియే । నీపురమగునయ్యా
వైశం॥-అనగనందరాశీర్వాదంబుల । నంతటనిడిరయ్యా
ధర్మజాదులాతల్లికిమ్రొక్కుచు । పరలియుండిరయ్యా
అతిదుఃఖించుచుదీపనలిడ । వారంతటజనిరయ్యా
ముఖమునవస్త్రంబిడుకొని । ధర్మజభూపుడేగెనయ్యా
తనకనుమంటలుజనులబాధించు । ననుకొనిజనెనయ్యా
తనచేతులనాడించుచుభీముడు । తరలిపోయెనయ్యా
వీటిచేతకౌరవులజంపుదను । విధముదోచెనయ్యా
ధూళియుక్తదేహముతోనకులుడు । తొందరజనెనయ్యా
తనతనువునుగనజనులకుదుఃఖము । తగలకుండనయ్యా

సహదేవుడుతనమోమువంచుకొని । చయ్యనజనెనయ్యా
వీడినకురులతోద్రౌపదియేడ్చుచు । వెతనుబోయెనయ్యా
మగలుబావగాకౌరవసతులి । ష్మాడ్కియునగనయ్యా
యా మ్యరౌద్రసామంబులబాడుచు । ధౌమ్యుడేగెనయ్యా
చచ్చినవారికిపరలోకక్రియ । సల్పువిధంబయ్యా
వినియంధుండనెపాండుకుమారులు । విహితచిత్తులయ్యా
ధృత॥-వారలతోడనకారణవైరము । వచ్చియుండెనయ్యా
బలహీనులునాసుతులువారిచే । భంగమగుదురయ్యా
వైశం॥-హాయనిదుఃఖమునొందిభూమిపై । యతడుగూలెనయ్యా
అంబికేయునింగనుగొనిసంజయు । డపుడుబలికెనయ్యా
సం॥-విలపింపనేలయిపుడువారలను । బిల్వబంపుమయ్యా
వారిసంపదలవారికిచ్చిబను । పంగవలయునయ్యా
అటులసేయనీతనయులుసుఖముల । నందుచుందురయ్యా
అన్యాయార్జితసంపదలన్నిట । హానిగూర్చునయ్యా
మించలేదుయోచించుకొనుము । బిల్పించదలచుమయ్యా
వైశం॥-జ్ఞానియైపుత్రమోహముతోవిని । షౌనమూనెనయ్యా
ద్రోణుడుపాండవులడవికేగ । యతిదీనుడాయెనయ్యా
కడుధర్మాత్ములటంచుదెలిసియును । వెడలకుండెనయ్యా
యెటులైననురణమగుననిమదిలో । యెరిగియుండెనయ్యా
ద్రుపదుడుసాయంబొనర్చువీరికి । దివ్యబలుండయ్యా
తననుజంపుటకుదృష్టద్యుమ్నుడు । జననమాయెనయ్యా
యెదురురణమునకునేనుగాకున్న । యెటులజంపునయ్యా
విప్రులవరమెప్పుడుదప్పనిదని । వెడలగలేదయ్యా
అధర్మపరులనిదెలసికౌరవుల । నతడుగూడెనయ్యా
పాండవులిరువదిమూడేడులు । వైభవములగొనిరయ్యా
సభాపర్వమియ్యదివినిపించితి । జనమేజయురాజ
అవ్వలికథవినిపించెనవినుమో । యర్కసదృశతేజ



—: ఫలశ్రుతి : —

## నెం. 1

భారతవీరులచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుదీని । విరచించెనుభక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడుయీసత్కృతిని
సదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని

సభాపర్వము సమాప్తము.



శ్రీ కృష్ణాయ నమః

# తందనాన

# శ్రీమహాభారతము

## అరణ్యపర్వము



## నెం. 1

వైశం॥-శ్రీజనమేజయనరవర్యా । చిత్తగించుమోనచ్చర్యా
అనఘునివ్యాసునినుతియింతు । అరణ్యపర్వమువినిపింతు
పాండుతనయులాయుధధరులై । బయనమైరిద్రౌపదియుతులై
పదునాలుగువేలరథంబుల్ । బయనమాయెపరిజనయుతులై
సుభద్రాభిమన్యులగూడి । సుతులనెల్లవారలగూడి
యుత్తరాభిముఖులైజనిరి । ఊరివారలదిగనిడునిరి
పద్య॥-పాపాత్ముడుదుర్యోధనుడు । వానిహితుడుధృతరాష్ట్రుండు
కపటద్యూతముగావింప । కానకమాయకులనుబంప
వలదనిబల్కడుభీష్ముండు । దలపకుమనడీద్రోణుండు
కృపనుజూపడాయెనుకృపుడు । విపరీతంబనడువిదురుడు
వీరెల్లరుమౌనమూనిరి । విపినముపాండుసుతులుజనిరి
దుష్టచతుష్టయమునుగూడి । దురితభయంబెల్లరువీడి
దుర్యోధనుడీధరనేలు । దుస్తంత్రంబిచటికిజాలు
పాండుసుతులవెంబడింతము । వనశ్రమలననుభవింతము
వైశం॥-అనుచుపురజనంబరుదెంచె । అందరిధర్మజుడీక్షించె
ధర్మ॥-పౌరులారదయతోవినుడీ । ఘోరవనమురాదలపకుడీ
దుష్కర్మనుజేసినమేము । దుర్గతిపాలగుచున్నాము
వైశం॥-కరినగరముజనుమనినంత । కడుదుఃఖముపాలైరంత

మెలమెల్లగయింళ్ళకుజనిరి । తొలుగకవిప్రులువెనుగొనిరి
పాండుసుతులుగంగనుగనిరి । ప్రమాణమనువటముజేరిరి
అదిసమంపచటనిలచిరి । అంతప్రభాతంబునుగనిరి
ద్విజులుపాండవులగనొగొనిరి । దీవించుచుమరియిట్లనిరి
బ్రా॥- మిమ్ము వీడిపురలతెగము । మిమ్మునమ్మియున్నవారము
దుష్టపాలసంబంధయుగుసు । కష్టంబతిశయమికయుగును
మీతొవనిసుండెదమయ్యా । మీకుతాపమిడమోయయ్యా
వైశం॥-అనగధర్మజుడురమ్మనెను । ఆహారంబిడచింతిలెను
భక్ష్యభోజ్యములదినుమీకు । ఫలములిడగలెపమునాకు
శౌనకుడసుమునిగనియనెను । దీనికుపాయమువినుమనెను
శౌన॥-సూర్యునిబూజింపగదయ్యా । సుఖముగల్గునీకోయయ్యా
వైశం॥-ధౌమ్యుడురవిమంత్రంబిడెసు । ధర్మజుండుతపముసలివెను
అతిభక్తిగదేసనదయ్యా । ఆదిత్యుడువచ్చినడయ్యా
సూ॥-నీసంకల్పంబెరిగితినీ । నీకువరంబిడవచ్చితిని
తామ్రపాత్రనిదిగైకొనుము । ద్రౌపదిచేతికినివిడుము
పంచభక్షములుజనియించు । పట్టినంతగొనిసుఖియించు
వస్త్రఫలములనుగొనుమయ్యా । ధర్మజీవుడవునీవయ్యా
పండ్రెండెళ్ళువిధిజనును । పరమాత్ముడుసాయంబగును
వైశం॥-అనిసూర్యుండేగినడయ్యా । అందట్టులబుట్టినవయ్యా

# నెం. 5

వేలకొలదిభూసురులకువారలు । ప్రీతిజేసిరయ్యా
అనేకమౌనులుఆశీర్వాదము । లందుచుండరయ్యా
కామ్యకవనమునుజేరికాలమును । గడుపుచుండిరయ్యా
కరిపురముసధృతరాష్ట్రుడువిదురుని । గాంచిబల్కెనయ్యా
పాండవులేమొనరింతురనవిని । బల్కెవిదురుడయ్యా
విదు॥-దేవసమానులుపాండుకుమారులు । ధీరచిత్తులయ్యా
భీమపార్థులతిఘనులునీసుతుల । విడుపరువినుమయ్యా
అధర్మమగుజూదంబునవైరం । బావహిల్లెనయ్యా
వారిభాగమికవారికిడినచో । వైరమురాదయ్యా

శకునికర్ణదుశ్శాసనబోధలు । సత్యంబనుచయ్యా
ఆక్రిదుర్యోధనుని పైఁబ్రీతిస । గట్టిగవిడుమయ్యా
వైశం॥-అతనిజన్మమునదుశ్శకునంబులు । యధికమాయెనయ్యా
విదు॥-సాధ్వికిసభలోనవమానంబును । సల్పెనుపనుమయ్యా
వినపైఁబ్రేమవిషచివారలను । బిల్వబంపుమయ్యా
ధైర్యవంతులవ్వారితోఁ । యుద్ధంబుతప్పదయ్యా
సకలజనక్షయమౌను నామాట । సత్వరవినుమయ్యా
పనకుండినచోయాపలంబు । నపనుబపింతుపయ్యా
వైశం॥-అసగకోపించిధృతరాష్ట్రుంతప్ప । డాతనికనెనయ్యా
నాతనయులగొప్పదనమువినపది । న్యాయముగానయ్యా
నిసహాయమికజాలునెంచైన । నీవువెడలుమయ్యా
పాండుకుమారులజేరెదపోయిక । బయసముగానయ్యా
వైశం॥-వినుచువిదురుడటవేగమునకామ్యక । వనముజేరెనయ్యా
పాండవులతనినిసత్కరింపగా । బల్కెనువినుమయ్యా
విదు॥-నీతిబోధింపధృతరాష్ట్రుడునను । నిందించినదయ్యా
రాజ్యలక్ష్మిమీరులేనికతమున । రంజిలదోయయ్యా
వృద్ధుడువయోపతినిబెండ్లాడిన । విధముదోచెనయ్యా
ఆరాజ్యంబునకర్తలుమీరే । యయ్యెదరోయయ్యా
యెన్నటికైనదప్పదిపలుకు । యేర్పడుపనుమయ్యా
అనధర్మజుడనెమాహితమెప్పుడు । యరయుచుండుమయ్యా
ధర్మ॥-గాననీవిటమాతోనుండుము । కడుసంతసమయ్యా
వైశం॥-వినివిదురుండటనివసించెను । కురువిభుడుదలచెనయ్యా
ధృత॥-మందబుద్ధినైవిదురునియెంతో । నిందించితినయ్యా
సంజయునప్పుడుపిలచియిట్లనెను । సత్వరజనుమయ్యా
నీతివంతుడావిదురునింబాసి । నిలువజాలనయ్యా
వైశం॥-అచటికిజనివిదురునిదోడ్తెమ్మన । యాతడుజనెనయ్యా
కామ్యకవనమునుజేరియచటగల । నతజూచెనయ్యా
పాండవసత్కారంబునుగొని । యిప్పగిదిబలికెనయ్యా
విదురునిదోడ్తెమ్మనిధృతరాష్ట్రుడు । వేగబంపెనయ్యా
అనధర్మజుడనెవిదురునకట్టుల । యాచరింపుమయ్యా
పెద్దలపలుకులువిననివారలకు । కద్దుసుఖంబయ్యా

అనగమంచిదనివిదురుడంతప్పుడు । యుచటికిజనెనయ్యా
కనిధృతరాష్ట్రుడుకౌగలించి । యుక్కరమునబలికెనయ్యా
బుద్ధిలేకపలికితినికిమింపుము । బుద్ధియుతుడవయ్యా
అనగవిదురుడనెనుధర్మమెరుగుచు । యనుటయెసుఖమయ్యా
విదు॥-వినకనీసుతునిసమ్మిసచొసగు । జనకుడుంబయ్యా
వైశం॥-అనుచుజెప్పచుతనిపుష్పనలగొని । యుపటనుండెనయ్యా
అంతదుర్యోధనుడుకర్ణాదుల । కపుడుబలికెనయ్యా
దు॥-పోయినవిదురుడుపచ్చెనాతండ్రి । బుద్ధిదిప్పెనయ్యా
వెగమెపాండుకుమారులనిచటికి । బల్పించెదరయ్యా
అగ్నివిషజలాదులతొవారిని । హతముజేతుమయ్యా
వైశం॥-శకునిబలికెవారుసత్యవంతులు । శపథమువిడరయ్యా
అనగకర్ణుడనెమనసేనలతొ । యరుగుదమోయయ్యా
కర్ణ॥-అనియొనర్చివారలనాయుధవిధి । హతముజేతుమయ్యా
అటులైననుసకలరాజ్యసంపద । ననుభవింతుమయ్యా
వైశం॥-అనగభళియునిదుర్యోధనుడపు । డరిగెనువినుమయ్యా
బలములగైకొనియెల్లరువెగమె । బయలుదేరెరయ్యా
వ్యాసమౌనిదివ్యదృష్టిగనుగొని । వచ్చిపలికెనయ్యా
అధర్మమగునిదివెడలకుమని । యిపుడతనినాపెనయ్యా
అంతవ్యాసుడాధృతరాష్ట్రునిగని। యపుడుబలికెనయ్యా

# నెం. 1

వ్యా॥-అవనిభాగంబునువిడిచి । అరణ్యంబుజేరగజనిరి
వారినివధియింపగసుతుడు । బయలువెడలెగాదుర్మదుడు
ధర్మయుతులుపాండవులయ్యా । దయాసత్యబలయుతులయ్యా
పదమూడేడులుజరిపెదరు । భాగమిమ్మనుచుబల్కెదరు
యీయుకున్నరణమగునయ్యా । యేటికిట్లుజేసెదవయ్యా
నీవుపేక్షజేసితివయ్యా । నీకేదుఃఖంబగునయ్యా
వైశం॥-అనధృతరాష్ట్రుడుశోకించె । అవ్యాసునకిటువిన్పించె
ధృత॥-పుత్రస్నేహముగలడయ్యా । పుత్రుడుఖలుడెరుగుడునయ్యా
నేనుజెప్పవినడోడయ్యా । నీవేదయజెప్పగదయ్యా

వైశం॥-అనగవ్యాసుడపుడిట్లనెను । ఘనుడా మైత్రేయుండనెను
అతనుహితమ్మను నేయయ్యా । అనుచువ్యాసుడేగెనయ్యా
అంతటమైత్రేయుడువచ్చె । ఆధృతరాష్ట్రుడుమదిమెచ్చె
ఎంతోగౌరవముజేసెను । యెచటనుండవచ్చితిరనెను
అనవినిమైత్రేయుండనెను । తిరిగితియాత్రలకేగనెను
మై॥-అడవిలోనవచ్చుచునుండ । పాండవులనుగనుగొంటి
జటాజినంబులుగలవారు । సత్యనిష్ఠతోనున్నారు
కాయలుపళ్ళునుడినివారు । కాలముగడుపుచునున్నారు
వైశం॥-అంతటదుర్యోధనుగనెను । అధర్మంబు సేయకుమనెను
మై॥-వారుమహాబలయుతులయ్యా । వారుధర్మపరులోయయ్యా
బలవంతుడుభీముండగును । బకహిడింబులనుపొరిగొనెను
జరాసుతుడుబలవంతుండు । జంపెనతనినీభీముండు
కిమ్మీరునిజంపెనయ్యా । అమ్మహాత్ము పతిబలుడయ్యా
శ్రీకృష్ణుడుబంధువుడయ్యా । శ్రితజనరక్షకుడతడయ్యా
పాంచాలులుబంధుగులయ్యా । బలముమిగులగలవారయ్యా
సత్వరమవ్వారలగూడి । జయముబొందుదుష్టులవేడి

## నెం. 5

వైశం॥-తొడలునరచుకొనిహాస్యముసల్పెను । దుర్యోధనుడయ్యా
కోపమొందిమైత్రేయుండతనికి । శాపమిచ్చెనయ్యా
మై॥-భీమునిగదచేనీతొడలనిల్లో । విరిగిపోవునయ్యా
వైశం॥-వినిధృతరాష్ట్రుడుభీతిజెంది । యామునినివేడెనయ్యా
వేడినంతలోమునిశాంతించుచు । వేగబలికెనయ్యా
మై॥-బుద్ధితోవీడుమెలగినశాపము । బొందడువినుమయ్యా
బుద్ధిహీనుడైగర్వించిననది । బొందుతప్పదయ్యా
వైశం॥-అనిమునిజనెధృతరాష్ట్రుడువిదురున । కపుడుబలికెనయ్యా
ధృత॥-భీమసేనుడాకిమ్మీరునిజంపినది । దెలుపుమయ్యా
వైశం॥-అనవిదురుండనెపాండవులడవిన । జనుచునుండిరయ్యా
విదు॥-కామ్యకవనమునరాత్రియందు । రాక్షసుడువచ్చెనయ్యా
ధౌమ్యుడురక్షోఘ్నమంత్రములు । నతిత్వరగనిచ్చెనయ్యా

వానిమాయచేమంత్రములప్పుడు । పాడఁదప్పెనయ్యా
భీకరయాపునిఁజూచుచునే నృపతి । భీతిజెందెనయ్యా
ధర్మజుఁడాకిమ్మీరునిఁగనుఁగొని । త్వరగఁబలికెనయ్యా
ధర్మ॥-ఏపరివాఁడవిందేలవచ్చితివి । ఎఱుఁగఁజెప్పుమయ్యా
విదు॥-అనఁగవాఁడువినిబకాసురునకే । సహజుఁడనేయయ్యా
కిమ్మీ॥అనేకరాక్షసబలములతోని । వనినుండెదనయ్యా
తెలియకయిటుతీవనమునవచ్చిన । తినియెదనేయయ్యా
అమరులునునుగనిశ్చితిల్లపరెటు । అరుదెంచితిరయ్యా
వచ్చితిరికమంచిదాయెమిమ్ముల । భక్షించెదనయ్యా
ధర్మ॥-ధర్మజుండనువినిబలికెనునేనే । ధర్మసుతుఁడనయ్యా
విజయనకులసహదేవులువీరె । భీముండితఁడయ్యా
విదు॥-అనఁగనసురుఁడనెభీముఁడువాఁడే । యౌనమంచిదయ్యా
కిమ్మీ॥భీముఁడునాయన్ననుబకాసురుని । వెతకుచుంటినయ్యా
నాహితుఁడైనహిడింబుఁడతనిచే । నశియించెనయ్యా
వాఁడేనాభాగ్యముచేనిపుడిక । వచ్చెఁజూచితయ్యా
క్షణమాత్రంబునమ్రింగివైచినా । కసిదీర్చెదనయ్యా
విదు॥-అనఁగనరనకులసహదేవులువిని । ధనువులఁగొనిరయ్యా
అంతటభీముండతిక్రోధమ్మున । యసురునిదాకెనయ్యా
ఇరువురుసమానబలులౌకసలుచు । దురముజేసిరయ్యా
అనేకవృక్షాయుధములచే । వారనియొనర్చిరయ్యా
అపుడుశిలలచేగొట్టుకొనిరి । వారతిబలులోయయ్యా
భీముఁడొక్కశిలగైకొనియసురుని । బిట్టుగొట్టెనయ్యా
పవనాత్మజునిబలంబునకెల్లరు । ప్రశంసించిరయ్యా
ఆభీమునియతిబలమంతుండో । యన్నావినుమయ్యా
వైశం॥-ఏనిధృతరాష్ట్రుఁడువినుమదిలోనను । భీతిజెందెనయ్యా
అడవికిపాండవులేగినదనిన । హరివినెనెయయ్యా
కౌరవులనునిందించుచువేగమె । జేరవచ్చెనయ్యా
ద్రుపదరాజుబంధువర్గములతో । నపుడువచ్చెనయ్యా
అందరుపాండవసత్కారముగొని । యచటనుండిరయ్యా
పాండుసుతులవనవాసంబునుగని । పరితపించిరయ్యా
అతికోపంబునశ్రీకృష్ణుండపు । డంతటనికనెనయ్యా

శ్రీకృ॥-కర్ణశకునిదుర్యోధనాదులను । కలసగహింత్రుమయ్యా
ఆఖిలరాజ్యసంపదను ధర్మజుని । కప్పగింతమయ్యా
వైశం॥-హరికోపంబునుగనుగొనియపుడె । సంబడుబలికెనయ్యా
అర్జు॥-శాంతింపుముకాలమింకనుండెను । సర్వజ్ఞుడవయ్యా
సకలభూతములుబుట్టిగిట్టు । నీసంకల్పంబయ్యా
అట్టినీవు పలచుకొన్నయెవరికి । యుద్ధపడుదురయ్యా
గంధమాదనంబందుమునుతపము । గావించితివయ్యా
ఫలాహారివైపదివేలేండ్లు । తపమునల్పితివయ్యా
జలాహారివైపుష్కరమందున । నిలచితివివయ్యా
పదునొకండువెయ్యేండ్లుతపంబున । పరలితివోయయ్యా
ప్రభాసతీర్థంబందొకపదమున । బరగనిలచితయ్యా
దివ్యసహస్రాబ్దంబులుతపమున । దేజరిలితివయ్యా
బదరీవనమందొక్కపాదమున । కదలకుంటవయ్యా
అనేకవేలేండ్లూర్ధ్వక రుండవై । యాచరించితయ్యా
ద్వాదశాబ్దములనేకవ్రతంబుల । దనరజేసితయ్యా
చైత్రరథంబునయనేకక్రతువుల । జేసియుంటివయ్యా
కనకముద్రలొకనూరులక్షలొక । క్రతువునకడితయ్యా
అనేకయజ్ఞంబులనివ్విధమున । యాచరించితయ్యా
తపోయజ్ఞమూర్తి పగుచుజగముల । దయనుబ్రోతువయ్యా
అట్టినీవుభూభారముడుప । నిందవతరించితివయ్యా
కంసనరకశిశుపాలాదులనిట । ఖండించితివయ్యా
ఆదివిష్ణుండవగుదువునీపలుక । నృతముగాదయ్యా
వైశం॥-అనుచుపాదములపైబడునరునకు । హరియిటులనెనయ్యా
కృష్ణు॥-నరుడవీవునారాయణుండనే । నెరిగితివీవయ్యా
నీకునాకుభేదంబులేదనుచు । నిజముదెలియుమయ్యా
నీశత్రువుడేనాశత్రువుడని । నీవుదెలియుమయ్యా
నీమిత్రుండేనామిత్రుండని । నేనుదెలుపుదయ్యా
వైశం॥-అతిదుఃఖించుచుద్రౌపతికృష్ణున । కపుడుబలికెనయ్యా
ద్రౌ॥-ప్రజాసర్గమునప్రజాపతివనుచు । బల్కిరిమునులయ్యా
యజ్ఞోద్ధరణమొనర్చినకతమున । యజ్ఞుండనిరయ్యా
నీవఖిలజ్ఞుడవెరుగుదువైనను । నేనుజెప్పుదయ్యా

అనేకవేలబ్రాహ్మణులను । మిరర్చించితిరయ్యా
యావిప్రులదీవనలచేతమీకెపుడు । జయమౌనయ్యా
వైశం॥-బకదాల్భ్యుండనుమహమౌనియిటు । బలకివెడలెనయ్యా
అంతవ్యాసమునిపాండవులున్నెడ । కపుడుపచ్చెనయ్యా
వచ్చిపూజగొనిధర్మరాజునకు । బల్కెసువినుమయ్యా
వ్యాసు॥కర్ణకృపద్రోణభీష్ములతిశయ । కదనవీరులయ్యా
వారినిరణమునగెల్వగమీకతి । భారంబగునయ్యా
దానికతిరహస్యంబగువిద్యను । త్వరగవెల్పుదయ్యా
జేకొనుమిదినీవాపాధునితో । జేయింపగదయ్యా
వైశం॥-అనియేకాంతంబందుధర్మజున । కతడుజెప్పెనయ్యా
వ్యాసు॥అర్జుననంపుముహరునిగూర్చి । తపమాచరించునయ్యా
హరుడుప్రత్యక్షమైదివ్యాస్త్రము । లప్పుడిచ్చునయ్యా
శర్వునిదయచేసకలవిరులను । జయింతురొరయ్యా
యీవనమునపెద్దకాలముండక । యేగపలయుసయ్యా
వైశం॥-వ్యాసుడిటుజెప్పివెడలగవారా । వనమువిడిరయ్యా
జనిసరస్వతీతీరంబున । వాసంబుజేసిరయ్యా
అతిసంతసమునకొంతకాలమిటు । లచటనుండిరయ్యా
నరునిగాంచిధర్మసంభవుండొక । నాడుబలికెనయ్యా
వ్యాసుడుజెప్పినవిధమునుజెప్పగ । బయనమాయెనయ్యా
అర్జునుడావిద్యనుగొనవెగమె । యరుగుచుండెనయ్యా
అర్జునుడాహిమగంధమాదనము । లంతదాటెనయ్యా
ఇంద్రకీలమనునగముచెంతకత । డేగుచుండెనయ్యా
ఇంద్రుడతనిధైర్యంబునుగనుటకు । యిటులబలికెనయ్యా
అచటికిబోవలదనుచుగగమున । యపుడుజెప్పెనయ్యా
భీతిలేకజనుచున్ననింద్రుడొక । విప్రుడాయెనయ్యా
వృక్షమూలమునగూర్చుండిననా । విజయుడుగనెనయ్యా
మహాత్ముడీతనితపముజెడుననుచు । మౌనమూనెనయ్యా
అచటవిశ్రమించినపాధునిగని । యతడుబలికెనయ్యా
శాంతతపోనిధులుండెడువనులకు । జనకునిలువుమయ్యా
ధనుర్బాణధారులేగదగదిట । త్వరగమరలుమయ్యా
అనుచుతీంద్రమగబలుకభీతిలక । యరుగుచుండెనయ్యా

అమరేశుడుసుతునిమెచ్చుకొని । ప్రత్యక్షమాయెనయ్యా
వరములిత్తుగోరుకొమ్మనగానా । నరుడుబలికెనయ్యా
శరములుయుగిత్వదివ్యాస్త్రంబులు । గావలెననెనయ్యా
అమరేశుండనెనస్త్రములటగిరి । పటుతెలిపిత్తునయ్యా
ఇం॥-దేవలోకమునకేగిసుఖంబుల । వెజరిల్లుమయ్యా
వినిననరుడనెయస్త్రములిటబాలును । వెడలిపోదునయ్యా
అర్జు॥-శత్రులచేనవమానపడితిమడి । సహింపలేమయ్యా
సతితోసహోదరులతోవనమున । శ్రమనుబొందితయ్యా
వారడవినశ్రమపడగసుఖమునె । ఖండయుబాలనయ్యా
వైశం॥-అతనిధర్మబుద్ధినిగనిఇంద్రుడు । అప్పుడుబలికెనయ్యా
ఇం॥-హిమవంతమునకుజనితపమున్ను । సహించిచేయుమయ్యా
హరినిసేవించువానికసౌఖ్యము । లన్నిగూడునయ్యా
వైశం॥-అనియింద్రుడుజనెపార్థుఁడుహిమగిరి । కంతజేరెనయ్యా
అందొకదివ్యస్థలమునందు । తపమాచరించెనయ్యా
మూడుదినంబులపరకులెపకొక । నాడుతేచునయ్యా
ఫలములడినిమరలమూడుదినముల । పరకుతెచునయ్యా
మహాభక్తితోనిటులజేయునొక । మాసమాయెనయ్యా
రెండవలెనయుందారుదినములకు । తేచుచుండెనయ్యా
పక్షంబునకొకసారితెచియే । ఫలములడినెనయ్యా
మూడవమాసంబునవిద్విధి । తపమునునలిపినడయ్యా
ఒక్కకాలుమొట్టనవేళ్లలంతట । యుర్విన్నిలపెనయ్యా
నిరాహారియైనాల్గవమాసము । నిలచియుండెనయ్యా
అతిఘోరంబగుతపమునుగని । మునులద్భుతపడిరయ్యా
మునులుహరునిజేరిపల్కిరత్యద్భుత । తపమోయయ్యా
తపాగ్నివనములగాల్చబొచ్చెనిక । దయనుజూడుమయ్యా
అనవినిహరుడనెబనుడుభీతిలకు । డటులజేతునయ్యా
పార్వతీశ్వరులుయెరుకులవేశము । బరగదాల్చిరయ్యా
ధనుర్ధారియైశివుడుసతిగూడి । త్వరగవచ్చెనయ్యా
మూకాసురునొకపందిరూపమున । ముందుబంపెనయ్యా
పిడుగులుబడునటులదిగర్జిల్లగ । విజయుడుగనెనయ్యా
చయ్యనవిలుగొనితీవ్రశరంబును । సంధించినడయ్యా

యెపుకురాజువేయుకుమనవినతా । శరమువిడచెనయ్యా
యెడుకొకశరమునువెయగసూకర । మిలపైబడెనయ్యా
సూకరరూపమువిడినిజరూపుప । మూకుడేగెనయ్యా
నరుడుసతీయుతుడైవచ్చెడియా । పురుషునకనెనయ్యా
అర్జు॥-యెపడవిప్రసతితోడమోరవని । కేలవస్తివయ్యా
శం॥-నేనెసినపందినినీవేయుట । నీతిబాహ్యమయ్యా
గానతప్పుజేసితివిశరంబున । ఖండించెదవయ్యా
యెపుకురాజనెనునాశరమునపడి । యిలపైబడెనయ్యా
జెయుఏకార్యముజెప్పితివెపుడిటు । సేయకుమనెనయ్యా
పలుకనేటికికరణామొసంపుము । తొలగిపోకుమయ్యా

## నెం. 2

వైశం॥-అనుచుపాపడుశరములనిడెను । గనుచునరుడుబాణములిడెను
పపడుశరవృష్టిగురిపించె । యెరుకుదేహమునునొప్పించె
యెపుకు జమ్ములనుగనెను । సరకుసేయకయెనిలచెను
పపడుమదివిస్మయముగొనెను । సురవిభుడోహరుడోయతడు
కఠినశరములనువైచెను । కంపమునుబొందడాయెను
యితనిబాణములుదాకెను । యెంతయోబాధజేసెను
నాశరములతనివిడచును । నాకితనిశరముదాకును
యీగిరిసమాయగన్పించె । యెచటనిదిజూడననియెంచె
అప్పుడురూపీరముగనెను । అమ్మొకటిలేకభీతిలెను
అగ్నిహోత్రుండునాకిచెను । అక్షయములంచుమున్ననెను
యిప్పుడొకటిలేకపుండెను । యేమిసేతుననిదలచెను
కపలిగాండీవమునుగొనెను । పనచపునిగొట్టనురికెను
మాయమైగాండీవముజనెను । మందుచొకకత్తిగైకొనెను
యెపుకుతలపైకివిసరెను । త్వరగనదిమాయమాయెను
అంతవృక్షములవిసరెను । అపుడురాలతోగొట్టెను
యెపుకుదేహమునదాకెను । సరగయవిచూర్ణమాయెను
బహుళకోపంబునొందెను । పజ్రముష్టితోగొట్టెను
యెపుకుగనియుతనిదాకెను । నపడుకడుబాధజెందెను
మూర్ఛగొనినేలపైబడెను । పురహరుడుపంతసముగొనెను

## నెం. 5

హరుడుతనదివ్యరూపముతో । ప్రత్యక్షమాయెనయ్యా
అభయహస్తముసపార్థునకిచ్చెను । బహుడుపుణికెనయ్యా
శూలికరస్పర్శచేతవిజయుడు । మేలుకొనియెనయ్యా
దివ్యదృష్టినాహరుడిడెపార్థునకు । చేరిజూచెనయ్యా
శిరముసగంగయుపాలమందుశశి । వెలుగుచుండెనయ్యా
మూడవకన్నునయుగ్నితనువుస । భూతిదాల్చెనయ్యా
గరళముగళముసకరముసశూలము । ధరించెనోయయ్యా
పన్నగహారునిపార్వతీధవుని । పరికించినదయ్యా
సాష్టాంగముపడిచేతులుమొగిడ్చి । సన్నుతించెనయ్యా

## నెం. 1

అర్జు॥-హరహరశ్రీగంగాధారీ । అఖిలరక్షాశశిధారీ
యెరుగకనినుగొట్టితిదేవా । కరుణించుమునసమభావా
వైశం॥-అనగహరుడుప్రీతిగగనెను । అర్జునునకుమరియిట్లనెను
వరముగోరుకొనుమిచ్చెదను । నరుడుమ్రొక్కియపుడిట్లనెను
అర్జు॥-పాశుపతాస్త్రంబిడుమయ్యా । బ్రహ్మశరంబొకటిడుమయ్యా
వేనవేలుశూలములిందు । వేనవేలుబాణములిందు
బుట్టుననుచుమునునేవింటి । పురహరమవినాకిడుమంటి
నావైరులగెలచెదనయ్యా । నాపైదయజూపగదయ్యా
వైశం॥-హరుడాయస్త్రంబులనిడెను । త్వరగశాంతినుడివిటులనెను
శంక॥-దీనిగెలుచునస్త్రములేదు । దీనినిపైవేయగరాదు
మదిసంకల్పించినయంత । మానకజేయునుకడువింత
వైశం॥-అనుచుబల్కియీశుడుజనెను । అర్జునుడస్త్రంబులగొనెను
హరునిస్పర్శనొందెనుగాన । అతితేజమునొందెబిరాన
దయతోయింద్రుడుజనుదెంచె । దనంజయునిగనిమోదించె
యమకుబేరవరుణులంబిలచె । అందరినాపార్థుడుగొలిచె
దండధరుడుదండమునిడెను । ధనదుండొకయస్త్రమునిడెను
వరుణుండొకపాశమునిడెను । సురపతిపార్థునకపుడనెను

ఇం॥-గంగాధరునోర్చితివయ్యా । పునవరంబునొందితివయ్యా
విమానంబునంపెదనయ్యా । వేగనాపురముగనుమయ్యా
అస్త్రంబులనిచ్చెదనయ్యా । అనుచువాడు వెడలినరయ్యా
వైశం॥-మహావిమానంబనుపెంచె । మాతలినరునకువిన్పించె

# నెం. ౫

మా॥-రాజసూయాశ్వమేధశతములకు । రాడిదివినుమయ్యా
శ్రీకృష్ణునిభక్తుంతవుగావున । శ్రేష్ఠమెక్కుమయ్యా
వైశం॥-అనగనరుడచటగంగలోస్నాన । మాచరించెనయ్యా
దివ్యవస్త్రధరుడైరథమందున । దేజరిల్లెనయ్యా
క్షణమాత్రంబునస్వర్గముజనె । యాశ్చర్యమాయెనయ్యా
విద్యాధరసురసిద్ధగణంబులు । వినుతిజేసిరయ్యా
గంధర్వాప్సరకిన్నరయక్షులు । గౌరవించిరయ్యా
స్వర్గవైభవంబులుగనుగొనితన । జనకునిగనెనయ్యా
అనేకమంగళవాద్యంబులతో । యచటకిజనెనయ్యా
పోయిపాదములపైబడునంతట । పుత్రునిగనెనయ్యా
కౌగలించియర్ధాసనమిడియనె । ఘనుడవునీవయ్యా
ఇం॥- హరునిదయను బొందుటముదలైనవి । యద్భుతమోయయ్యా
శ్రీకృష్ణునిదయతోనివియెల్లను । జేకురెవినుమయ్యా
అనేకపరిజనములతోసౌఖ్యం । బందుచుండుమయ్యా
వైశం॥-అపుడుసూర్యుడస్తమించెసురపతి । యంతవెడలెనయ్యా
అంతనరుడొక్కదివ్యతల్పమున । యపుడుబండెనయ్యా
అమరేశునియాజ్ఞనొందియూర్వశి । యపుడువచ్చెనయ్యా
అతిసంతసమునయాతనిగనుగొని । యపుడుబలికెనయ్యా
నీసుగుణంబులువింటిమున్నిచట । నిన్నుగంటినయ్యా
నారదాదిమునులుజెప్పగవినినిను । జేరవచ్చితనెను
అనవినిచేతులుమొగిడ్చిబలికెను । యాత్మజుండనమ్మా
అద్వ॥-తల్లివినవ్విటునుతింపదగునా । దయనుజూడుమమ్మా
వైశం॥-అనగనవ్వియుార్వశిబల్కెనుయిటు । లాడగతగదనెను
యుల్లములోనినుగోరివచ్చితిని । తల్లినెట్టులనెను

వావివరుసలీసురలోకంబున । బాటింపకుమనెను
యదేచ్ఛగావర్తింపవలయునిది । యన్నృతముగాదనెను
నన్నుగూడియాస్వర్గసుఖంబుల । తిన్నగగొనుమనెను
నాయాకనువ్యర్థంబుసేయకిది । నాదుకోర్కెయనెను
హరిహరియనిచెవులుమూసుకొని । యపుడర్జునుడనెనయ్యా
అఖిలశక్తిసంపన్నులగుసురలకు । అదితగుననెనయ్యా
అర్జు॥- కర్మభూమిజన్మించితిగావున । కర్మరుండనమ్మా
యిచ్చటియాచారంబునలుప । నాకిష్టముగాదమ్మా
పూర్వుడుమావంశకర్తయగునా । పురూరవుండమ్మా
అతనిసతివిగానతల్లివగుదువు । యద్భుతమేనమ్మా
జనకుడిందుడగునతనిగూడితివి । జననివగుదువమ్మా
గానరెండుకారణములతోనను । గావదలుపుమమ్మా
వైశం॥-అతికోపంబునయూర్వసినరునకు । యపుడుబలికెనయ్యా
ఊ॥-దేవవేశ్యనగునాకోరికనిటు । ధిక్కరించినావు
మానహీనుడానపుంసకుడవై । మనజనుమికనీవు
వైశం॥-ఊర్వసియిటులనితనయింటకిజనె । యుదయమాయెనయ్యా
అవృత్తాంతమువినిసురనాథుం । డాతనికనెనయ్యా
ఇం॥-అతివవలనజిక్కకనిశ్చింతగ । యుటయుచుంటివయ్యా
వత్సరముండునుయూర్వసిశాపము । భయపడకోయయ్యా
పదమూడవయేడజ్ఞాతంబున । పనిబడునోయయ్యా
వైశం॥-తనయునకిట్లనియనేకాస్త్రముల । దయతోనిడెనయ్యా
అయిదేండ్లీవిధిజరిగెను । పార్థుడాండచేటనుండెనయ్యా
అంతనొకనాడురోమశుడనుముని । యచటికిజనెనయ్యా
ఘనాసనంబునజిష్ణులనిప్పర । గాంచిపలికెనయ్యా
రో॥-అనేకయుగములతపమొనర్పనిది । యలభ్యమోయయ్యా
అర్ధాసనముననిన్నుబోలిన । మహాత్ముడెవరయ్యా
వైశం॥-బలికెనింద్రుడోయయ్యానడనెడి । పరమమౌనియయ్యా
ఇం॥-పాండురాజునకునాయంశంబున । బరగబుట్టెనయ్యా
శ్రీకృష్ణునిచెలికాడుతపముచే । శివునెంచెనయ్యా
పాశుపతాస్త్రముగొనివచ్చెను । భూభారముడుపనయ్యా

ధర్మద్వేషులబట్టవేగమే । త్వరగద్రుంచుమయ్యా
ఏప్రభూలోకమేగిధర్మజునితో । వచింపుమయ్యా
మనసీయనెండినాప్రేమనుండుము । యనివలెనోయయ్యా
అనేకయాత్రలకతనిపంపబడిగ । యనుగవలయునయ్యా
వైశం॥-రోమశుడదివినియుచటనుండిపని । భూమిజేరెనయ్యా

## నెం. 1

ధర్మజుండుకడుచింతించి । ధనంజయురాకగురించి
భీమసేనునకునిట్లనెను । విజయుడొకడుఘనకార్యమును
ధర్మ॥-సాధించుటకొరకైజనెను । చాలాకాలంబుగడచెను
యేమిదోచకుండినదయ్యా । యెట్టులవార్తవినియెదమయ్యా
వైశం॥-ధర్మజుండుకడుచింతించె । తగువిధిపూజలగావించె
అతనినిరోమశుడుకాంచె । అర్జునువార్తనువినిపించె
రో॥-శివునిగూర్చితపమొనరించె । శివునికన్నులారగగాంచె
భక్తితోడనుతులొనరించె । పాశుపతాస్త్రముగ్రహియించె
అంతటసురనాధునిగాంచె । అతనిలోకమునకరుదెంచె
అతనిమన్ననలగ్రహించె । అర్ధాసనమునవసియించె
స్వర్గలోకమేగితినయ్యా । శచీనాథుడిటులనెనయ్యా
వేగమెభూమికిజనుమనెను । విజయునివార్తలనునుమనెను
నినుయాత్రలకుజనుమనెను । నివెంటనెననుపొమ్మనెను
వైశం॥-ధర్మజుడదివినిమోదించె । త్వరగయాత్రలకుజననెంచె
అవనిసురులనుగనియనెను । యడుగుటకష్టమ్మగుననెను
త్వరగమరలవచ్చెదమనెను । ధౌమ్యాదులకొందరిగొనెను
తమ్ములనంతటవెనుగొనెను । ద్రౌపతితోమెల్లగజనెను
అనేకక్షేత్రములకుజనిరి । అచటనదులందుమునిగిరి
అతిశయధ్యానంబులనిడిరి । అచ్చటిదేవతలగొలచిరి
జనుచుకొంతకాలంబునకు । జనిరిగంధమాదనమునకు
శీతవాతములకుసహించి । జేరిరిహిమవంతముగాంచి
ద్రౌపదికడుదస్సినదయ్యా । ధరపైబడిమూర్ఛితెనయ్యా

కొంతవరకుమేల్కనుగనెను । ఇంతిపతులకపుడిట్లనెను
ద్రౌ॥-ముందునకొకయడుగిడలేను । కందిపోవుచుండెనుమేను
వైశం॥-త్వరగభీముడచ్చటనిలచె । తనతనయునిమదిలోదలచె
అనేకరాక్షసగణములతో । అనేకఫలములుగొనిదయతో
ఘటోత్కచుడువచ్చినడయ్యా । గనివారికిమ్రొక్కినడయ్యా
యెందుకుననుదలచితివయ్యా । యేమిసేతుదెల్పగదయ్యా
గనిధర్మజుడతిముదమొందె । గనుగొనుమాద్రౌపతిగుందె
ధర్మ॥-యీపెనెత్తుకొనిరావలయు । యెపుడువెంటనుండగవలయు
వైశం॥-విని ఘటోత్కచుండిటులనెను । జనుటకుబహుదుస్తరమనెను
ఘ॥-నాబలములువచ్చినరయ్యా । నాపల్కులువినుడోయయ్యా
యీవీరులమూపులపైన । యెక్కుడుశ్రమనుంటరిగాన
వైశం॥-నిశిచరులందరినిజగొనిరి । నిముసంబుననచటజేర్పిరి
మైనాకంబునదిగినారు । మహాసంతసముగొన్నారు
హిరణ్యశిఖరంబునుగొనిరి । త్వరబిందుసరస్సునుగనిరి
అబరీవనమునవారు । ఆరుదినములటనున్నారు
పర్వతచరియలపైవారు । బహుసంతసముననున్నారు
వాయువశంబునకమలంబు । వచ్చిపడియెనతిమోదంబు
ద్రౌపతికమలంబునుగాంచె । చూపిభీమునకువచియించె
ద్రౌప॥-గనుమువేయిరేకులపువ్వు । జనకుమొక్కుడుండినదవ్వు
సమీపమందుండినదెమ్ము । చాలసనాకగుమోహమ్ము

## నెం. 5

వైశం॥-వినిభీముండాపువ్వుదెచ్చుటకు । వెడలదలచినాడు
ఘనగదాస్త్రధనువులగొనివేగమే । కదలిపోయినాడు
గంధమాదనశృంగమెక్కుటకు । కడువడికనినాడు
తననెదిరినమృగములనుబట్టి । హస్తమునజంపినాడు
గరుడగంధర్వకిన్నరకాంతలు । గాంచగజనినాడు
మనుజులుజనవీల్గానితావులను । జనిగనుగొనినాడు
అనేకామడలవెడల్పుగలకొల । నచ్చటగనినాడు
గనుగొనిముదమునశంఖనాదమును । ఘనతజేసినాడు

తోకనుప్రక్కకుద్రోచుకొనుచు । దయతోడుతజనుమయ్యా
వైశం॥-అనగభీముడొకకరమునలేపగ । యుపశమాయెనయ్యా
కరద్వయంబునమహాబలముచే । కనలిపట్టెనయ్యా
అతిప్రయత్నముసుజేసిమ్రొగ్గింపు । యుపనింబడెనయ్యా
లేచిసిగ్గుగొనిభక్తిచేతగే । ల్జాచిమ్రొక్కెనయ్యా
భీము॥-తరుచరరూపముతోనేతెంచిన । సురవరుండవయ్యా
నీవెవరోదయతోడదెల్పి । మన్నించిపోవుమయ్యా
హను॥-అనకపివరుడిట్లనెనీవుజెప్పిన । హనుమంతుడనయ్యా
పవనాంశంబునయంజనియందున । ప్రభవించితినయ్యా
తమ్ముడవగుదువునేనీగుహలో । తపముజేతునయ్యా
పరాత్పరుండారాముడునాకొక । వరమునిచ్చెనయ్యా
రామునికథధరనుండువరకుగొన । రాదుమృత్యువయ్యా
అరామునిధ్యానంబుదక్కనా । కన్యములేదయ్యా
వైశం॥-అనవినిభీముడుచరణములంబడి । యుపుడుబల్కెనయ్యా
భీము॥-ఘనమగునీనిజరూపముజూపుము । గననెంచితినయ్యా
వైశం॥-అనగమంచిదనిహనుమంతుండపు । డటులజూపెనయ్యా
అతిభయంకరమ్మత్యద్భుతమును । యతడుజూచెనయ్యా
భూనభోమధ్యవ్యాపితమగు । మూర్తినిగనెనయ్యా
భీముడుభీతిలికనులమూసికపి । వీరునకనెనయ్యా

# నెం. 1

భీము॥-యీరూపమునిలుపుగదయ్యా । యికనీపూర్వముగొనుమనెనయ్యా
వైశం॥-అనగయాంజనేయుండనెను । అనిలోరెట్టింపిదియగును
అం॥-నీకుప్రియముజేసెదనయ్యా । నీవొకవచనమువినుమయ్యా
యీనిముసంబునబోయెదను । యెల్లకౌరవులజంపెదను
నీయున్ననురాజునుజేతు । నీవుసుఖింపగనేజూతు
వైశం॥-అనగభముడపుడిట్లనెను । అల్పకార్యమిదిమాకనెను
భీము॥-అంతవారువారలుగారు । అనిలోనసమిరించగబోరు
వైశం॥-వినికపీశుడపుడిట్లనెను । జనుమటులైననునీవనెను
హను॥-అర్జునురథమందుననుందు । అనిలోమీబలములగందు

వైశం॥-కౌగలించిజనుమనియనెను । మనుజతనికిమ్రొక్కి వెడలెను
కొంతదూరమంతటజనెను । కుబేరవనమునుగనుగొనెను
సౌగంధికకమలమ్ములను । పుష్పనగనిసంతసపడెను
వడివేవ్రువనపాలకులు । వచ్చిపలికిరతిబలయుతులు
వచ॥-యెవరుమీరుచెప్పగదయ్యా । యేలయిటకువచ్చితిరయ్యా
ఇదికుబేరవనముసబడును । ఇందలినీరమృతంబగును
యక్షరాక్షసాకోటిజులు । అనవరతముగాతురుసనులు

## నెం. ౫

వైశం॥-పాండుసుతుడభీముడపుష్పములకు । వచ్చితినన్నాడు
తడుబగోరగావచ్చితిధర్మజు । తమ్ముడనన్నాడు
కుబేరాజ్ఞచేగొనుమనివారక । కోపగించినాడు
అనుచువలదనగవినకపుష్పముల । గొనగబోయినాడు
అనేకశస్త్రాస్త్రవర్షముల । వారపుడువేసినారు
అన్నిదిక్కులందొక్కసారిగా । యతనిజుట్టినారు
గదగొనిభీముడువారిశస్త్రముల । కనలిద్రుంచినాడు
త్వరగపదివేలరాక్షసగణముల । దరిమికొట్టినాడు
వారుకుబేరునిచెంతకేగి । యీవార్తదెలిపిరయ్యా
వినికుబేరుడతిశాంతచిత్తుడై । మెదలకుండెనయ్యా
భీముడాపుష్పములగొనివెనుకకు । వెడలదలచెనయ్యా
ధర్మజుండుదుర్నిమిత్తములగని । తన్వినడిగెనయ్యా
పుష్పములకొరకుపోయినాడనుచు । పొలతిజెప్పెనయ్యా
ధర్మజుడంతటచింతిలియచటికి । దరలుచుండెనయ్యా
ఘటోత్కచాదులువారినెత్తుకొని । క్షణమునజనిరయ్యా
భీముడొనర్చినపోరునుగనుగొని । విస్మయపడిరయ్యా
భీముడాపుష్పములద్రౌపతికిడి । ప్రీతిజేసెనయ్యా
అచటధర్మజాదులునివసింపుచు । యసురులనంపిరయ్యా
ఘటోత్కచాదులువారియాజ్ఞగొని । కదలిపోయిరయ్యా
జటాసురుడువిప్రవేసమున । నచ్చటికివచ్చినాడు
పరశురామునిశిష్యుండవేదముల । బఠించితన్నాడు

ఇటులనమ్మించివారిచెంత । వసింపుచునున్నాడు
భీముడొకనాడువేటకేగనతి । భీకరుడైనాడు
ధర్మజద్రౌపదినకులులనంతట । త్వరగబట్టినాడు
ముగురినెత్తుకొనియస్త్రములంగొని । పోవజొచ్చినాడు
సహదేవుండాభీమునిబిలువగ । సత్వరజనినాడు
ధర్మజుండుతనహస్తమ్ములతో । దనుజునదిమినాడు
ఆకసమునకేగియసురుడుబలిమిగ । యరుగుచునున్నాడు
సహదేవునిపిల్పునువినిభీముడు । సత్వరజనినాడు
ఆకసమందునజనుచుండినయా । యసురునిగనినాడు
గదనుదీసితమవారికిబాధను । మదినిదలచినాడు
అపుడుబల్కెనోరోరిపాపుడా । యడుగకుమన్నాడు
వారివిడచినాతోననిజేసిన । ధీరుడవన్నాడు
బకహిడింబకిమ్మారులునీవలె । బారిరేమొజూడు
వారికపకీర్తిదెచ్చితివివ్విధి । బారకుమన్నాడు
అనగవాడురోషించివారలను । యపుడువిడిచినాడు
భీమునిగాంచియుయతికోపంబున । బిట్టుగొట్టినాడు
కనలిభీముడొకవజ్రముష్టిచే । ఘాతజేసినాడు
తరువులతోగండశిలలతో । యుద్ధంబుజరిగెనయ్యా
అతిఘోరంబగుయుద్ధంబును । వారపుడుజేసిరయ్యా
తోల్లివాలిసుగ్రీవులవిధమున । దురముజేసిరయ్యా
ఉభయముష్టిఘాతమ్ములనాదము । లుగ్రమాయెనయ్యా
వినుచుయాధ్వనినిపక్షులుమృగములు । వేగబారెనయ్యా
వజ్రముష్టిచేభీముడతనితల । బగులగొట్టెనయ్యా
భీముడుజేసినరణమునకెల్లరు । విస్మయపడిరయ్యా
అంతటబాండవులచటినుండి । ముందరుగుచుండిరయ్యా
అష్టిషేణాశ్రమమ్మునసుఖముగ । యలరుచుండిరయ్యా
అంతటనరుడుసురపతికిమ్రొక్కి । రథమందువెడలెనయ్యా
అతితేజోవంతుండైక్షణమున । యచటజేరెనయ్యా
మాతలితనరథమునుగొనివేగమె । మరలిపోయెనయ్యా
ధర్మజభీమాదులపాదములకు । దండములిడెనయ్యా
అతిసంతసముననరునకుధర్మజు । డపుడుబలికెనయ్యా

ధర్మ॥-యెడమభుజంబదరినదయ్యా। యెచటికిజనెటిముండయ్యా
వైశం॥-అనుచుతమ్ములనుబంపెంచె। అతివేగముపానరువెంచె
వెదకివెదకి సర్పముగనెను। వినునిజట్టుటగనుగొనెను
పిలపించుచుయపుడిట్లనెను। విడుపుముమాతమ్మునినెను
ధర్మ॥-చాలినంతమృగమాంసంబు। సత్వరమిచ్చెదసత్యంబు
యితనివిడచిబ్రతుగగలేను। యీవికనాపైదయబూను
వైశం॥-అనగసర్పమపుడిట్లనెను। వినుమామీకులజుడననెను
సర్ప॥-నహుషుడవిప్రులశాపంబు। నాకుఁగలిగెనతిఘోరంబు
దయతోనాప్రశ్నలవినుము। త్వరగయుత్తరమ్ములనిడుము
శాపాంతంబగునోయయ్యా। చయ్యనతమ్ముని గొనుమయ్యా
వైశం॥-అనధర్మజుడాలోచించె। హరినిమనమునఁధ్యానించె
అటులజెతుననుచువచించె। ఆసర్పంబటువిన్పించె
సర్ప॥-యేగుణములుగల్గినవాడు। ఇలలోబ్రాహ్మణుడగుజూడు

# నెం. 5

ధర్మ॥-క్షమాసత్యశౌచదయాదులచే। సద్బ్రాహ్మణుడగును
అతడెరుగదగినట్టిదేదనగా। యాత్మశాంతినయ్యా
సర్ప॥-బ్రాహ్మణుడగునాయీగుణములచె। పాదజుడోయయ్యా
ధర్మ॥-గుణహీనుండగువిప్రుడు। శూద్రుండనబడునోయయ్యా
వైశం॥-అహింసాధర్మమెరుగజెప్పుమన। యతడుబలికెనయ్యా
ధర్మ॥-హింసాయుతమగుదానఫలంబతి। హీనజన్మమయ్యా
హింసారహితములగుదానములకు। ఇహపరసుఖమయ్యా
వైశం॥-ధర్మబుద్ధితోధర్మజుడిటు। యుత్తరములనెనయ్యా
అగస్త్యుడిచ్చినశాపమునహుషున। కంతమాయెనయ్యా
భీమునిఁవిడచిధర్మభీములను। బ్రీతిగగనెనయ్యా
నహు॥-సకలార్థంబులనొందెదరుమీరు। జయముగొంతురయ్యా
ధర్మపరులకాహరిసాయంబై। త్వరగబ్రోచునయ్యా
అధర్మపరులెంతటివారైనను। యంతమగుదురయ్యా
శాంతములేకుండినచోజగమున। సౌఖ్యములేదయ్యా
స్వర్గమేగిశాంతమునువీడి। కష్టమునుబొందితయ్యా

వైశం॥-అనుచునిట్టులుదివ్యరూపమున । యరిగెనువినుమయ్యా
ధర్మజుడాభీమసేనువెంగొని । త్వరగవచ్చెనయ్యా
దారావనమునువీడిద్వైతమను । వనముఁజొచ్చిరయ్యా
వనమునపాండుకుమారులుఁజెందెడి । బాధలవినెనయ్యా
కరిపురమందునయంధరాజు । దుఃఖమునబలికెనయ్యా
ధృత॥-నాయవివేకముతనయుని । దుష్టతనమునగలిగెనయ్యా
సౌఖ్యమనుభవించువారలడవిని । శ్రమలఁజెందిరయ్యా
విజయుడనుగాడ్పునొందిపిమాగ్ని । విడచునెట్టులయ్యా
నాపుత్రశతంబనుపనిదగుబను । నశించునోయయ్యా
వైశం॥-అంధరాజప్పుడొకవిప్రునకిటు । లార్తిజెప్పెనయ్యా
అంతదుర్యోధనుడుకర్ణాదుల । కపుడుబలికెనయ్యా

## నెం. 1

దుర్యో॥-ద్వైతవనంబునపాండవులు । త్వరగజేరిరటశ్రమయుతులు
మనబలములతోజనవలయు । మహరణమునేయగవలయు
వారికిసైన్యములేదయ్యా । వధింపనిదేసమయంబయ్యా
గానిజనకుడిదివినేని । గావించునువిఘ్నముబూని
ఆతడాజ్ఞనిచ్చెడువిధము । ఆలోచింపుడుగనసుఖము
వైశం॥-అనగకర్ణుడపుడిట్లనెను । అవులమందలగనజనను
కర్ణు॥-ఘోషరక్షణముసకుమనము । గొనెదమతనియాజ్ఞనునిజము
వైశం॥-అనగసంతసించుచుజనిరి । ఆధృతరాష్ట్రునకిటులనిరి
దుర్యో॥గోపాలుడువచ్చినరయ్యా । గోవులగనబోయెదమయ్యా
మృగబాధలడిర్చెదమయ్యా । మేలుగనిటువచ్చెదమయ్యా
వైశం॥-అనధృతరాష్ట్రుండపుడనెను । అచటపాండవులుగలరనెను
ధృత॥-వారికిబాధలనిడకండి । వలదుకోపమునువిడువండి
అపరాధముసలిపితిరేని । అపజయమందెదరికబూని
వైశం॥-వినివారలుపయనమ్మైరి । వివిధసేనలనుగైకొనిరి
తమతమసతులనువెనుగొనిరి । తగువిధమునజనుచునుండిరి
ద్వైతవనముజేరగజనిరి । తగినస్థలమందువిడసిరి

అమరేంద్రుండాలోచించె । అదుష్టులమతమీక్షించె
పాండవులనుగావగనెంచె । బరగచిత్రసేనునిగాంచె
ఇం॥-గంధర్వులతోజనుమయ్యా । కౌరవులనుబొరిగొనుమయ్యా
వైశం॥-అనగచిత్రసేనుడువినెను । అనేకగంధర్వులగొనెను
సరోవరముచెంతకుజనెను । కురుసైన్యంబులగనుగొనెను
చిత్ర॥-యీసరోవరముమాడయ్యా । యిచటినుండివెడలుండయ్యా
శాంతముతోజెప్పితినయ్యా । సత్వరమేజనశుభమయ్యా
వైశం॥-అనకురుపతివినిభీష్మించె । వనమిదిమాదనివచియించె
అనుచుసేనలనుబంపించె । అపుడుయుద్ధమారంభించె

## నెం. 2

అంతగంధర్వులేగిరి । అపుడుశరములక్రాగురిపిరి
కురుబలంబంతదాకెను । ఘోరముగరణముజేసెను
అపుడుదుశ్శాసనుడునొచ్చె । అఖిలసైన్యంబుకడునొచ్చె
కర్ణుండంతలోకోపించె । కఠినబాణములనిగుడించె
వేలగంధర్వులిలబడిరి । వేలకొలదిగాబారిరి
చిత్రసేనుండుగాంచెను । శీఘ్రముగవచ్చిదాకెను
వేలగంధర్వులేతెంచి । వేగకురుసేనసమయించి
కరులుగిరులవలెగూలెను । తురములుదెగుచుసోలెను
అదరములుబ్రద్దలాయెను । అపుడుకాల్బలములిలబడెను
కౌరవులబలముబారెను । కర్ణుడతికోపమొందెను
కర్ణునిఖవారుగాంచిరి । కనలియరదమునుజుట్టిరి
కొందరశ్వములదుంచిరి । కొందరురథమునుదుంచిరి
కొందరాసూతుదునిమిరి । కొందరతనివిలుదునిమిరి
విరథుడైకర్ణుడేగెను । వేగముగబాధజెందెను
అంతదుర్యోధనుడుజనెను । అనియొనర్పంగనిలచెను
చిత్రసేనుండుగాంచెను । శీఘ్రమురథముద్రుంచెను
అతనివెంట్రుకలబట్టెను । అవనిపైవేగగూల్చెను
చెలగిరథమునంబంధించె । సింహనాదంబుగావించె
అంతగంధర్వులేగిరి । అతనిసోదరులగట్టిరి

కురుసుతులనంతగట్టిరి । కురువరులసుతులగట్టిరి
చిత్రసేనుకడమెచ్చిరి । క్షేమముగబోవదలచిరి
పాపులతిదుఃఖమొందిరి । జరచిధర్మజునిగాంచిరి

# నెం. 1

పాపు॥-ధర్మరాజమ్రొక్కెదమయ్యా । త్వరగమమ్ముగావగదయ్యా
కురుపతిసతిసుతసోదరులకా । గూడివచ్చెనఖిలబలములకా
గంధర్వులురణమొనరించి । గలవారలనిటబంధించి
గొనివెడలుచునుండిరయ్యా । తనవారలగావగదయ్యా
వైశం॥-అనగధర్మజుడుయోచించె । అప్పుడుతమ్ములకువచియించె
ధర్మ॥-సత్వరమేజనుడేయయ్యా । క్షాత్రధర్మమిదియేనయ్యా
శరణువేడుశత్రువున్నైన । సాకుటయేధర్మముగాన
సర్వస్కందంబనుమఖము । సలుపుచుంటిగావునరణము
సేయగనేరాదగదయ్యా । సేయుడార్తరక్షణనయ్యా
వైశం॥-అనగభీముడతికోపించి । అపుడుబలికెధర్మజుగాంచి
భీము॥-జలములందుననుద్రోయించె । చయ్యనమనఋలుగాల్పించె
అన్నమందువిషమిప్పించె । అతివనుసభలోకీడ్పించె
కనలిమనముజేసెడిదయ్యా । గంధర్వులేజేసిరయ్యా
మనకుపెడవదలినదయ్యా । మనముగాచుటకువలదయ్యా
వైశం॥-వినిధర్మజుడపుడిట్లనెను । జనిగాచుటముఖ్యంబనెను
ధర్మ॥-వైరముపాటింపకుడయ్యా । వనితలబంధించినరయ్యా
విడిపించుటకీర్తికరంబు । విడువుడతనిదుష్టతనంబు
వైశం॥-వినివిజయుండప్పుడుజనెను । భీముడువిసువుచువడిజనెను
మాద్రీసుతులంతటజనిరి । మహావేగమునవెనుగొనిరి
విజయుడుగంధర్వులగనెను । వినుడునాదుపల్కులననెను
అర్జు॥-పాండవాగ్రజుడుధర్మజుడు । బలికెనుకురుపతినివిడువుడు
వైశం॥-అనగంధర్వులుయిట్లనిరి । అమరేంద్రునియాజ్ఞయిదనిరి
గంధ॥-ధర్మజుడెటుజెప్పినడయ్యా । దానినెట్లుజేసెదమయ్యా
అర్జు॥-నరుడనెప్రియముమునుచెలిపితిని । నాధర్మమునెరవేర్చితిని
వైశం॥-వినకుండిననలుప్పంచనెను । ఘనబాణంబులనుగురిపెను

## నెం. 2

అంతగంధర్వులదిగనిరి । అమ్ములఁగ్రుమ్మరించిరి
లక్షలకుమించియున్నారు । కక్షచేపోరుచున్నారు
పార్థుఁడానిరథంబుజుట్టిరి । భగ్నమునుచేయదలచిరి
నరుడుశరవృష్టిగురిపించె । త్వరగపదిలక్షలఁద్రుంచె
భీముడొకవైపుఖండించె । వేగనకులుండుఖడించె
కనలిసహదేవుడిలఁగూల్చె । కపసమతిభీకరముదాల్చె
అపుడురక్తనదిబారెను । అమరగణమంతభీతిలెను
అంతగంధర్వులడిగనిరి । ఆకసమునకంతనెగిరిరి
కురుపతినివెంటగైకొనిరి । త్వరగతమపురికిదరలిరి
అర్జునుడువారిగాంచెను । అతికరిసశరములనువిడెను
కనలిఆగ్నేయమేసెను । కడువడిగవారిగాల్చెను
చిత్రసేనుండుకోపించె । శీఘ్రముగగదనుబంపించె
కనలినరుడొక్కశరమిడెను । గదనుఖండించిగూల్చెను
చిత్రసేనుండుభీష్మించె । చెలగితనమాయగావించె
బాణవర్షంబుగురిపించె । వారలకుబాధగావించె
సరగవిజయుండువీక్షించె । శబ్దభేదశరములనుంచె
శీఘ్రముగమాయనశియంచె । చిత్రసేనుండుజనుదెంచె
గర్వమునువీడిబలికెను । కదనశూరుండవీవనెను

## నెం. 5

గాంచిపార్థుఁడనెగంధర్వేశ్వర । కసలుటతగదయ్యా
అర్జు॥-మావారలనందరినివిడువు । నామాటలువినుమయ్యా
వినిగంధర్వేశ్వరుడనెపార్థా । వీడుపాపుడయ్యా
గం॥-సతితోమిమ్ములనడవికంపికడు । శ్రమలబెట్టెనయ్యా
సైన్యములుమీకులేవనితలచుచు । సరగవచ్చెనయ్యా
నట్టడవినజంపవచ్చెనని । సురనాథుడంపెనయ్యా
గనుకవీనినాసురపతిచెంతకు । గొనిపోయెదనయ్యా
అర్జు॥-అనగనరుండనెధర్మరాజితని । గొనితెమ్మనెనయ్యా

మాయన్నకుఁజూపించియితఁడనెడి । మాటలవినుమయ్యా
వైశం॥-అనఁగమంచిదనెచిత్రసేనుఁడప్డు । దండయుఁజనెనయ్యా
చిత్రసేనుఁగనిధర్మజుండు । బూజించిపలికెనయ్యా
ధర్మ॥-యితఁడుమీచేతఁజంపఁబడకున్కి । యెంతోమేలయ్యా
మావంశంబునునిలిపితివయ్యాది । మాభాగ్యంబయ్యా
యితనితప్పులనుమన్నించుడు । మాకతిముదమగునయ్యా
బంధవిముక్తులఁజేసియిమ్మనిను । ప్రార్థించెదనయ్యా
వైశం॥-అనఁగసంతసిలివారలఁబాపెడి । యాతఁడేగెనయ్యా
శచీసుతుదివినిధర్మజుబుద్ధికి । సంతసించెనయ్యా
అమృతముచేఁజచ్చినగంధర్వుల । నతఁడులేపెనయ్యా
అంతధర్మజుఁడుదుర్యోధనునకు । అప్పుడుబలికెనయ్యా
ధర్మ॥-యెప్పుడిట్టిసాహసమొనరించుట । కేగకుమోయయ్యా
పాలతిఁదోడమీవారలతోయిక । పురముకేగుమయ్యా
అవమానమునొందితిననిదుఃఖము । నందకుమోయయ్యా
దుర్యోధనుఁడతిచింతిలియెల్లర । తోడనేగెనయ్యా
ధర్మజుశాంతంబునకుమునులు । సంతసమునొందిరయ్యా
కురుపతితనవారలనందరిఁగొని । యరుగుచుండెనయ్యా
కొంతదూరమిటులరిగియొక్కచో । నంతనిలచెనయ్యా
పటకుటీరమండొక్కచోట । దల్పమునబండెనయ్యా
అంతకర్ణుండేతెంచియుతనిఁగని । యపుడుబల్కినాఁడు
బలవంతులుగంధర్వులశరముల । బడలితినన్నాఁడు
విరథుడనైనొచ్చినేనువెడలితి । భీతిలితన్నాఁడు
బాధలేకశరఘాతనొందకెటు । వరలితివన్నాఁడు
గంధర్వులగెలిచెదిబలమెచ్చుట । గాంచితివన్నాఁడు
అనఁగదీనముఖుడైకురునాథుఁడు । యపుడుబల్కినాఁడు
గంధర్వులుమమ్మెల్లరననిలో । గట్టినరన్నాఁడు
దుర్యో॥అట్టివేళమనవారుపాండవుల । కంతజెప్పినారు
ధర్మరాజునాజ్ఞతమ్ములచటికి । త్వరగవచ్చినారు
గంధర్వులనెల్లరయుద్ధంబున । కనలిచంపినారు
ధర్మజునికడకునమ్ముగొనిజని । బంధములవిడచినారు
ధర్మమతులుపాండవులుబొమ్మనగ । త్వరగవచ్చితయ్యా

దుర్మార్గంబునొనర్చువానిశిరి । దొలగిపోవునయ్యా
అవమానమునొందితిగావున । పురికరుగజాలనయ్యా
మానహీనమైభూమియందింక । మనగజాలనయ్యా
వైశం॥-అనిదుఃఖించుచుదుస్ససేనునకు । అపుడుబలికెనయ్యా

# నెం. 1

దుర్యో॥రాజ్యమునీకిచ్చితినయ్యా । రాజువగుచునుండగదయ్యా
శకునికర్ణసాయముగొనుము । సహోదరులబ్రీతిగగనుము
గురువులభక్తిగపోషించు । పరమభక్తిద్విజులనుగాంచు
శత్రువులకులొంగకుమయ్యా । సౌఖ్యంబులగైకొనుమయ్యా
వైశం॥-అనగదుస్ససేనుడువినెను । తొలగుముమదిదుఃఖంబనెను
యిరువురిటులదుఃఖముగొనిరి । పరిపరివిధములయనుకొనిరి
కర్ణుండనెచింతిలకయ్యా । కడుదుఃఖమునొందకుమయ్యా
కర్ణు॥-జయాపజయములువీరులకు । శాశ్వతములుగావువగవకు
వైశం॥-శకునిబల్కెనిటువినుమయ్యా । చాలాదుఃఖమువలదయ్యా
శకు॥-మదిలోదయనొందగదయ్యా । మహాకపటమునువిడుమయ్యా
ధర్మాత్ములుపాండవులయ్యా । దైవభక్తిగలవారయ్యా
వారినిపుడుబిల్వగదయ్యా । వారిభాగమిడుమోయయ్యా
శత్రుత్వముతోనున్నపుడు । సంరక్షణజేసిరియిపుడు
మిత్రుత్వముజేసినవారు । మేలునీకుజేతురువారు
అర్ధరాజ్యమునసుఖపడుము । ఆత్మాశనుమదిలోవిడుము
వైశం॥-అనవినిదుర్యోధనుడనెను । అపమానముబోదనియనెను
దుర్యో॥మరణదీక్షనొందెదనయ్యా । త్వరగనడ్డుసేయకుమయ్యా
వైశం॥-అనగవారుదుఃఖముగొనిరి । అపుడెదురునవగదనిజనిరి
సూర్యుండస్తాద్రికిజనెను । జూచికురువరుండులేచెను
సరగస్నానమునుగావించి । సద్వస్త్రంబులధరియించి
దర్భశయ్యనప్పుడుజేరి । త్వరగసమాధినిగొనగోరి
ప్రాణాయామంబొనరించె । పరమసమాధినిగావించె

నెం. 5

పాతాళంబందలిరాక్షసులీ । వార్తనెరిగినారు
అప్పుడుశుక్రునికడకేగి హోమంబు । నాచరించినారు
అగ్నికుండమునశక్తి బుట్టగని । యప్పుడుఁబల్కినారు
కురుపతినిటగొనిరమ్మనగానది । త్వరగవెడలెనయ్యా
అతనిఁగొనిపాతాళలోకమున । కప్పుడుజేరెనయ్యా
వారతనిఁగనిబలికిరిటులల । సరివాడునగుచురయ్యా
రాక॥-ఆత్మఘాతకుండిహపరసౌఖ్యము । లందజాలడయ్యా
అతిధైర్యంబునశత్రుక్షయము । నాచరించుమయ్యా
మనుజమాత్రుడవుగావునీజన్మ । వినుదెల్పెదమయ్యా
మున్నుమేముశంకరునిగూర్చి । తపమునుజేసితిమయ్యా
అతడుమెచ్చిబుట్టించెనిన్ను । మాకధిపతివోయయ్యా
సకలరాక్షసులునీకుసాయముగ । జన్మమొందిరయ్యా
భగదత్తాదులుక్షత్రియులెల్లరు । బలయుతులోయయ్యా
ద్రోణాదులుదేవాంశభవులు । నీతోడునుందురయ్యా
మేమువారినావేశించితిమిక । మేలుగూర్తుమయ్యా
వారిసాయమునపాండుకుమారుల । వధింపుమోయయ్యా
నరకాసురునంశముకర్ణునిపై । త్వరగజేరునయ్యా
కృష్ణార్జునులనుసమరరంగమున । గెలుచునువినుమయ్యా
కర్ణునికడకిందు్రడుపాండవ । రక్షకువచ్చునయ్యా
కవచకుండలంబులుదానంబుగ । గ్రహించునోయయ్యా
సంశప్తకులనుజేరటదనుజులు । జన్మించినరయ్యా
శతలక్షసహస్రసంఖ్యావారలు । సమరవీరులయ్యా
నీకుసాయమైసమరరంగమున । నిలచెదరోరయ్యా
సకలసామ్రాజ్యమనుభవింపుమా । భావకవినుమయ్యా
రాక్షసపక్షంబునకపకీర్తిని । రానీయకుమయ్యా
వైశం॥-ఆలింగనమొనరించికురుపతిని । యపుగుమనినరయ్యా
అంతశక్తియితనిమరలగైకొని । యచటనుంచెనయ్యా
అంతనుయోధనుడతిసంతసమున । యప్పుడులేచెనయ్యా

సమరమునపాండుసుతులుజత్తురని । సంతసపడెెయ్యా
అన్యులకీవృత్తాంతముజెప్పక । యాత్మనుంచెనయ్యా
అంతతెలవారెకర్ణుడుకురుపతి । చెంతకేగెనయ్యా
కర్ణు॥-విజయునకుభీతిజెందిచచ్చుటకు । వెడలితివీవయ్యా
ఆయుధంబుచేపట్టిప్రతిజ్ఞను । యాచరింతునయ్యా
పదునాల్గవయేటనరునిగెల్తు । నబద్ధములేదయ్యా
వైశం॥-వినికురునాథుండతిసంతసపడి । వెడలవలచెనయ్యా
అసురులమాటలునమ్మికర్ణుపై । యాశజెంచెనయ్యా
అంతటసకలబలంబులతోపురి । కపుడుజేరెనయ్యా
ఇటులకొంతకాలముజనెకర్ణున । కిటులబలికెనయ్యా
దుర్యో॥కడుయోగ్యంబగురాజసూయమగు । క్రతువుజేతునయ్యా
నీసాయంబునయాయాగంబును । నేనుజేతునయ్యా
వైశం॥-అనకర్ణుండనెతనుధనమనముల । నర్పించితినయ్యా
అవశ్యముగక్రతువాచరింపుమన । యతడుదలచెనయ్యా
పురోహితునిబిలువబనిచియతనిని । బూజించినడయ్యా
దుర్యో॥గావించెదరాజసూయమును । సంకల్పించితినయ్యా
పురో॥-వినియాతండనెదీనికొకగొప్ప । విఘ్నముగలదయ్యా
సకలరాజులనుగెల్చెడికార్యము । సలుపవలయునయ్యా
అందరునీకువిధేయులుపాండవు । లద్భుతబలులయ్యా
వారినిగెలుచుటయసాధ్యమగునిది । వలదునిలువుమయ్యా
వైష్ణవంబనెడియజ్ఞముసేయుము । బహుయోగ్యంబయ్యా
వైశం॥-అనగమంచిదనిమంచిముహూర్తము । నపుడుజూచిరయ్యా
యాగయోగ్యమగుసంభారంబుల । నాచరించిరయ్యా
జననీజనకులుభీష్మాదులుకడు । సంతసించిరయ్యా
అనేకదేశంబులకువార్తలను । యపుడుబంపిరయ్యా
అనేకవేలమునీంద్రులనచటికి । యపుడుబిలచిరయ్యా
దుర్యోధనుడాపాండవులకడకు । దూతనంపెనయ్యా
దూతబొయిధర్మజునకువార్తను । ప్రీతిదెలిపెనయ్యా
అతిసంతసమునధర్మజుడు । దూతకపుడుబలికెనయ్యా
ధర్మ॥-పవిత్రమగుయజ్ఞంబుసల్పగా । పరమధన్యుడయ్యా
అనుకొన్నశపథమునుసలుపకయే । యచటికిరానయ్యా

పదమూడేండ్ల్కటగడిపియాపైన । వచ్చెదమనుమయ్యా
వైశం॥-అనగభీముడనెనెల్లరువిన । నిటులనుమనివిన్పించె
భీము॥-పాండవాగ్రజుడుపడునాల్గేండ్లకు । బయలువెడలనెంచె
సమరయజ్ఞమునకౌరవపశువుల । జంపగయోచించె
శస్త్రానలమునహోమమొనర్పగ । చాలగవీక్షించె
వైశం॥-అనగవినిమాతకరిపురమునకు । యప్పుడుజనుదెంచె
ధర్మజుడీములపల్కులెల్లరకు । త్వరలోవిన్పించె
శుభముహూర్తమునయాగంబునుకురు । విభుడారంభించె
విధివిధానముగహోమములిడినా । పిదురునినియమించె
అనేకజనములకన్నదానముల । నంతటగావించె
యథాశాస్త్రముగవైష్ణవయాగము । నప్పుడుగావించె
అవభృథస్నానమొనర్చియాగము । నంతముగావించె
సకలజనంబులకాయాగంబున । సంతసమనిపించె

# నెం. 1

కలననరునిదునిమెదననుచు । కర్ణుడేన్నశపథమువినుచు
అప్పుడుధర్మజుడుదుఃఖించె । అభేద్యకవచుండనియెంచె
అన్యులకిదిజెప్పకయుండె । అనుదినంబుచింతిలుచుండె
అవనమునువీడుచువారు । అంతకామ్యకముజనివారు
వనవాసంబందునవారు । బహుశ్రమలగనుచున్నారు
అనేకమునులనుగనుగొనిరి । అద్రౌపదినప్పగించిరి
అందరుఫలములకైజనిరి । అవనమునదిరిగుచుండిరి
ధౌమ్యుండనుమునినాథుండు । ద్రౌపదినిగాంచుఘనుండు
సాల్వునికన్యనుబెండ్లాడ । సైంధవుండుబలములతోడ
ఆమార్గంబునజనుచెంచె । అచ్చటపాంచాలినిగాంచె
దానిచక్కదనమునుగాంచి । త్వరగమోహితుండైమించి
వచ్చిగాంచియపుడిట్లనెను । వనితాక్షేమంబాయనెను
నారీమణివినియనెనయ్యా । నాపతులకుక్షేమంబయ్యా
ద్రౌప॥-అదుగోపాద్యముగొనుమయ్యా । ఆసనంబుగైకొనుమయ్యా
హరిణమాంసమునుదినుమయ్యా । త్వరగపతులువచ్చెదరయ్యా

వైశం॥-వినిసైంధవుడపుడిట్లనెను । వనజనేత్రినను గనుమనెను
రమణినిజాగోరితిననెను । రథమునెక్కి జనుమనియనెను
వినిద్రౌపతియపుడిట్లనెను । వివేకంబుబాసితివనెను
ద్రౌప॥-తోడబుట్టువగుదువునీవు । దుస్సలకునుపతివగుదువు
దుష్టబుద్ధిజనుచున్నావు । కష్టంబులనందెదవీవు
వైశం॥-అనగసైంధవుండిటులనెను । ఆవచనములుపనిలేవనెను
సైంధ॥ప్రేమయెముఖ్యంబగుగాన । కామినినన్బొందుబిరాన
వైశం॥-వినిద్రౌపతికనలుచుగనెను । వినయహీనుడావినుమనెను
ద్రౌప॥-బలవంతులునామగవారు । బంధుత్వముజూతరువారు
నిన్నుబట్టిచంపెదరయ్యా । నీకాలముమూడినదయ్యా
వైశం॥-అనగసైంధవుండదివినక । అపచయముగుననిమదిగనక
అగ్నింబడుపురుగువిధమున । ఆకాంతనుబట్టెమదమున
అరదంబుననిడుకొనినాడు । అప్పుడుబయనమైజనినాడు
ద్రౌపతిదుఃఖించినదయ్యా । ధౌమ్యునంతబిలచినదయ్యా
మునివరుడంతటయరుదెంచె । వెనుగొనియిట్లువినిపించె
దౌ॥-సింధురాజవెడలకుమయ్యా । శీలవతినిగొనదగదయ్యా
నీవురథమునిల్పగదయ్యా । నీకాయువుమూడినదయ్యా
వైశం॥-వానివెంటనడచుచునుండె । పాండవులనుబిలచుచునుండె
అందరొక్కచెనపాండవులు । ఆప్పుడెగూడినారతిఘనులు
తగుదుశ్శకునంబులగనెను । ధర్మజుండుతమ్ములకనెను
ధర్మ॥-నామదిలోభీతిజనించె । నాయెడమభుజంబుచలించె
యేమోయాపదయగునయ్యా । యేగుడాలసింపకుడయ్యా
వైశం॥-అనుచుపర్ణశాలకుజనిరి । అచటివార్తనంతయువినిరి
క్షణములోనవెనుకొనిరయ్యా । సరగధౌమ్యునిజాగనిరయ్యా
అతనికిమ్రొక్కుచునిట్లనిరి । అగుడుచింతిలవలదనిరి
అయిదుగురాబలములగనిరి । అతికఠినశరంబులనిడిరి

## నెం. 2

భీముడతివేగముగజనెను । ధీరముగసైంధవునిగనెను
కోపమునగదనుద్రిప్పెను । కోటికాస్యుండుయెదిరెను

సింధురాధిపసేనలను । కవిత్రిగర్తసైన్యంబులను
గాంచిభీమునిజాడాకెను । క్రూరశరములనువిడచెను
భీముడతికోపమంచెను । భీకరంబైనగదగొనెను
ఆరథములధ్వంసిచేసెను । తురగములనేలఁగూల్చెను
కాల్బలములనుజంపెను । ఘనగజంబులనుదునిమెను
సింహనాదంబుజేసెను । శీఘ్రముగముందుకేగెను
ధర్మజుండొక్కసెనజనెను । త్వరగకరినబాణములిడెను
కనలిసౌవీరవరులను । కలనసూత్వరనుజంపెను
నకులుడొకవైపుదాకెను । ప్రకటవీరులనుదునిమెను
అంతసహదేవుడేగెను । అశ్వసైన్యములగూల్చెను
నరుడుసైంధవునిబలములను । దూరమునఁగూల్పజొచ్చెను
వేలయేనుగలుగూలెను । వేలతురగములుసోలెను
రక్తనదులంతబారెను । రణముకడుఘోరమాయెను

## నెం. ౫

గదగొనిత్రిగర్తపతిధర్మజు । తురగములనేసెనయ్యా
ధర్మజుండొక్కశరముననాతని । తలనుద్రుంచెనయ్యా
త్రిగర్తులిరువురునకులునితోకడు । జగడమాడిరయ్యా
కనలినకులుడిర్వురనొప్పింపగ । కదలిపోయిరయ్యా
సురథుడొక్కగజమెక్కినకులుపై । శరములనిడెనయ్యా
అంతనకులుడొకఖడ్గముచేకరి । నపుడుగూల్చెనయ్యా
సురథునికంఠముద్రుంచగబలములు । వెరచిపారెనయ్యా
భీముండాకోటికాస్యునిలపై । వేగగూల్చెనయ్యా
పన్నిద్దరుసౌవీరకుమారులు । పాఘుఁదాకిరయ్యా
అనేకశస్త్రాస్త్రంబులవేసిరి । యతిబలులోయయ్యా
ధనంజయుండందరికంఠంబుల । ధరనుగూల్చెనయ్యా
సమరతలముశవమయమైయుండెను । చాలభయదమయ్యా
అంతసైంధవుడుచచ్చినసేనల । నపుడుజూచెనయ్యా
సైంధవుండుద్రౌపదినిదిగవిడచి । సరగునజనెనయ్యా
నరుడాభీమునిగనియునెసైంధవు । దపుగుచుండెనయ్యా

అర్జు॥-రాజులేనిసైన్యంబుజంప । ధర్మంబుదప్పునయ్యా
వైశం॥-అనగభీముడనెధర్మజుతోనీ । వతివనుగొనుమయ్యా
దౌమ్యునితోమాద్రీతనయులతో । త్వరగవెడలుమయ్యా
భీము॥-సవ్యసాచియిచటసైన్యమెడిరిన । చక్కబెట్టునయ్యా
సైంధవునికొరకునేనుజనియతని । జంపివత్తునయ్యా
వైశం॥-అనవినిధర్మజుడిటులనెసైంధవు । పతిదుష్టుండయ్యా
ధర్మ॥-మనచెల్లెలుదుల్సలదుఃఖించును । దునుమకుమోయయ్యా
గాంధారికికడుశోకంబగునిది । గావింపకుమయ్యా
ఒక్కతప్పుమనకతడుజేసె । నిపుడూరకుండుమయ్యా
వైశం॥-సరగునధర్మజుడెల్లరగొని । యాశ్రమముజేరెనయ్యా
భీమవిజయులతివేగమెసైంధవు । వెంటనంటిరయ్యా
సైంధవుండువీరలగనిరథమును । సరగదోలెనయ్యా
అర్జునుడతిదూరముజనుశరముల । నప్పుడువిడెనయ్యా
అశ్వములుజచ్చెయతడునేలదిగి । యపుడుబారెనయ్యా
భీముడంతవానివెంటపరుగిడి । వేగబట్టెనయ్యా
వజ్రముష్టిచేబొడచిబొడచి । కరవాలముగొనెనయ్యా
అతనితలచిత్రముగగొరిగియు । రథమందుగట్టెనయ్యా
పాండవదాసుడననుమనియాతడు । భయముననవెనయ్యా
అతనినిగొనిధర్మజునికడకుజని । యప్పగించిరయ్యా
పాండవదాసుడననుమనయాతడు । బలికిమ్రొక్కెనయ్యా
అంతధర్మజుండతనివిడచిపురి । కరుగుమనియెనయ్యా
యెన్నడిట్టిదుర్మార్గముసేయుక । యేగుమనియెనయ్యా
అంతసైంధవుడుసిగ్గుచేతపురి । కరుగకుండెనయ్యా
గంగాద్వారంబునకుజనినిష్ట । గావించినడయ్యా
పాదాంగుష్టముభూమిపైనిడి । తపంబుజేసెనయ్యా
కైలాసనివాసునిమదిధ్యానము । గావించినడయ్యా
అతికఠినంబగుతపముసేయగా । హరుడుమెచ్చెనయ్యా
అడుగుమువరమిచ్చెదననసైంధవు । డపుడుగోరెనయ్యా
సైంధ॥పంచపాండవులజయించువరమును । ప్రసాదింపుమయ్యా
శంక॥-అనగశివుండనెనరుడులేనియపు । డదియగునోయయ్యా

అట్టివాడుదేవేంద్రుండు । అధముడనాకడకుఘనుండు
యాచనకైవచ్చుటయేమి । అదినేనిడకుండుటయేమి
కాయముకాయముగాదయ్యా । ఘనకీర్తియెకాయంబయ్యా
యింతవరకులేదనలేదు । యిప్పుడునానాల్కకురాదు
నావ్రతంబువిడనోయయ్యా । నాశనమెుప్పెదవినుమయ్యా
నీమాటలువినలేదనుచు । నీవరుగుముదయతోగనుచు
వైశం॥-అనసూర్యుండపుడిట్లనెను । వినుమింకొక్కటిచెప్పెదను
సూ॥-కవచకుండములిడుమయ్యా । ఘనశక్తినిగైకొనుమయ్యా
దానితోడజయమొుందెదవు । తప్పనాడుటకుజంకెదవు
వైశం॥-అనుచుసూర్యుడంతటజనెను । అతిముదమునకర్ణుడుజనెను

## నెం. 5

బ్రాహ్మణవేసంబునదేవేంద్రుడు । బయనమాయెనయ్యా
సూర్యోపాస్తినిజేసెడుకర్ణుని । జూచినిలచెనయ్యా
భిక్షాందేహియనంగకర్ణుడతి । ప్రీతిగాంచెనయ్యా
అడుగుమునీయిష్టంబిచ్చెదనన । యాతడడిగెనయ్యా
ఇం॥-యిచ్చెదనంటివికవచకుండలము । లిమ్ముబాలునయ్యా
కర్ణ॥-అనగకర్ణుడనెయిటులడుగుట । నీకధర్మమగునయ్యా
మణికనకాదులనెన్నియైన । నేమరకనిత్తునయ్యా
కవచకుండలంబులుసహజంబులు । గావుననిడనయ్యా
ఇడితినేనిసమరరంగమున । యేనుజత్తునయ్యా
ఇం॥-అనవినియింద్రుండనెవేయేటికి । యవియేయిడుమయ్యా
వైశం॥-అనగనవ్వికర్ణుడుదేవేంద్రుస । కపుడుబలికెనయ్యా
కర్ణ॥-ఓసురనాయకభిక్షమడుగ । నీకొప్పునెట్టులయ్యా
ఘనుడవీవడుగకాదననొక్కటి । గావలెవినుమయ్యా
నీవడిగినకవచకుండలంబులు । నేనిచ్చెదనయ్యా
నీయమోఘశక్తినినేగోరెద । నీవిడుమోయయ్యా
వికారరూపమునొందకుండునటు । వేగసేయుమయ్యా
ఇం॥-వినియింద్రుండనెశక్తినిడుదునొక । విధంబువినుమయ్యా
అమోఘశక్తినియాపత్కాలం । బందువిడువుమయ్యా

ఒక్కనాఁటిబలిపంతునిపైపడు । ముచ్చటాలింపుమయ్యా
అటుపైనస్త్రీజేయఁగానిమరి । యక్కరబడదయ్యా
వికారమొందకచిత్తముపట్టని । విధమగునేయయ్యా
వైశం॥-వినియింద్రుఁడుశక్తినియొగగైకొని । యప్పుడుమ్రొక్కెనయ్యా
అనుమానింపకకవచకుండలము । లతనికిచ్చెనయ్యా
తనమరణమునకుభీతినిజెందక । దానమిచ్చెనయ్యా
అమరులంతపుష్పవృష్టిగురుపుచు । యద్భుతపడిరయ్యా
కవచకుండలంబులుగొనియింద్రుఁడు । కదలిపోయెనయ్యా
చయ్యనావార్తపాండవులువిని । సంతసించిరయ్యా
శ్రీకృష్ణునిసంకల్పంబిదియని । చింతవీడిరయ్యా
కౌరవులిదివినియతిదుఃఖంబును । గాంచుచుండిరయ్యా
పాండుకుమారులుద్వైతవనమునకు । బరగజేరిరయ్యా
అంతనొక్కబ్రాహ్మణుఁడుపాండవుల । చెంతజేరెనయ్యా
బ్రా॥-హరిణంబరణింగొనిచనెమీరిపు । డదినాకిడుమయ్యా
వైశం॥-పాండవులదివినియతివేగంబుగ । బయనంబైరయ్యా
హరిణంబునుగనియనేకశరముల । నపుడువేసిరయ్యా
బాణమొకటిదాకనీకహరిణము । పరువులెత్తెనయ్యా
వారుదానివిడకవెంటజనజనఁ । దూరమేగిరయ్యా
హరిణంబదృశ్యమాయెవార । లత్యద్భుతపడిరయ్యా
శ్రమనుజెందియొకచెట్టునీడ । విశ్రాంతిజెందిరయ్యా
ధర్మజుఁడుదకముతెమ్మనినకులుని । త్వరగబంపెనయ్యా
అతఁడొక్కకొలనుగాంచినీరము । లందబోయెనయ్యా
అశరీరుండైయముఁడొకవాక్యము । నపుడుబలికెనయ్యా
యమ॥-త్వరగప్రశ్నలకుయుత్తరములనిడి । త్రాగవలయునయ్యా
మాటవినకనీరముద్రావినచో । మరణమగుదువయ్యా
వైశం॥-నిర్లక్ష్యముచేనకులుఁడందుజని । నీరుద్రాగెనయ్యా
మోహమొందిపైకివచ్చియిలపై । మూర్ఛనొందెనయ్యా
భీమార్జునసహదేవులివ్విధము । వెడలివచ్చిరయ్యా
యక్షునిమాటలువినకనీరుద్రాగి । యచటగూలిరయ్యా
అంతధర్మజుఁడుతమ్ములవెదకుచు । యచటజూచెనయ్యా
యిలపైబడియుండువారలనుగని । కలతజెందెనయ్యా

నలుగురుతమ్ములుగూలిరనుచుకడు । విలపించినడయ్యా
యెవరులేరిచటయేమిమాయయని । యేడ్చుచుండెనయ్యా
దప్పిచేనీరుదాగబోయియొక । ధ్వనినివిన్నడయ్యా
యII-తమ్ములువలదనివినకనీరుద్రాగి। ధరనుగూలిరయ్యా
నేనడిగెడిప్రశ్నలకుత్తరముల । నీవుజెప్పుమయ్యా
అపుడునీరుద్రాగిపొమ్ముయాపదల । నందవువినుమయ్యా
వైశంII-అనుచుఘోరరూపంబుధర్మజు । కపుడుజూపెనయ్యా
అపుడుధర్మజుడుభీతివిస్మయము । లంతబొందెనయ్యా
ధర్మII-యథాశక్తియుత్తరములనిడెదను । యాలకింపుమయ్యా
వైశంII-భాస్కరునెవ్వరునడిపెదరనగా । బ్రహ్మంబనెనయ్యా
సూర్యునిగొల్చుచుదిరిగెడరెవరన । సురవరులనెనయ్యా
సూర్యుడెద్దాననస్తమించుచునన । సుధర్మముననయ్యా
సప్తాశ్వునకేదిసాయమనగా । సత్యంబనెనయ్యా
వినుముపురషుడెటుగొప్పయగుననగ । విద్యచేతనయ్యా
ధరమహిమావంతుడెటులౌననగ । తపముననెనయ్యా
తగుసాయంబతనికేదియనగా । ధర్మంబనెనయ్యా
బుద్ధిమంతుడెటుతాననపెద్దల । సుద్దులననెనయ్యా
విప్రునకమరత్వమిడెడిదేపన । వేదపఠనమయ్యా
యII-బ్రతికియుమరణించినవిధముండెడు । వాడెవడనయ్యా
ధర్మII-యెవనికిబెట్టకభుజించువానికి । యీపేరగునయ్యా
వైశంII-ధరణికన్నభారమేదియనగా । తల్లియెయగునయ్యా
ఆకసమునకన్నపొడువెవడనగా । యగునుతండ్రియయ్యా
మారుతవేగముమించునేదియన । మానసమనెనయ్యా
అంతటయక్షుడుయుత్తరములవిని । సంతసించెనయ్యా
తిరయగనొకతమ్మునిబ్రతికించెద । యడుగుమన్నడయ్యా
అంతధర్మజుడునకులునిమ్మనగ । యాతడనియెనయ్యా
యII-భీమపార్థులనుగోరకయితనిని । ప్రేమించితివయ్యా
సమరవీరులవ్వారినిగోరిన । సాయపడుదురయ్యా
ధర్మII-అనధర్మజుడనెకౌంతేయులలో । యగ్రజుండనయ్యా
మాద్రిపుత్రులలోయితడగ్రజుడగు । మనగగోరితయ్యా

వైశం॥-అంతయమునంతసంబుచే । ప్రత్యక్షమాయెనయ్యా
యము॥ధర్మాత్ముండవుమెచ్చియిచ్చితిని । తమ్ములగొనుమయ్యా
పదమాడవయేడిపెవచ్చెనొక । వరమిచ్చెదనయ్యా
యేరూపంబునరమెచటనున్న । మిమ్మెవ్వరెరుగరయ్యా
యింకయేమైనగావలసినచో । యిచ్చెదనోయయ్యా
ధర్మ॥-అనగధర్మజుడనెమృగముహరించిన । యరణినీయుమయ్యా
వైశం॥-అరణినిడిగజునకునిపాదములకు । యపుడుమ్రొక్కెనయ్యా
యముడుజనెనుమూర్ఛల్లినవారలు । యపుడులేచిరయ్యా
అరణిగొనుచుతమ్ములతొ ధర్మజు । డంతవెడలెనయ్యా
ఆశ్రమముజేరిబ్రాహ్మణోత్తమున । కరణినిచ్చెనయ్యా
అతడుమెచ్చియాశీర్వాదంబుల । నంతజేసెనయ్యా
పండ్రెండేండ్లిట్లుజరిగెనువనమున । బహుబాధలనయ్యా
భక్తరక్షకుండగుశ్రీకృష్ణుని । వలనదాటిరయ్యా
అన్నివిధంబులధర్మతత్వముల । నతడుబ్రోచునయ్యా
మనమునకృష్ణునిపాండుకుమారులు । మరవరెప్పుడయ్యా
జనమేజయునకువైశంపాయన । మునిజెప్పినదయ్యా

—: ఫలశ్రుతి :—

## నెం. 1

భారతపావనచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుడీని । విరచించెనుభక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడుయీసత్కృతిని
సదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని

అరణ్యపర్వము సమాప్తము.



శ్రీ కృష్ణాయ నమః

# తందనాన
# శ్రీమహాభారతము

## విరాటపర్వము



## నెం. 1

వైశం॥-శ్రీయుతజనమేజయరాజ । సేవకజనకల్పకభూజ
వేదవ్యాసునినుతియింతు । విరాటపర్వము వినుపింతు
పాండుసుతులువనవాసంబు । బాధలొందిగడపిరయంబు
వనవాసాంత్యదినమ్మందు । వరలెధర్మదేవతముందు
వారుమ్రొక్కిసంతసించిరి । వరమొక్కటిదయనిమ్మనిరి
అజ్ఞాతముభంగములేక । యగునట్టులజేతువుగాక
అపుడుధర్మదేవతవినెను । యగుననుచును వేగమెజనెను
అంతవారుమౌనులగనిరి । అతివినయంబుననిట్లనిరి
పాం॥-ఇంతవరకుమాతోమీరు । యెన్నొబాధలగొన్నారు
ఐనదిపుడువనవాసంబు । అయ్యెడిదికనజ్ఞాతంబు
మావార్తలదుర్యోధనుడు । యేవిధినైననువినఖలుడు
ప్రయత్నంబుసేయగనెంచు । పాపాలోచనగావించు
గూఢచారులనుబంపించు । గాఢయత్నములగావించు
యేవిఘ్నములందనివరము । యిచ్చిపోయెపుడీసత్వరములు
వైశం॥-అనుచుధర్మజుడుదుఃఖించె । అదుగుండనియనవిలపించె
ధర్మ॥-అడవిలోనయుతికష్టములు । అనభవించితిరిభయదము
మముపీడకగాచితిరయ్య । మిముపీడుచుబోయెదమయ్య

కతినాత్మకులము మేమయ్యా । కరుణావంతులుమీరయ్యా
వైశం॥-అనవిని ధౌమ్యుడుగణగొనెను । అతనికిదయతోనిట్లనెను

## నెం. 5

ధౌ॥-యేలదుఃఖమొందెదవే ధర్మజ । యిదిమదిగనుమయ్యా
సురపతియసురులకోడినిపిడగిరి । మరుగుదాగెనయ్యా
హరితనరూపము మార్చివామనుం । డగుచు గెలచెనయ్యా
బార్పుడను మౌనిజననితొడయందు । నణగియుండెనయ్యా
ధేనుశరీరమునందుసూర్యుడు । విలీనుడాయెనయ్యా
వీరులుకాలముగాంచిబయటబడి । విజయముగొనిరయ్యా
నీవుసోదరులతోడనట్టులే । నిల్వవలయునయ్యా
వైశం॥-ఇటులబల్క మౌనులుదీవనవిడి । యేగియుండిరయ్యా
పరివారజనంపీపిథిబల్కుచు । పయనమాయెనయ్యా
అందరెగగాధౌమ్యునితోవారలు । యరగియుండిరయ్యా
సాయంకాలమువరకుజనియొక్క । స్థలముగాంచిరయ్యా
అచటనారాత్రినిలచిధర్మజుం । డందరికనెనయ్యా
ధర్మ॥-మత్స్యదేశమునమనముండుటనే । మహాయోగ్యమయ్యా
యేయేపనులనొనర్చుచుకాలం । బిరుగడతురయ్యా
అనగవిజయుడన్ననుగనిచింతిలి । యపుడుబల్కెనయ్యా
అర్జు॥-సుతుమూరుండవుశుద్ధచిత్తుడవు । సుగుణాఢ్యుడవయ్యా
సేవలుగొంటివిగానిసేవలణ । జేతువెట్టులయ్యా
యేవేసంచేపనితోవిరటుని । సేవించెదవయ్యా
వైశం॥-అనగధర్మజుడుతమ్మునిదుఃఖం । బాపిపలికెనయ్యా
ధర్మ॥-విరటునిపురిలోయతివేసంబున । బరగుచుందునయ్యా
సత్కథాగోష్టిజరుపుచుయాతని । సభనుజెలగుదయ్యా
విలాపార్థముగనతనికిజూదము । వేడ్కజూపుదయ్యా
ధర్మరాజుమిత్రుండనందు । మోదంబుగూర్తునయ్యా
కంకుడనుపేరుజెప్పివారితో । గలసియుందునయ్యా
వైశం॥-భీమునిగనికన్నీరువిడచుచు । వ్యథముబలికెనయ్యా
ధర్మ॥-సౌగంధికకైయకులణగెలచి । సాధ్వికిచ్చినాడు

కిమ్మీరాసురుజంపివనము । శుద్ధమ్ము జేసినాడు
బకునిజంపియేకచక్రపురజన । బాధదీర్చినాడు
జటాసురునిజించిచెండాడి । రక్షణనుసల్పినాడు
జన్మసాంతముగదైన్యంబెరుగని । సమర్థుఁడగువాడు
విరటునిపురిలోయజ్ఞాతంబెటు । వెడలదీయుఁవీడు
వైశం॥-అనగవినిభీముడన్నకుమ్రొక్కుచు । యపుడుబల్కినాడు
భీము॥-వలలుడనుపేరవిరటునిపురిలో । వర్తించెదనయ్యా
బహువిధములరుచిగలభోజనముల । వంటజేతునయ్యా
వృక్షములెంతటివైనవంటకై । విరచివేతునయ్యా
గోల్లుపులినైనబట్టికరంబుల । గూల్చివేతునయ్యా
మల్లులఁగెలచివిరటునిచే । బహుమానమొందుదయ్యా
ధర్మరాజువంటవాడనని । శాంతముననుందునయ్యా
వైశం॥-అనగసంతసిలిధర్మజుండువిజయుని । గనియన్నాడు
ధర్మ॥-ఖాండవనంబునుదహించిసురపతిని । కలనగెల్చినాడు
అమరేంద్రునియర్ధాసనమున । పెంపందివచ్చినాడు
అట్టివాడువిరటునింటనెవ్విధి । యలరుదెలియదయ్యా
వైశం॥-అనవినివిజయుడుచింతిల్లకుమని । యపుడుబల్కెనయ్యా
అర్జు॥-స్వర్గమందునేనున్నపుడూర్వసి । శాపమిచ్చెనయ్యా
నపుంసకుండవుగమ్మనెయింద్రుడు । నాకుచెల్పెనయ్యా
అజ్ఞాతంబొకవత్సరమందున । యక్కరయగునయ్యా
సురపతిజెప్పెనుశాపముగైకొని । విరటునింటనయ్యా
ఉత్తరకన్నెకుజెప్పుచునిలచెద । నృత్యగీతమయ్యా
ద్రౌపదిమన్ననలందుదునని । సంతసముజేతునయ్యా
బృహన్నలాయనుపేరుచేనందు । ఖ్యాతినుందునయ్యా
వైశం॥-అనవిననకులుడుధర్మరాజునకు । యపుడుబల్కెనయ్యా
నకు॥-అశ్వశిక్షకుడనైయావిరటుని । యాశ్రయింతునయ్యా
దామగ్రంథియనంగబిల్వబడి । ప్రేమగాంతునయ్యా
యుధిష్ఠురునియశ్వపాలకుడనని । యుత్తరమిడుదయ్యా
వైశం॥-అనసహదేవుండనెవిరటునినే । నాశ్రయింతునయ్యా
సహ॥-గోవులగాచుచుగోపాలుడనై । సేవజేతునయ్యా
తంత్రిపాలుండనెడిపేరు । మోదముననగూర్తునయ్యా

ధర్మజుఁకఁగోపాలుఁడనఁ । యుక్తముగఁజెప్పుదయ్యా
వైశం॥-అనఁగధర్మజుఁడుద్రౌపదిఁగనుఁగొని । యపుడుపలికెనయ్యా
సాధ్వివినుకుమారాంగివేషములు । సల్పెదవనెనయ్యా
మిగులదుఃఖమునఁబల్కెడునతనికి । మెలతజెప్పెనయ్యా
ద్రౌ॥-సైరంధ్రీవేషమునవిరాటుని । సతినిజేరుదయ్యా
చీరలగట్టుడునలంకారములు । జేయుచుందునయ్యా
దినదినమునయావిరటునిసతి । మన్ననలఁగొందునయ్యా
నామముమాలినిద్రౌపదిదాసిని । ప్రేమవెల్పుదయ్యా
వైశం॥-అనఁగసంతసిల్లిధౌమ్యునికమ్మల । నాతడిచ్చెనయ్యా
దృపదునిచెంతకువంటలవానిని । యపుడుపంపెనయ్యా
తమరథాశ్వములద్వారకాపురికి । త్వరగనంపెనయ్యా
ధౌమ్యుఁడపుడుచింతిల్లుచుసేవా । ధర్మములనెనయ్యా
సేవాధర్మంబతికష్టంబని । చెప్పఁదొడగెనయ్యా

## నెం. 1

ధౌ॥-పెద్దపీఠమెక్కఁగరాదు । బిరంబులుబల్కఁగరాదు
అతనివిధంబుండగరాదు । అతనివలువగట్టగరాదు
అయాసముజెప్పఁగరాదు । అతనియాజ్ఞతప్పఁగరాదు
పరిజనములదిట్టఁగరాదు । పగలునవిద్రింపగరాదు
అతనివాహనముగొనరాదు । అతనివైరిఁగూడగరాదు
పొరుగిండ్లకుబోవగరాదు । పొరుగుమాటలనువినరాదు
అతనిహృదయమెరుగగరాదు । అదియెరిగినజెప్పఁగరాదు
అతనివల్కెకెదురనరాదు । అతనిగుట్టుదెల్పఁగరాదు
మీరునీతివంతులుగాన । మెలఁగికీర్తిగాంతురుగాన
వైశం॥-అనుచుదీవనలనిడగొనిరి । అంతటబయనమ్మైజనిరి
అతిదూరపంథంబుననడచి । అనేకదేశంబులగడచి
పోవుచుండద్రౌపదియలసి । పుడమిబడుచులేవకసొలసి
ద్రౌ॥-నాథులారశ్రమనొందితిని । నడువజాలనెండబడితిని
పదములుకదలింపగలేను । బహుతృష్ణనుగనియున్నాను
-అనగధర్మజుఁడుచింతించె । అతివనెత్తుకొనయోచించె

అపుడునకులునిఁ జూచెఁ । అతఁడుకష్టమొందుటగాంచె
సహదేవునివైపునుగాంచె । శ్రమనొందుటగనిచింతించె
విజయునకాసతిఁజూపించె । విపినబాధలనుబరికించె
సతినిమోచికొనినరుడేగే । చయ్యనపురమునుగనియాగె
ధర్మసుతుడుపురమునుగనెను । తమ్ములతోనపుడిట్లనెను
ధర్మ॥-మనమాయుధములధరియించి । మసలినచారులబంపించి
కురుపతియీవార్తనువినును । అరయువచ్చిమనలనుగనును
అజ్ఞాతంబునగుర్తించి । అప్పుడుపందెమియోచించి
వనవాసాజ్ఞాతమ్ములను । జనుమనిబంపించుమనలను
వీటినిసర్పాకృతిజేసి । వృక్షమునఁబదిలముజేసి
జనినశుభముగల్గునుమనకు । అనజనిరిశమీతరువునకు
సకలాయుధములబంధించి । సర్పాకారంబొనరించి
వైశం॥-ధర్మజుండుతరువుననుంచి । ధర్మదేవతనుస్మరియించి
ఏనునరుడుగాంతుముగాక । ఇతరులుగనకుందురుగాక
అన్యులుగనసర్పమువిధము । అగుపడుననిబల్కె శపథము
కష్టకాలమునుగ్రహియించి । కడుకోపముభీముడుగాంచి
కౌరవులనుజంపదలంచి । గడగొనతరువారోహించి
గాంచగనౌసర్పవిధమ్ము । గడచుమాకునజ్ఞాతమ్ము
భీమసేనునంతటగాంచి । వేగిరపాటునుద్యాజియించి
అజ్ఞాతముసేయగదయ్యా । అదియేశుభమిడుమనకయ్యా

## నెం. 5

అనుచుజచ్చిపడియున్నొకపక్షి । నంతటగనెనయ్యా
దీనిచర్మంబుగొనిరమ్మని । సహదేవునంపెనయ్యా
సహదేవుడుజనిదానిచర్మమును । చయ్యనగొనెనయ్యా
ఆయుధములపైనుంచుమనగ । సతడటులజేసెనయ్యా
చచ్చిపడియున్నయనాథశవమును । సత్వరగొనెనయ్యా
అస్త్రములపైనగట్టగనిముడ । మందియుండెనయ్యా
పుణ్యనదికందరేగికృత్యములు । పూర్తిజేసిరయ్యా
ధర్మజుండంతధర్మదేవతను । త్వరగమ్రొక్కెనయ్యా

అజ్ఞాతమునకుతగినవేషముల । నాచరించిరయ్యా
వేసములకుదగువస్తువులదయ । వేగనియ్యుమనగా
అనుచువేడవేసములుమారెయుట । కన్నిజేరెనయ్యా
యెల్లరుగ్రహింపుడనుచుధర్మజుడు । యేగదలచెనయ్యా
యతివేసంబునుగాంచిరెుక్కరొక । రేగవలయునయ్యా
సర్వేశ్వరునిస్మరింపుచువిరటుని । సభకుజేరెనయ్యా
జనుదేరగవిరటుండుగాంచితన । సచివులకనెనయ్యా

విరా॥-ముమ్మూర్తులలోవచ్చెడువాడొక । మూర్తిగగనుపించె
భూషణాంబరాదులవడ్డించిన । భూపతియనిపించె
పరిచారకవర్గంబువిడుసార్వ । భౌముండనిపించె

వైశం॥-ఇటులబల్కుచాయతిరాజునుగని । యెదురుగజనుదెంచె
అర్ఘ్యపాద్యములనిచ్చిపోడ్తెచ్చి । యతనికిప్రణుతించె
ఎచటనుండువారెచటికివచ్చితి । రెయగగప్రశ్నించె
మందహాసమునన్నృపతికియతి । యిమ్మాడ్కినివచియించె
ఉన్నదియున్నటులెరిగిచెప్పవా । రెన్నడులేరయ్యా

ధర్మ॥-కురుదేశీయుడవిప్రుడధర్మజు । కూర్మిసఖుడనయ్యా
అఖిలధనలక్ష్మిజూదమాడగా । యంతమొందెనయ్యా
విరక్తిచేయతినైతికంకుడను । పేరుగాంచితయ్యా
సకలనీతిశాస్త్రంబులెరుగుదును । సన్మతివీవయ్యా
ఒక్కవత్సరంబిచటనుందునీ । వొప్పినసోయయ్యా
భూరిగుణాఢ్యుడవనినీచెంతకు । జేరవచ్చితయ్యా

వైశం॥-వినివిరటుండనెరాజ్యపాలనము । వేగజేయుమయ్యా

విరా॥-నినుగొల్చెదపరివారముతోడుత । నీవుజెప్పుమయ్యా
కాదనిపల్కినసీయిష్టంబుగ । గదలకుండుమయ్యా

వైశం॥-అతనినిమరిమరిగాంచుచువిరటుడు । అద్భుతపడెనయ్యా
అంతటభీముండన్యమార్గమున । యపుడువచ్చెనయ్యా
వంటవానివేసంబునపురమున । ప్రవేసించెనయ్యా
వంటజేయుసామగ్రులగైకొని । బయులువెడలెనయ్యా
పురజనులందరుయతనిగాంచి । యబ్బురముజెందిరయ్యా
రాజపథకంతవచ్చుచుండగా । రాజుగాంచెనయ్యా

భయసంభ్రమములనొందివిరాటుడు । భాగ్యంబనెనయ్యా
అంతలోవచ్చిభీముడుమ్రొక్కుచు । యధిపునికనెనయ్యా
భీము॥-శూద్రజాతివాడనుపాకంబున । శూరుడనోయయ్యా
అన్నిదేశములవంటలలో । నేర్పైనవాడనయ్యా
వలలుడనుపేరుకూడుగుడ్డకొక । వర్షముందునయ్యా
వైశం॥-అనగవిరటుడనెశూద్రుడవెట్టుల । యయ్యేదవన్నాడు
భూపాలనమొనరింపగాదగిన । మూర్తివియన్నాడు
ఛత్రచామరంబులనిడెదను । రాజ్యముగొనుమన్నాడు
అనవినిమోరకువిధమునభీముం । డపుడుబల్కినాడు
పాకమొనరించునాకేటికి । భూపాలనమన్నాడు
ధర్మరాజింటవంటవారిలో । ధన్యుడనన్నాడు
కారెనుబోతులకరులసింహముల । గలచెదనన్నాడు
మల్లురెట్టివారైనకలనబరి । మార్చెదనన్నాడు
ఒల్లకున్నబోయెదననవిరటుడు । యుబ్బిబల్కినాడు
అటులౌననితనవంటశాలకై । యతనిబంపినాడు

## నెం. 6

1. నరుడంతటవేగమ్ముగజనెను ।
నాతియిడినశావముగైకొనెను
విరటునిపురిలోప్రవేసించెను ।
పురజనమాతనిగనినివ్వెరపడెను । గనుగొనెను

2. విరటుడుగనిసచివురికిట్లనెను ।
వెలదిగాదుపురుషుండనియెను
నరుడుయాటకైయిదినిర్మించెను ।
నామదికిదియాశ్చర్యమాయెననెను । ఘనమనెను

3. అనగనర్జునుడుదానిట్లనెను ।
ఆటలపాటలనేర్పరిననెను
నినుగొల్చుటకైవచ్చితిననెను ।
నీకన్నెలకాటలనేర్పెదననెను । నిల్చెదను

4. పేరుబృహన్నలయనుచుజెప్పెను ।
      ధారుణీశుడబ్బురమునుజెందెను
   నారథకార్ముకములనిడుదనెను ।
      యీరాజ్యముపాలించుమునీవనెను । ముదముగన
5. భూపతిపల్కులువిని నపుడనెను ।
      పుడమిపాలనము నాకువలదనెను
   శాపముచేనిట్లుతి నేననెను ।
      సంవత్సరమిందుండెదముండుమనినను । కాదనక
      సత్వరమింకొకదేశముబోయెదను । తెల్పగను
6. అనగవిరాటుడుసమ్మతిపడెను ।
      ఆత్మజనచటికిబిల్వబంపెను
   తనయనాబృహన్నలకర్పించెను ।
      తగినగృహమునకువేగబంపజనెను । చదువులను
      తరలాక్షికిజెప్పుటకైమొదలిడెను । యాటలను

## నెం. 1

పురముననకులుండుజేరెను । పురజనంబుజూడగోరెను
రాజమార్గమునజనుదెంచె । రాజుగుర్రములనటుగాంచె
తటకుననయీతడుజనుచెంచె । ధరణీశుండీతనిగాంచె
మన్మథునింబోలినవాడు । మహీనాథుడనదగువాడు
అతిసుకుమారాంగునిగాంచి । అడిగెయున్నిటినివిపదించి
అవనిపతిమ్రొక్కిటులనెను । అశ్వశిక్షకుడనేననెను
నకు॥-జాత్యశ్వంబులగుర్తింతు । చక్కనినడకలనేర్పింతు
   ఆయుష్యముజెప్పగనేర్తు । అశ్వలక్షణంబులనేర్తు
   అశ్వవైద్యశాస్త్రమునేర్తు । అవిమీకిటజూపగనేర్తు
విరు॥-భూపాలనమొనరుపరాద । ఆపనిసేయుటమర్యాద
వైశం॥-అనగనకులుడపుడిట్లనెను । అర్హతలేదాపనికనెను
వకు॥-వచ్చినపనిసేయగవలయు । మెచ్చునట్టులుండగవలయు
   ధర్మసుతుడుననుపోషించె । దయనుచదువులనునేర్పించె
   అశ్వశిక్షకువియొనరించె । అందుననాపటిమనుగాంచె

ననుతమ్ముని వలెప్రేమించె । ననువిడియెచటికొజనుదెంచె
ఇష్టమున్ననుండెదనయ్యా । కష్టమన్నబోయెదనయ్యా
యేదొక్కటినుండెదనయ్యా । కూడుగుడ్డలిడుచాలయ్యా
వైశం॥-అనగరాజుసంతోషించె । అశ్వశాలకునుబంపించె
అందరికధిపతినొనరించె । అందాతడుమోదముగాంచె

## నెం. 5

సహదేవుండాపురమునజనుచు । త్సాహముగొనెనయ్యా
తలుగులవాదియునుదామెనమూపున । ధరించిజనెనయ్యా
పౌరులెల్లయాతనిగనివెంబడి । జేరుచుండిరయ్యా
రాజ్యవీధిజనుదెంచిమత్స్యభూ । రాజునుగనెనయ్యా
మ్రొక్కిబల్కెనీపశులగాచెదను । భూపతివినుమయ్యా
సహ॥-పాడిదరుగనీకనుపశులనునే । పాలించెదనయ్యా
పశుశాస్త్రమునేనెరిగితివైద్యము । పాటించితినయ్యా
నానరిగొల్లలుమెచ్చునట్లుగా । నాపనిగనుమయ్యా
వైశం॥-అనజనపాలుండనెగొల్లడవన । యద్భుతమన్నాడు
ఇనశశివంశంబులలోబుట్టిన । జనపతివన్నాడు
భూపరిపాలననీకిడితృప్తిని । బొందెదనన్నాడు
కుత్సితంబైనపనివిడుమాయిది । గూడనిదన్నాడు
సహదేవుండదివినియనెతక్కువ । జాతివాడనయ్యా
సహ॥-బాలుడనాగరికంబుదెలియ । భూపాలనదగదయ్యా
ధర్మపుత్రపశుపాలకుండనని । త్వరగదెల్యుమయ్యా
తంత్రిపాలుండనెడిపేరుచే । ధరజెలగుదునయ్యా
ఇష్టమైననొకయేడునిల్తుదయ । నెరుకసేయుమయ్యా
వేరొకపనినేజేయజాలనా । విన్నపమిదియయ్యా
వైశం॥-అనగవిరాటుడుసంతసించియిటు । లనియెనువినుమయ్యా
నేనదిజెప్పనుపశులరక్షణకు । నీవొప్పితివనెను
ఐనబొమ్మనుచుగోపవర్గమున । కధిపతిగమ్మనెను
సైరంధ్రివేసమ్మునద్రౌపది । చయ్యనజనుదెంచె
మాసినకోకనుగట్టివెడలియభి । మానముత్యజియించె

వీధినజనుచుండగనచ్చటగల । వెలదులుగనిరయ్యా
యీపెయరుంధతియోరోహిణియో । యెవతోయనిరయ్యా
సామాన్యపుమనుజాంగనగాదని । సతులుబల్కిరయ్యా
నీవెవరిచటికియేలవచ్చితన । నెలతబలికెనయ్యా
నిరుపేదనుకూడుగుడ్డలిడి । మన్నించయుందునసెను
వినికాంతాగణమద్భుతపడనా । వెలదిముందుజనెను
మేడనెక్కినసుదేష్ణయపుడి । మెలతనుగనెనయ్యా
జనెడిసతినిదోడ్కొనిరమ్మనితన । సఖులనంపెనయ్యా
వారుజనివిరాటునిసతిసుధేష్ణ । బంపినదనిరయ్యా
రమ్మనెనసగావారివెంటనా । రమణియేగెనయ్యా
వచ్చినకాంతనుగలియజూచి । యావనితబల్కెనయ్యా
యెవరిదానవిందేలవచ్చితివి । యెరుగదెల్పుమనెను
అనగనీతితోద్రౌపదిసుధేష్ణ । కంతయిట్టులనెను
ద్రౌ॥-దాసీకులమగుమగలేవురుగల । దాననుమాయమ్మా
మాలినియనునామముగలదానను । మనవినివినుమమ్మా
పరులుగాంచశత్రువులవెంట్రుకల । బట్టియీడ్చిరమ్మా
పతులగూడియడవినిజేరివ్రతమును । బట్టితినోయమ్మా
వత్సరమొక్కటితక్కువాయెనా । వ్రతమునకోయమ్మా
నీయెడనొకయేడుండవచ్చితిని । నిల్పేదనోయమ్మా
నానాథులుగంధర్వులుదెలియరు । నన్నుగాతురమ్మా
యెంగిలికుడువనుయేపనులైనను । యేవగించనమ్మా
శ్రీకృష్ణునిసతిసత్యభామకడ । జెలగితినోయమ్మా
తదుపరికొన్నాళ్ళకుద్రుపదాత్మజ । దాసినైతినమ్మా
వీదుకీర్తి వినియిచటనుండుటకు । నేనువచ్చితమ్మా
వైశం॥-అనవినిసుధేష్ణమాలినిగనుగొని । యపుడుబలికెనయ్యా
చక్కనికాంతవునీవిటనుండిన । శ్రమయగునసెనయ్యా
పతివిజగాంచియుమోహించినకడు । బాధయనినదయ్యా
ద్రౌ॥-వివిబల్కెనుమాలినిదుష్టులనను । గనగజాలరమ్మా
మోహించియుబలవంతపరుపనా । మొగలువత్తురమ్మా
గంధర్వులువిముసంబునవానిని । కలిచివేతురమ్మా

వైశం॥-అయనుమానముబొందకుమననా। యంగనవినెనయ్యా
మంచిదంచుతనయింటనుండుటకు। మగువయొప్పెనయ్యా
యింతియుపాండుకుమారులువిరటుని। యింటనుండిరయ్యా

# నెం. 1

కంకుడుసభజేరుచునుండె। కడువినోదములుగనుచుండె
భూపతిసంతసపడుచుండె। పుణ్యపుకథలనువినుచుండె
ప్రతిదినమిటుజరుగుచునుండె। బహుధనంబులిచ్చుచునుండె
ధర్మజుడవిగైకొనుచుండె। తమ్ములకందరకిడుచుండె
అనిలజుడెల్లరగనుచుండె। అన్నపానములనిడుచుండె
ఒకరినొకరుగాంచెదరయ్యా। ఓర్పుగమాట్లాడెదరయ్యా
ఎల్లరుసతిగాచెదరయ్యా। ఎల్లరసతిజేరెడిదయ్యా
తమగుట్టునుదెల్పకవారు। తగువిధమటనుండిరివారు

# నెం. 5

మల్లుడొక్కడొకనాడువిరాటుని। యిల్లుజేరెనయ్యా
సభకుజేరిమ్రొక్కినిలచిచేయిని। జాచిపలికెనయ్యా
మల్లు॥-విరాటరాజయఖిలదేశముల। వెడలివచ్చితయ్యా
మల్లులగెలచుచుధైర్యముతోబహు। మతులగొంటినయ్యా
మీమల్లులబిల్పించిరణమునకు। మీరుబంపుడయ్యా
మల్లులుతేరనిబల్కినచోబహు। మానమీయుడయ్యా
వైశం॥-అనగన్నృపుడుమల్లులబిల్పించిన। యపుడుబల్కిరయ్యా
అతనిదేహమునుబలమునుగనిభయ। మందిబల్కిరయ్యా
ఇతనిగెల్చుటకుశక్తిజాలదని। యెరుగజెప్పిరయ్యా
అననతనికిగర్వమంతకంతకు। నధికమాయెనయ్యా
జనపతియిదిమనకవమానంబని। యనగజొచ్చెనయ్యా
కంకుభట్టపుడువిరటునిగణగొని। కనలిబల్కెనయ్యా
కం॥-గెల్వగలడుమనవలలుండిప్పుడు। బిల్వబంపుమయ్యా
గాంచితినితననిధర్మజునికడ। కదనశూరుడయ్యా

వైశం॥-అనగసంతసిలి జనపతివలలుని । యప్పుడుబిల్చెనయ్యా
వచ్చిమ్రొక్కినను బిల్చుకారణము । బల్కుమనియెనయ్యా
విరటుడుబలికెను మల్లయుద్ధమును । వేగజూపుమయ్యా
ఆమల్లునితోబోరుమనభీము । డన్నుగనెనయ్యా
కంకుడంతకనుసన్నజేయగా । కనలినిల్చెనయ్యా
అపుడుబోయియామల్లునితో । రణమాచరించెనయ్యా
మల్లునిగుద్దులుభీమసేనునకు । మల్లెమొగ్గలయ్యా
భీమునిగుద్దులుమల్లవీరునకు । పిడుగుపాటులయ్యా
అఖిలజనంబులువీరలగనిభయ । మందుచుండిరయ్యా
వలలుడుమల్లునికరపాదంబులు । బట్టిత్రిప్పెనయ్యా
త్రిప్పినేలపైగొట్టియొకగుద్దు । నొప్పగించెనయ్యా
వాడురక్తంబుగ్రక్కుచుగర్వము । బాసిబారెనయ్యా
అతిసంతసపడివిరటుడుధనముల । నతనికిచ్చెనయ్యా
ఆధనమఖుణలకిచ్చిలోపలికి । యపుడువెడలెనయ్యా
అందరువిరటునిమన్ననలందుచు । యచటనుండిరయ్యా
కొన్నిదినంబులెఒక్కయేడునకు । కొరతయుండెనయ్యా
దండనాథుడొకనాడుకీచకుడు । ద్రౌపదిగనెనయ్యా
సింహబలుండనిపేరుబొందిదా । సినిగనుగొనెనయ్యా
గాంచియుకన్నులుదిప్పజాలకా । ఖలుడునిల్చెనయ్యా
తలమాసినదాసినిగనిమోహము । తానుబొందెనయ్యా
చినిగినకోకనుగట్టినదానిని । చేరదలచెనయ్యా
ఒరులుగాంచినవ్వేదరనుమాటను । మరచిపోయెనయ్యా
నేనురాజునిదిదాసియటంచును । జ్ఞానమువిడెనయ్యా
మోహమునొందినవానివివేకపు । బుద్ధిబోవునయ్యా
మరణమాసన్నమగుటచేనిట్టి । మదముగ్గలునయ్యా
కన్నురెప్పవాల్పకతనుజూడగ । కాంతవడకెనయ్యా
ముఖమునచెమ్మటగలిగెకాంతి । యప్పుడెమాసినదయ్యా
నాకుదిక్కెవరియ్యెడననియా । నాతిదలచెనయ్యా
అంతలోసింహబలుడువేగతన । యక్కనుగనెనయ్యా
యీపెయెవరుకులమెయ్యదియిచటికి । యేలవచ్చెనయ్యా
అనవినినుభేష్టమోహపరవశుం । డనుచుదెలుసుకొనెను

మతినిద్రిప్పుటకువేరేచేయగ । యతడువేగజనెను
మాలినిచెంతకువేగమెజనియొక । మాటబల్కుదనెను
యింతచక్కదనమున్ననీవంటి । ఇంతియెలేదనెను
వినుచువిననియటులున్నదాని । కవ్వీరుడిట్టులనెను
మన్మథబాణముకోర్వజాలనో । మానినిరమ్మనెను
అఖిలవైభవములొనగూర్చెద । నన్నాదరించుమనెను
వినిదుర్భాషలకోపమొందియును । వినయముతోననెను

# నెం. 1

ద్రౌ॥-నావేసముజూడగరాద । నాగొప్పదనమునుగనరాద
మానినచీరనుగట్టితిని । దాసినౌచుయిటమెలగితిని
ననుగనిమోహింపగనేలా । నవ్వెదరిదివినభూపాలా
పరసతిగోరినపాపంబు । తరుగదుమానినయోగ్యంబు
వైశం॥-అనగనతడువేగిరపడెను । ఆమాలినికపుడిట్లనెను
కీచ॥-కామబాధకోర్వగలేను । కామినినినువీడగలేను
నరకబాధనొందెదగాని । నాతినిన్నువీడనుబూని
అనమాలినికోపముగాంచి । అనెకనులెర్రగనొనరించి
ద్రౌ॥-అతిబలంబుగల్గినవారు । హరునైననుగెల్చెడువారు
యేవురుగంధర్వులుగలరు । ఇదిగనికోపింపగగలరు
మానప్రాణంబులుబోవు । మానిసౌఖ్యములగొనుమీవు
వైశం॥-సింహబలుడువినియిట్లనెను । చెప్పరానిగర్వముగొనెను
సిం॥-పతులైదుగురనిచెప్పెదవు । బలయుతులనిబెదరించెదవు
పాలతినన్నుగెలిచెడివారు । మూడులోకములలోలేరు
వైశం॥-అనుచుగర్వమొందెడువాని । గనిపల్కెనుకోపముబూని
ద్రౌ॥-తొల్లిరావణుండనువాడు । తొయ్యలిసీతనుగొనినాడు
రామునిచేజచ్చెనుగాద । రావలదనరామర్యాద

# నెం. 5

వైశం॥-అనుచునిందింపకోపముతోజని । యక్కనుగనినాడు
వనజాక్షికినేజెప్పినవినదను । వార్తదెలిపినాడు

అతివవినిమదినిదలచెమోహమ । త్యంతమొందినాడు
ప్రాణహానియగునేమొయంచుబహు । భయమునొందెనయ్యా
అయినగానిచిత్తమునుమరల్చెడి । యత్నమూనెనయ్యా
సు॥-తమ్ముడానాదుపల్కులువినియా । తరుణిగాంచకయ్యా
వైశం॥-యేవురుగంధర్వులుతనపతులని । ఇంతిజెప్పెనయ్యా
బలిమిదననుబట్టినవానిని । జంపదల్తురనెనయ్యా
సు॥-కావుననాపల్కులువినకుండిన । చావుదప్పదయ్యా
పరసతిగోరినవారికిజయమె । ప్పటికిగలుగదయ్యా
దీనికన్నచక్కదనముగల్గిన । స్త్రీలనంపుదయ్యా
వైశం॥-నాకుదోచినటుజెప్పితివినుమని । నాతిబల్కెనయ్యా
అనగసింహబలుడంతచింతగొని । యపుడుబల్కెనయ్యా
యేలబోధసల్పెదవిదియంతయు । యెరుగుదుననెనయ్యా
సిం॥-కావలసినదెటుగాకమానదా । కాంతనువిడనమ్మా
నీవీసాయమొనర్పకున్నచో । నేనునిల్వనమ్మా
వైశం॥-అనుచుతనపాదములకుమ్రొక్కతన । యనుజునిగనెనయ్యా
వీనికిచావెటులైనదప్పదని । వెలదిదలచెనయ్యా
తనమదిదుఃఖముగాంచియడంచియు । త్వరగబలికెనయ్యా
సు॥-యేలచింతనొందెదవునీచెంత । కింతినంపుదయ్యా
ఆసవమునొనిరమ్మనికపటము । నాచరింతునయ్యా
వైశం॥-అనగసంతసిలిసింహబలుండపు । డరిగియుండెనయ్యా
తనయింటికిజనిమాలినినేమది । దలచుచుండెనయ్యా
యెపుడువచ్చుననిమదనబాధచే । యెదిరిచూచెనయ్యా
అంతటసుధేష్ణమాలినిఁబిలచి । యపుడుబలిచెనయ్యా
దప్పిగొంటినాసవమునుగొనిరా । త్వరగనేగుమనెను
సింహబలునింటమంచిదిగలదట । జేకొనిరమ్మనెను
వినిభీతిలిమాలినితనమదిలో । విసుగుచునిట్లనెను
మాలి॥-యింతటనీచపుపనికిబంపగా । యెటులనొప్పెనమ్మా
నాకుజెప్పదగుపనినిజెప్పుమది । నాకుయోగ్యమమ్మా
వేరేదాసులుగలరుదీనికై । వేగబంపుమమ్మా
వైశం॥-అనుచుతనమదినిగల్గినభయమును । యుదిపిబల్కెనయ్యా
అవవివినిసుధేష్ణబలికెనీచమున । కరుగకుమనెనయ్యా

దప్పిచేబుద్ధిదప్పెనుగావున । జెప్పితిననెనయ్యా
పరులయిల్లనుచుదలచితిబోవగ । వెరవకుమనెనయ్యా
నీవుమంచిదానవెనేనెరుగుదు । నిజముసుయనెనయ్యా
అనుచుఖలికియూరకున్నమాలిని । యరిగెదననెనయ్యా
పానపాత్రంబుజేకొనియచటికి । బయనమాయెనయ్యా

## నెం. 1

సుధేష్ణభవసంబునువిడచి । సుదతికొంతముందుకునడచి
కనులనీరుగారుచునుండె । తనువంతటవడకుచునుండె
హాకృష్ణారమ్మనుచుండె । యాపదబొందితిననుచుండె
ద్రౌ॥-అనాథనాథుండవుగావా । ఆర్తరక్షకుండవుగావా
దిక్కులేనిదాననుదేవా । గ్రక్కునబ్రోవుముసమభావా
నీపైభారంబుంచితిని । నేవెడలుచునినుదలచితిని
గాచినమరిగావకయున్న । గలభారమునీయదియన్న
వైశం॥-అనుచువెడలిసూర్యునిగాంచె । అతనికికరములుజోడించె
ద్రౌ॥-కర్మసాక్షివీవోదేవా । కరుణామయుడవుసమభావా
నేనుపతివ్రతనేయైన । నేనచటికిబోయెదగాన
నాకుబాధగల్గగనీక । ననుదయరక్షించెదుగాక
వైశం॥-అనుచుపదముత్రొక్కుచుండె । అపెవెడలెరవిగనుచుండె
అంతరక్కసునిబంపించె । అదృశ్యుడైయాతడుగాంచె
పులిచెంతకులేడివిధంబు । బోయిచేరెనాభవనంబు
యెదురుజూచుచుండెనువాడు । యెంతోమోహముగొన్నాడు
సతినంతటజూచెనువాడు । సంతసంబుమదిగొన్నాడు
అంతటమాలినిజనియనెను । అక్కయాసవముదెమ్మనెను
మాలి॥-ఆలస్యముజేయగదగదు । ఆపెకోపమొందగగలదు
వైశం॥-అనవినియాతండిటులనెను । ఆసవంబుబంపెదననెను
సైం॥-నీవిచ్చటనుండగవలయు । నీసుఖంబునొందగవలయు
వైశం॥-నాసంపదనిచ్చెదననెను । నామోహముదీర్చుమయనెను
అనుచుచెంతకంతటజనెను । వనితనుబలిమిగనుబట్టెను

అంతట ద్రౌపదిదుఃఖించె । అచటినుండివెడలగనెంచె
అంతరక్కసుండరుదెంచె । అతనినొక్కతోఁపుననొంచె
ఆపెకరమువిడియిలబడెను । ఆసతియిలుదాటివెడలెను
లేచికీచకుండరుదెంచె । లేమనుబట్టుటకేతెంచె
దానివెంట్రుకలుగ్రహియించె । దబ్బునరక్కసుడదిగాంచె
అదృశ్యుడైవెంటనెనిల్చె । అతనిబట్టిపుడమినగూల్చె
దెబ్బనొందివేగమెలేచె । గొబ్బునదానినిగొనజూచె
వీధియనుచుమెలియకయుండె । వెర్రివిధముపరుగిడుచుండె
వెనుకదిరిగిసతిగనుచుండె । భీతినొందిపరిగిడుచుండె

## నెం. 5

మహానాగమునుబట్టెడుగరుడుని । మాడ్కివెంటజనెను
చిలుకనుబట్టగబోవుపిల్లివలె । శీఘ్రమువెనుజనెను
యెక్కడినుండియొభీమసేనుడది । గ్రక్కునగనినాడు
ప్రళయకాలరుద్రునివలెపొంగుచు । బారదలచినాడు
అతికోపంబునసమయంబెరుగక । యరుగజూచినాడు
అచటనున్నయొకవృక్షమూలంబు । నట్టెబట్టినాడు
వృక్షమునువిరికిసింహబలునిపై । వేయసాగినాడు
సభలోనుండినకంకుబట్లుగని । చయ్యనజనినాడు
భీముడెరుగునటులొరులెరుగనియటు । వేగబల్కినాడు
పెద్దపెద్దకొమ్మలతోబెరగిన । వృక్షంబన్నాడు
చలువనీడనదిజనులకుసౌఖ్యము । నలిపెడిదన్నాడు
సమయమెరుంగకదీనినిద్రుంచిన । శ్రమయగునన్నాడు
వలలాయిపుడేద్రుంచినవంటకు । పనిబడదన్నాడు
కాలమెరిగిద్రుంచినచోనీకను । కూలంబన్నాడు
అభీముడువినివృక్షముబెరుకక । యపుడువెడలినాడు
అంతటమాలినిదుఃఖించుచుసభ । కపుడువెడలెనయ్యా
సభలోగల్గినవిరటునిగనుగొని । సతియిటులనెనయ్యా
ద్రౌ॥-ధర్మాధర్మవిచారణదెలసియు । ధరణినేలితయ్యా
శిష్టరక్షణముదుష్టశిక్షము । సేయువాడవయ్యా

గంధర్వులునాపతులైదుగురిటు । గాంచుచుండిరయ్యా
తమసతియాపదనొంపగజూచిన । ధర్మముగాదయ్యా
మత్స్యదేశమునుపాలించుచు । దుర్మార్గునిగనవయ్యా
యీదుష్టుడుననుబలిమినిబొందగ । యిటులవచ్చెనయ్యా
స్త్రీలుదుఃఖించురాజ్యముకుశల । స్థితినిబొందదయ్యా
వైశం॥-అనుచుబల్కగవిరాటుడుగాంచుచు । యపుడుబల్కెనయ్యా
కీచకునిఁగోపించినిలుప । శక్తిలేనివాడయ్యా
శాంతవచనములబుజ్జగించి । కీచకునిబంపెనయ్యా
కాంతనిలచిదుఃఖించుటగనియా । కంకుడనియెనయ్యా
పతులకుసమయముగాకుండుటచే । పలుకకుందురనెను
అంతటసభలోపతులనిందింప । యింతికిదగదనెను
జననాథుడునీబాధలఁదీర్ప । జాలియుండెననెను
పతులదిట్టకుమునాట్యముజూపక । పడతీజనుమనెను
అనగపాంచాలిరోషమొందితా । నప్పుడిట్టులనెను
జూదరినాపతినటుడుగాడతిని । సుదతినినేననెను
నటునిసతిగాకయున్నసతికెట్లు । నాట్యమబ్బునయ్యా
అనుచుపాంచాలిదుఃఖమాపుకొని । యంతవెడలెనయ్యా
సుధేష్ణయెఱుగనిదానివలెదాని । జూచిపలికెనయ్యా

## నెం. 1

సు॥-ధూళిచేతనీమేనంత । తొయ్యలికళదరుగుటవింత
చిన్నబోయినీముఖమిట్లు । చెలువయున్నకారణమెట్లు
నీకుబాధలెవడొనరించె । నెలతదెల్పుమనిప్రశ్నించె
వైశం॥-అనద్రొపదియాలోచించె । అవృత్తంబిటువినువినుపించె
ద్రౌ॥-నీయాజ్ఞనుబొందితినమ్మా । నీతమ్మునిజేరితినమ్మా
మద్యంబడిగితినోయమ్మా । మదముననముగాంచినదమ్మా
ననువెతలంబెట్టినదమ్మా । ఘనదుఃఖమునొందితినమ్మా
పరువిడిసభకేగితినమ్మా । ప్రభువునకదిజెప్పితినమ్మా
వెంట్రుకలఁబట్టినదమ్మా । వేగమెననుదన్నినదమ్మా
వైశం॥-అనుచుజెప్పనెరిగినదొాట । జనపతిసతియనెనొకమాట

సు॥-నాతమ్ముని వండించెదను । న్యాయముగాదనిచెప్పెదను
వైశం॥-శోకముడగదనివచియించె । సుదతికృష్ణయిటువిన్పించె
ద్రౌ॥-యేలశిక్ష జేసెదవమ్మా । చాలుమౌనమూనగదమ్మా
నాపతులేవురుగలరమ్మా । నాపగదీర్చెదరోయమ్మా
వైశం॥-అనసుధేష్ణమదిచింతించె । అతనిమృత్యువిదియనియెంచె
వేవిధములదెల్పినగాని । వెలదిచింతనేమదిబూని
అన్నపానములవర్జించె । అర్ధరాత్రమగుటనుగాంచె
ధౌతవస్త్రమునుధరియించె । తరుణిభీముకడకరుదెంచె
నిద్రనున్నపతినిస్పృశించె । నెలతదుఃఖమునవచియించె
ద్రౌ॥-కీచకుండుననుగొననెంచె । క్రూరబుద్ధితోనరుదెంచె
గనుచుయూరకుంటివినీవు । కాంతదుఃఖమునుగన్నావు
సుఖనిద్రనుజెందితలపవు । సుదతిశోకమునుగనుగొనవు

## నెం. 5

కురుపతితమ్ముడుమీరుగనుచుండ । కురులుబట్టియీడ్చె
కురుపతిభావమరందియరదమున । గొనిపోవగనెంచె
కురులబట్టెకీచకుడునేడుసభకు । వెంటనరుదెంచె
అకటానాథులుగననిసతిబ్రతుకు । వ్యర్థంబనిపించె
వైశం॥-అనుచుదుఃఖించుసతిగనిభీముం । డపుడిటువిన్పించె
భీము॥-సింహబలుడునినుపరిభవించుటక । సంతయెగాన్పించె
బహుకోపంబునవెడలధర్మజుడు । వలదనివారించె
వానినపుడుహింసింపగాసమయ । భంగమనుచునెంచె
వైశం॥-నన్నునిందింపలాభమేమనుచు । నాతికివచియించె
వినిసతియనెనుసుధేష్ణనుగాంచిన । భీతిసంభవించె
ద్రౌ॥-కుంతినిమిముగనినప్పుడుగల్గని । యంతమదిజనించె
ధర్మసంభవునినిందించితికాం । తమునుమదిద్యజించె
రాజసూయయాగంబొనరించిన । రాజిటుసేవించె
అజాతశత్రుండీనాటికి । సన్యాసముగడుతించె
సత్యనిరతుండువిరటునింట । దాస్యంబుసేయనెంచె
బాహుబలశాలివైననిన్నిచట । వంటయందునుంచె

అమరేంద్రునియర్ధాసనంబెక్కి । యలరుచుండువాడు
అట్టివాడిచటఁబూటనేర్పింప । యధికుండైనాడు
అక్షయబలుడగునకులుడిటయశ్వ । శిక్షకుడైనాడు
బాలుడైనసహదేవుండిట । గోపాలుండైనాడు
యిట్టిమిముగాంచిదుఃఖించెదనా । యిడుములవినరాద
పంచపాండవులపత్నినైశోక । వార్ధిఁబడితిగాద
అందరికన్ననునీవుగాతువని । యాశనొందలేద
నిరుపమానబలశాలివిటుజూడ । నీకిదిమర్యాద
వైశం॥-అనవినిభీముండతికోపంబున । యపుడుబల్కెనయ్యా
సమయభంగమగునంచుమౌనమును । సల్పితినననెనయ్యా
భీము॥-అతనిజంపుటకుభీతిలినేనిటు । లాగలేదుకొమ్మా
రేపువానిరూపుమాపదలచితి । రిత్తగాదుసుమ్మా
వైశం॥-మరలకీచకుడుగోరినచో । సమ్మతినిజూపుమనెను
అర్ధరాత్రమువనర్తనశాలకు । యతనినిరమ్మనెను
ఒక్కడవచటికివచ్చినసౌఖ్యము । నిక్కంబగుననెను
అతనికిట్లులనితోడ్తెచ్చినచో । హతముజేతుననెను
అదిగోతెలవారెపొమ్మనిభీముం । డచటనిద్రగొనెను
అంతదెలవారెకీచకుండుదన । యక్కనుగనవచ్చె
సైరంధ్రినిగనుదలపుచేతమది । సంతసంబుహెచ్చె
మెలమెల్లనకామాంధుండంతట । లలనగాంచినాడు
ఆపెనుజేరుచుకోపమేటికే । యతివాయన్నాడు
కోర్కెదీర్చినన్నేలుకొమ్మనుచు । కులికిపలికినాడు
అంతసైరంధ్రితనవలలోబడి । నటులదెలిపెనయ్యా
ద్రౌ॥-పతులుగాంతురనియొప్పకుంటిత్వర । పడుటగూడదయ్యా
నాసుఖమొందగదలచితేనితగు । నర్తనగృహమయ్యా
అర్ధరాత్రమునయొకడవరుదెంచి । యచటజేరుమయ్యా
అన్యులెవరుగనకుండరావలయు । నందునిలతునయ్యా
వైశం॥-అనుచుసైరంధ్రిబలుకకీచకుడు । యౌననియన్నాడు
స్వర్గసౌఖ్యంబునొందువానివలె । సంతసపడినాడు
సింహబలుడేగభీమునిగనియా । చెలువయిట్లులనెను
నాపనిజేసితినీపనిగలదీ । నాడుదీర్పుమనెను

సమయభంగంబుగాకుండగయిది । సలుపవలయుననెను
వినికనలుచుభీముండుద్రౌపదిని । వినుమనియన్నాడు
భీము॥ఆవనికంపింపదివమల్లాడగ । యతనిగొందుజూడు
సైరం॥-మహాబలంబునవానిబట్టిబరి । మార్చెదనన్నాడు
చింతింపకుమొందులెండిగెదరని । వంచించెదనన్నాడు
అరుగుమానీడుపనులుజేయుమని । యతివనంపినాడు
అంతకీచకుడుమదనబాణముల । నార్తిజెందినాడు
ముదితపైప్రేమచేధైర్యమువిడి । మదినిదల్చినాడు
తపనుడీనాడుమందగతిచేత । తరలుచున్నాడు
అర్ధరాత్రమెపుడౌనునేనెప్పు । డరిగెదనన్నాడు
మాలినినర్తనశాలకురానను । మానంబన్నాడు
డానిపతులచటికేతెంచినచో । తగవగునన్నాడు
యేమిగానితనుబోనియచటికి । యేగెదనన్నాడు
ఆపగలిట్టులగడపగాసూర్యు । డస్తమించినాడు

## నెం. 1

మాలినిపతిచెంతకుజనెను । కాలంబేతెంచినదనెను
భీముడువినిసంతసపడెను । భీతిలేదువచ్చెదననెను
పెండ్లికిజనురీతిగనడచె । వెనుకసతినిరమ్మనిబిలచె
యెల్లరునిద్రించుటగనిరి । యిరువురాగృహమునకుజనిరి
అందొక్కతలమునబరుండె । అతివదూరమందుబరుండె
అంతకీచకుడుజననెంచె । అర్ధరాత్రమగుటనుగాంచె
ధౌతవస్త్రముమధరియించె । తగుశృంగారముసేయించె
సింహముగుహకేగెడుగజము । చెలువముదోచెనుసత్వరము
సింహబలుండటకేతెంచి । చీకటిమందిరమునుగాంచి
సంశయంబునొందకజనెను । సైరంధ్రినివెదుకసాగెను
జనిచనియొకశయ్యగాంచెను । సంతసమునజేయిసాచెను

## నెం. ౫

వచ్చినాడుకీచకుడనిదెలియుచు । పవనజుండుబండె
కరముసోకగాక్రోధమొందియును । కదలికలేకుండె

కీచకుండుమోహాయత్తుండై । కేలనిమిరియుండె
యాకీచకుడంగనలిడులంచము । లెన్నొబొందుచుండె
యింతినింగోరియతడేలంచము । లిపుడుదెచ్చియుండె
అనుచు[బియంబులనాడుకీచకున । కనిలజుడనుచుండె
ననుముట్టుచునింకొక్క సతిసుఖము । గనవనియనుచుండె
అనుచుతటాలునలేచివానిశిర । మట్టెబట్టియుండె
గంధర్వుండనికీచకుడాతని । కనలిబట్టియుండె
అవనిపైనబడవైచిగట్టిగా । నతనిబొడచెనయ్యా
అంతభీముడంతకాకృతిఙగొని । యతనిబట్టెనయ్యా
అతికోపంబునమరలకీచకుం । డవనిగూల్చెనయ్యా
లేచిభీముడతికోపమొందియవ । లీలబట్టెనయ్యా
నేలబడవైచివ[జముష్టిచే । చాలగొట్టెనయ్యా
అతిబలశాలులుయిరువురుయుద్ధం । బపుడుజేసిరయ్యా
అవనీశుండొకదాసినిబొందగ । యనియొనర్చెనయ్యా
జనులునగుదురనికీచకుడిటు । నిశ్శబ్దమూనెనయ్యా
పవనజుడజ్ఞాతభంగమౌనని । పలుకకుండెనయ్యా
ఒరులెరుగుదురనియిరువురుసమరము । నెరపుచుండిరయ్యా
భీమునిదెబ్బకుకీచకుడద్భుత । వేదనగొనెనయ్యా
కీచకునిదెబ్బనాభీముడు । లెక్కించకుండెనయ్యా
కీచకునిబలంబంతకంతకును । క్షీణమాయెనయ్యా
హరునివేడగాపవనజునిబలం । బధికమాయెనయ్యా
హరిధర్మంబుననడచువారికి । సహాయమిచ్చునయ్యా
సమబలులిరువురియందుభీమునకు । సాయమాయెనయ్యా
ధర్మమేజయంబందుననువల్కు । తథ్యమాయెనయ్యా
అత్యుగ్రుండైభీముడుకీచకు । నపుడుబట్టెనయ్యా
అవనిపైజరచిముష్టిఘాతచే । నతనిజంపెనయ్యా
చలముననాతనియవయవములుచే । నలిపివేసెనయ్యా
అగ్నివెలిగించివానినిద్రౌపది । కపుడుజూపెనయ్యా
గనియనె[ద్రౌపదివరసతిగోరిన । గర్వఫలంబయ్యా
దుష్టబుద్ధిననుగోరిభార్యలకు । దూరమైతివయ్యా

సింహబలునినిందించితనపతికి । చెలువబల్కెనయ్యా
నాయాపదదీర్చిగాచితివిధన్య । నైతిననియెనయ్యా
యింతినిగనిసంతసించివాయుజు । డేగెనువినుమయ్యా

—: ఫ ల శ్రు తి :—

## నెం. 1

భారతవీరులచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుదీని । విరచించెనుభక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడుయీసత్కృతిని
సదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని



# విరాటపర్వము

## (రెండవాశ్వాసాంతము)

## నెం. 1

ద్విశం॥-మారుతితనభవనముజేరె । మజ్జనమొనరింపగగోరె
మంచినీటస్నానముజేసి । మగువకష్టమునుదలపోసి
తనశయ్యనుజేరుచునుండె । తరుణినిదలచుచునుబరుండె
అసతిభవనంబునువిడచె । అచటగాచువారలబిలచె
కీచకుండురణమొనరించె । నీచబుద్ధినవలంబించె
గంధర్వులతోనెదురించె । కడకువారితోమరణించె
నూటయేవురుపకీచకులు । మాటవినుచువచ్చిరిఖలులు
అన్ననుగనియేడ్చెడువారు । అన్నపైనబడియెడువారు
అవనిఁబడియేడ్చెడువారు । ఆశ్చర్యమునొందెడివారు
అందుకొందరిటులనుడివిరి । యిందరమిటనుండితిమనిరి
మనుజులకార్యముగాదనిరి । ఘనగంధర్వులకృతమనిరి
అవయవంబులగుపడవింత । అతకముద్దయగుటయెవింత
అనుచుశవమునంతటగొనిరి । అనుజులెల్లవెంబడిజనిరి
వీరలపనిగనుగొననెంచె । వెలదినిలచియయ్యదిగాంచె
అంతవారుద్రౌపదిగనిరి । అతికోపముతోడబట్టిరి
దీనిపైనమోహముగొనెను । దీనికొరకుమదిచింతిలెను
దీనికారణమునజచ్చెను । దీనిపతులవలనగలిగెను
అన్నతోడగట్టుదమనిరి । అగ్నియందుబెట్టుదమనిరి
రాజాజ్ఞనుబొందుదమనిరి । రాజుచెంతకంతటుజనిరి
సత్వరమావిరటునిగనిరి । సైరంధ్రినిగొనియెదమనిరి
అన్నతోడగాల్చెదమనిరి । అజ్ఞనుగొనవచ్చితిమనిరి
అనవినివిరటుడుయోచించి । అనేకవిధములదుఃఖించి

ఆపశక్తి లేదనియెంచె । అదిమీయిష్టమనివచించె
అంతవారుసంతసపడిరి । ఆజ్ఞనిచ్చెననుచుమరలిరి

# నెం. 5

మోహితుడగుమాయన్నమోహమును । బోగొట్టెదమనిరి
దానినాశవముపైనగట్టుకొని । త్వరలోగొనిచనిరి
కరదీపికలంగైకొనికాటికి । కడువడిజనిరయ్యా
అశుచిశవంబునశుచియగుదానిని । యకటగట్టిరయ్యా
అంతటద్రౌపదియతిభయమొందుచు । యప్పుడేడ్చెనయ్యా
ప్రాణేశులారగంధర్వులార । పాలింపుండనెను
యీదుష్టులునన్నన్నశవముపై । యిపుడుగట్టిరనెను
దహనమొనరింపకాటికివేగమె । దరలుచుండిరనెను
క్షణమాత్రంబాలస్యముజేసిన । గానరునన్ననెను
యేపురిలోమీరొకరేతెంచిన । యిచటజాలుననెను
ధర్మరాజధర్మరక్షకాయని । తన్విబిలచెనియ్యా
రణభీమాకృష్ణారమ్మనియా । రమణిబిలచెనయ్యా
శతృవిజయుడాశ్రీకృష్ణాయని । సాధ్విబలికెనయ్యా
అతిదీనకులావనకృష్ణాయని । యతివయేడ్చెనయ్యా
రిపుదుస్సహదేవాకృష్ణాయని । కృష్ణబిలిచెనయ్యా
అన్యులెరుగనటుపతులనివ్విధం । బాపెబిలచెనయ్యా
తల్పమందుశయనించిభీముడా । ధ్వనివినిజనెనయ్యా
ప్రళయకాలరుద్రుండైకాటికి । బారజొచ్చెనయ్యా
అన్యమార్గమునఅతిశీఘ్రంబున । యచటజేరెనయ్యా
అతిభయంకరమ్మగువృక్షంబును । యతడుబెరికెనయ్యా
భుజముపైనయాతరువునుదాల్చుచు । పొంగినిలిచెనయ్యా
కటికచీకటినపెనుభూతమువలె । గానుపించెనయ్యా
శవమునుమోయుచువారలెల్లరా । స్థలముజేరిరయ్యా
కరదీపికలంగగ్గెడువెగ్లున । గాంచివెరచిరయ్యా
అదిగోగంధర్వుడేతెంచినదని । యపుడుబల్కిరయ్యా
దూరమందుశవముదింపివారలు । బారసాగిరయ్యా

భీమసేనుడవ్వారినిగనుగొని । వేగబారెనయ్యా
వృక్షాయుధమునకొందరిశిరములు । విరుగవేసెనయ్యా
కొందరియెముకలుచూర్ణంబగునటు । కొట్టిచంపెనయ్యా
అతిచిత్రంబుగనూటయేవురను । హతముజేసెనయ్యా
తరువునొకచోటబారవైచితన । తన్వినిగనెనయ్యా
కట్టినతాళ్ళనువిప్పివేగమె । కదలిపోయెనయ్యా
జనమేజయరాజాధర్మమునకు । జయముగల్గునయ్యా
అధర్మపరులకునాశముగల్గును । హరికృత్యంబయ్యా
యెవరికగుపడకయేమిదెలియనటు । యిల్లుజేరెనయ్యా
భీమసేనుండువెడలినఘడియకు । వెలదివెడలెనయ్యా
అంతదెలవారెయచటినదిలోన । యాపెమునిగెనయ్యా
ధౌతవస్త్రయైనగరవీధిలో । త్వరగనడచెనయ్యా
సకలకీచకులుగంధర్వులచే । జచ్చుటవినిరయ్యా
సైరంధ్రియెమూలంబుదీనికని । జనగణమనెనయ్యా
వీధినుండిసైరంధ్రిబోవగని । భీతిలిజనువారు
మారిగ్రహమాకీచకులకంచు । పారిపోవువారు
జూచిభీతిచేమరియొకమూల । జొచ్చుచుండువారు
కనకుడుదానివెంటబడునంచు । కనులుమూయువారు
యింకయేమిపుట్టించునోయంచు । శంకించెడువారు
పులినిగన్నతేళ్ళవిధముబారెడి । పౌరులగనెనయ్యా
ముసిముసినగవులనగుచువేగనా । ముగుదవెడలెనయ్యా
వంటయింటిద్వారంబునభీముడు । పడతినిగనెనయ్యా
గంధర్వుడుకీచకులజంపినను । గాచెననియెనయ్యా
కరుణాయుతునకునమస్కారమని । కదలుచుండెనయ్యా
పాలతినిగాచుటపతిధర్మంబ । ద్భుతమేమనెనయ్యా
అనగపాంచాలినర్తనశాలకు । యపుడుబోయెనయ్యా
విరటుడుకీచకమరణమువినిదన । వెలదిదనియెనయ్యా
తన్విసైరంధ్రియీపురినుండిన । తప్పగుననెనయ్యా
చక్రదనంబామాలినికుండుట । సహజంబనెనయ్యా
సతినిగావగాపతులెదిరించుడు । సహజంబనెనయ్యా
పడతినీనాడెయెచ్చటికైనం । బంపుమనియెనయ్యా

# నెం. 1

అచటకృష్ణపాథుఁ డిగనెను । అర్జునుండుగనియిట్లనెను
అర్జు॥-దుష్టులనినుగలచుటవింటి । తోయజాక్షిపతివెన్నంటి
వారలజంపినడనివింటి । బహుముదమునమునగగగంటి
శాపముచేనేనిట్లుంటి । సాకజాలకయెయూర్కొంటి
హరిదయగల్గుటగఁగొంటి । అలయమునకికబొమ్మంటి
వినియనెనిన్నెరుగుచునుంటి । వేశ్యశాపమునుగనుగొంటి
హరిదయచేనేనిట్లుంటి । అదిదెల్పితిపోయెదనంటి
వైశం॥-అనిమాలినిభవనముఁజనెను । అవిరటునివనితనుగనెను
మునుపటివలెయచటనుండెను । జనపతిసతియపుడిట్లనెను
సు॥-నానాథుడుజెప్పెనుగాన । నాతివెడలుమెచ్చటికైన
చక్కనిసతివౌదువుచాన । గ్రుక్కునపురుషుడుగనబూన
పతులుజంపివైతురుగాన । పడతిజనవలయుబిరాన
వైశం॥-అనమాలినిమదిచింతించె । ఆపెపల్కులకుయోచించె
అంతకరములనుజోడించె । అసుధేష్ణకిటువివరించె
ద్రౌ॥-కొలదిదినములేశేషించె । కోమలివ్రతమంతముగాంచె
నానాథులుబలయుతులమ్మా । నరపతిసతివెరుగుదువమ్మా
నీనాథునిగాచెదరమ్మా । నిన్నుచాలమెచ్చినరమ్మా
ఉపకారముమరువరుకొమ్మా । యిపుడెశుభములిచ్చెదరమ్మా
మూడుపదియుదినములకమ్మా । పూర్తియగునువ్రతమోయమా
వైశం॥-అనగమంచిదనెనాయమ్మా । అతివయుండెనందేసుమ్మా
దుర్యోధనుడజ్ఞాతంబు । తెలగజేసెనుద్యోగంబు
గూఢచారులనుబంపించె । కౌంతేయులనెవ్వడుగాంచె
గాంచినవార్తనువినుపించె । ఘనునకుసంపదలిడనెంచె
మరలికరిపురమునకుఁజనిరి । కురునాథునకిటులబలికిరి
గూ॥-మీయాజ్ఞనుబొందితిమయ్యా । మేమంతటదిరిగితిమయ్యా
వారిరథములేగుటగాంచి । ద్వారకాపురమ్మేతెంచి
అచటకొంతకాలంబుండి । అపాండవులనుగనుచుండి
వారిజాడతెలుగకమేము । వనభూములగనుగొనినాము
గిరిగుహలనువెదకితిమయ్యా । అరణ్యములజూచితిమయ్యా

వారివార్తదెలియగలేదు । వారలుబ్రతికినరనరాదు
మత్స్యదేశమునబలియుడు । మహాశూరుడాకీచకుడు
చక్కనిసతిగోరినడంట । సతిబాధనుదెలసినరంట
గంధర్వులుయ్యైదుగురంట । కటికచీకటినజనిరంట
అకీచకుడెదిరినడంట । హతమొనర్చివెడలినరంట
వైశం॥-అనవినివారలబొమ్మనెను । అదుర్యోధనుడిటులనెను
దుర్యో॥అరణ్యవాసంబొనరంచి । అజ్ఞాతంబునుద్దాటించి
అర్ధరాజ్యమునుగొనసెంచి । అపాండవులిటకరుదెంచి
యిపుడుమనముబహుకష్టించి । యేగివారలనుగుర్తించి
అజ్ఞాతమునికవేధించి । అదిపణముమరియెరగించి
వనవాసంబునకంపించి । వసుధాఖండముపాలించి
వైశం॥-యిదినామదియుండినదనెను । యికమీమతమనుదనియెను
అనదుశ్శాసనుడిటులనెను । హతమైరాపాండవులనెను
ద్రోణుడువినియివ్విధమనెను । దుస్తరమదిజరుగుటయనెను
ద్రో॥-అతిబలంబుగల్గినవారు । హరికారుణ్యముగలవారు
సత్యనిరతిగల్గినవారు । జయముగొందురుచావరువారు
వైశం॥-అనభీష్ముడుతలపంకించె । అదినిశ్చయమనివచియించె
భీష్మ॥పాండుసుతులనెరిగెడివిధము । బలుకుదువారుండినస్థలము
సస్యంబులుబాగఫలించు । సకలజనముసౌఖ్యముగాంచు
గోగణంబువృద్ధినిగాంచు । గొప్పకాటుకములునశించు
వైశం॥-అనసుశర్మయాలోచించె । అందరువిననిటువివరించె
సు॥-మత్స్యదేశమిటులనిపించె । మనమేగినతగుననిపించె

## నెం. 5

వైశం॥-అనవినికురుపతియుతిసంతసమున । యపుడుబల్కినాడు
పాండుసుతులుమత్స్యదేశమున । వరలెదరన్నాడు
శల్యకీచకులురాముడుభీముడు । సమబలులన్నాడు
శల్యరాములతిదూరవాసులిది । జరుగనిదన్నాడు
బవరమందుకీచకులజంపెనట । పవనజుడన్నాడు
వనితపాంచాలిపాండవులచ్చట । వసించిరన్నాడు

విరటునిగోధనములబట్టుటకై । వెడలెదమన్నాడు
అనసుశర్మవినిబలములతోనే । నరిగెదనన్నాడు
తొల్లికీచకునికోడితిమదినది । తొలగనిదన్నాడు
గనుకపూర్వవైరముచేవిరటుని । గలచెదనన్నాడు
పాండవులచ్చటనున్నచోననికి । వచ్చెదరన్నాడు
ఆపల్కులువినికురుపతిముదమున । యపుడుబల్కినాడు
బలియుడవేగియుబహుళాష్టమి । గోవులగొనుమన్నాడు
మరునాడేమతిబలముతోయట । కరిగెదమన్నాడు
ఒకవైపుననీవొకవైపునమే । ముండెదమన్నాడు
పాండవులుండినబయల్పడెదరిది । బాగుగునన్నాడు
పాండుసుతులులేకున్నవిరాటుని । బట్టెదమన్నాడు
మత్స్యదేశంబుగొనుటకిదియొక్క । మార్గంబన్నాడు
రెండువిధంబులలాభమగుననుచు । రేడుబల్కినాడు
భళిభళియనగసుశర్మవేగముగ । బయనంబైనాడు
సకలసైన్యములగైకొనియచటికి । చయ్యనజనినాడు
విరటునిగోవులజాడలనాదెలసి । వేగబట్టినాడు
గోపాలకులనుపటుశరములచే । గొట్టినిలచినాడు
పీడనొందిగోపకులుభూపతికి । విన్నవించినారు
అనేకబలములతోడత్రిగర్తులు । యావులగొనినారు
వలదనియెదిరినకఠినశరంబుల । బాధసల్పినారు
ఆవులువారలపురికేగినచో । యాపదయన్నారు
విరటుడువినివెడలుడనిక్రోధంబు । వేగబల్కినాడు
యెన్నడెరుంగడుత్రిగర్తేశుడిటు । తెలజేసినాడు
గనిసచివులకిట్లనెసుశర్మఘన । గర్వమొందినాడు
చతురంగబలంబులతోజనుడీ । సత్వరమన్నాడు
ఆలసింపగావిషమగునిపుడే । యరిగెదమన్నాడు
అనుచుదనరథమునారోహించుచు । యంతవెడలినాడు
విరటునితమ్ముడుశతానీకుడతి । వీరుడుజనినాడు
అతనితమ్ముడుమదిరాశ్వుడువిని । యనికివెడలినాడు
అతనిసోదరుడుసూర్యదత్తుడను । యధికుడుజనినాడు

విరటుని పెద్దకుమారుడుశంఖుడు । వేగవెడలినాడు
అనేకవీరులనంపుచువిరటుడు । యచటనిలచినాడు
వెనుకబడువారినంపుటకొరకై । వెడలకుండినాడు
ధర్మతనయుండువిరటునిగనుగొని । త్వరగబల్కినాడు
అస్త్రవిద్యనభ్యసించియుంటిని । అడిగనుమన్నాడు
నాకొకరథమిడినన్నుబంపుము । రణంబునకన్నాడు
వలలుడుశూరుడురథికునొనరించి । పంపుదమన్నాడు
దామగ్రంధియువీరుడనుప । సంగ్రామముకన్నాడు
తంత్రీపాలుడురణపండితుడా । తనిగొనుమన్నాడు
అనగముదమందివిరటుడురథముల । నందరికిడినాడు
అడిగినశస్త్రాస్త్రములనిడివారల । త్వరగబంపినాడు
విరటునిసేనలుత్రిగర్తసేనలు । వేగదాకెనయ్యా
ఉభయసైన్యములుబహుకోపంబున । యుబ్బిపోరిరయ్యా
రక్తపుటేరులువేలకొలది । బారంగజొచ్చెనయ్యా

## నెం. 2

అంతమదిరాశ్వుడేగెను । అరిబలంబులనుదాకెను
దునిమెనన్నూరురథములను । దురమునజూపెబలములను
సూర్యదత్తుండుదాకెను । శూరులదుంచివైచెను
అంతశంఖుండుగాంచెను । అరులబలములదుంచెను
విరటుడంతలోవెడలెను । వైరిబలములదాకెను
పంచశతరథములగూల్చె । బలములజంపగానిల్చె
అనుశర్ముండుగాంచెను । అతనితమ్ముండుజూచెను
తమబలంబులగాంచిరి । దైన్యమొందుటనుదెలసిరి
కనలియరిసేనజొచ్చిరి । ఖండఖండలుగజేసిరి
విరటుడంతలోగాంచెను । వేగవారలనుదాకెను
పడినుశర్ముండుదాకెను । బాణవర్షంబుగురిపెను

## నెం. 5

విరటుడుసుశర్మపక్షమునకుపది । శరములనిడినాడు
పదిబాణంబులచేతగుర్రముల । బరగజంపినాడు

అదిగనిసుశర్మయేబదిశరముల । నతనిగొట్టినాడు
యిరువురుజయమునుగోరిరణంబును । యిటులజేసినారు
తమమేనులరక్తంబుగారగా । త్వరగబోరినారు
అంతసూర్యుడస్తాద్రిజేరరణ । మపుడునిలిపినారు
చంద్రోదయమైనంతరణంబును । సల్పదొడగినారు
విరటుడుతనతోబోరసుశర్ముడు । వేగజూచినాడు
శూరులతోనొకపెట్టునయాతని । చుట్టుముట్టినాడు
మత్స్యేశునిసారథినిహయంబుల । మ్రందజేసినాడు
అన్యాయంబనిదలపకవిరటుని । యపుడుబట్టినాడు
తనరథమందునగట్టిదుందుభులు । ధ్వనులుజేసినాడు
యెల్లతనసేనలనుమరల్చిపురి । కేగదలచినాడు
అతనివిడిపింపలేకవిరటుబల । మపుడుబారెనయ్యా
ధర్మజుండుభీమసేనుగనుగొని । త్వరగబలికెనయ్యా
ధర్మ॥-యితనిపాలమనముండివైరిగొన । విడిగనతగదయ్యా
వినుడెల్లరమాత్రిగర్తనాథుని । యనిగెల్చెదమయ్యా
త్వరగవిరాటునివిడిపించుటయే । ధర్మంబగునయ్యా
వైశం॥-అనభీముండనెసుశర్మబట్టగ । యుందరేటికయ్యా
భీము॥-తరువునత్రిగర్తనాథునిజంపియు । విరటుదెత్తునయ్యా
ధర్మ॥-అనవినిధర్మజుడనెనీవట్టుల । యాచరింపకయ్యా
పవనజుండనుచుదెలిసినసమయము । భంగంబగునయ్యా
మాద్రీతనయులగొనిసామాన్యపు । మనుజునివగుమయ్యా
వైరులణద్రుంచివిరటువిడిపించి । వేగమెరమ్మయ్యా
వైశం॥-ముగ్గురాజ్ఞగొనియేగుచురథముల । నుగ్గుజేసిరయ్యా
రెండువేలరథములనాభీముడు । పిండిజేసెనయ్యా
యేడునూర్లరథములనానకులుడు । పాడుజేసెనయ్యా
సహదేవుడుమున్నూరురథంబుల । త్వరగగూల్చెనయ్యా
ధర్మజుండొక్కవేయిరథంబుల । త్వరగగూల్చెనయ్యా
అంతసుశర్ముడుకోపమొందిపది । యమ్ములేసెనయ్యా
ఆదిగనిధర్మజుడతనిరథంబును । యపుడుగూల్చెనయ్యా
విరాటుడతిముదమొందిరథముదిగి । వేగవచ్చెనయ్యా

గదకేల౯గొనిసుశర్మనంతట । కనలికొట్టెనయ్యా
సుశర్మగదగొనిభీముండరదము । జొచ్చిపట్టెనయ్యా
అరదమునకుపెడకేల౯గట్టుచు । యగ్రజుగనెనయ్యా
విరటునిగ్గికొనితమబలములలో । వేగజేరెనయ్యా
అంతవిరాటుడుధర్మసంభవున । కపుడుబలికెనయ్యా

## నెం. 1

విరా॥-ప్రాణమానములగాచితివి । బహుమోదంబొనరించితివి
ప్రత్యుపకారముగొనుమయ్యా । ప్రార్థనజేసెదవినుమయ్యా
నారాజ్యమునిచ్చెదనయ్యా । ననురక్షణసేయగదయ్యా
వైశం॥-అనగధర్మరాజదివినెను । అపుడువిరటునకునిట్లనెను
జయభేరినియికమోదించె । చయ్యనపయనముగావించె
ధర్మ॥-పట్టణంబుజేరుదమయ్యా । ప్రత్యుపకారంబిదియయ్యా
వైశం॥-అంతవిరాటుడుయోచించి । అచటభీమసేనునిగాంచి
విరా॥-సమరశూరుడవునీవయ్యా । జయమునుబొందించితివయ్యా
దామగ్రంథియుశూరుండు । తంత్రీపాలుడువీరుండు
మీరునలువురీబలమందు । వైరిఘాతగొనరనియందు
వైశం॥-అనగధర్మజుండిటులనెను । అడిగెపనొకవరమిమ్మనెను
ధర్మ॥-సకలసైన్యములతోవీని । సత్వరంబువిడువయుబాని
వైశం॥-అనిసుశర్మనటువిడిపించె । అతనిపురమునకంపించె
విరటుడుదూతనుబంపించె । పురమునజయమునువినిపించె
ఆరాత్రినియచటనిలచిరి । అయుద్ధంబునుగనుగొనిరి



(తృతీయాశ్వాసాంతము)



## నెం. 5

అంతసూర్యుడుదయించెకురుబలము । లచటజేరెనయ్యా
ద్రోణకర్ణభీష్మాదియుక్తమై । దొమ్మిజెందెనయ్యా
పట్టణంబునకుకొలదిదూరమున । బలమునిల్చెనయ్యా
విరాటుగోధనమాక్రమించుకొని । వెడలదలచెనయ్యా
గోపబాలకులపైనశరంబులు । గ్రుమ్మరించెనయ్యా
కడువేదనలంబొందిపురమునకు । కదలిపోయిరయ్యా
రాజాంతఃపురమందుజేరియువ । రాజునుగనిరయ్యా
గో॥-ధరణీచక్రముకదలగవచ్చెను । కురుబలమోయయ్యా
గోధనములగొనెవలదనశరముల । బాధజేసిరయ్యా
అలసింపగాగోవులుబోవును । యతిదూరంబయ్యా
కురుదేశంబునజేరుకొన్నచో । మరల్పరాదయ్యా
భూపతినిన్నతిశూరుడవంచును । పొగడుచుందునయ్యా
సమయమిదిగానరథముపైనెక్కి । చయ్యనరావయ్యా
శస్త్రాస్త్రంబులుగైకొనుమరువకు । చాలశూరులయ్యా
యెటులబోదువేయెటులగెల్తువో । యేమిజేతువయ్యా
వైశం॥-ఇంతులచెంతవసించుబాలుడివి । యెల్లవిన్నడయ్యా
తగినసారథినిదెండుకురుబలము । తరిమెదనన్నాడు
భీష్మకర్ణద్రోణకృపులనెదురుగ । వెడలెదనన్నాడు
దురముజేతుభీతిల్లకజని । పార్థుఁనివలెనన్నాడు
వినిద్రుపదాత్మజజనినరునకుయీ । విధముదెల్పెనయ్యా
అతడజ్ఞాతముగడచినదనిద్రుప । దాత్మజకనెనయ్యా
ద్రౌ॥-అయ్యాబృహన్నలసారథ్యముసేయ । జాలుననియనుము
ఘనుడగుపాండవమధ్యమురథమును । గడపినవాడనుము
వినియొప్పినచోనవ్వుచటికిరా । వించుముజనుమనెను
వైశం॥-అంతటద్రౌపదిజనిసుధేష్ణగని । యమ్మావినుమనెను

బృహన్నలనుసారథ్యము సేయగ । వేగబంపుమనెను
బలముగలవాడుతంత్రవేదినిఁ । బంపవలయుననెను
ఉత్తరుండాతడేగికౌరవుల । యుక్కడంతురనెను
అనవినినవ్వుచుయుత్తరుడనెసా । ధ్యంబెటులౌననెను
వచ్చినవారలుభీష్మద్రోణులు । ప్రళయాంతకులనెను
తగినవాడవారలకుబోదునుత్త । రుండనేననెను
నపుంసకునిగొనియనికిజననములు । నవ్వుచుందురనెను
అనవినిద్రౌపదిబల్కె బృహన్నల । యతిశూరుండనెను
కురుసైన్యములననేలత్రిజగముల । సరకుసేయడనెను
వినియుత్తరుడనెయట్టులైనచో । బిల్వవెడలుమనెను
యుత్తరవినినేజనెదననినదుని । యున్కికంతజనెను
తొల్లిమాయన్నసారథిరణమున । ద్రోళ్ళియుండెననెను
వినుముభీష్మాదికురువీరులతో । రణముగల్గెననెను
తగినసూతుండులేడనమాలిని । త్వరగదెల్పెననెను
అన్ననిన్నుదోడ్కొనిరమ్మనె । నీవచటినిరమ్మనెను
అనగబృహన్నలజనియువరాజును । యప్పుడుగఁగొనెను
బృహన్నలనుగనుగొనియుత్తరుడతి । ప్రియముగననెనయ్యా

ఉత్త॥-నరునికిసారథివైతివనుచుయా । నాతిజెప్పెనయ్యా
బలిమిగకౌరవులుమాగోవులను । బట్టిరనుచువింటి
రణమొనర్పగాబోవదలచిసార । థినివెదకుచుంటి
శూరత్వముభీష్మాదులకునేడు । జూపదలచుకొంటి
కౌరవబలమునభీతిల్లకుని । న్గావగనేనుంటి
వేగమునరథముసిద్ధమొనర్పుము । వెడలదలచుకొంటి
అనగబృహన్నలరథమునుదెచ్చిన । యపుడువెడలెనమ్మా
కౌరవులతలలపాగలుదెమ్మని । కన్యజెప్పెనయ్యా
విజయసారథియొగాచుననితల్లి । వేగబల్కెనయ్యా
విజయుడశ్వములముట్టగారథము । వేగబోయెనయ్యా
శ్మశానభూమికిరథముజేరకురు । సైన్యముగనెనయ్యా
ఉత్తరుడాకురుసైన్యధ్వనివిని । తత్తరపడెనయ్యా
అధికభయంబునబృహన్నలనుగని । యపుడుబల్కెనయ్యా

# నెం. 1

ఉత్త॥-బృహన్నలాఅదివినుమయ్యా । భీతిగొంటిననుగనుమయ్యా
ద్రోణభీష్ములనియెడువారు । దురమునవెనుదియ్యనివారు
దుర్యోధనదుశ్శాసనులు । ధైర్యవంతులతిబలయుతులు
కర్ణాశ్వత్థామలుఘనులు । కదనపండితులుదుర్మతులు
వీరుదీనిగాచెదరయ్యా । వేలకొలదిగన్పడునయ్యా
నాకుసేనసుంతయులేదు । నాకువేరెరక్షణలేదు
నామదిలోధైర్యములేదు । నాకుజయంబౌననరాదు
శరీరంబువడకగజొచ్చె । చాలభీతిమదిలోహెచ్చె
రథముమరల్పుమువలదయ్యా । రణమునుజేయగలేనయ్యా
ప్రాణంబులుతీపగునయ్యా । బాలుడభీతిల్లితినయ్యా

వైశం॥-నరపతిసుతుపల్కులువినెను । నవ్వెబృహన్నలయిటులనెను

అర్జు॥-తుచ్ఛసేనగాంచితివయ్యా । తొందరమదిజెందితివయ్యా
అతివలుగనబల్కగలేద । అనిజేసెదనంటివిగాద
భీష్మాదులగణగొనరాద । భీతివిడచినిల్వగరాద
మహారాజసుతుడవుగాద । మరల్పుమననిదిమర్యాద
ఐవరంబొసెయగవలయు । పగవారినిగెల్వగవలయు
పశువులగైకొనిపోవలయు । ప్రాణమైనవీడగవలయు

వైశం॥-అనగయుత్తరుండిటులనెను । ఆవులదైవముగనుననెను

ఉత్త॥-అతివలుమెచ్చుటకైనేను । అధికులనిటగెల్వగబోను
పశువులజోలికినేరాను । ప్రాణంబులువీడగలేను
వీరులెల్లయచటికిజనిరి । వివిధసేనలనువెనుగొనిరి
ఒంటివాడసేనలులేవు । ఓర్వుమనుచుబలికెదవీవు
సారథివైనిలబడినావు । సంగ్రామముసేయగలేవు
నేనురణముజేసెదనయ్యా । పూనివన్నుజంపెదరయ్యా
నగరమునకునీవేగెదవు । జగడముసంగతిజెప్పెదవు

వైశం॥-అనుచుకంపమొందుచునుండె । అన్నిదిక్కులనుగనుచుండె
ధనుర్బాణములనందుంచె । త్వరగబోవురథమునుగాంచె
వేగదుమికిబారసాగెను । విజయునిచేయరదమాగెను

# నెం. 5

రథమునిలిపినరుడు వెంటపరుగిడి । రాజసుతునిబట్టె
అంతకౌరవులకితనిగనుగొనగ । యనుమానముబుట్టె
కొలదిదూరమునకనుగొనివారలు । బలుకసాగినారు
నరునివేసంబునాతిచందమని । నవ్వసాగినాడు
బాహువులకాంతినడకజూడగా । పార్థుఁడనిరయ్యా
మత్స్యదేశమునమారువేసమున । మసలవచ్చునయ్యా
నరుడుగాకకురుసేనకొంటిగా । పరుండురాడయ్యా
విరటుడుదక్షిణగోగ్రహణమునకు । వెడలియుండునయ్యా
సకలసైన్యమటువెడలెనుపురమున । యొకండులేడయ్యా
ఉత్తరునిఁగొనిమనలగెలుపయిట । కొచ్చియుండునయ్యా
ఉత్తరుండుమనసేనగనిబార । యురికిపట్టెనయ్యా
అనుమానంబునతమలోతామిటు । లనుచుజూచిరయ్యా
అంతపార్థుఁడుత్తరునిబట్టగా । యతడుబల్కినాడు
ఉత్త॥-బృహన్నలాననువిడువుమువేడెద । భీతిలితన్నాడు
యింటికిదోడ్కొనిపొమ్ముబంగార । మిచ్చెదనన్నాడు
అష్టవైడూర్యములనొసగెదరణ । మతిభయమన్నాడు
మంచిగుఱ్రములరథమిడుదునువిడు । మాయనియన్నాడు
పదియేన్గులనొసగెదనుననువిడువు । పట్టకుమన్నాడు
యూరొకటిచ్చెదపురముజేరదయ । గోరెదనన్నాడు
అమ్మనుజూడగబుద్ధిగల్గెనే । నరిగెదనన్నాడు
అనేకవిధములప్రార్థింపగవిని । యతడుబల్కినాడు
అర్జు॥-రాజకుమారాభీతినివిడియా । రథముదోలుమయ్యా
కౌరవసేనలనురుమాడెదని । క్రంబిదిగనుమయ్యా
వైశం॥-అంతకిష్టపడకున్నయుత్తరుని । యపుడుదెచ్చెనయ్యా
అరదమందుంచిజమ్మిచెట్టుకడ । కంతవచ్చెనయ్యా
నరుడుజమ్మికడకేగుటగనుగొని । గురుడిటువినుపించె
ద్రోణు॥తరుణిమండలముకళాహీనమై । త్వరలోగన్పించె
కరులుమ్రోగ్గెనక్రూలరచెహయములు । కడువడిదుఃఖించె

అనేకవిధంబులయపశకునంబులు । యంతటగన్పించె
జాగ్రతనుండుడురణమగువిధమిక । చయ్యనగన్పించె
వైశం॥-విజయుండనుకొనిసమయభంగమని । భీష్మనివీక్షించె
అతడెవడోమనపైకివచ్చుసుర । పతియేయనిపించె
యెరిగియెరుగనటులుబలుకగభీష్మం । డీవిధివిన్పించె
అనుకొనివచ్చినపనినెరవేరిన । దనిదెలియగదయ్యా
శత్రులభయమికలేదురణంబును । సలుపవలయునయ్యా
అనద్రోణుడుపాండవులకజ్ఞాత । మగుటదెలిసినాడు
యథార్థమాకౌరవులువినునటుల । యపుడుబల్కినాడు
ఆకలిగొనుసింగంబువలెవచ్చె । నర్జునుడన్నాడు
అవులగొనిమనమేగుటయనునది । యబద్ధమన్నాడు
ప్రళయరుద్రునిగాగెలచివచ్చెనీ । ఫల్గునుడన్నాడు
సమరమందుజయమబ్బుటమనకిక । సంశయమన్నాడు
అనకర్ణుడువినికోపమొందిదా । నపుడుబల్కినాడు
పక్షపాతమునబల్కితివేమన । వలెననియన్నాడు
కురుసైన్యంబునబలియుడవీవిటు । గోరకుమన్నాడు
ఫల్గునుడెన్నడునీసమానుడని । బల్కకుమన్నాడు
కదనరంగమునకఠినశరంబుల । గలచెదనన్నాడు
అనగనుయోధనుడపుడనెనరుడే । యైనమనకుగొప్పె
అజ్ఞాతంబునదెలసినచోమరి । యడవికిజననొప్పె
అర్జునుండైనయెడలవారలకు । యధికమైనముప్పె
వారిజాడలెరిగితిమిగానమన । వారలకదిగొప్పె
నరుడుగాకపరుడైననేనితని । దరిమెదననిచెప్పె
నవ్విభీష్ముడనెయజ్ఞాతములో । నరునిరాకతప్పె
నవ్యాపాచియరదంబుశమీతరు । సమీపమందుంచె
ధనంజయుడుతనగాండీవంబీ । తరువుపైననుంచె
ధర్మజాదులవియువిగోయనియు । త్తరునకుజూపించె
తరువునెక్కిగాండీవముగొనుమని । దబ్బునవచియించె
యెప్పటియట్టులతక్కినవిగట్టి । యచ్చటుంచవయ్యా
అంతయుత్తరుడుతరువునెక్కగని । యతనికిప్రఖుతించె
పీనుగుఘంటినపాపమబ్బునని । భీతిదాచనెంచె

అనఫల్గునుడుయుత్తరవినుమని । యయ్యదివిన్పించె
జనులంటెదరనిశవమువలెధర్మ । జాతుడేర్పరించె
తరువెక్కుచుధనువిమ్మనివిరాటు । తనయునిపంపించె
భీతివిడచితరువెక్కెనుమూటను । విప్పివేగగాంచె
సూర్యకిరణములబోలినవాటిని । జూచుచుప్రశ్నించె
వారివారియస్త్రములనామముల । వరుసగవిననెంచె

# నెం. 1

ఉత్త॥-పాండవులిటకెపుడరుదెంచి । పరమాస్త్రంబులనిటనుంచి
యెచటికివారేగినరయ్యా । ఏనువారియల్లుడనయ్యా
కౌరవపతిమదియోచించె । కపటద్యూతముగావించె
పాండుకుమారులనోడించె । వనవాసమ్మునకంపించె
అరణ్యవాసముగావించి । యజ్ఞాతముసేయగనెంచి
ద్రౌపదితోయెటనున్నారు । యేపగిదినిగడచిరివారు
యెరిగినచోదెల్పగదయ్యా । యిదివినమదినెంచెదనయ్యా
వైశం॥-అనగబృహన్నలయదివినెను । అయుత్తరునకునిట్లనెను
అర్జు॥-శమనభవునికార్ముకమయ్యా । స్వర్ణకాంతిగల్గినదయ్యా
భీమసేనుధనువిదియయ్యా । భీకరమతిపీర్ఘంబయ్యా
పాండుమధ్యమునిధనువయ్యా । గాండీవంబదివినుమయ్యా
శతసహస్రసమములుదీని । స్రష్టభరించెనుధృతిబూని
అరవైవేలేండ్లుధరించె । అప్రజాపతినికరుణించె
ఏబదివేలేళ్లిందృుడు । యిదిగొనిజయమందెఘనుండు
పంచశతాబ్దంబులుదీని । బట్టెసోముడితరముమూని
వరుణుడునూరేండ్లుధరించె । పావకునకుయతడర్పించె
నరునకాతడిచ్చినదయ్యా । నరుడుదీనిదాల్చినదయ్యా
మత్స్యాంకమునకులునిదయ్యా । మయూరాంకమనుజునిదయ్యా
భీకరగదదాల్చెడివాడు । భీమసేనుడనుమొనగాడు
పాండుసుతులదెల్పెదనయ్యా । బహుప్రీతిగవినగదవయ్యా
ధర్మసుతుడుకంకుండగును । తంద్రికిషగునఖుడనెబడెను
వలలుండేభీముంతగును । వంటలవాడగుచుమెలగెను

దామగ్రంథియేనకులుండు । తంత్రిడిచెంతహయశిక్షకుడు
తంత్రిపాలుండనువాడు । దలపగసహదేవుడుజూడు
అర్జునుండనేనగుదయ్యా । అటలనేర్పితివినుమయ్యా
మాలినియే ద్రౌపదియగును । కూలెకీచకుడుగోరగను
దైశం॥-అనగనవ్వియుత్తరుడనెను । అర్జునుండవీవెటులగును
ఉత్త॥-పదిపేర్లాతనికింగలవు । వాటివిధినిదెల్పనగుదువు
అనగనవ్విపాథుఁడండనెను । వినినమ్మకమునుగొనుమనెను

# నెం. 8

అర్జు॥-అధికంబగుతెల్లనిమేనుండగ । యర్జునుడనిరయ్యా
ప్రభవించగనుత్తరఫల్గునిలో । ఫల్గునుడనిరయ్యా
పృథయనుపేరిటకుంతీదేవిని । బిలచుచుండిరయ్యా
పృథాకుమారుడనగుటచేతనను । పార్థుఁడండనిరయ్యా
నాకేశుడుసంతసిలికిరీటము । నాకొసంగెనయ్యా
కిరీటమతిశోభిల్లుచుండనను । కిరీటియనిరయ్యా
తెల్లనిగుర్రంబులుగలరథమున । దేజరిల్లుదయ్యా
శ్వేతవాహనుండనుచుజనంబులు । జెప్పుచుండురయ్యా
భయంకరాకృతిరణమునగనిభీ । భత్సుండనిరయ్యా
వైరులననియోడించిజయముగొన । విజయుండనిరయ్యా
చిక్కకశూరులనెల్లగెల్వగా । జిష్ణుండనిరయ్యా
రెండుకరంబులయుద్ధమునల్పుచు । నుండగాంచిరయ్యా
సవ్యసాచియనినామంబిడియా । జనులుబిలచిరయ్యా
ధనమునురాజులగెలచిగైకొనగ । ధనంజయుడనయ్యా
ఖాండవదహనంబపుడింద్రునితో । కదనమాయెనయ్యా
కృత్తివాసచతురాస్యులుమెచ్చుచు । కృష్ణుండనిరయ్యా
యేకాదశనామంబులవిధినీ । కేర్పరిచితినయ్యా
పదిపేర్లడగతివింకొక్కటినే । బరగజెప్పితయ్యా
అతిబలవంతులునివాతకవచులు । యనియొనర్చిరయ్యా
వరదర్పితులగుమూడుకోట్లనౌ । కృరుడజంపితయ్యా
అరువదివేలహిరణ్యపరస్థుల । హతముజేసితయ్యా

ఆత్మస్తుతిచేదోషమగునునీ । వడుగజెప్పితయ్యా
గాండీవంబిటుదెమ్ముకౌరవుల । గలచివేతునయ్యా
భయమువిడుముసారథ్యమొనర్పుము । పశులవెత్తునయ్యా
తరముగానిముదమొందియుత్తరుడు । తరువునుడిగెనయ్యా

—: ఫలశ్రుతి :—

# నెం. 1

భారతవీరులచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుదీని । విరచించెనుభక్తిసిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడుయీసత్కృతిని
సదయుండగురామచద్రుని । పదములకర్పించెనుకృతిని



# నెం. 1

వైశం॥-పాదంబులపైబడినాడు । బహుసంతసమునుగొనినాడు
ఘనదుఃఖంబునుగొన్నాడు । వినతుండైయిటులన్నాడు
ఉత్త॥-నిన్నెరుగకనిందించితిని । నేనపరాధముజేసితిని
తప్పులనుక్షమించగదయ్యా । దయతోనన్గావగదయ్యా
నీరథంబునికదోలెదను । వైరులగనిభీతిలబోను
వైశం॥-అనుచువేడునాతనిగనెను । అర్జునుడశ్రువులవిడచెను
అర్జు॥-యేలచింతజేసెదవయ్యా । కాలగతులుదప్పునివయ్యా
గాండీవాదులగొనుమయ్యా । కడువడినాకిడవలెనయ్యా
తక్కినవటులుంచగదయ్యా । త్వరగరథముగడుపగదయ్యా
వైశం॥-అనిసాధనములగనుగొనెను । అధిదైవతములకుమ్రొక్కెను
మునుపటియర్జునిరూపంబు । గొనియరదంబెక్కెఘనంబు
వహ్నిదేవునిన్ధ్యానించె । వానరధ్వజంబరుదెంచె

దివ్యవృక్షమును వినుతించె । దేవదత్తమును పూరించె
ఆశబ్దంబునగిరులదరె । అంభోనిధులంతజెదరె
భూమండలమతికంపించె । పురందరునిపురముచలించె
ఉగ్రంబగుశబ్దమువినెను । యుత్తరుండురథమునబడెను
కురుబలంబుభీతినిగొనెను । గుర్రంబులుభూమినపడెను
అర్జునుండురథమునుదిగెను । అశ్వంబులనంతలేపెను
తనువులహస్తముననిమిరెను । త్వరయుత్తరునపుడులేపెను
అర్జు॥-శంఖధ్వనికిట్టులతగునా । క్షత్రియునకుధర్మంబగునా
వైశం॥-అనగయుత్తరుండిటులనెను । ఘనశంఖధ్వనినీదనెను
ఉత్త॥-శంఖధ్వనులెన్నోవింటి । చాలభయంకరమిదియింటి
వైశం॥-వినినరుడనెధైర్యముగొనుము । భీకరశంఖధ్వనివినుము
మరలమరలధ్వనియొనరించె । మహాధైర్యమునుకల్పించె
ద్రోణాచార్యుడుధ్వనివినెను । దుర్యోధనునకునిట్లనెను

## నెం. ౫

ద్రో॥-శంఖశబ్దమునుకపిధ్వజంబును । చయ్యనగనుమయ్యా
ప్రళయరుద్రుడోయనగవచ్చున । ప్రాథుణినిగనుమయ్యా
మహారణంబగుతప్పదింకనా । మాటనువినుమయ్యా
ముందునీవుజనుమధ్యనపశువుల । మందనుంచుమయ్యా
శూరులనెల్లరవెనుకనుంచజొర । నేరదునరుడయ్యా
వైశం॥-అనవినిదుర్యోధనుడెల్లరగని । యపుడుబల్కినాడు
అజ్ఞాతంబునపాండవులజాడ । నందితిమన్నాడు
మరలవనవాసయజ్ఞాతంబుల । కరిగెదరన్నాడు
వ్రతినసంపూర్తిచేయకవిజయుడు । వచ్చినడన్నాడు
గురుభీష్మాదులుకాలనిర్ణయము । నెరపెదరన్నాడు
అర్జునుండొకడుమనలగెల్చునని । యనదగదన్నాడు
అతిశూరులమగుమనలగెల్వసా । ధ్యముగాదన్నాడు
ద్రోణునిగనియునెచేతగాకున్న । తొలంగుమన్నాడు
శోణవర్ణియులురణమునభీతిలి । బోయెదరన్నాడు

నరునిబొగడెదవుపక్షపాతివని । యెరిగితినన్నాడు
గురుసుతుండువినికోపమొందియును । కురుపతికన్నాడు
కృ॥-దూతలనుబంపిగోవులగైకొన । దొడ్డతనంబయ్యా
వైరులజగెలచిరాజ్యముగైకొను । వాడిటులనడయ్యా
మాయజూదమునగెలచినసిరిగల । మాటయంటివయ్యా
పడతికిసభనవమానముసల్పిన । ఫలముగల్గునయ్యా
యిపుడుజూపుమానాటిపౌరుషము । యిదెగాంచెదనయ్యా
దుష్టబుద్ధివైగురునిదిట్టితివి । దురముసేయుమయ్యా
అతికోపంబుననరుడరుదెంచెను । యతనిగెల్వుమయ్యా
సిగ్గుమాలిద్రోణుండుజేయునే । జేయనురణమయ్యా
వైశం॥-అనవినకర్ణుడుకోపమొందిపా । నపుడుబల్కినాడు
కురుపతిసేమముగోరకపులకు । గోరెదరన్నాడు
సమరమనభీతిజెందియుండకుడు । జనుతనియన్నాడు
నేనొక్కండననునరునికెదురుగా । నిలచెదనన్నాడు
రణమునవానినిగెలచిపశువులజ । గొనియొపనన్నాడు
యిరువురిలోతగుశూరుండెవడో । యెరిగెదరన్నాడు
పరశురాముకడనేర్చినవిద్దెకు । ఫలమిదియన్నాడు
నరునొక్కనిగనిభీతిజెంద । యన్యాయంబన్నాడు
అనగకృపుండనెనరుడొక్కరుడని । యనదగదన్నాడు
ఖాండవముగాల్చిసురలగెల్చె । నొక్కరుండెయన్నాడు
కృపా॥-కలికిసుభద్రనుగొనయాదవులను । గెలిచెనొకడునాడు
క్షత్రియోత్తములగెలచిధనంబుల । గొనెనొకడానాడు
గంధర్వులనోడించికురుపతిని । గాచెనొకడునాడు
కాలకేయులజనివాతకవచుల । గూలిచెనానాడు
ఒకడెనినుగెల్చిద్రౌపదిగైకొని । యుండెనద్దిజూడు
వైశం॥-గర్వమేలబొందెదవునీచెత । గాదిదియన్నాడు
అందరముండినజయమొందుటసా । ధ్యముగాదన్నాడు
కర్ణుడువినియతికోపమొంది । యిక్కరణబల్కినాడు
కర్ణు॥-కురుపతిధనమునుమయూలుపిల్లలను । గూడితింటిరయ్యా
అతనికిసమయమువచ్చినపుడిటు । లాడగతగదయ్యా
గృహములకేగుడునరునిరణంబున । గెలచివత్తునయ్యా

నాపురుషార్థంబెరుగకంటివి । రణంబునగనుమయ్యా
వైశం॥-అనగభీష్ముండుకనలికురుపతికి । యపుడిటువిన్పించె
భీష్మ॥-ద్రోణకృపాశ్వత్థామలపలుకులు । దురుక్తులనిపించె
ఆచార్యునినిందించితివెరుగక । యల్పుడవనిపించె
ప్రజ్ఞలుబల్కినవాడునీమదికి । బలియుండనిపించె
శతృడుబలవంతుండనియెరుగును । సత్యమువినిపించె
అంతమాత్రముననిందసేయ । యన్యాయంబనిపించె
మహాత్ములారాకోపపడకుడని । మహీశుజూపించె
సమరమెల్లరముగూడిసేయగా । జయమగుననిపించె
అజ్ఞాతమునిన్నటికిజెల్లెనే । దర్జునుడేతెంచె
వైశం॥-అధికమాసములతోనగునని । సత్యంబిటువచియించె
భీష్ముడిటుబల్కపార్థునియరదము । వేగమెజనుదెంచె

# నెం. 1

పార్థుడొక్కడనియోచించె । బహుకూరులుగలరనియెంచె
పవరముగనమదిప్రేమించె । పాండురాజునటబిల్పించె
సుదర్శనంబారోహించె । సురనాథుండటకేతెంచె
ఆకాశంబుననివసించె । అతిప్రేమపుత్రునిగాంచె
అర్జునుడుత్తరునిగాంచె । అతనికప్పుడిటువివరించె
అర్జు॥-అదుగోరాజుముందరనడచె । అవులమందలువెనునడచె
అర్ధసైన్యమతనిగాచెను । అర్ధసైన్యమిచటనిలచెను
వీరసమూహంబిటనుండె । వీరితోడబనిలేకుండె
అరదంబచటికిగొనిపొమ్ము । కురుపతితోజేతురణమ్ము
ఆవులపురమునకంపింతు । ఆపైవీరలనెదిరింతు
వైశం॥-అనయుత్తరుడటులొనరించె । జనుచుండగపార్థుడుగాంచె
గురుకృపగాంగేయులనెంచె । శరములుపండ్రెండుద్యజించె
చరణంబులపైబడనారు । శ్రవణంబులముట్టగనారు
పదములకుమ్రొక్కుటకొరకు । భద్రంబాయనియడుగుటకు
హస్తలాఘవంబునుగనిరి । అమువ్వురునంతసపడిరి
అరదమునుత్తరుడువడిపెను । కురునాథువిముందునిలిపెను

## నెం. 2

అర్జునుండంతటనులేచెను । అఖిలసైన్యమునుజూచెను
ధనుపుటాంకారమొనరించె । త్వరగశరవృష్టికురిపించె
అర్కకిరణములగప్పించె । అంధకారంబుగావించె
కరులసంఘమునుగాంచెను । ఖండములజేసివైచెను
హయములనునేలగూల్చెను । అరదములనంతగాల్చెను
బలములోకకొన్నిజచ్చెను । బలముబారగాజొచ్చెను
గోవులంతలోమరలెను । గోపకులవెంటదరలెను
అంతగురుకృపాదులుగనిరి । ఆవులనుద్రిప్పగాజనిరి
పార్థుఁడదివేగజూచెను । బాణవర్షంబుగురిపెను
కురుబలముఘాతజెందెను । గోవులనువిడచిగుందెను
తొందరగమందబారెను । తొంటితమనెలవుజేరెను



## (చతుర్థాశ్వాసము)



## నెం. 5

భీష్మాదులుగోగణంబుబారుట । వేగజూచినారు
ఒకరిముఖమొకరుజూచుకొనుచు । నత్యుగ్రతగనినారు
కురువీరులుమూడువేలరథముల । గూడివచ్చినారు
కర్ణగాంగేయులొక్కొకవేయిని । గలసివచ్చినారు
వేయిరథంబులగైకొనికురుపతి । వేగవచ్చినాడు
పశులమరల్చెవనిచింతించుచు । బలముదెచ్చినాడు
నరుడుకురుపతినిగనియుత్తరునకు । నవ్వియలికినాడు
పశువులబట్టితిననివచ్చెడుకురు । పతిగనుమన్నాడు
శ్రేష్ఠులైనకురుయోధులనుగనుమా । జెప్పెదనన్నాడు
అర్జు॥-కాంచనవర్ణధ్వజముగలవాడు । ఘనుడగుద్రోణుండు

సింహలాంగూలకేతనమువాడు । జెట్టిగురుసుతుండు
కనకగోవృషధ్వజముగలవాడు । ఘనుడాతడుకృపుడు
శంఖవర్ణకేతనముగలవాడు । చతురుడుకర్ణుండు
పన్నగధ్వజముగల్గువాడుకురు । పతిదుర్యోధనుడు
తాళకేతనముగల్గినవాడె । ధన్యుడుభీష్ముండు
గురునకుప్రదక్షిణంబగునట్టుల । యరదముబోనిమ్మా
భీష్మునిచెంతకురథముపోనీక । వెడలగవలెసుమ్మా
వైశం॥-దుశ్శాసనదుష్ప్రహరదుర్ముఖులొక । దోవవచ్చిరయ్యా
బాహ్లీకసైంధవసోమదత్తులొక । బాటవచ్చినయ్యా
అనేతయోధులుగల్గినసైన్యం । బతనిజుట్టెనయ్యా
గదాముపలపరశుముద్గరంబుల । గాంచివేసిరయ్యా
అంతనర్జునుడుశరపరంపరల । నపుడువేసెనయ్యా
వారిదుశస్త్రంబులనుపొడిజేసి । వారిగొట్టెనయ్యా
అనేకయరదములనేకగుర్రము । లవనింబడెనయ్యా
అనేకగజములననేకయోధుల । నతడుగూల్చెనయ్యా
రక్తపుటేరులుబారజొచ్చెయా । రణంబునందయ్యా
బలముతెల్లభీతిల్లియుచటనిలువ । జాలమనిరయ్యా
ద్రోణభీష్మాదులదిగనికనలుచు । దొమ్మిజేసిరయ్యా
నరుడుగురునిపైదెబ్బదియమ్ముల । నాటవేసెనయ్యా
కృపునివక్షంబుబగులునట్లుపది । గీలుకొల్పెనయ్యా
దుష్ప్రహునిబండ్రెండుబాణముల । దూలనేసెనయ్యా
పదియేనమ్ములదుస్సహునిజ । గడియగొట్టెనయ్యా
అరువదిశరములభీష్మునిగనుగొని । యపుడువేసెనయ్యా
దుర్యోధనునెనిమిదిశరములచె । దొలగగొట్టెనయ్యా
కర్ణునిరథమునుసూతునికవచము । ఖండించినడయ్యా
రక్తధారబారంగవక్షమున । శరంబులనిడెనయ్యా
యోధులనిటుబాధించిరణంబున । యుగ్రుడాయెనయ్యా
చిత్రాంగనచిత్రసేనదుష్ప్రహ । చిత్రరథులుజనిరి
వివింశతియుదుర్జయదుర్ముఖులతి । వేగముతోజనిరి
కఠినశరములనాల్గుదిక్కులయు । ఖండముగానిడిరి
శతృతాపుడర్జునునకెదురగుచు । శరములనిగుడించె

అదిగనివిజయుడుపదింటసూతుని । యంతంబొనరించె
అంతటొకకఠినబాణములచే । యాతనితలద్రుంచె
సమరజిత్తపుడుయతికోపించుచు । సత్వరమేతెంచె
చాలవాడిగలశరముచేనరుని । చాలగనొప్పించె
అతడుకోపించియొక్కబాణమున । యాతనితలద్రుంచె
అదిగనికర్ణుడుమహాక్రోధమున । యప్పుడరుగుదెంచె
హయములవిరాటతనయునిపండ్రెం । డమ్ములనొప్పించె

# నెం. 2

అర్జునుడుకోపమొందెను । అర్కసుతుడెదురునిలచెను
కర్ణుడర్జుననిగాంచెను । కఠినశరవృష్టిగురిపెను
నరుడుకర్ణునకునిట్లనెను । వెరచిపారకయొగనుమనెను
అర్జు॥-అపుడుసభలోనబల్కితివి । అధికబలశాలినంటివి
ధర్మపాశమునజిక్కితిని । తగినవిధిసేయమానితిని
నేడునిన్నిందుజూచితిని । నిన్నుశిక్షింపదలచిని
వైశం॥-అనుచుశరవృష్టిగురిపెను । అంధకారంబుగప్పెను
అర్కసుతుధనువుద్రుంచెను । అతికఠినశరమువైచెను
కర్ణుడతికోపమొందెను । కఠినశక్తినిఁదోలెను
ఘనశరంబొకటినరుడిడెను । ఖండితంబగుచుగూలెను
సురసమూహంబుమెచ్చెను । కురుబలంబంతనొచ్చెను
వేరువిల్లపుడుగైకొనెను । వేగకర్ణుండుచూచెను
హయములఁనాల్గిటఁగొట్టె । ఁపెటఁయుత్తరునిగొట్టె
యెనిమిదిటరథమునేసెను । హనుమనిఁపదిటగొట్టెను
అరువదిశరంబులేసెను । నరునికబిబాధజేసెను
నరుడుబహుకోపమొందెను । తరణిపుత్రునిఁజూచెను
కఠినబాణంబులనువిడచె । కర్ణునంగంబునొప్పించె
కర్ణుడతిబాధగాంచెను । కయ్యమునువీడిపారెను
దేవదత్తంబుపూరించె । దేవతాగణముమోదించె
ఉత్తరుండిటులబల్కెను । యుల్లమునభీతిగల్గెను

యెన్నడిటుజూడకుంటిని । యిపుడుగనినిల్వకుంటిని
అనగనర్జునుండిటులనెను । ఔరనీకేలభయమనెను

నెం. 5

ధనురాచార్యునిచెంతకురథమును । త్వరగపోలుమనెను
గురునిజేరజనకరజుజేతునతి । కోపముతగదనెను
బడలినారమతవిలోనమీవయ । బ్రతికితిమన్నాడు
ఆదిలోశరము లేనువిడుపగా । యదర్మమగుననెను
వినిగురుడిపుదదికతినశరంబుల । విజయునిపైవిడెను
నరుడునడుమనేఖండింపంగా । గురుడదిగనుగొనెను
మహాక్రోధమునవేలబాణముల । మర్మములకునిడెను
అచాప్యునిమర్మంబులడాకగ । యర్జునుండువిడెను
యిరువురతిరథులుయుద్ధప్రవీణు లు । గురుశిష్యులరణము
గురుబలమందునసురబలమందున । గూర్చెనువిస్మయము
గురునెదురింపగనరుడుగాకపుర । హరునకైనతరమా
అయిరువురియుద్ధంబువర్ణింప । యర్జునకైనతరమా
గురుడువేయువేలబాణములనా । నరుండుపొడిజేసె
నరుడువేయువేలబాణములనా । గురుండుపొడిజేసె
అవయవసంధులలోననర్జునుం । డపుడుగొట్టెనయ్యా
అనేకరక్తముగారెనుగురునకు । యవశమాయెనయ్యా
తండ్రిబడెడుబాధగనుచుయశ్వ । త్థామవచ్చెనయ్యా
వచ్చుటేగాకకతినశరంబుల । పాథునేసెనయ్యా
నరుడుకోపించిగురుసుతాశ్వముల । నచకమాపెనయ్యా
నరునిపైనకోపించిగురుసుతుడు । నారిద్రుంచెనయ్యా
నరుడుమరలనారిగట్టునంతలో । శరములేసెనయ్యా
ఆకురుబలమునయింతటిపనియెవ । రాచరించరయ్యా
అంతనవ్వినరుడుభళిభళీయని । అమ్ములనిడెనయ్యా
అశ్వత్థామయునేకశరముల । నతవిగొట్టెనయ్యా
గురుపుత్రునితూణీరంబందున । శరములులేకుండె
పవ్యసాచిబాణవేగముగని । చప్పునగూర్చుండె

అశక్తుడగుగురుపుత్రునిగనికృపు । డంతవచ్చెనయ్యా
కఠినశరంబులగైకొనిపాథుఁడాని । కనలికొట్టెనయ్యా
విజయుడతికోపమొందిగనికృపుని । ధ్వజముఁగూల్చెనయ్యా
అంతబోకకఠినబాణములచే । యతనిగొట్టెనయ్యా
అపుడురథరక్షకులుతొమ్మండుగు । రనికనిలచిరయ్యా
కఠినశరంబులపాథుఁడానిగొట్టగ । కనలిచూచెనయ్యా
నరుడునవశరంబులచేశిరములు । నరికివేసెనయ్యా
హరులజంపిధనువ్రుచంచిసూతుని । యవనిగూల్చెనయ్యా
కఠినశరముగొనినవ్వికృపుని । వక్షముననాటెనయ్యా
అంతకృపుడుకోపించిశక్తిగొని । యపుడువైచెనయ్యా
విజయుడుగనిపదిశరములశక్తిని । విడుగవేసెనయ్యా
నరునిజంపరథమునుదిగిఖడ్గము । బెరకివచ్చెనయ్యా
నరుడుబాణములవిడచిఖడ్గమును । నరికివేసెనయ్యా
జేయునదిలేకకృపుడాభీష్ముని । చెంతకేగెనయ్యా
నరుడుకృపునిగనిసేనలపైబడి । దరిమికొట్టెనయ్యా
మాంసరక్తమయమాయెభూస్థలము । మహారణంబయ్యా
వృషసేనుండనుకర్ణపుత్రుడతి । వేగవచ్చెనయ్యా
గనుగొనిపాథుఁడండొక్కశరంబున । ధనువ్రుచుచెనయ్యా
పంచశరంబులనతనియురంబును । బగులగొట్టెనయ్యా
అతిబాధనుగొనివృషసేనుడుపె । ల్లరచిబారెనయ్యా
శకునిగనిదుశ్శాసనులగనిపాథుఁడు । శరములేసెనయ్యా
రథములుగూలెనురక్తముగారెను । రణమువీడిరయ్యా
ఆకురుబలమునయోధుడొకడైన । యర్జునుగనకుండె
భీష్మునిపైకిరథంబుదోలుమని । విజయుండనుచుండె
అంతయుత్తరుండతిసంతసమున । యటులజేసియుండె

## నెం. 2

శాంతనవుడంతలోగాంచె । శంఖమతివేగపూరించె
కురుబలముధైర్యమునుగాంచె । నరునిపైకేగవీక్షించె

నరుడుశంఖమునుపూరించె । కురుబలముబారయోచించె
యిరువురనిసేయనిల్చిరి । సురలుగనమింటనిలచిరి
అంతభీష్ముండుజూచెను । అష్టశరములనువైచెను
ఆంజనేయునింగొట్టెను । అతనిభూతములఁగొట్టెను
అంతయుత్తరునిపైవేసె । అశ్వములుమొగ్గగావేసె
కనలిపార్థుఁడుంజూచెను । కఠినశరవృష్టివైచెను
అంతభీష్ముండుకోపించె । అన్నిశరములఖండించె
నరుడుధనువంతలోద్రుంచె । శరములతివేగనిగుడించె
భీష్ముడతికోపమొందెను । వేరుధనువప్పుడేగొనెను
చక్రరక్షకులుదాకిరి । శరములనువేయసాగిరి
విజయుడవ్వారిద్రుంచెను । వేగనుగ్రములనొంచెను
భీష్ముడొకశరమువిడచెను । విజయుభుజమునకుదాకెను
ఫల్గుణుడుబాధనొందెను । బహుళకోపంబునొందెను
భీష్మధనువునుంద్రుంచెను । వేగకఠినాస్త్రమేసెను
ధనువుగొనునంతలోవచ్చె । తనువునందాకగానొచ్చె
భీష్ముడరధమునమూర్ఛిల్లె । వేగకురుబలముదురపిల్లె
అర్జునుడుసేనలనుగాంచె । అంతకునిబోలెగాన్పించె
గురుసుతుడుకర్ణునిఁగాంచె । అరుగుమాపార్థుఁడేతెంచె
బలముగలవాడనంటివి । పార్థుఁనిఁ గెలుతునంటివి
ఆనుముమాచేతగాదనెను । ఘనుడవీవొక్కరుడవనెను
పార్థుఁశరములకునొచ్చెను । పల్కులకునపుడునొచ్చెను
చేతగాకున్నలేచెను । శీఘ్రముగనరునిజూచెను
కర్ణునిఁనరుడుగాంచెను । కఠినశరములనువిడచెను
నొచ్చియటజనకనిల్చెను । మెచ్చినరుడంతవెడలెను
కురుపతినివేగగాంచెను । గోవులనుగొందువాయనెను
రెండుశరములనునాటించె । దండియురమంతబగిలించె
రక్తమెడలగాకోపించె । రణములోపార్థుఁనిఁగాంచె
వాడిశరములనుసంధించె । పార్థుఁఫాలమ్ముబగిలించె
ధారగారక్తముస్రవించె । త్వరగనరుడంతలోగాంచె
ఘోరశరములఁవిడచెను । కురుపతికిదాకనొచ్చెను

# నెం. 5

వికర్ణుడంతటమదగజముపైన । వేగవచ్చెనయ్యా
విచ్చికఠినబాణంబులగొనివి । వ్వచ్చునేసెనయ్యా
అంతకోపించికరిపైబాణము । లర్జునుడిడెనయ్యా
ఆశరఘాతకుతాళలేకగజ । మంతమొందెనయ్యా
కఠినశరంబునకురునాథుని । వక్షముబగిల్చెనయ్యా
కరికురునాథులురణమునుబాసిరి । కడుచిత్రంబయ్యా
తక్కినయోధులపార్థుఁడుగనుగొని । దరిమికొట్టెనయ్యా
విజయునిముందరికొకడురాలేక । వెరచిపారిరయ్యా
పారెడివారలగనుగొనిశరములు । పార్థుఁడువిడెనయ్యా
యురికెడుకర్ణునివీపునశరములు । నుబ్బివేసెనయ్యా
భీష్మకృపద్రోణాశ్వత్థామలు । వెడలుచుండిరయ్యా
తక్కినబలములువెనుకకుజూడక । తరలుచుండిరయ్యా
సుయోధనుడువెడలుచుండగనియ । ర్జునుడుబలికెనయ్యా

అర్జు॥-ఉత్తమక్షత్రవంశమునందున । యుద్ధవించినావు
అనేకయోధులవెంబడిగైకొని । యనికివచ్చినావు
ఒక్కడనాతోరణమందోడుచు । యురుకదలచినావు
రాజ్యభోగములనందనేర్చితివి । రణముసేయలేవు
కపటజూదమాడంగనేర్చితివి । కలననిల్వలేవు
యెన్నాళ్ళకైనమరణముండునని । యెరుగకుండితీవు

వైశం॥-వినికర్ణకఠోరంబగుపల్కుల । వేగమరలినాడు
తోకద్రొక్కబడుపామువిధంబున । దుస్సహుడైనాడు
అతనిగావభీష్మద్రోణాదులు । యపుడుమరలినారు
అన్నిదిక్కులందరునిల్చుచు । యస్త్రములిడినారు
ఒక్కసారియస్త్రములిడగనినరు । డుగ్రుండైనాడు
ఇంద్రదత్తమగుమోహనాస్త్రంబు । నేసిజూచినాడు
యెల్లరుతెల్వినిబాసినిద్రచే । యిలపైబడినారు
భీష్ముడొకడుగాకయెల్లరివ్విధి । వ్యథనుజెందినారు
అర్జునుండనెయుత్తరపల్కుల । నాచరించవయ్యా
యెల్లరితలపాగలనుగొనివేగ । యిచటికిరావయ్యా

అనగయుత్తరుండటులజేసిరథ । మందునిలచెనయ్యా
అంతటభీష్ముండనేకశరముల । నపుడువేసినాడు
అర్జునుండపుడుగాంచిశరంబున । యతనిగొట్టినాడు
అంతలోనెల్లవారుమేల్కాంచి । యనికినిలచినారు
భీష్ముడంపకురునాథునిగని । యివ్విధముబల్కినాడు
భీష్మ॥మీరెల్లరుభూమినబడపాథుడాడు । మిమ్ముజూచినాడు
తలలునరుకుటనుమానుచుతలపా । గలనుగోసినాడు
ధర్మతత్పరుండగునుగానమిము । దయనుగాచినాడు
మనమికయుద్ధముమానిపురమునకు । మరలెదమన్నాడు
దురముననిలచినమనలబంపుయుమ । పురమునకన్నాడు
వైశం॥-అనవినియోధులుయభిమానమువిడి । యపుడుబలికినారు
జనకశక్తిజాలకకొందరునరు । శరణువేడినారు
యేలజెంకెదరుభీతిమాని । పురికేగండన్నాడు
కృపద్రోణగాంగేయులకంతట । కేలుమోడ్చినాడు
బోయివత్తుననిచెప్పియరదమును । బోనిమ్మన్నాడు
గాండీవాద్యాయుధములన్ని । వృక్షమునబెట్టినాడు
అరదమందుత్తరుడుసూతుండు । బృహన్నలయైనాడు

## నెం. 1

అర్జు॥-నావిధంబుదెలుపకుమయ్యా । నరనాథునకిదివినుమయ్యా
కురుబలంబుగెలచితిననుము । గోవులమరలించితిననుము
మేమేయిదిదెల్పేదమయ్యా । మిన్నకుండుచేతగునయ్యా
గోపకులజాబురికంపించు । గోధనజయమునువిన్పించు
వైశం॥-అనయుత్తరుడటుగావించె । ధనంజయునితోజనుదెంచె
విరటుడుదక్షిణదిశనుండి । పురముజేరియదివినిమండి
ఉత్తరుండుబోవుటవినెను । తత్తరంబుమదిలోగొనెను
సచివులతోనిట్లనియనెను । సైన్యముబంపగవలెననెను
పశువులగైకొనమదిదలచి । బాలుడొక్కడేగుచునిలచి
గురుభీష్మాదులననిగెలచి । మరలుటకష్టంబనిదలచి
అనవిరటునికంకుడుగాంచె । జననాథునకిటువిన్పించె

విరాటకంకులుజూదంబు । వేయుచువినెవృత్తాంతంబు
విరాటరాజావినుమయ్యా । బృహన్నలాఘనుడగునయ్యా
సారథ్యంబతడొనరింప । జయమగుజనములువినుతింప
వినివిరటుడుకోపముజెందె । గనికంకుడుశాంతమునొందె
గోపబాలులపుడేతెంచి । భూపాలునిగనివినుతించి
తనయుడుకురుబలముల(దుంచె । తనసారథితోనరుదెంచె
జయభేరినిమ్రోగించండి । జయమంతటవినుపించండి
అంతభూపుడదివినెనయ్యా । అతిముదంబుమదిగొనెనయ్యా
చారులనంతటబిల్పించె । చయ్యనదానిటువిన్పించె
విరా॥-ఉత్తరుండుజయమునుగొనెను । ఒకడేపశువులగైకొనెను
సకలవీధులనుదిరుగండి । జయభేరినిమ్రోగించండి
వైశం॥-అనగకంకుడపుడిట్లనెను । అటులబల్కదగదనియనెను
కంకు॥-బృహన్నలదిజయమనుడయ్యా । భీష్మాదులగెలచినడయ్యా
అతడసాధ్యుడనుకొనుమయ్యా । అతనిబలంబెరుగుదునయ్యా
అతడేయుద్ధమునొనరించె । అతడెగోవులనుమరలించె
నీతనయుండరదముదోలె । నిక్కంబిదినామదిదేలె
వైశం॥-అంతవిరాటుడుకోపించె । ఆకంకునకిటువిన్పించె
విరా॥-అసూయమదిజెందితివయ్యా । ఆత్మజుజయమునుగనవయ్యా
నాపుత్రునినిందించితివి । నాకుకోపమొందించితివి
వైశం॥-అనిపాచికనంతటవదలె । అదిఇనికనుబొమ్మకుదగిలె
రక్తమంతటజారగజొచ్చె । రమణికృష్ణమదిగనినొచ్చె
తనవస్త్రముచేతదుడిచెను । ధరణీశుండపుడిటులనెను
నీవేటికిదుడిచితివనెను । నిక్కముచెల్పగదగుననెను
అన(ద్రౌపతియిటులనెనయ్యా । అతడుధర్మాత్ముండయ్యా
అతనిరక్తమిలబడినంత । శతవత్సరములుభూకాంత
వర్షంబిసుమంతయులేక । పాడిపంటదర్గునుగాక
అదినామదినెరుగుదుగాన । అటులజేసియుంటిబిరాన

## నెం. 5

ద్వారపాలుడేతెంచియుయిరువురి । వచ్చుటవిన్పించె
అంతవిరాటుడుజయశీలునితన । యాత్మజుగనవెంచె

బంటునకాకంకుడుగోప్యంబని । వచనమువిన్పించె
బృహన్నలనుయిటురావలదనుమని । వేగమెబంపించె
త్వరగయుత్తరుడుజనకునిగని । వందనముసమర్పించె
విరటుడుతనయునికౌరవులగెల్చు । విధమునుబ్రశ్నించె
అనగయుత్తరుడుకంకునకుమ్రొక్కి । యాతనివీక్షించె
గాంచికనుబొమ్మకేమనియనగా । కంకుడువిన్పించె
కంకు॥-విరటుడుతనతనయునదేజయమని । వేగమెవిన్పించె
జయముబృహన్నలదేయనియనగా । చయ్యనకోపించె
సారవేయరక్తంబుగారె । యాశ్చర్యములేదయ్యా
సమరవార్తనెరిగించుమనినీదు । జనకుండనెనయ్యా
వైశం॥-అనగయుత్తరుడుజనకునిగణగొని । యపుడుబలికెనయ్యా
ఉత్త॥-యెంతయధర్మంబాచరించితివి । యెరుగకుంటివయ్యా
వారియనుగ్రహమాత్రంబుననిటు । వరలుచుంటిమయ్యా
వైశం॥-అంతవిరాటుండపరాధినియన । హర్షమొందెనయ్యా
అపరాధంబిదిగాదురణవార్త । నంతయువినుమయ్యా
అనయుత్తరుడనెబృహన్నలనుగొని । యరిగియుంటినయ్యా
ఉత్త॥-బలములగననేభీతిజెందనను । బట్టినిల్పెనయ్యా
మాతునిగానన్నార్చిరణమున । జొచ్చియుండెనయ్యా
కురువృద్ధులశతవృద్ధులనొనర్చి । గోవులగొనెనయ్యా
కర్ణాదిమహాయోధులుబారిరి । ఘనబలుడగునయ్యా
అతనిమూలముననబ్రతికివచ్చితిని । యతనిదెజయమయ్యా
యెప్పటియట్టులగౌరవించి । దానేగియుండెనయ్యా
వైశం॥-అనాడచ్చటతొల్లివిధంబున । యందరుండిరయ్యా
అంతదెలవారెనిత్యకృత్యముల । నాచరించిరయ్యా
భీమార్జునమలాయన్నదెబ్బగని । వేగబల్కిరయ్యా
అదియేమదియనవారలతో । సత్యంబుబలికెనయ్యా
తనతనయుడుకౌరవులగెలచెనని । జనపతియన్నాడు
బృహన్నలదిజయమనగసారెగొని । విసరివేసినాడు
అనభీముండనెవిరాటభూపుని । హతముజేతుననెను
వానివంశమునుగూల్తుననుచు । భీభత్సుండపుడనెను

# నెం. 1

అనగధర్మజుడువిన్నాడు । అతమ్ములకిటులన్నాడు
ధర్మ॥-అతనినికోపింపకుడయ్యా । అతడుమనలగాచినడయ్యా
అభిమానముగాచినడయ్యా । అంతనిట్లుజేసినడయ్యా
వైశం॥-అనుచుశాంతమునుబోధించి । అందరితోసభకరుదెంచి
సింహాసనమారోహించె । క్షితీశుడంతటజనుదెంచె
కంకునియాసనమునగాంచె । కనలిపల్కులిటువినుపించె
విరా॥-యేలదీనినెక్కితివయ్యా । యింతయెరుగకుండితివయ్యా
నవ్వులకిటుజేసితివయ్యా । ననుగనిదిగవిదియేమయ్యా
అర్జు॥-అననరుడనెదెలియగలేవు । అతండెవడనుకొన్నావు
రాజసూయమఖమొనరించె । రాజులనెల్లరనుజయించె
ధర్మరక్షణంబొనరించె । ధర్మరాజునామముగాంచె
పాండుపుత్రుడనియనుకొమ్ము । భక్తిగనాపల్కులువినుము
వైశం॥-అనవిరాటుడద్భుతపడెను । అతనితమ్ములులేరనెను
ద్రౌపదియెటకేగినదనెను । త్వరగదెల్పుమావినుమనెను
అర్జు॥-అంతనరుండపుడిట్లనెను । అవలలుడేభీముండనెను
అశ్వశిక్షకుడునకులుండు । ఆవులగాచుసహదేవుండు
మాలినియేద్రౌపదియగును । మారుతియాపైనిట్లనెను
భీము॥-ఖాండవంబుగాల్చినవాడు । గంధర్వులగెలచినవాడు
కురుబలమునుగెలచినవాడు । గోగణంబుదెచ్చినవాడు
అర్జునుడీతండగునయ్యా । అత్మజునికనడుగగదయ్యా
వైశం॥-అంతయుత్తరుండపుడనెను । ఆతనిమాటసత్యంబగును
ఉత్త॥-గురుభీష్మాదులనోడించె । నరుడునిన్నునన్నుబ్రోదికించె
వైశం॥-విరటుడువినిభీతినిగాంచె । భీభత్సునియతిప్రేమించె
ధర్మజుపదములపైబడెను । తక్కినవారలకిట్లనెను
విరా॥-యెంతమోసగించితివయ్యా । యేలయిట్లుజేసితిరయ్యా
అపరాధంబొనరించితిని । కృపనుజూపుడనివేడితిని
వైశం॥-అనవినియుత్తరుడిట్లనెను । జనకయిట్లుసేయుమనియెను
నీచవృత్తిలోనుంచితిమి । నీవుకార్యములజెప్పితిమి
ఉత్త॥-మనరాజ్యంబిడసరిరాదు । మనమునవిదియుండగపోదు

కూతురునిటబల్వగవలయు । కొత్తకాన్కలేనీవలయు
వైశం॥-అనవిరాటుడటులేయనెను । తనయునుబిల్చికరమ్మనెను
సుధేష్ణకిదిదెల్పగవలెను । సుజడివసంబిడియనవలెను
మాలినిద్రౌపదియనవలెను । మహారాజియనుకొనుమనెను
అనగమంత్రియటకేతెంచె । ఆవృత్తాంతమువిన్పించె
తనయునుత్వరలోపంపించె । ద్రౌపదికపుడిటువినిపించె
సుధే॥-దాసీవైమెలగితివమ్మా । తప్పులునేజేసితినమ్మా
నీమదినిదియుంచకుమమ్మా । నీతల్లిగజూడగదమ్మా
వైశం॥-కనిద్రౌపదియిట్లనెనమ్మా । కాలగతులుడప్పవుసుమ్మా

## నెం. 1

తనకూతురుయుత్తరతోవిరటుడు । ధర్మజుగనుగొనెను
నాకూతునర్జునునకిడుబుద్ధి । నాకుగలిగెననెను
అంతధర్మజుడుపాథునానిజూడగ । యాతడిట్టులనెను
అర్జు॥-గురువునైవిద్యజెప్పితిగావున । కూడదిట్టులనెను
హరిమేనల్లుడుసుభద్రతనయుడు । అభిమన్యుండయ్యో
అతనికిడినయోగ్యంబనసంపరు । యతిసంతసపడిరి
పాండుసుతులంతశమీతరువుగన । భక్తితోడజనిరి
అందుంచినతమయాయుధంబులను । యప్పుడుగైకొనెను
పూర్వరూపములనొంచివిరటుడిటు । పూజలగైకొనెను
అతిముదమొందుచువిరటునిపురిలో । హాయితోడమనిరి
యాదవపాంచాలులకుశుభవార్త । నంతవిరటుడంపె
అభిమన్యునకుత్తరనిడువార్తకు । యండదువినిసొంపె
దుర్యోధనుడింటికిజనిదుష్టచ । తుష్టయమునుగాంచె
దుర్యో॥పాండుసుతులకజ్ఞాతభంగమే । ర్పడెననివినిపించె
వైశం॥-గాంగేయుడుపక్షపాతముననటు । గాదనివచియించె
భీష్మ॥-తొందరగాపాండవులచెంతకొక । దూతనుబంపించె
అజ్ఞాతముభంగమైనదనినే । నతనికివిన్పింతు
ఆసత్యమాడడుధర్మరాజెపుడు । యతనినినమ్మింతు
అతనినిర్ణయమునుసత్యంబనినా । యాత్మలోననెంతు

వైశం॥-అనుచునొకదూతనపుడుబంపగా । యాతడుజనినాడు
ధర్మరాజునకుమ్రొక్కియీపలుకు । త్వరగదెల్పినాడు
వినిధర్మజుడాదుష్టాలోచన । విధముగాంచినాడు
మరలయరణ్యముబొమ్మనెననితన । మదినిదెలసినాడు
నిండెయజ్ఞాతవాసమింక । భ్రాంతిలేకయున్నాడు
గురుభీష్మాదులువినగబల్కుమని । మరిమరియన్నాడు
అనగదూతవినికరినగరముజని । యపుడుదెల్పినాడు
వినిదుర్యోధనుడంతసభికులను । వినుడనియన్నాడు
అంతభీష్ముడనెధర్మజుండు । బొంకాడలేనివాడు
దేవదత్తశబ్దమువినినప్పుడె । దెలిపితినన్నాడు
సమయభంగంబుగాలేదది । నిస్సంశయమన్నాడు
సభికులెల్లవినిసంతసపడగా । జనపతిజనినాడు
శ్రీకృష్ణుండాపాండవులవార్త । శీఘ్రమువినినాడు
అతిసంతసమునయుపప్లావ్యమున । కరుగదలచినాడు
పాండుకుమారులరథసారథులను । బంపివేసినాడు
అనేకయాదవసైన్యంబులతో । నపుడువెడలినాడు
బలభద్రసుభద్రాభిమన్యులకా । బరగగూడినాడు
అతివేగంబునయుపప్లావ్యమున । కంతజేరినాడు
భక్తవత్సలునిరాకడవినియా । పాండుసుతులుజనిరి
అర్ఘ్యపాద్యములతోడబూజించి । యతనికినతులిడిరి
కుశలంబాయనియడిగితమకైన । కుశలంబిదియనిరి
విరటుడంతసద్భక్తితోడనా । హరినిగాంచినాడు
అతనికిదగనటుపూజలొనర్చుచు । యచటనుంచినాడు
ద్రుపదరాజుపాండవులవార్తవిని । యపుడువెడలినాడు
అతిబలములతోయుపప్లావ్యమున । కంతజేరినాడు
అతనిబూజించిపాండుకుమారులు । యపుడుబల్కినారు
హరిదయతోకష్టములబాసి । పెంపందితిమన్నారు
కాశిరాజుశైబ్యుండుబలములకా । గలసివచ్చిరయ్యా
ధర్మనందనునిసత్కారముగని । దయనుదెల్పిరయ్యా
సకలబందుగులువచ్చుటవిరటుడు । చయ్యనగనెనయ్యా
దేవదత్తులగుబ్రాహ్మణోత్తముల । బిల్వబంపెనయ్యా

పరిణయముహూర్తమవ్వారలచే । బరగజూపెనయ్యా
తనపురమంతటయలంకారములు । త్వరతోజేయించె
వరునిదోడ్తెచ్చుటకుబంధువులను । విరటుడుబంపించె
మంచియలంకారములుకృష్ణుడభి । మన్యునకొనరించె
భద్రగజంబెక్కించివేగమే । బయనముగావించె
యాదవపాండవపాంచాలురలతో । యచటికిజనుచెంచె
తనసతిగూడుచువిరటుడుకన్యా । దానంబొనరించె
భేరీభాంకారధ్వనులంతట । విరివిగజేయించె
దీనబాంధవుండగుకృష్ణునితో । దీవనలిప్పించె
విప్రగణంబులయాశీర్వాదము । వేగముజేయించె
యెల్లవారకుబహుమానంబుల । నేర్పడనిప్పించె
అతిసంతసమునవివాహకార్యం । బాతండొనరించె
యేడునూర్లభద్రగజములల్లున । కిచ్చిసంతసించె
గుర్రములొకపదివేలుసొమ్ములను । గూర్చుచునర్పించె
పాడిగలుగుపంచలక్షగోవుల । వరునకునర్పించె
అరదములొకరెండువేలొసంగుచు । యతిమోదముగాంచె
దాసదాసీజనంబులొకలక్ష । త్వరతోనర్పించె
సకలబంధుజనములనుభక్తితో । చయ్యనబూజించె
జనమేజయునకుమునినాథుండీ । సత్కథవిన్పించె
విరాటపర్వంబిచటికాయెనిది । విశేషమనిపించె
సత్కథవినువారలకాకృష్ణుడు । జయమిమ్మడగనెంచె

—: ఫలశృతి :—

నెం. 1

భారతవీరులచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుదీని । విరచించెనుభక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడుయీసత్కృతిని
సదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని
విరాటపర్వము-సమాప్తము.

శ్రీ కృ ష్ణా య న మః

# తందనాన

# శ్రీమహాభారతము

## ఉద్యోగపర్వము



## నెం. 1

వైశం॥-శ్రీజనమేజయభూపాలా। రాజితసత్కీర్తివిశాలా
ఉద్యోగంబనుపర్వంబు। ఉత్తమభక్తులచరితంబు
ప్రేమతోడదెల్పెదనయ్యా। ప్రీతితోడవినగదవయ్యా
పాండుసుతులుమోదముగొనిరి। పెండిలివిందులుగైకొనిరి
విరటునిసభకంతటజనిరి। త్వరగనెల్లరనుగనుగొనిరి
సభాసీనులయ్యెరివారు। సకలరాజులటనున్నారు
హరిసఖికులనెల్లరగనెను। అచటివారికపుడిట్లనెను
కృష్ణు॥-కపటద్యూతంబొనరించి। ఖలులుపాండవులనేడించి
అరణ్యవాసముబంపించి। అజ్ఞాతముజెరుపగనెంచి
విరటునిగోగణములగొనిరి। విజయునిచేబాధలపడిరి
అన్నమాటసల్పిరివీరు। అర్ధభాగమీయరువారు
సమరంబేమొదలగునెడల। సైన్యంబవసరమగుమిగుల
యెంతటిబలవంతుడుగాని। యితరసాయమొందినయేని
కార్యముసాధించగగలడు। కడుసుఖములనొందగగలడు
కడుకుశలతగల్గినవాని। కార్యమునెరవేర్చెడువాని
ఒక్కనికరిపురమంపించి। నిక్కముదెల్పుటయేమంచి
యిరువురికిబంధుడగాన। యిదిసేయగదగునుబిరాన

వైశం॥-అనబలభద్రుండిటులనెను । అదియోగ్యంబగుననియనెను
బల॥-జూదమాడుటకుబిల్పించె । సుయోధనుండతిప్రేమించె
ధర్మజునకుజూదమురాదు । తానాడగనటుబోరాదు
ఆటలోనపణమొనరించె । అదినెరవేర్చుటగావించె
వైశం॥-వారిదిధర్మంబనియెంచె । వాసుదేవుడదివినుపించె
కృష్ణ॥-అదర్మంబుసుంతయులేదు । అజ్ఞాతముచెడెననరాదు
దూతనొకనిపంపగవలయు । దుర్యోధను వేడగవలయు
వీరిభాగమీయగవలయు । వారుసుఖమునొందగవలయు
అనవినిసాత్యకియిట్లనెను । అన్నయిట్టులనదగదనెను
సాత్య॥జూదంబునకపటంబేల । సుయోధనుడుచేసెనుచాల
ఒకదూతనుపంపగవలయు । యుర్విసగంబిమ్మనవలయు
అతనివేడుటన్యాయంబు । అతడియ్యకున్నరణంబు
భీమార్జునలదియొనరించి । విజయముగైకొనెదరుమించి
సహాయంబుమేమొనరించి । సమానభాగంబిప్పించి
నామదిసంతసమునుగొందు । నామతమిదియనినేనందు
వైశం॥-అనద్రుపదుడుభళిభళియనెను । అవిరాటుడౌనవియనెను
అపుడచ్చటిజనమగుననెను । ద్రుపదుడుమరియొకటిట్లనెను
ద్రు॥-నాపురోహితుడుయోగ్యుండు । నయవిదుండుకార్యకరుండు
యితనినచటికిపంపుదమయ్యా । ఇదియేనామతమనెనయ్యా
వైశం॥-అనుచుపురోహితుబిల్పించె । అనదగినవిదావిన్పించె
ఆపురోహితుండటుజనెను । హరియెల్లరగొనిపురిజనెను
సేనోద్యోగంబొనరింప । శీఘ్రముజనివారునుతింప

# నెం. 5

శ్రీకృష్ణుడుద్వారవతీపురమును । జేరియుండెనయ్యా
అతనిసాయమునుగైకొనకురుపతి । యచటికిజనెనయ్యా
అనాడేనరుడాహరిసాయము । నందజేరెనయ్యా
శ్రీకృష్ణుడునిద్రించియుండగా । జేరిరిరువురయ్యా
ముందుబోయిదుర్యోధనుండు । గోవిందునిగనెనయ్యా
గొల్లడనుచుపదములకడనిలువగ । నొల్లకుండెనయ్యా

అహంకారమునయుచ్ఛ్వాసనమున । యతడునిలచెనయ్యా
శిరోభాగమునయాతడుంటగాంచెను । పాథుఁడుండయ్యా
అతిభక్తినిగొనిపదములసన్నిధి । నాతడుండెనయ్యా
హరిసర్వజ్ఞుండతమేల్కాంచి । యర్జునుగనెనయ్యా
పిదపశిరోభాగమందున్నకురు । వీరునిగనెనయ్యా
కురుపాండవవీరులనతిముదమున । కుశలమడిగెనయ్యా
తెలుపుడిపుడేకార్యమునకువచ్చితిరొ । దీర్చెదననెనయ్యా
అనగసుయోధనుడేనుమొదలిటకు । యరుదెంచితిననెను
నిసురణమునకైసాయముగోరగ । నేనువచ్చితనెను
పలికెనుకృష్ణుండుభయులకునునె । బంధువుండననెను
మొదటవచ్చితివినీవునరునినే । మొదటగంటిననెను
యిరువురికియ్యెడసాయమొనర్చెద । యేర్పరింతుననెను
పదివేవురుగోపాలురునాయటు । బలముగల్గువారు
నారాయణులనుపేరుగలవారు । నమ్మదగినవారు
బవరమందుధనువుబట్టనేనొక । భాగంబన్నాడు
బలవంతులునారాయణులింకొక । భాగంబన్నాడు
భాగద్వయమునగోరుకొనుమొదట । పాథుఁడండన్నాడు
పాథుఁడమోసముజెందకగొనుమొక । భాగంబన్నాడు
అంతనరుడుసంతసించినిన్నే । యడిగితినన్నాడు
అదిగనిదుర్యోధనుడుసంతసిలి । యదితగునన్నాడు
పదివేవురగోరితిననిజనిబల । భద్రునిగనినాడు
ఆతనిబహుమానమందియనికిసా । యంబుగోరినాడు
అనవినిబలుడనెహరివారికిసా । యంబగునన్నాడు
హరినివిడచినేనొకపనిసేయగ । వెరచెదనన్నాడు
ఉభయులకిందుసహాయముజేయుట । కుడిగితినన్నాడు
పలుకమంచిదనివెడలిపోయికృత । వర్మనుగనినాడు
అక్షోహిణిసేనతోడవచ్చుట । కభయముగొన్నాడు
అతిముదమొందుచుసుయోధనుడుపురి । కంతటజనినాడు
అర్జునుగనుగొనిశ్రీకృష్ణుండిటు । లతనికివిన్పించె
కృష్ణు॥-పురుషాథుఁడలపదివేలవిడువనీ । బుద్ధిమందగించె
అయుధంబుబట్టనిననుగోరితి । వల్పుడవనిపించె

అర్జు॥-అననరుడనెనీవెదురైపోరిన । హరునతుమితిమించె
ఆట్టినిన్నెదిరిజయమునుబొందుట । యబద్ధమనిపించె
శుభకరుండవగునిన్నురథమునఁజ । జూడకోర్కెమించె
సారథివీవైయుండజయమునిస్సం । శయమనిపించె
సర్వజ్ఞుండవునీదయగల్గిన । జాలనియనిపించె
వైశం॥-అనుచుబల్కశ్రీకృష్ణుండాతని । నపుడుపరిహసించె
నీవనుకొనినటులొనర్తునని మ । న్నించిప్రీతిగాంచె
పాథుఁడంతశ్రీహరినిగొనియుప । ప్లావ్యమరుగుదెంచె
త్వరగశల్యుకడకొకదూతనా । ధర్మజుడంపించె
శల్యుడువినిపుత్రమిత్రులనుగొని । చయ్యనరానెంచె
దుర్యోధనుడాశల్యుడువచ్చెడి । త్రోవనువీక్షించె
భటునివేసమునభటులతోజేరి । పనులనుజేయించె
ఆహారవిహారములకుసౌఖ్యము । లచ్చటగావించె
వచ్చిశల్యుడతిసౌఖ్యములఁగొని । భటులనుబిల్పించె
యిటులసౌఖ్యములగల్పించినవా । డెవడనిప్రశ్నించె
అతడుగోరుకొననట్టిదిడగనా । మతిలోజన్మించె
అవసరమిదియనిసుయోధనుండపు । డచటికిజనుదెంచె
అతనికడకేగితననుదెల్పగా । యతడుకౌగలించె
యేమిగోరియిటులయుంటివన । భూమీశుడువిన్పించె
దుర్యో॥-పాండుకుమారులతోడనాకిపుడు । బవరముప్రాప్తించె
సైన్యాధీశుడవైనీవుండిన । జయమగుననిపించె
వైశం॥-కురుపాండవులకుసమానుండనని । కోర్కెనువిన్పించె
అతిసంతసమునశల్యుండాతని । కభయమ్మిడిగాంచె
బోయిపత్తుననియుపప్లావ్యమునక । ప్పుడేగుదెంచె
ధర్మజుండుతమ్ములతోజనివం । దనములాచరించె
అతనికుశలంబుదెలసివిందిడగ । యాతడుహర్షించె
మార్గమందుకురుపతియొనరించిన । మన్ననవిన్పించె
అతనికభయదానమిడుటధర్మజు । కంతటవివరించె
భళీయనుచునాపాండుపుత్రుడొక । వరమునువిన్పించె
మాతతనయసారథ్యమొనర్పగ । జొచ్చెదవనియెంచె

కర్ణునిమనంబు ద్రిప్పియర్జునుని । గావగవిన్పించె
అనగశల్యుడటుజేతుజయమునీ । కగునిజమన్నాడు
ధర్మాత్ముడవాహరికినీపయిన । దయగలదన్నాడు
అధర్మాత్ముడగుదుర్యోధనుడిక । హతమగునన్నాడు
సకలసామ్రాజ్యమునుగొనెదవుని । శ్చయమిదియన్నాడు
పోయివత్తుననిశల్యుండాకరి । పురికివెడలినాడు
అక్షోహిణిసేసనుగొనిసాత్యకి । యపుడువచ్చినాడు
ధర్మజాదులకుమ్రొక్కిరణకార్య । తత్పరుడైనాడు
ఛేదీశుడుధృష్టకేతువచటికి । జేరవచ్చినాడు
అక్షోహిణిసైన్యంబునుపప్లా । వ్యంబుజేర్చినాడు
ద్రుపదుడొకయక్షోహిణిగైకొని । యపుడువచ్చినాడు
ధర్మరాజుమన్ననలబొందిమో । దంబుగనున్నాడు
విరాటుడొకయక్షోహిణిసేనల । వేగబంపినాడు
పాండ్యరాజొక్కయక్షోహిణిగొని । పరగవచ్చినాడు
జరాసంధపుత్రుడుసహదేవుడు । త్వరగవచ్చినాడు
అతిబలవంతులయక్షోహిణిదా । నపుడుదెచ్చినాడు
కేకయులక్షోహిణీబలంబుల । వికదెచ్చినారు
అక్షోహిణులేడుపాండవుల । యండజేరినారు
పరగకురునాథుడొనగూర్చినయా । బలంబువినుమయ్యా
భగదత్తుండొకయక్షోహిణితో । వచ్చిచేరెనయ్యా
భూరిశ్రవుడొకయక్షోహిణికరి । పురికిబంపెనయ్యా
శల్యుడొక్కయక్షోహిణిగైకొని । సాయమొచ్చెనయ్యా
సుదక్షిణుండొకయక్షోహిణితో । ముదముగూర్చెనయ్యా
సైంధవుండొక్కయక్షోహిణిమొ । ప్పందదెచ్చెనయ్యా
నీలుడొక్కయక్షోహిణిగొనిమ । న్నించివచ్చెనయ్యా
కృతవర్ముండొకయక్షోహిణిగొని । కృపనువచ్చెనయ్యా
విందానువిందులక్షోహిణిగొని । వేగవచ్చిరయ్యా
అనేకరాజులుదెచ్చినయవిమూ । డక్షోహిణులయ్యా
అన్నిగూడిపదకొండక్షోహిణు । లచటగూడెనయ్యా
ద్రుపదునిపురోహితుడుకరిపురమున । కపుడువచ్చెనయ్యా
ఘనబహుమానమునొందిసభికులిటు । వినగఖలికెనయ్యా

# నెం. 1

బ్రా॥-అంధపాండుభూనాయకులు । అన్నదమ్ములతిబలయుతులు
వీరిసుతులుసమభాగంబు । ధారుణిగైకొనిరినిజంబు
కపటద్యూతంబొనరించి । కాననంబునకుబంపించి
పాండుసుతులుకష్టములొంద । పరమసుఖముతనసుతులొంద
యూరకుండెధృతరాష్ట్రుండు । ఉభయులకునుపరమాప్తుండు
వారికిభాగంబిడరాద । యూరకుండుటిదిమర్యాద
తనసుతులనుగాదనవలయు । తమ్మునిసుతులకునీవలయు
రెండువంశములుగననొప్పు । లేకుండిననిదియేతప్పు
పదకొండక్షోహిణులున్న । పవరమందుజయమేసున్న
భీముండతిబలవంతుండు । ఫీభత్సుండతిశూరుండు
సాత్యకిపరమాస్త్రవిదుండు । సర్వేశ్వరుడటువైపుండు
వారికెదురునిలచెడివాడు । బలుకుడింకనీసభవాడు
అభిమానమునొందగవలదు । అదివిడసుఖసంపదగలదు
సమరంబనుపలుకునువీడి । శాంతముతోవారలగూడి
అధికసుఖములొందెదరయ్యా । అటులసేయనామతమయ్యా
వైశం॥-అనభీష్ముడుసంతసపడెను । అవిప్రునకపుడిట్లనెను
భీష్ము॥వారినిటకుబిల్వగవలయు । వారిభాగమీయగవలయు
గాకుండినరణమేయగును । కౌంతేయులకేజయమగును
ఒక్కనరుండార్గురగెలెచె । ముక్కంటినియాతడుగొలెచె
అతనిముందునిల్వగలేరు । హతంబగుదురిటగలవారు
వైశం॥-ధృతరాష్ట్రుడువిప్రునకనెను । హితమతినొకనిజాబంపెదను
ధృత॥-పాండుతనయులజాబిల్పింతు । వారిభాగములనిప్పింతు
వైశం॥-నీవుమున్నుజనుమనియనెను । నేనిప్పుడుజేసెదననెను
అనగవిప్రుడంతటజనెను । అపాండుకుమారులగనెను
కరిపురివార్తనువినిపించె । కదలిపురమునకుజనుదెంచె
అంధుడుసంజయురావించె । అతనికిట్లుదావివరించె
ధృ॥-పాండుసుతులచెంతకుజనుము । బరగవారలకునిట్లనుము
వనవాసముగావించితిరి । వైభవంబులనువిడచితిరి

అతిబాధలనటనొందితిరి । అజ్ఞాతముగావించితిరి
ఇపుడుమీశుభంబునువింటి । యెంతోసంతసమునుగొంటి
నాసుతులనుగాదనియంటి । నాపల్కులువినరనియంటి
నిన్నుక్రోధమందకుమంటి । నీశాంతంబునుగనుగొంటి
యిటులనాదుపల్కులజెప్పి । యెరిగింపుమునీమదివిప్పి
సమరముమాన్పించగదయ్యా । సత్వరముగరాగదవయ్యా
వైశం॥-అనగసంజయుడురథమెక్కె । అరిగెదననియతనికిమ్రొక్కె
పాండుసుతులచెంతకుజనెను । వారలగనివందనమిడెను
సంజయుండుసభకేతెంచె । సభాసదులనందరిగాంచె
ధృతరాష్ట్రునివృత్తాంతంబు । హితవుగబోధించెఘనంబు
ధర్మజునెయ్యడవీక్షించె । తనమతంబునిటువివరించె
సం॥-ధర్మతత్పరుండవునీవు । దయగల్గినమానసివీవు
దుర్మార్గుడుదుర్యోధనుడు । దుష్టాలోచనతత్పరుడు
మీపాలిడసమ్మతిగొనడు । మీమేలెన్నడుగనుగొనడు
కదనంబొనరింపగనెంచె । కఠినమార్గమవలంబించె
నీవుశాంతమొందగరాద । నీవురణముమానగరాద
యెల్లజనంబులహింసించి । యీరాజ్యంబునుపాలించి
సుఖముజెందగోరుటకంటె । సుఖమగుభిక్షాన్నముదింటె

# నెం. 5

ధర్మ॥-అనధర్మజుడనెయతనిరాజ్యమున । శాంతంబొందలేదు
మాభాగంబునుగైకొనుటెప్పుడు । మాకుతప్పుకాదు
భీష్మద్రోణాదులుగల్గినరని । విర్రవీగరాదు
పదకొండక్షౌహిణులబలముగని । ప్రజ్ఞసేయరాదు
పార్థుడుగాండీవధ్వనిసేయగ । బలమునిల్వబోదు
మహాబలులొక్కపార్థునికోడిన । మాటమరువరాదు
అహంకారముననిటులబల్కెనని । యనుకొనసరిగాదు
దయతోమాభాగముమాకొసగిన । తప్పకగునుమేలు
లుబ్ధుండగుచోయైదూళ్ళిచ్చిన । లోపమనముచాలు
అంతకొప్పకుండినచోయుద్ధం । బైననధియేదేలు

కృ॥-అనగకృష్ణుడనెయాశజెందతుము । యాతడిడడుపాలు
అయిదూళ్ళతిదయతోనిచ్చినను । యదియేపదివేలు
తనసుతులనుగాదనడంధుండిది । ధర్మము కాబోలు
తమ్మునితనయులకిటులజెప్పతన । తనయుడుధరనేలు
సంజయాయుద్ధమెటులదప్పదిక । జనుమనియన్నాడు
అయినగానినేనచటికివచ్చెద । యపుడేమనురేడు
కొడుకుకుబుద్ధినిజెప్పినచోయొన । గూడుతనకుగూడు
అటులవినకున్నచోతమకుతమవారి । కగునచ్చటకీడు
వైశం॥-సంజయుండువినియాజ్ఞనుగైకొని । చయ్యనజనినాడు

# (రెండవాశ్వాసము)

శీఘ్రయానమునకరినగరమునకు । జేరబోయినాడు
ధృతరాష్ట్రునిగనిధర్మజుడాడిన । దెరవుబల్కినాడు
సంజ॥-అతడుదైవమగువారినినమ్మితన । మతముజెప్పినాడు
కపటద్యూతమునాడెవలదనని । కారణమన్నాడు
యింతకువచ్చెనుయిపుడైనను । యూహించెదనన్నాడు
ధర్మబుద్ధినొందినచోతనయులు । దక్కెదరన్నాడు
అటుగాకుండినసర్వనాశనం । బగుననియన్నాడు
వైశం॥-సంజయుడివ్విధిబల్కవిదురుడతి । సత్వరజనినాడు
అదివినియన్నునగనివిదురుండిటు । లపుడుబల్కినాడు
విదు॥-నిఖిలపుణ్యంబులొక్కెడధర్మము । నిలువుటొక్కటయ్యా
హరిహరాదులాధర్మాత్మునియే । మనగజాలరయ్యా
ధర్మారాజుధర్మాత్ముండనిమది । దల్పుచుండుమయ్యా
ధర్మాత్ములతోవిరోధమొందుట । తగనికార్యమయ్యా
వైశం॥-అనుచువిదురుడారాత్రిహితబోధ । నాచరించెనయ్యా
అంతదెలవారెనిత్యకృత్యముల । నాచరించెనయ్యా
సభకుజేరిధృతరాష్ట్రుడువేగమె । సంజయునకనెనయ్యా
ధృత॥-శ్రీకృష్ణుండేమనియెనోయద్ది । జెప్పవలయునయ్యా
వైశం॥-సంజయుండనెనుశ్రీకృష్ణుండిటు । సల్పుమనియెనయ్యా

సం॥-ధర్మరాజునకుగోపముబుట్టెను । తాళకమీరనెను
నీటబుట్టునగ్ని హెూత్రమటుశాం । తింపదుగనుడనెను
ధనధాన్యంబులసత్పాత్రములకు । దానమీయుడనెను
చెలులచుట్టములనాశ్రితులను । బూజించుడువడియనెను
అఖిలవస్తువులనానందంబుగ । యనుభవించుడనెను
కాంతలసుతులనుసంతసమొందగ । గారవించుడనెను
తమతమమనములగోరినసుఖములు । త్వరగదీర్చుడనెను
అరచేతులప్రాణములనిడుకొనుచు । యనికినడ్వుడనెను
ఇంతయేలయనసభలోద్రౌపది । కంతజెసిరనెను
అపుడుననుబిల్వమానరక్షణము । నాచరించితనెను
అరుణంబుదీర్చెటికాలంబిక । చేరువయ్యెననెను
అరదమందునేనెక్కిసారథ్య । మాచరింతుననెను
గాండీవంబునుటంకరించుచున । రుండువచ్చుననెను
పదుకొండుక్షోహిణులసైన్యమును । బాడుజేయుననెను
శ్రీకృష్ణుండెల్లరువినసభలో । జెప్పుమనియెనయ్యా
అంతటయర్జునుడలుకజెందిదా । నపుడుబల్కినాడు
భూశయనంబునుధర్మజుడడవిన । బొందినడన్నాడు
గనిపార్థుడాడుకురుపతినిదలచుకొని । కటకటబడినాడు
భూశయనంబికనీకొనరింపగ । పూనికయున్నాడు
గదసారించుచుభీముడిప్పుడే । కనలుచున్నాడు
కురుపతిసంధికియొప్పకుంటయే । సరసంబన్నాడు
ప్రతిజ్ఞాభంగమికగాదంచును । బహుముదమన్నాడు
భీష్మద్రోణాదులకుమ్రొక్కియీ । విధముదెల్పినాడు
అధర్మాత్ములకుసాయపడువారి । కపజయమన్నాడు
ధర్మమేవారికెదురైగెలుచును । తప్పనిదన్నాడు
వైశం॥-సభికులుభీతినిజెందిరిభీష్ముడు । చయ్యనవిన్పించె
నరనారాయణులేకృష్ణార్జున । నామములనియెంచె
భీష్మ॥హరిపరమాత్ముడురెండురూపముల । యవనినిజన్మించె
సురలువేడగానివాతకవచుల । దురమునహరియించె
సురాసురలకవ్వారలగెల్వగ । చొప్పడదనిపించె
కర్ణదుశ్శాసనులటోధవిని । కాలముప్రాప్తించె

## నెం. 1

వైశం॥-దేవనదీసుతుడిట్లనెను । ధృతరాష్ట్రుడువినిచింతిలెను
ధృత॥-గదగొనిభీముండరుదెంచు । కౌరవశతమునుహింసించు
పార్థుఁడతనితోనడుదెంచు । ప్రళయరుద్రువలెగన్పించు
యెల్లరనాశంబొనరించు । యీకర్ణుండేమెదిరించు
వైశం॥-అంధరాజుకడుదుఃఖించె । అంతసంజయుడువిన్పించె
సంజ॥-ధర్మజుసంకల్పమువినుము । తనయులననివలదనియనుము
విరాటబలములగైకొనును । వివిధాస్త్రంబులుచేగొనును
శిఖండిభీష్మునిహింసించు । శీఘ్రమిద్దినిజమనిపించు
దృష్టద్యుమ్నుండేతెంచు । ద్రుపదజాసుతులబుత్తెంచు
ద్రోణాచార్యునిహింసించు । ద్రుపదునిపన్నముచెల్లించు
గదగొనిభీముండేతెంచు । కౌరవశతకంబునుద్రుంచు
అభిమన్యుడురణమొనరించు । అఖిలరాజపుత్రులద్రుంచు
సవ్యసాచిరణమొనరించు । శకునిసైంధవులహింసించు
అశ్వద్ధామనునిర్జించు । అకర్ణునిహతమొనరించు
కృష్ణునితమ్ముండేతెంచు । కృతవర్మాదులహింసించు
నకులుడుకదనంబొనరించు । శకునియులూకాదులద్రుంచు
సహదేవుండనియొనరించు । చాలాబలములహింసించు
శల్యునినేద్రుంచెదననెను । సత్యంబిదిజరిగెడిదనెను

## నెం. 5

వైశం॥వినిధృతరాష్ట్రుడుదుఃఖమొందగా । భీష్ముండనెనయ్యా
భీష్మ॥యింతదుఃఖమీవందనేలతగ । దిటులసేయుమయ్యా
పాండుసుతులబిల్పించిప్రేమతో । భాగమొసగుమయ్యా
నీపుత్రులమెప్పించిసుఖంబుల । నీవుబొందుమయ్యా
కర్ణునికరమునబొమ్మవలెసుతుడు । గ్రాలుచుండెనయ్యా
అతనిమూలమునకౌరవవంశం । బంతరించునయ్యా
వైశం॥-అనవినికర్ణుడుకోపమునొందుచు । యపుడుబలికెలయ్యా
కర్ణ॥-భీష్ముడవనిపైబడెడుదాకనే । వెడలనువినరయ్యా

వైశం॥-ఖవరమొనరింపననుచుశస్త్రముల । బారవైచెనయ్యా
పడినతరువాతరణమందుననా । బలముజూపుదయ్యా
అనుచుకర్ణుడతికోపముతోడుత । యపుడువెడలెనయ్యా
నవ్విభీష్ముడనెనుయోధనునితో । నమ్మినవాడయ్యా
భీష్మ॥శస్త్రముబట్టినవిడచిననీతడు । సమానమగునయ్యా
కనెదవింకనాబలముయుద్ధమున । కర్ణునిబలమయ్యా
వైశం॥-కర్ణపక్షపాతమునకురురాజు । కనలిపల్కెనయ్యా
దు॥-పాండునందనులుగెల్తురనిమీరు । బల్కుచుందురయ్యా
కర్ణదుస్ససేనులనమ్మితిని । కదనంబునకయ్యా
ముగ్గురమాపాండవుగెల్చియీ । భూమినేలుదయ్యా
వైశం॥-భీష్ముడువినిచింతించెయంధుడీ । విధముబల్కినాడు
కాలమాసన్నమగుటచేనితని । దూలనాడినాడు
విదురుడనెనింతయేలపాండవుల । బిలిచెదమన్నాడు
వారిపాలువారికిడినబుట్టదు । వైరంబన్నాడు
అనవినిధృతరాష్ట్రుడుమదియొప్పక । యపుడుబల్కినాడు
ధృత॥-సంజయారెండుసేనలకుంగల । శక్తిదెలుపుమయ్యా
యెవరెవరనిలోజయమునొందెదరు । యెరిగింపగదయ్యా
సం॥-అనసంజయుడనెయిదిజెప్పగనే । నల్పబుద్ధినయ్యా
వ్యాసునిబిలిచినయీసంశయముని । వారింపుగదయ్యా
వైశం॥-అనగగాంధారియతిభక్తితోడ । యతనిదలచెనయ్యా
తలచినంతలోవ్యాసమునీంద్రుడు । త్వరగవచ్చెనయ్యా
అతనిబూజించివందనమిడగా । యతడుబల్కెనయ్యా
దివ్యదృష్టిచేవారనుకొన్నది । దెలిసిజెప్పెనయ్యా
సంజయాయితనిసంశయముదీర్ప । జాలుదువీవనెను
అట్టిశక్తినీకిడితినిజెప్పుము । యదివినిజనియెదను
అనమహాప్రసాదంబనిసంజయు । డతనికిట్టులనెను
సం॥-అఖిలశక్తిసంపన్నుడుకృష్ణుం । డచటజేరినాడు
అతనితోసమానుండీజగముల । యందుజూడలేదు
హరుడుభక్తుడగుబాణునికైరణ । మాచరించెనాడు
ఒక్కనిమిషమునకృష్ణుడుబాణుని । యుక్కుబాపినాడు
దేవలోకపారిజాతమిచటికి । దెచ్చిపెట్టినాడు

అధికదుష్కరములైనకార్యముల । నాచరించినాడూ
ఫాల్గుణునిరణమునగెల్పించుటకై । ప్రతినబూనినాడు
అతడుతనచేతిచక్రమువారల । కందజేసినాడు
మాయచేతదానియంకమన్నిట । మరుగుపరచినాడు
భువనంబులబుట్టింపగిట్టింప । మూలమైనవాడు
ధర్మతత్పరులచెంగటయాతడు । త్వరగనిలచినాడు
అతడునిలువగాజయముదప్పునా । అదివినుమన్నాడు
దుర్యోధనుమూలంబుజేసుకొని । త్రోవజూపినాడు
అఖిలజనంబులజంపిభూభార । మార్పివేయుజూడు
వైశం॥-అనవ్యాసుడువినిసంతసంబంది । యంధునకనినాడు
సకలార్థజ్ఞంబులనెరిగినవాడీ । సంజయుడన్నాడు
పాండుకుమారులబిలచివారలకు । పాలిడుమన్నాడు
వారుమెచ్చహరిమెచ్చునీసుతులు । బ్రతికెదరన్నాడు
సకలసౌఖ్యములననుభవింత్రుని । స్సంశయమన్నాడు
కాలగతులుదప్పింపనీవెటుల । జాలెదవన్నాడు
అఖిలధర్మములజెప్పనీతడని । యద్భుతుడైనాడు
అంధరాజుసంజయునిబొమ్మంచు । యపుడుబల్కినాడు
భవనమునకుజనిగాంధారికిద్ది । బల్కసాగినాడు

—: ఫలశ్రుతి :—

## నెం. 1

భారతవీరులచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుదీని । విరచించెనుభక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడుయీసత్కృతిని
సదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని



# (మూడవహాశ్వాసము)

## నెం. 1

వైశం॥-ధర్మరాజుసభజేయించి । తగువిధముగనెల్లరగాంచి
తమ్ములగనిమదియోచించి । త్వరగబల్కెసమయమునెంచి
ధర్మ॥-హరిసన్నిధికేగుదమయ్యా । అతనినిబ్రతిమాలుదమయ్యా
సంధిసేయదోలుదమయ్యా । జనక్షయమునిలుచుగదయ్యా
వైశం॥-అనితమ్ములనెల్లరగొనెను । హరిసమీపమునకుజ్జనెను
అతనిచేతమన్ననలంది । అపుడుబలికెతనమదిగుంది
ధర్మ॥-నీవుమమ్ముదయగనవలయు । నీవారలగావగవలయు
హస్తిపురంబేగగవలయు । అంధరాజుతోననవలయు
మమ్మువారిసమముగగాంచి । మాభాగముమాకిప్పించి
కులముగాచిసౌఖ్యముగొనుము । బలములగనిమదినమ్మకుము
హరినీపుత్రులవలెగనుము । ఆధృతరాష్ట్రునకిట్లనుము
అర్ధభాగమీయకయున్న । అయిదూళ్ళిచ్చినదగునన్న
జనక్షయంబగుకార్యంబు । సల్పిగొనెడిమధురాన్నంబు
నాకుప్రియముగాదనియనుము । లోకులుమెచ్చగజనుమనుము
యెటులనైనసంధినిగూర్చి । యీమాచింతనుబోనార్చి
గాచుటకైజనవలెనయ్యా । గలదింకొకసంశయమయ్యా
నీవచటికిజనయోచించు । నీకుబాధలనుగల్పించు
దుష్టబుద్ధిదుర్యోధనుడు । దుష్టచతుష్టయసంయుతుడు
వైశం॥-అనవినికృష్ణుండిటులనెను । ఆసందేహమువలదనెను
కృష్ణు॥-మంచిదికరిపురికేగెదను । మంచిమాటలనుజెప్పెదను
నీధర్మంబుననూచింతు । బాధగలుగుననివచియింతు
నేజనుటయెయోగ్యంబౌను । యీజగమునకీర్తియెయౌను
దుర్మార్గులువినరనుకొనుము । తుదకుయుద్ధమేయౌనిజము
తగుసన్నాహములొనరించి । ధైర్యంబేమదిగల్పించి
దుష్టశిక్షణంబొనరించి । శిష్టరక్షణంబొనరించి
మెలగుటయేక్షాత్రముగాద । మీమదికిదిదెలియగలేదా
నాకుకీడుదలచినయేని । నాచక్రంబునుచేబూని

రణభేరులనటమోృయించి । క్షణములోననెల్లరదృంచి
రక్తపుఏరులుజారించి । రానేవచ్చితిగననెంచి
యీసంశయమునువిడుమయ్యా । యిదియేనాపనియగునయ్యా
వైశం॥-అనభీముంతపుడిట్లనెను । అన్నపలుకుయోగ్యంబనెను
భీము॥-సకలజనక్షయమికచప్పె । సంధిసేయుమందరికొప్పె
యిదివినకుండినయుగుదప్పె । యెల్లరకునుగలుగునుముప్పె
శ్రీకృష్ణుడుబలుకుచునవ్వె । చేతకుగూతలకునుదవ్వె
కష్ణు॥-కౌరవశతకంబునుదృంచి । ఘనసామ్రాజ్యముసాధించి
అన్నకుపట్టముగట్టించి । మిన్నకుండుదనిపలవించి
భీతిబొందితివికాబోలు । పిరికితనముజూచితిచాలు

## నెం. ౫

వైశం॥-అనవినిప్రళయాంతకాకారమున । యపుడుబొంగినాడు
కనులనిప్పులజారాల్చువిధమ్మున । గాంచిపల్కినాడు
భీముండనుమదగజమీవరకే । వెదలెడిదన్నాడు
కౌరవులనియెడికమలనాళముల । గలచెడిదన్నాడు
అన్నగారిశాంతశృంఖలంబున । యాగినదన్నాడు
భీము॥కదనమందువేలసైన్యములగొని । ఖండలుగావింతు
మహాశ్మశానమువిధముజేసినా । మాటనుజెల్లింతు
సవ్యసాచిరథమునననుగాంచుచు । సంతసమొనరింతు
వైశం॥-అనగపాథుఁడనెచెప్పదగినంత । యన్నజెప్పినాడు
అతిపకుసభలోజేసినద్రోహము । నరసితినానాడు
అతికష్టంబులబెట్టినఏకృప । బ్రతికితిమన్నాడు
నీవెటుజెప్పినయటులజేయుటకు । నిలచితిమన్నాడు
సంధియన్నసమరమన్నరెండిట । సంతసమన్నాడు
పాండవనావనుదరికిజేర్చనీ । బారంబన్నాడు
అంతటనకులుడుశ్రీకృష్ణునితో । యపుడుబలికినాడు
అవులబట్టిననాటిజయంబును । యరసెదరన్నాడు
యేడకీహీలిటజేరినపని । యెరిగెదరన్నాడు
భీమార్జునులబలంబులువారికి । విదితంబన్నాడు

శుభకరుండవిటుజేరియుంటివని । జూచెదరన్నాడు
సాక్షాత్తుగనీవుజెప్పసంధిని । సలిపెదరన్నాడు
అన్నలుజెప్పినపలుకులేనాకు । హర్షంబన్నాడు
అంతసహదేవుడపుడుబలికెనీ । వరుగుటఁగదయ్యా

సహ॥-అరిగితివోనీమాటలువారలు ।యాలకింపరయ్యా
అర్ధఁభాగమైదూళ్ళుగూడనిడ । డాతడువినుమయ్యా
క్షత్రియజాతిలోబుట్టియడుగుటలు । కాసికార్యమయ్యా
అతిబలవంతులుపాండవులందును । యడుగుటదగదయ్యా
రణమునరక్తపుటేరులుబారిన । రాజ్యమబ్బునయ్యా
అన్నలుజెప్పినపలుకులేనాకు । హర్షంబగునయ్యా

వైశం॥-అనసాత్యకిమొదలకుసభికులుయో । గ్యబిందియునిరయ్యా
అనద్రొపదిచింతించుచుకృష్ణున । కపుడుబల్కెనయ్యా

# నెం. 1

ద్రౌ॥-ధర్మజుపల్కులునేవింటి । దైన్యంబునుమదిలోగొంటి
వరబలమునజన్మముగొంటి । భరతవంశమునబడియుంటి
బలవంతులపతులనుగొంటి । బలవంతులపుత్రులగంటి
తోడబుట్టుబలయుతులంటి । దుర్మార్గుడునను వెన్నంటి
వెంట్రుకలఁబట్టెనుగాదా । వీరలుగనుచుండగగాదా
నీదయతోరక్షణగొంటి । నిన్నేమదిదల్చుచునుంటి

వైశం॥-అనుచువెంట్రుకలముందుంచె । అతిదుఃఖముతోవచియించె

ద్రౌ॥-కేశంబులబట్టినవాని । కేలనుఖండింపగలేని
భీమునిబలమడవినగాచు । వెన్నెలవలెనామదిదోచు
గాండీవంబునుధరియించి । కడువిక్రమమునుజూపించి
అసుయోధనునితలద్రుంచి । అతనిశరమ్మునుజూపించి
ధర్మజునన్నునుమెప్పించు । ధనంజయుడుకీర్తినిగాంచు
యిటుసేయనియర్జునుబలము । యేలగాల్పనగునదినిజము
దుష్టులశిక్షించెడినీవు । తోబుట్టువుయిటనున్నావు
పరమాత్ముడవీవిటులుండ । పతులువ్రతినదల్చుచునుండ
సంధిపొసగజాలదువినుము । పార్థునినేననియనుకొనుము

వైశం॥-అనుచుకంటసీరిడుదాని । గనిహరిబల్కెనుదయబూని
కృష్ణు॥చింతయేలజేసెదవమ్మా । శ్రీఘంటికులగునోయమ్మా
కన్నీళ్ళేఖడ్గములౌను । కౌరవకులనాశంబౌను
వారికాంతలిట్లేక్చెదరు । ఘోరదుఃఖమునుబొందెదరు
యమునిదున్నమెడలోనున్న । ఆఘంటాధ్వనివినుమన్న
సంధిశాంతనాదమువినదు । జావునకుజాసిద్ధపడెదరు
కౌరవశతమునుహరియింతు । ఘనసామ్రాజ్యమునిప్పింతు
వైశం॥-అనుచుబల్కెద్రౌపదివినెను । అపుడుశాంతమునుమదిగొనెను
అంతధర్మజుండిటులనెను । సంతసమునజనుమనియనెను
ధర్మ॥-అయ్యానీదిరోహిణితార । అగునురేపురేవతితార
సాధనమునవెడలగదయ్యా । సాధించియెవచ్చెదవయ్యా
వైశం॥-అనితమ్ములతోజనుదెంచె । అతిసుఖముగనిద్రనుగాంచె

## నెం. 5

తెలవారుచుండశ్రీహరివేగము । తెలవిబొందెనయ్యా
కాలోచితకృత్యములదీర్చిభా । స్కరునివేడెనయ్యా
అగ్నిపూజగావించిబ్రాహ్మణుల । నపుడుబిలచెనయ్యా
ప్రియాఖమందిచ్చుదానములనతి । భక్తినిచ్చెనయ్యా
వారిదీవనలబొందిసాత్యకికి । గోరిబిలచెనయ్యా
కృష్ణు॥వేగనారథముదెమ్ము నావెంట । వెడలగవలెనయ్యా
ఆయుధమ్ములజగైకొనియరదము । సందుబెట్టుమయ్యా
అచటదుర్మార్గులుండిరిగావున । యవసరమగునయ్యా
వైశం॥-అనవినిసాత్యకిజనిదారుకునకు । యపుడుజెప్పెనయ్యా
వరలుశైభ్యసుగ్రీవమేఘపుష్ప । వలాహకమ్ములను
అరదమునగట్టిగరుడధ్వజంబు । నంతటనిలుపగను
సాత్యకిసకలాయుధములగైకొని । సత్వరమందిడెను
దారుకుడంతటయరదముగైకొని । త్వరగవచ్చెనయ్యా
బోయివత్తుననిశ్రీకృష్ణుండతి । ముదముతోడయనెను
ధర్మజుండుమాతల్లిదుఃఖమో । దార్చుచురమ్మనెను
వినిశ్రీకృష్ణుడుయటులేయౌననుచు । వెడలుచుగనుగొనెను
శుభశకునంబులుగన్పడెకార్యము । సులభంబౌననెను

మంగళవాద్యములంతమ్రోగగా । మాధవుండుజనెను
రథమతిదూరంబేగినంతనా । రహదులనుగనెను
అరదమునుడిగ్గినతులనొనరించి । యపుడువారికనెను
యేకార్యమునకుమహాత్ములందరు । యిచటనుంటిరనెను
అననారదుడనెనీదర్శనంబు । నాశించితిమనెను
కురుపతిసభలోనీవాడేడిసూ । క్తులనువిందుమనెను
అచటనీకిడినప్రత్యుత్తరముల । నాలకింతుమనెను
అటుసేయుండనికృష్ణుడువేగమె । యచటినుండిజనెను
అర్కుడస్తాద్రికేగెకుశస్థల । మందుజేరుకొనెను
పటకుటీరముననుండిభక్తులిడు । భక్ష్యంబులగొనెను
అచటిభక్తులొనరించునుతులవిని । యపుడునిద్రగొనెను
కుశస్థలమునకుహరిజేరినదని । కురుపతివిన్నాడు
విదురభీష్మదుర్యోధనాదులను । బిలువబంపినాడు
శ్రీకృష్ణుడుపాండవదౌత్యంబును । జేయవెతలినాడు
వచ్చెకుశస్థలికిటకువచ్చుతెల । వారినయన్నాడు
అతడుపరమేశుడాశ్రితావనుడు । చతురుండన్నాడు
తనయాలతనికితగువిధిపూజలు । నొనర్చుమన్నాడు
అనదుర్యోధనుడపుడుప్రధానికి । యాజ్ఞజేసినాడు
దుర్యో॥అంధరాజనేహరికిభూషణము । లర్పణగావింతు
మంచిమంచిపట్టువస్త్రములను । సమర్పణగావింతు
వైశం॥-అనవిదురుండనెనీమదినెరిగితి । యాతడుగొనడనెను
లంచమిచ్చిమెప్పించదలచితివి । లక్ష్మీపతియనెను
వినుమైదూళ్ళాపాండవులకిడినతృప్తి । జెందుహరియనెను
వచ్చినకార్యముజేయుమాయదియే । బహుమానంబనెను
అతనికవమానమొనర్చుకార్యం । బాచరించకనెను
అనభీష్ముండనెసంధియొనర్పగ । నతడువచ్చెనయ్యా
లంచమిడుచేలవచ్చినపనిగా । వించుమునీవనెను
దుర్యోధనుననెయతనికెదురుగా । దురుక్తివలదనెను
కేశవుడుభయులకుసమానుండగు । కినుకజెందుననెను
అనదుర్యోధనుడనెపాండవజయ । మతడుగోరునయ్యా
దుర్యో॥యెన్నిమనమిడినపాండవపక్షం । బీతడుండునయ్యా

పాండవులకుబలమీతడేయవును । బంధించెదనయ్యా
చెరబెట్టినచోపాండుకుమారులు । వెరచిపోదురయ్యా
వైశం-॥అనభీష్ముండనెయతనిబంధింప । హరునిచేతగాదు
భీష్ము॥బంధమోచనుండతనిబంధింప । భక్తుండవుగాదు
అతడుకోపింపబంధుజనులతో । హతమయ్యెదవీవు
వినాశకాలముసమీపించెనీ । విధముదలచినావు
వైశం॥-ధర్మనాశకుడవనిపితామహుడు । తరలిపోయినాడు
విదురుడునాశంబగుదువనిచెప్పి । వెడలిపోయినాడు
జనకుడనెనాశమగుదువావిధము । సలుపకుమన్నాడు
అనేకవిధములజెప్పగావినుచు । యాతడుజనినాడు

# నెం. 1

అంతటసూర్యోదయమాయె । అపుడుకృష్ణునకుమేల్కాయె
కాలకృత్యములనొనరించి । కడువడిరథమారోహించి
ముదమునకరిపురికిజనెను । అదిధృతరాష్ట్రుడువినియనెన
భీష్మాదులనటరావించి । భేరీభాంకృతులొనరించి
యెదురుకొనగనటుబంపించె । యెల్లజనంబటకేతెంచె
కురుపతిసుతుడంతటవినెను । అరుగకపురమందునిలచెను
భీష్మాదులువేగమెజనిరి । వెడలికృష్ణునంతటగనిరి
అతనికితగుపూజసల్పిరి । అందరుక్షేమంబాయనిరి
అంతకృష్ణుడెల్లరగాంచి । అందరిశుభమునువినిపించి
పురమార్గంబునజనుచెంచె । పురమందలిశోభనుగాంచె
పురస్త్రీలుయతనినిగనిరి । పాలతులుతమలోనిట్లనిరి
స్త్రీలు॥-పసితనమునరక్కసిద్రుంచె । బలయుతుడగుకంసునిద్రుంచె
పారిజాతమునుదెప్పించె । పడతికోర్కెదాపూరించె
గోపస్త్రీలమనములగొనెను । గోరివెన్నెపాలనుగొనెను
వేదంబులకందనివాడు । వేగమనకుగన్పడినాడు
వైశం॥-అందరిటులబల్కగజనెను । ఆధృతరాష్ట్రునిగనుగొనెను
ధృతరాష్ట్రుడువినిమోదించె । హితమతినాతనిపూజించె
తనకాసనమారోహించె । తనయులకుశలంబెరిగించె

విదురునింటికేగెదననెను । విదురుడతనిదోడ్కొనియనెను
అతిసంతసమునబూజించె । అతిప్రీతికృష్ణుడుగాంచె
కుంతినిగనివచ్చెదననెను । సంతసమునయుచటికిజనెను
అపెకృష్ణునంతటగనెను । అతిదుఃఖముమదిలోగనెను
తనకొడుకులక్షేమమువినెను । త్వరగనాతనికినిట్లనెను
కుం॥-నీశికినుగాంచినరయ్యా । నీకుబంధుగులువారయ్యా
నీకృపచేబ్రతికినరయ్యా । నేనువింటినోమాయయ్యా
కడుసుఖములనొందినవారు । అడవినెట్టులుండిరివారు
భక్ష్యభోజ్యములదినువారు । ఫలములతోగడిపిరివారు
కొడుకులకునుక్షేమంబయ్యా । కోడలికిక్షేమంబయ్యా
ఇచటివిదురొక్కడుగాక । యెవరుగనరుమదిదయలేక
కౌరవులునునాపుత్రకులు । గాంచెదమనయుభయులుసములు
దైవసాక్షియనివచియింతు । దానికితగువిధిజూపింతు
అదినామదినిక్కంబైన । ముదముగాంతురుమీరుబిరాన
నాసుతులకునిటులనుమయ్యా । నామాటలుమరువకుమయ్యా
క్షత్రియజాతినబుట్టితిరి । సమరజయంబునుగాంచితిరి
భుజబలమునబ్రతుకుటమేలు । ద్విజులవిధంబడుగుటజాలు
పురుషశబ్దముండినయెడల । భుజబలంబుజూపుడిమిగుల
కృష్ణ॥అంతకృష్ణుడనెనేయమ్మా । ఆచింతనుమదిగొనకమ్మా
నీతనయులగెల్పించెదను । నీకుసుఖముగల్పించెదను
నీకొడుకులుబలయుతులమ్మా । యీకరిపురమేలెదరమ్మా
వైశం॥-అనగకుంతిసంతసపడెను । అదినీభారంబనియనెను
అనగకృష్ణుడంతటజనెను । గనెసుయోధనునిభవనమును
అంతద్వారపాలురుజనిరి । హరిరాకడకురుపతికనిరి
సుయోధనుండెదురుగజనెను । జూచిహరునిదోడ్కొనిజనెను
ఆతనికితగుపూజలొనర్చె । ఆతడుగూర్చుండనొనర్చె
అంతకృష్ణుడెల్లరగాంచె । అందరికుశలముప్రశ్నించె
కురుపతివిందిడయోచించె । గోవిందుండిటువినిపించె
విదురునింటగుడిచెదనయ్యా । వేగమరలవచ్చెదనయ్యా
అనసుయోధనుడుయోచించె । అంతగర్వముఖమునుగాంచె

అప్పుడుకృష్ణునకునిట్లులనెను । ఆహారముసిద్ధంబనెను
దు॥-పాండవకౌరవులకునీవు । బంధుండవుసమముయునావు
గుడుపననుటకిదిమర్యాద । గోపాలాతెలియఁగరాద
వైశం॥-అనఁగకృష్ణుడప్పుడిట్లనెను । అందుదర్మమీవిధమనెను
కృ॥-వచ్చినకార్యముగావించి । మెచ్చిదూతయప్పుడుభుజించి
అతడుబోవలెవినుమయ్యా । దూతమొదటదినడగదయ్యా
అదియుగాకశత్రువునింట । యూరగింపవిషమగునంట
శత్రువుండనెటులౌపనగ । చయ్యనచెప్పెదనదివినగ
పాండుసుతులుప్రాణములయ్యా । వారికిశత్రుడవీవయ్యా
గానవాకుశత్రుడవయ్యా । గాదుకుడుపయోగ్యంబయ్యా
వైశం॥-విదురినింటకుడిచెదననెను । వినిదుర్యోధనుడౌననెను
అనుచువిదురినింటికిజనెను । అతడుహరినిముదమునగనెను
హరికిమజ్జనంబొసరించి । అవనిసుపలకువిందుంచి
సాత్యకికృష్ణులబూజించి । సరసాన్నంబులవడ్డించి
తానువారితోభుజయించి । తాంబూలాదులగావించి
తల్పమందుకృష్ణుడుబండె । త్వరగనతనికిట్లనుచుండె

## నెం. 5

విదు॥-నీవేటికివచ్చితివినిపలుకు । నీచులువినరయ్యా
ద్రోణభీష్మకర్ణాదులుగలరని । తులువలందురయ్యా
పదుకొండక్షోహిణులున్నారని । ముదముజెందిరయ్యా
వచ్చుచుంటివనివెలసియెల్లరిటు । బల్కుచుండిరయ్యా
యీకృష్ణునిపల్కులువినడగదని । యెల్లరందురయ్యా
పాండుతనయులకుదిగ్విజయంబున । బరగవేడిరయ్యా
వారెల్లదుకకచేతనిచటికి । వచ్చియుండిరయ్యా
పాండుసుతులజంపిభూమికొనుటకు । ప్రతినజేసిరయ్యా
అటుగాకుండినరణమునజచ్చెద । మనుచుబల్కిరయ్యా
నీకుకీడుచేయఁగదలచెదరది । నీవెరుంగుమయ్యా
సర్వజ్ఞుండవునీకుజెప్పుటకు । జాలకుందునయ్యా
కృ॥-వినికృష్ణుండనెనీప్రేమకునే । బ్రీతిజెందితయ్యా

అదినేనెరుగుదునాసంకల్పం । బాలకింపుమయ్యా
నాపల్కులువినరెల్లసురజమున । ఏకింపుపడిపుమయ్యా
చుట్టంబులుకలహించుచుండనది । జూచుటతగదయ్యా
తనబుద్ధికిదోచినయటుచెప్పుట । ధర్మంబగునయ్యా
గానయిదువురకుశాంతియుక్తమే । గావించెదనయ్యా
అదియుగాకకృష్ణుడుజెప్పెనరజ । మాగునందురయ్యా
యీయపకీర్తికివెరచిచెప్పుటకు । యిందువచ్చితియయ్యా
అయిననాకుకీడుజేయదలచిన । అదిచెల్లదనయ్యా
క్షణమాత్రంబునభస్మమొనరించి । కదలిపోదునయ్యా
వైశం॥-అనుచుదెల్పగాసమ్మతుడాండవని । యాతడుజనెనయ్యా
నిర్మలమగుతల్పంబునకృష్ణుడు । నిద్రజెందెనయ్యా
అరుణోదయమునవందిమాగధులు । యచటజాడిరయ్యా
వినికృష్ణుడుమేల్కాంచికాల్యములు । వేగజేసెనయ్యా
సుయోధనుడుకర్ణాదులదేర్కొని । జూడవచ్చెనయ్యా
ప్రియవాక్యంబులబల్కిసభనుగన । బిలచియుండెనయ్యా
శ్రీకృష్ణుడుదనయురథమందెక్కి । జేరబోయెనయ్యా
సాత్యకికృతవర్మలొక్కరథమున । చయ్యనజనిరయ్యా
దుష్టచతుష్టయమొకరథమందున । దోడవెడలిరయ్యా
అరదముదిగివిదురుకరముబట్టుచు । యచటజేరెనయ్యా
కనకాసనమందెక్కబోయిమునిగ । గణమునుగనెనయ్యా
బ్రీతితోడమునులువచ్చిరనియూ । భీష్మునకనెనయ్యా
భీష్ముడువారలకాసనంబులను । వేగనిచ్చెనయ్యా
యెల్లవారుసభలోగూర్చుండగ । యిటులనుండెనయ్యా
చుక్కలలోచంద్రునివలెకృష్ణుడు । శోభించినదయ్యా
మేఘధ్వనితోధృతరాష్ట్రునిగని । మెచ్చిపలికెనయ్యా

## నెం. 1

కృ॥-నీవుబుద్ధిమంతుడవయ్యా । నీవుధర్మమెరుగుదువయ్యా
పరమధర్మమెరిగించుటకు । భరతకులముగాచుటకొరకు
నేనరుదెంచితిపాండవులు । నీకుమారులగుపాండవులు

నీవుపాలుగలిసినవిధము । నీవుసేయుమదిసమ్మతము
భరతవంశమునబుట్టితివి । పరమధర్మమునుదెలిసితివి
నీతనయులుధర్మముగనవు । నీవంశంబునుజెరచెదరు
భీష్మద్రోణులుగలరంచు । నీతినివిడిగర్వముగాంచు
కర్ణదుశ్శాసనులనెంచు । కపటముసేయగకాంక్షించు
నరుడొక్కడుదివిజులగెలిచె । నాసాహాయ్యముకాంక్షించె
భీముడుసాయంబైనిలచె । వీరులజంపగమదివలచె
సురాసురులుగెలువగలేరు । జొచ్చిరణమువెల్వడలేరు
నావాక్యంబులునాలించి । నష్టమునీమదియోచించి
పాండుతనయులివ్విధమనిరి । వనవాసముజేసితిమనిరి
మాభాగముమాకిమ్మనిరి । మనధర్మంబునుగనుమనిరి
నీకునమస్కారంబనిరి । నీయాజ్ఞనుసలిపెదమనిరి
కావునపాలీగడవయ్యా । నాకుండినరక్షమగునయ్యా
యింకెవరికికష్టంబైన । గుంటెవవికనీమదిలోన
వైశం॥-జామదగ్న్యుతనుమునివినెను । చయ్యునదుర్యోధనుకనెను

( కథాక్షేపకము )

## నెం. 5

జా॥-మునుదంబోద్భవుడనురాజొక్కడు । భూమినిపాలించె
కదనంబుననాకెదురుతెరంచు । గర్వంబునుగాంచె
ఒక్కనాడుగంధమాదనమునకు । గ్రక్కునజనుదెంచె
తపమొనర్చునరనారాయణులను । ధరణీశుడుగాంచె
సమరమొనరింపవారలరమ్మని । చయ్యనబిల్పించె
వలదనియనేకవిధములజెప్పిన । వారలనిందించె
అంతనరుడుదర్భలచేశరముల । నయ్యెడసృష్టించె
సకలసేనజంపియుతనితనువును । చాలగనొప్పించె
భంగపడిరాజువెడలెయాతడే । పార్థుడగుచుమించె
ఆనారాయణుడేయీకృష్ణుం । డనుచుపేరుగాంచె
తలపడిసురాసురాదులువారల । గెలువరనివచించె

పాండవులగూడిసకలసౌఖ్యములు । పడుమనివిన్పించె

## ( క ఖా క్షే ప క ము )

## నెం. 5

వైశం॥-కఖ్యోడంతలోసుయోధనునియొక । కథవినుమనెనయ్యా
కఖ్యో॥ఇంద్రునిరథసారథిమాతలికొక । ఇంతిబుట్టెనయ్యా
గుణకేశినియనుపేరిడిపిల్లను । బెనుచుచుండెనయ్యా
ఆర్యకుడనుసర్పరాజుమనుమడు । యతడుసుముఖుడయ్యా
తనకూతునుసుముఖునకిచ్చెదనన । తాతబల్కెనయ్యా
వీనిజనకునిగరుడుడుజంపెను । వీనిజంపునయ్యా
మాసములోపలజంపెదననెను । మానినెవలదయ్యా
అనమాలినియనెఇందుకునడిగియిది । యాచరింతమయ్యా
అనుచుయతనిదోడ్కొనిస్వర్గమునకు । యపుడుపోయెనయ్యా
వీరలుస్వర్గంబేగెడువరకట । విష్ణువుండెనయ్యా
అంతఇంద్రునకుజెప్పనిందుకుగా । హరికిజెప్పెనయ్యా
మాధవుడాగరుడునితోననెనొక । మాటజేయుమయ్యా
సుముఖునిజంపకుమెప్పుడుమాతలి । సుతనొసంగునయ్యా
వినిగరుడుడుగర్వంబుతోబలికె । వినతకొడుకునయ్యా
అదితికొడుకువీవయ్యాయొకడేనా । కనుజుడనగుదయ్యా
అదితిసుతులనొకయాకపైనమో । యందగునేనయ్యా
నీచకార్యమెటుజేతునాబలము । నీవెరుంగవయ్యా
అనగవిష్ణువనెనాబలమునసీ । వతిబలియుడవయ్యా
అనుచుకోపించియతనిపైననొక । హస్తంబిడెనయ్యా
హస్తభారముననేలబడిమూర్ఛ । నందెగరుడుడయ్యా
అంతహరిలేపిగర్వమొందదగ । దనుచుబలికెనయ్యా
కరములుమోగిడ్చిగర్వమొందనని । గరుడుడేగెనయ్యా
గానసుయోధనగర్వమొందనగా । గలుగునష్టమయ్యా
ఆవిష్ణుండేశ్రీకృష్ణుండైభువి । యవతరించెనయ్యా
అనదుర్యోధనుడనెమీరాడిన । యవినిజమన్నాడు
నాతొల్లిటికర్మననుసరించుచు । నడచెదనన్నాడు

మీరుజెప్పినటుజేయగనామది । మెచ్చునిదన్నాడు
ధృతరాష్ట్రుడుకృష్ణునకనెతనయుల । మరిని(దిప్పుమనెను
నేజెప్పినయటుసేయరుగావున । నీవుజెప్పుమనెను
అనగకృష్ణుడాదుర్యోధనునిగని । యపుడుబలికెనయ్యా
కృ॥-ధర్మజుండునీకన్నయగునుమం । దనముసేయుమనెను
అతనికేచ్చిరాజ్యపాలనం । బతనికినీవయ్యా
చెలగిప్రధానత్వముగొనియన్నిటి । జేయుచుండుమయ్యా
మీనూర్వురకామైందుగురికెంతొ । మేలుగలుగునయ్యా
నామాటలువినకున్నచోమీరు । నశింతురువినుమయ్యా
వైశం॥-అనభీష్ముండనెహరిజెప్పినయటు । లాచరించుమయ్యా
వినకచెడెదవికజెరచెదవిందరి । విధమునడువుమయ్యా
అనగద్రోణుడనెతండ్రితాతలను । టాచరించుమయ్యా
సకలవిభవంబులంచెదవిదిని । శ్చయమునమ్ముమయ్యా
అనగదుర్యోధనుండువారలకు । యపుడుబలికెనయ్యా
దు॥-పక్షపాతబుద్ధిచేమీరలిటు । బల్కుచుందురయ్యా
ధర్మజుండుజూదమునవోడెనా । తప్పేమగునయ్యా
దానికివనమునకేగియుండెనా । తప్పదిగాదయ్యా
అతనిపాదములుబట్టుమంటిరది । యన్యాయంబయ్యా
వాడిసూదిమొనయంతభూమినే । వారలకీఁనయ్యా
రణమందునజయమొందినవారికి । రాజ్యంబగునయ్యా
మీరలింకజెప్పటజాలించిన । మేలుగాంతునయ్యా
అనగశ్రీకృష్ణుడతికోపంబున । యపుడుబల్కినాడు
వైశం॥-తప్పులేదంచుబలికితివింకొక । తప్పుగునన్నాడు
కృ॥-విషాన్నమిడితివిషాములచేగరి । పించితివానాడు
నీటద్రోచితివిలక్కయింటికగ్ని । బెట్టితివానాడు
సాధ్వినిసభకీడ్చివలువలొలువగ । సాగితివానాడు
పరుడగుకర్ణునిగూడినింద్యముల । బలికితివానాడు
కనలకవారలుశాంతమొందినను । గాంచిరియానాడు
వారిభాగమునువారికిడకున్న । పడింతురేనాడు
వైశం॥-అనగకోపమునలేచిసుయోధను । డపుడువెడలినాడు
అపుడుకృష్ణుడనెకంసుడీవిధం । బాచరించెనాడు

కృ॥-సత్వరమాతనిబట్టిసభలో౯ ॥ జంపెతినానాడు
మీరుదీనినిపుడట్టులజేసిన । మేలగునన్నాడు
వైశం॥-అనగధృతరాష్ట్రుడదరిపడిసతిని । యప్పుడుబంపినాడు
అపుడుసుతునిగసిధర్మనీతులను । యాపెజెప్పెనయ్యా
చుట్టిరికంబునువారలశక్తిని । సుదతిజెప్పెనయ్యా
వినకవెడలికర్ణాదులయాలో । చనను మెచ్చెనయ్యా
జనార్దనునిబంధింపదలచుటా । సాత్యకివినెనయ్యా
హరికిజెప్పధృతరాష్ట్రునకాతడు । యపుడుబలికెనయ్యా
కృ॥-నన్నుబంధింపనీసుతులియ్యెడ । బన్నిరివినుమయ్యా
అజ్ఞనిమ్ము నాబలముజూపెనే । నరిగెదవినుమయ్యా
వైశం॥-అంతదుష్టులఁగూడిసుయోధను । డపటిజేరెనయ్యా
హరియనెదుష్టులకొకడననుకొంటి । రనుచుజూపెనయ్యా
ఫాలమందుబ్రహ్మవక్షమందున । భవుడునిలచెనయ్యా
అష్టలోకపాలకులుపార్శ్వముల । యందునిలచెనయ్యా
హలధరగాండీవధరులుభుజముల । యందుబుట్టిరయ్యా
వీపునపాండుకుమారులస్త్రముల । వెలసిబుట్టిరయ్యా
సకలయాదవులుతొడలంబుట్టిరి । సాయుధకచులయ్యా
వివిధాయుధములుగలహస్తంబులు । వేగబుట్టెనయ్యా
కనులచెవులముక్కులలోమంటలు । గానుపించెనయ్యా
అర్కకిరణకాంతిరోమకూపము । లందుబుట్టెనయ్యా
గనుగొనశక్యముగాకజనంబులు । కనులుమూసిరయ్యా
మదిలోయద్భుతభయముగొనివారు । కదలకుండిరయ్యా
ద్రోణభీష్మవిదురమునిగణములకు । దృష్టియొసగెనయ్యా
విభునివారుగనుచుండదేవదుం । దుభులుమ్రోగెనయ్యా
సురలుకల్పసుమవృష్టిగురిపియ । చ్యుతునివేడిరయ్యా
అంధుడువినివిశ్వరూపమనుగన । హరినివేడెనయ్యా
దివ్యదృష్టినిడగనిమోదముననను । తించిబలికెనయ్యా
సిద్ధులుసాధ్యులుయక్షులుగరుడులు । జేరియుండిరయ్యా
పండ్రెండుగురాదిత్యులంగమున । ప్రభవించినరయ్యా
సప్తమరుత్తులువిశ్వదేవులు । సంభవించిరయ్యా
వేలయేండ్లుతపమొనర్చియదిగన । జాలకుందురయ్యా

అనేకయాగములొనర్పవారల । కగపడదిడియయ్యా
నీదయకన్నులనిడితివిజూచితి । నేథన్యుడనయ్యా
దేవానినుగనిజగముగనజాల । దృష్టినిగొనుమయ్యా

—: ఫ ల శ్రు తి :—

## నెం. 1

భారతవీరులచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుడ్ని । విరచించెనుభక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్యాసినాడుయీసత్కృతిని
సదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని



## (స్త్రీపర్వాశ్వాసము)

## నెం. 1

వైశం॥-అనగకృష్ణుడటులొనరించె । జనెదనంచుదావిపరించె
యెల్లరుతనవెంబడిరాగ । యేగెనుకుంతినిగనవేగ
ఆపెకువందనమొనరించె । అచటివార్తలనువినుపించె
బోయివత్తునవివచించెను । పుత్రులకేమనియెదవనెను
అనగకుంతియుపుడిట్లనెను । అఖిలంబీవెరుగుదువనెను
కుం॥-క్షత్రజాతిబుట్టితిరనుము । ఘనులనిపేరందితిరనుము
బిచ్చపుకూడడుగకుమనుము । ఓరముజాపగతగదనుము
సకలకష్టములనిడిరనుము । స్మరింపుడిదిమరువకుడనుము
వైశం॥-వినిహరిరథమారోహించె । జనెదనిలుచ్చుడనివచియించె
యెల్లవారలనుమరలించె । యేగుచుకర్ణుడురానెంచె
కర్ణుడురథమారోహించె । కదలిదూరమేగుటగాంచె
కృష్ణుడుకర్ణునకిట్లనెను । కీర్తిగాంతువిదివినుమనెను

కృ॥-సూతసుతుండవుగావయ్యా । సూర్యసుతుండవునీవయ్యా
కుంతికివరమునబుట్టితివి । కౌంతేయుండవనజరగితివి
పాండుసుతులుతమ్ములునీకు । భావమునమలగుదుసనాకు
ధరణీశునినిన్నొనరింతు । ధర్మజుమంత్రిగనొనరింతు
వాయుసుతుడుఛత్రముగొనును । పాథుకాదుపాథ్యముగొనును
అభిమన్యుడుమొదలగువారు । అంపనినిగొల్తురుపవారు
మహీచక్రమేలగవయ్యా । మునవద్రౌపదినిగొనుమయ్యా
కర్ణ॥-అనగకర్ణుడప్పుడిట్లనెను । అవియుపివరకేనెరుగుదును
సుదతికుంతివిడచినదయ్యా । సూతుడునన్నుపెంచినదయ్యా
వారిఋణముచెల్లెపనయ్యా । పాండుసుతపనేగానయ్యా
అదియుగాకదుర్యోధనుడు । అతిప్రేమనుజూచెనుఘనుడు
అర్జుననకుమొనవనుకొనెను । అన్యాయముసకుజొరననెను
రాధేయుండగుకర్ణుండు । రణమనగాభీతిలియుండు
అయెనుకౌంతేయుడునేడు । అనియందురుజనమీనాడు
పాండుసుతులజేరగబోను । పవరంబొనరించెదనేను
ధర్మజునకుదెల్పకుమయ్యా । మర్మమెపుగుమోసంబయ్యా
రణమొనర్పకుండెడునయ్యా । రాజ్యపాలనముగొనడయ్యా
రణయజ్ఞంబగువినుమయ్యా । రాజుధర్మజుండగునయ్యా
కౌరవులేపశులగునయ్యా । కర్మనుజెప్పెదవీవయ్యా
వైశం॥-అనగకృష్ణుడాలోచించె । అపుడాతనికిటువివరించె
అమావాస్యదినమునరణము । అగుననిచెల్పుమయిదినిజము
వినికర్ణుడురథమునుదిగెను । వేగరథంబంతటజనెను

## నెం. ౫

కుంతిచింతిల్లికర్ణునిగనుటకు । కోరియంతజనెను
కర్ణునిగనియనెరహస్యమొక్కటి । గలదదివినుమనెను
కౌంతేయుడవౌరాధేయుండవు । గావునిక్కమనెను
పాండుకుమారులజేపకొనిభూమి । భాగముగొనుమనెను
అనగకర్ణుడనెనాకదియేటికి । యనినిసేతుననెను
నీసంకల్పంబెరిగితినలువుర । నేనుజంపననెను
ఏనోనపుడేజత్తుమునీసుతు । లేవురుందురనెను

వైశం॥-అగ్గురంచుడలపకుము వెడలుమని । యపుడువెడలినాడు
అంతటకృష్ణుడుపాండుసుతులకడ । కపుడుజేరినాడు
యుచటివృత్తాంతమంతవారలకు । యిటులజెప్పినాడు
కృ॥-ధృతరాష్ట్రాదులువినగసభలోన । హితవుజెప్పితయ్యా
వినకదుర్మార్గులనిసేయుటకే । వెడలగోరిరయ్యా
విదురునింటగుడిచితిమేనత్తకు । వెతనుదీర్చితయ్యా
అనికివెడలుడనియాపెయాజ్ఞగై । కొనివచ్చితినయ్యా
సమరమమవాస్యనాడనుచుని । శ్చయముజెప్పితయ్యా
వైశం॥-అనవినిధర్మజుడటులౌననియా । హరికిజెప్పెనయ్యా
అఖిలభారంబునీపైబెట్టితి । ననుచుబల్కెనయ్యా
ధర్మ॥-సేనానాయకుడచటభీష్ముడై । వెలుగుచుండునయ్యా
సేనాపతినెవరిజేతుమోయది । జెప్పవిందునయ్యా
అర్జు॥-అనయర్జునుడనెయుగ్నికుండమున । జనించియున్నాడు
గురునివధింపగబుట్టియుండెరణ । కోవిదుండువాడు
భీష్మద్రోణులనెదిరింపగతగు । ధీరముగలవాడు
అనేకవ్యూహంబులనుభేదింప । యాతడుతగువాడు
వైశం॥-సేనానాధునియతనిసేయవాం । ఛించితినన్నాడు
దండనాధునిశిఖండినొనర్చిన । తగుననియన్నాడు
భీష్మనిజంపగబుట్టెనతండరి । భీకరుడన్నాడు
జనార్దనుండెటులసేయుమననది । సలిపెదమన్నాడు
హరిబలికెనుదృష్టద్యుమ్నుండే । యర్హుండన్నాడు
దండనాథులేడ్గురుగావలయును । త్వరవినుమన్నాడు
దేవసమానుడుపటుబలవంతుడు । ద్రుపదుండన్నాడు
శత్రుభీకరుడువిరాటరాజతి । శక్తిగల్గువాడు
శౌర్యధైర్యములుగల్గినవాడీ । సాత్యకియన్నాడు
జరాసంధతనయుడుసహదేవుడు । శక్తిగల్గువాడు
యాదవవీరుడుచేకితానుడుమ । హాబలుడన్నాడు
శిశుపాలసుతుడుధృష్టకేతువని । సేయనిలచువాడు
సమరలంపటుడుశిఖండియాతడు । శౌర్యముగలవాడు
యేడక్షౌహిణులకుదగువారల । నేర్పరించినాడు

అన్ని సేనలకుదృష్టద్యుమ్నుం । డధిపతియన్నాడు
అంతసూర్యుడస్తమించెగృహముల । కందరుజనినారు
ఆహారవిహారములగొనినిద్రల । నంతబొందినారు

# నెం. 1

వైశం॥-ధర్మజుండువేగములేచె । ధరణీశులనెల్లరజూచె
యెంతోమోదముగొనియనెను । యెల్లవారలిదివినుమనెను
కురుక్షేత్రమేగగవలయు । కురుబలములద్రుంచగవలయు
అర్జుననకుయపుడిట్లనెను । అందరిగనుగొనవలెననెను
హరిమనలనుగాచెడివాడు । యతడేజయమిచ్చెడువాడు
అనుచుభేరులనుమ్రోగించె । వినిజనంబుభీతినిగాంచె
ఆధ్వనిచేదిశలుబగిలెను । అపుడుసముద్రములుబొంగెను
భూధరంబులెల్లకదలెను । భూదేవతకంపమొందెను
తమతమబలములనుగూడిరి । దండనాధులంతవెడలిరి
పాండుకుమారులుజనిరయ్యా । పడతిద్రౌపదినిగొనిరయ్యా
తగినరథములనుగైకొనిరి । తనయులెల్లవెంబడిజనిరి
వనమాలనుమెడనుధరించి । బహువిధభూషణములగాంచి
కళ్ళెంబులుచేతధరించి । ఘనరథంబునారోహించి
హనుమధ్వజమునుసవరించె । హరిరథంబుముందరనుంచె
కిరీటంబుశిరమునదాల్చి । కృష్ణునిపాదంబులగొల్చి
దివ్యాయుధములుధరియించి । దివ్యరథంబారోహించి
అన్నకువందనమొనరించె । అపుడుశంఖమునుపూరించె
కురుక్షేత్రమునకుంజనిరి । వరశకునంబులగనుగొనిరి
హిరణ్యాతియనునదిచెంత । యెల్లరుపటుగృహములనంత
గాంచినివాసంబులగొనిరి । కదనవాంఛతోడమెలగిరి
దెలిసినరుడుకృష్ణునిగాంచె । దేవదత్తమునుపూరించె
అందరుశంఖంబులగొనిరి । అద్భుతశబ్దంబునలిపిరి
పాండవవాసంబునఃగనగ । పరమశోభనొంధెనువినగ

నెం. ౫

దుర్యోధనుడంతటవినికర్ణా । దులతోనిట్లనెను
తానుజెప్పవినలేదనికృష్ణుడు । త్వరగవచ్చెననెను
త్వరలోనబలములనెల్లదకుండకే । త్నమునకంపుదనెను
దండనాథులజాబెప్పెదనికవిను । చుండుడుమీరనెను
దు॥-గురుడుగురుసుతుడుకర్ణుడుశల్యుడు । దురమునదగువారు
భూరిశ్రవుండుకృపుడుబాహ్లికుడు । పోతరిమగవారు
శకునికృతవర్మకాంభోజులుఘన । శక్తిగలుగువారు
సింధురాజుతోపదుకొండుగురిటు । సేయదగినవారు
వైశం॥-అపుడువారలనుదండనాథులుగ । సూచరించినాడు
అంతటవినిభీష్మునిచెంతకుజనిదిన । యమునుగబల్కినాడు
దు॥-సర్వసేనాధిపత్యంభీపే । నిర్వహింపవయ్యా
అటుగాకుండినసీవేర్పరచిన । యట్లుజేతునయ్యా
అపుడుభీష్ముడనెమీరుపాండుసుతు । లారయసమమయ్యా
భీష్మ॥ఐనగానివచ్చెదనీవనినటు । లాచరింతునయ్యా
నరుడుగాకననుజయించువారీ । ధరలోలేరయ్యా
గానిపాండుతనయులనుజంపుటకు । కరములురావయ్యా
కరిపురమునసీచెంతనుంటచే । కదలివత్తునయ్యా
సర్వసేనాధిపత్యముకర్ణుడు । నిర్వహించునయ్యా
మొదటసమరమునకాతనిబంపుము । పిదపవత్తునయ్యా
వైశం॥-అనగకర్ణుడనెభీష్ముడుబడువర । కచటికిరానయ్యా
అనగభీష్ముడటులసేయుమనిరణ । మునకునిలచెనయ్యా
అనవినికురుపతిసేనాపత్యం । బతనికిచ్చెనయ్యా
భేరీమృదంగశంఖధ్వనులతి । వేగజేసిరయ్యా
దండనాథులంజూపివీపనీ । యండనుందురయ్యా
చక్కగవీరినిగాచియుద్ధమున । జయమునొందుమయ్యా
అనుచుసైన్యములియుద్ధభూమికై । యపుడుబంపెనయ్యా
దుశ్శకునంబులునగరంబంతట । దోచుచుండెనయ్యా
యెముకలునెత్తురురాళ్ళుపురమునం । దెల్లెడఃబడెనయ్యా
పిడుగుబడెనుజనులెల్లరదివినుచు । భీతిజెందిరయ్యా

కురుపతిశాంతులొనర్చివారసములు । నెరపిపంపెన్నోయయ్యా
తలిదండ్రులగనిచింతిల్లకుమని । బలములంపెనయ్యా
తనతమ్ములతోభీష్మాదులతో । భారగవచ్చెనయ్యా
యెల్లవారలకుతగినస్థలములు । నేర్పరించెనయ్యా
కౌరవవీరులపటగృహంబులు । గాంచమోదమయ్యా

# నెం. 1

బలభద్రుండడివిన్నాడు । పయనంబైయటుజనినాడు
పాండుసుతులగనుగొనినాడు । భక్తిపూజలనుగొన్నాడు
వారలసైన్యంబులగాంచె । వారికిట్లువావివిరించె
బల॥-అన్నదమ్ములగుదురుమీరు । అతిక్రూరులైయున్నారు
బంధుజనులగైకొనినారు । బవరముసేయగనున్నారు
ఇదిదగదనికృష్ణునకంటి । యిరువురుబంధువులనియంటి
శాంతముసేయగజనుమంటి । సమరమార్గమునువలదంటి
కరిపురికేగినడనివింటి । గలుగుసంధియనియనుకొంటి
శాంతంబుగజెప్పగరాద । సంధిసేయుటకుమతిలేద
తామసంబునొందెనుగాద । తమవారలకిదిమర్యాద
మీకువారుబంధువులైన । విజయునిప్రేమించునుగాన
పాండవులకుజయమగునిజము । వారికిమరణంబౌనిజము
హరిబట్టినపట్టునువిడడు । అతడుసమర్థుడుఘనబలుడు
భీమసుయోధనులతిబలులు । వీరులురణశూరులుఘనులు
గదావిద్యజెప్పితినేను । గానవధింపగగనలేను
తీర్థయాత్రపొయెదనయ్యా । తెలుపనిందువచ్చితినయ్యా
వైశం॥-ధర్మజకృష్ణులుగనుగొనిరి । భావగనతనిసాగనంపిరి
రుక్మిణికినిసోదరుడయ్యా । రుక్మియనెడిభూపుండయ్యా
కఠినధనువుగల్గినవాడు । కడుబలములతోజనినాడు
ధర్మజునప్పుడుగనుగొనెను । తగుపూజలగొనియిట్లనెను
రు॥-సమరమునకువెరచెదరేని । సత్వరమేనొక్కడబూని
కురుబలమునుదృంచెదనయ్యా । గొప్పశూరుడనుగనుమయ్యా
వైశం॥-హరిగనసిగ్గునువిడిచెనెను । నరుడునవ్విదానిట్లనెను

అర్జు॥-గంధర్వులగెలచిననాడు । కాలకంపునోడ్చిననాడు
అసహాయుడనైజేసితిని । హరిసహాయమిపుడొందితిని
వైశం॥-నీసహాయమికవలదనెను । నీవెంబైననుబొమ్మనెను
వినుచురుక్మియంతటజనెను । వెడలికౌరవేశునికనెను
రు॥-నీకుసహాయంబొనరింతు । నీపగవారలనోడింతు
వైశం॥-అనకురునాథుడుయిట్లనెను । అబద్ధంబుబల్కకుమనెను
దు॥-నీసాయంబక్కరలేదు । నీవిటనుండినబని కాదు
వైశం॥-అనగరుక్మిచింతనుగొనెను । అంతటతననగరికిజనెను
బలరుక్ములుయిటుజనినారు । వారుదప్పయితరులులేరు
ధరనందరురాజులుజనిరి । యిరువురికినిసాయంబైరి

## నెం. 5

భీష్ముడుదుర్యోధనుగనుగొనియి । వ్విధముజెప్పినాడు
అతిరథమహారథులజెప్పెదనిక । యపివినుమన్నాడు
భీష్మ॥నీవతిరథుడవుసమరథులగుదువు । నీసోదరులయ్యా
పాంచాలులనిర్భంతురువారలు । బలాఢ్యులోయయ్యా
నాపరాక్రమముజెప్పకొనుటకై । నాకదిదగదయ్యా
కృతవర్ముండనువాడుబలయుతుడు । యతిరథికుండయ్యా
మతిమంతుండనబడునీశల్యుం । డతిరతుడగునయ్యా
హరికిశత్రువుండల్లురణావిడచి । యనికివచ్చెనయ్యా
భూరిశ్రవుడతిరథుడగుబలియుడు । బుద్ధిమంతుడయ్యా
మహారథుడుసైంధవుడుపాండవుల । మగువనుగొనెనయ్యా
త్వరగవారితనిభంగపరుపగా । తపముజేసిరయ్యా
వారినొక్కనాటికిగెల్చుటకై । వరముబొందెనయ్యా
సమరశూరుడీసుదక్షిణుండును । సమరథుడగునయ్యా
నీలుడతిరథుడుకదనరంగమున । జాలియుందురయ్యా
అవంతిదేశాధీశులువీరలు । యర్థరథికులయ్యా
విందానువిందులనెడిపేరుచే । వెలయుచుందురయ్యా
త్రిగర్తులేవురుమహారథులువిను । పగరగెల్తురయ్యా
సమరథుడగునీకొడుకులక్ష్మణుడు । సమశూరుండయ్యా

బృహద్బలుండునుసమరథుఁడగురణ । వీడుడుగనుమయ్యా
అతిరథోత్తముఁడుకృపాచార్యుఁడగు । నద్భుతబలుఁడయ్యా
నాల్గుదిశలసేనలఁబరతెంచిన । నవ్విగెలచునయ్యా
శకునిసమరథుఁడుపాండుతనయులకు । సదాశత్రుఁడయ్యా
అస్త్రమునసముఁడగునశ్వత్థామయు । నపనీసుఁడయ్యా
బవరమందుప్రళయరుద్రుఁడగునతి । బలవంతుండయ్యా
ధనుర్వేదవేత్తయైనద్రోణుఁడు । తగినశూరుఁడయ్యా
ముసలివాడనుచుదల్పకుమనిలొ । పురహరుఁడగునయ్యా
గానినడునిప్రేమఁగల్గుటకును । కనలికొట్టుఁడయ్యా
బాహ్లికుఁడతిరథుఁడగురణమందున । పరమశూరుఁడయ్యా
అతనికుమారుఁడుసోమదత్తుం । డతిరథుఁడగునయ్యా
సమరథుఁడలంబసుతుండుమారావె । సమరశూరుఁడయ్యా
సమరథుండుభగదత్తుండింద్రుని । సమానబలుఁడయ్యా
సుప్రతీకమనుగజమునెక్కినజ । సురలగెల్చునయ్యా
గాంధారిసులుసమరథులగుదురు । కదనశూరులయ్యా
ఉన్నతనమునుండినమ్మిత్రప్రియా । జెట్టికర్ణుఁడయ్యా
అమరనాథునకుకవచకుండలము । లాతఁడిచ్చెనయ్యా
పరశురామునకడశాపమునొందిన । పరమశూరుఁడయ్యా
అర్ధరథికుఁడగుననుచుఁబల్కెఁగుడ । డెప్పుడుఁబల్కెనయ్యా
అగుసురణములంటాపనుగావున । యర్ధరథికుఁడయ్యా
వైశం॥-అనగకర్ణుఁడతికోపమునొందుచు । యప్పుడుఁబల్కెనయ్యా
కర్ణు॥-అర్ధరథికుఁడంటివినన్నేటికి । యదిచెల్లగదయ్యా
సభలోనన్నతినింద్యముఁబాడిన । శాంతించితినయ్యా
నీవుగూడయర్ధరథుఁడవంచును । నేనుచెల్పుదయ్యా
వైశం॥-అపుడుదుర్యోధనునిగనిబల్కెను । యతిదుర్జనుఁడయ్యా
కర్ణు॥-పాండవపక్షముఁబల్కెనితనిచే । బవరముగాదయ్యా
ముసలివాడుబల్కెవిధముదెలియడు । వినఁబుమానిసయ్యా
గానయితనితోరణమునకురాని । కారణమిదియయ్యా
భీ॥-అనభీష్ముండనెముసలివాడనే । యనినదెల్పుమయ్యా
నీగురువగుపరశురామునడిగిన । నీకెదెల్పునయ్యా
నీవయస్సునదనియడుగుమాయని । నీవెయడ్డుమయ్యా

నీకారణమునయాత్మస్తవమును । నేనుజేసితయ్యా
దుర్జాతుడనీతోమాటాడిన । దోసంబగునయ్యా
కౌరవులనువృక్షములద్రుంపగా । ఖడ్గంబేవయ్యా
నెపమువూనియింటనున్నపాథుడాడు । నిన్నువిడువడయ్యా
అందరుజచ్చినవెనుకజచ్చెదవు । యదిజూచెదనయ్యా
వైశం॥-కురుపతితోననెయితడిటులాడిన । కూడదంటినయ్యా
అనవినికురుపతియనెమీరిరువురు । కనలుటతగదయ్యా
నాపైదయతోసమరజయంబును । నాకిడదగునయ్యా
భీష్మునితోననెయుచటవీరులను । వినెదదెల్పుమయ్యా
అనగభీష్ముడనెయదిజెప్పినచో । యాగ్రహింతువయ్యా
వినగనేలరణమందుదెలియునన । వినియెదననెనయ్యా
భీ॥-అనగభీష్ముడనెదెల్పెదధర్మజు । డతిరథుడోయయ్యా
భీముడతిరథశ్రేష్ఠుడనిలోన । వీరసింహమయ్యా
సమరథుల్ నకులసహదేవులు । బాస్కరసమానులయ్యా
నరునితోసమానుండీజగమున । నాకగుపడడయ్యా
హరిరథమందుననుండేగాండీవ । మచ్చుతధనువయ్యా
హనుమంతుండతిబలవంతుండే । యతనికిధ్వజమయ్యా
పశుశయరుద్రునెదిరిపాశుపతమును । బట్టినడోయయ్యా
గాననతనినెదిరింపజాలని । కర్ణంబుజెప్పితయ్యా
వైశం॥-భీష్మునిపలుకులువినుచువీరులతి । భీతిబొందిరయ్యా
భీ॥-మహారథులుద్రౌపదిసుతులేవురు । మహాశూరులయ్యా
ఉత్తయుడుమహారథుడుమనలగని । యుడుకుచుండునయ్యా
అతిరథవర్యుండభిమన్యుండా । హరినరసముడయ్యా
హస్తలాఘవముననరునికంటెను । యధికుండగునయ్యా
యతిరథోత్తముడుసాత్యకిరణమున । యర్జునసముడయ్యా
వీరులువీరలుమనసైన్యంబుల । బిలుకుమార్తురయ్యా
విరాటద్రుపదులుమహారథులురణ । వీరులునమమయ్యా
మహారథుండగుశిఖండినాకిక । మారకుడగునయ్యా
ధృష్టద్యుమ్నుండతిరథుండుయిూ । ద్రోణమృత్యువయ్యా
అతనిసుతుడర్ధరథుడుధృవర్ము । డనియెడువాడయ్యా

మహారథుండగుధృష్టకేతువని । మధురానుడగునయ్యా
అజుడుభోజుడునుమహారథులురవ్వ । మందుధీరులయ్యా
మహారథులుపాంచాలుర్లెద్దురస । మానశూరులయ్యా
కేకయులేవురుమహారథులుఘన । కీర్తిమంతులయ్యా
మహారథులునీలాదులేవురుకు । మారులుశ్యులయ్యా
చేకితానచిత్రాయుధులిద్దరు । లోకమాన్యులయ్యా
మహారథులుపాండవులసుఖంబును । మదినిడల్తురయ్యా
మహారథులువ్యాఘ్రచంద్రదత్తులు । మనయుతులోయయ్యా
అతిరథోత్తముడుసేనాజుండుం । దనిలజుసముడయ్యా
పాండ్యకాశ్యులతిరథసమరథులన । జడుడు సుఘనులయ్యా
కుంతిభోజుడతిరథుండుఘనబల । వంతుడుగనుమయ్యా
రోచమానుడుమహారథుండులియు । పద్యుండగునయ్యా
ఘటోత్కచుడుమాయావియతిరథుల । గలచివేయునయ్యా
అనేకరాక్షసబలములగైకొని । యతడువచ్చునయ్యా
రెండుబలంబులయందుగలరు । రణపండితులోయయ్యా
పాండవబలములయందలిశూరుల । బట్టిచంపునయ్యా
శిఖండినొక్కనిజంపజాలయో । చించిచెప్పితయ్యా

వైశం॥-వినికురుపతియనెశిఖండినేయని । విధముజెప్పుమనెను
అకథజెప్పెదవినుమనిభీష్ముం । డప్పుడిట్టులనెను
పాండుసుతులబలమెన్నిదినములకు । బడవైచెదవనెను
అనగభీష్ముడనెసహస్రయోధుల । నణచివేతుననెను
ఒక్కదినమునయిటులజేయగా । నొప్పియుంటిననెను
శిఖండినరులచటలేకయున్ననిటు । జేసెదవినుమనెను
ఒక్కనెలలోనసకలబలంబుల । నుక్కడంతునేను
అనగద్రోణుడనెగాంగేయునివలె । నాచరింతుననెను
దృష్టద్యుమ్నార్జునులులేకున్న । జెలిపితినిదియనెను
అనగకృపుండనెయరువైదినముల । కాచరింతుననెను
గురుసుతుడనెపదిదినములనెల్లర । గూలవేతుననెను
అనగకర్ణుడనైదుదినంబుల । కాచరింతుననెను
ధర్మజుభటులవలననిదివిని । తమవారలకనెను

అర్జునాయెంతలోనకురుబలము । హతముజేతువనెను
అంతనరుండనెఆనితప్పుటదూ । ష్యంబగుననియనెను
హరిదయనీదయగల్గనిముసమున । హతముజేతుననెను
అడియెట్టులనాచరింతువనగా । అదివెల్పెదననెను

అర్జు॥-పరమేశుండీపాశుపథముచే । పల్రళయముగావించు
అదినాకొసగెనుదానివేయనే । నన్నటువాంచు
మనవారందరుమహావీరులని । మదిలోనదలంచు
నీపరాక్రమమునీవుజెప్పవది । నింద్యంబనుకొంచు
సత్యముగానీవుకోపమొందిన । జగమేకంపించు
మనకువిజయముదప్పదనుచునీ । మదిలోభావించు
జనమేజయునకువైశంపాయన । మునియిటువినుపించె
అవ్వలికథవినియెదననిభూపుం । డాతనిపల్రశ్నించె
విధుమౌళీదాసుండీచరితము । భక్తిగరచియించె
తప్పులుక్షమింపమహాత్ములనుకొం । తముగావినుతించె
నందనకార్తికశుద్ధసప్తమి । నాటికిముగియించె
భారతమందాదిపంచకంటీ । పగిదినరచియించె

—: ఫలశ్రుతి :—

నెం. 1

భారతవిరులచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుదీని । విరచించెనుభక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడుయీసత్కృతిని
పదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని

( ఉద్యోగపర్వము )

సమాప్తము.

7) B

శ్రీకృష్ణాయనమః

# తందనాన శ్రీమహాభారతము

## భీష్మపర్వము

### నెం. 1

శ్రీమద్భారతచరితంబు । చెప్పలవిందు సేయునిజంబు
జనమేజయుడా మునికనెను । సచ్చరితమువినియెదననెను
కురుక్షేత్రమందునజేరి । కురుపాండవ బలములుమీరి
అనియెట్టుల జేసినరనెను । అదిదెల్పుము వినియెదననెను
వై॥ వినిమునియనె ధన్యుడవయ్యా । భీష్మపర్వమును వినుమయ్యా
కరిపురమున ధృతరాష్ట్రుండు । కడుశోకంబందెన్నృపుండు
సంజయుడచ్చటనేయుండె । శాంతంబొనరించుచునుండె
వ్యాసుండయ్యెడకరుదెంచె । అంధభూపునకు వినిపించె
వ్యా॥ క్షయకాలంబిది యనియెంచు । సకలజనుల హతమొనరించు
దుఃఖమొందవలదికబూని । దూరముగాంచ దలచెదవేని
దివ్యదృష్టి నొసగెదనయ్యా । దెలుపుము సంశయపడకయ్యా
వై॥ అనధృతరాష్ట్రుం డిటులనెను । అదిజూడగమదిలేదనెను
వినగకోర్కె మదిగలదనెను । వినుపింపుముదయగనుమనెను
అనముని సంజయునిగాంచె । అట్టిశక్తినిడివిన్పించె
వ్యా॥ రాత్రింబవలెటులుండెదరు । రహస్యంబులేమనియెదరు
మనముల నేమనుకొనియెదరు । గనిసురలేమనుకొనియెదరు
యేరూపంబులుగాంచెదరు । యెటులసమరమును జేసెదరు
అన్నినీకుగన్పడునయ్యా । అతనికి విన్పింపగదయ్యా
సమరముజని రాగలవయ్యా । శరములుదాకవుగనుమయ్యా
ఇటులవ్యాసుడతనికొసగెను । యీవిధమున యంధునకనెను

మేఘంబులు గన్పడవయ్యా । మెరుపులువినబడునేమయ్యా
హయగజముల కళ్ళకునీరు । అతిశయించి భూమినజారు
పక్షులకుఁ మృగములుబుట్టె । పక్షులుమృగములకుఁబుట్టె

## నెం. 5

నాతికొకసారి నలువురుబుట్టిరి । నవ్వెబలికిరయ్యా
సూర్యోదయాస్తముల నల్లదనము । జూడగబడెనయ్యా
చంద్రునిచిహ్నము తలక్రిందులుగా । సరగగాంచితయ్యా
కౌరవులిండ్లకు గట్టినధ్వజములు । జారిపడినవయ్యా
ఆయుధములు మండెనుదుశ్శకునము । లనేకమగునయ్యా
కులక్షయంబగుగావుననీకిది । గూడనిపనియయ్యా
దుర్మార్గులు నీతనయులు వలదని । దురముమాన్పుమయ్యా
తమ్మునిపా లతనిసుతులకిడ శాం । తమునొందెదరయ్యా
యెవరు మిగుల రీరాజ్యాశను । నీవిపుడుమానుమయ్యా
అనగధృతరాష్ట్రుడనె తనయులునే । నన్నుటువినరయ్యా
నాతప్పిందేమిలేదుగావున । నన్ననదగదయ్యా
వై॥ కాలమానన్నమాయెననిమౌని । కదలిపోయెనయ్యా
సంజయుడిట్లనె భారతయుద్ధము । చక్కగవినుమయ్యా
సం॥ భీష్ముడెల్లయోధవరులగనియా । విధముబలికెనయ్యా
యోధులారమనమెన్నటికైనను । యుడిగెడమనెనయ్యా
వ్యాధినొంది యింటజావగా లా । భంబుగలుగదనెను
సమరమందు శత్రువులఁజంపుచు । జయమునొందుదనెను
సమరమునఁజచ్చి విరస్వర్గము । చయ్యవజనుడనెను
పార్థుఁశిఖండులదప్పనెల్లరఁ । బలిమిజంపుడనెను
శిఖండి నాకెదురుగరాకుండగ । జేయుడెల్లరనెను
అనగవారు బాసజేసిరణమున । కపుడువెడలిరయ్యా
గురుభీష్ములు మమజవ్యూహంబును । సరగజేసిరయ్యా
వ్యూహముఖంబునజాముసిలచిరతి । సాహసపరులయ్యా
కుడివైపునగురుసుతకృపులనుసం । దడిగనిల్పిరయ్యా
యెడమవైపు కృతవర్మశల్యులను । యేర్పరించిరయ్యా

ఆవ్యూహమునకు వెనుకసోమ ద । త్తాదులుండిరయ్యా
నడుమతమ్ములఁగా గూడుకొనుచు కుప । నాధుఁడుండెనయ్యా
దశసహస్రసంశ ప్తకసైన్యము । దానిగాచెనయ్యా
చంపెదమఁజుంణాను నటుగాకుండిన । జచ్చెదమనిరయ్యా
గజహయరథముల కాల్బలములనొక । క్రమమునిలిపిరయ్యా
ఒకటికొకటివెనుకనిలపివ్యూహం । బొప్పజేసిరయ్యా
యిదియొకచిత్రవ్యూహంబని వా । రెంచుచుండిరయ్యా
సురలును దివమందునగలరాజులు । జూడవచ్చిరయ్యా
అచటి వృత్తాంతమెఱిగించెదనో యి । య్యా వినుమయ్యా
ధర్మజాదులెల్లను తగురథముల । త్వరగవచ్చిరయ్యా
భేరీమృదంగవాద్యములతోడ । వెడలివచ్చిరయ్యా
శమంతపంచకమునకు జేరశుభ । శకునమాయెనయ్యా
సకలయోధులాశకునంబులగని । సంతసపడిరయ్యా
ధర్మమే జయంబనుచుయోధులా । దారిబట్టిరయ్యా
దృష్టద్యుమ్నుండు నటవ్యూహమ్ము । దీర్చినిలిపెనయ్యా
అభిమన్యాదికుమారులు సముఖమున । యపుడునిలిచిరయ్యా
భీమనకులసహదేవులువారికి । వెనుకనిలచిరయ్యా
విరాటద్రుపదులు రెండువైపులను । వెలసియుండిరయ్యా
చేకితానసాత్యకులుసాయుధముగ । జేరినిలచిరయ్యా
ధర్మజుఁడెల్లరగనుగొనిమధ్యన । త్వరగనిలచెనయ్యా
నరసహాయమున శిఖండిభీష్ముని । యరయుచుండెనయ్యా
మాగధసహదేవాదులాచుట్టు । మసలుచుండిరయ్యా
అంతధర్మజుఁడు కవచాదులవిడి । యరుగుచుండెనయ్యా
కురుసైన్యము కెదురేగతమ్ములది । బరికించిరయ్యా
చెంతజేరియనిరి భీతిచేమది । చింతసేయకయ్యా
మౌనముగానిబోవుచున్నహరియనె । మర్మమెఱిగితయ్యా
కృ॥ గురుభీష్మాదుల చెంతయాజ్ఞగొని । మరలివచ్చునయ్యా
భీష్మునిచెంతకుబోయి మ్రొక్కి యా । విధముగననెనయ్యా

# నెం. 1

ధ॥ నీవు విద్దెజెప్పితివయ్యా । నీవు పెద్దజేసితివయ్యా
నిన్నెదిర్చిపోరెదమయ్యా । నీయాజ్ఞనుగోరితిమయ్యా
అతనిధర్మమునకుమెచ్చెను । అపుడుభీష్ముడాతనికనెను

భీష్మ॥రాకడచె సంతసపడుదు । రాకుండిన శాపంబిడుదు
వచ్చితివిక మేలగునయ్యా । వైరులను జయించెదవయ్యా
ఆడుగుమొక్కవరమిడుదయ్యా । అనిసేయుటనడుగకుమయ్యా
అనధర్మజుడిటులనెనయ్యా । అని యిచటనెసేయగదయ్యా

ధర్మ॥ నీవు మా హితముగనుమయ్యా । నినుగెల్చుట తెలుపగదయ్యా
అనగనవ్వి భీష్ముండనెను । అమరులసాధ్యముగాదనెను

భీష్మ॥అదినీవిపుడడుగకుమనెను । అవసరముననదిదెల్పెదను
అనగ మ్రొక్కిగురువునుగనెను । అజ్ఞబొందవచ్చితిననెను
వినిగురుడనె కృష్ణుడులేడా । విజయముజేకూర్చగలేడా
మేమెన్నియొనర్చినగాని । మీకేజయమిడుహరిబూని
ఐననొకటిజెప్పెదనయ్యా । ఆలకింపగా దగునయ్యా
సాకరమునయస్త్రంబున్న । నాకుచావులేదోయన్నా
చింతావాక్యంబునువిన్న । చేయస్త్రము విడచెదనన్నా
అప్పుడు నేజచ్చెదనయ్యా । అరుగుమిచటనుండకుమయ్యా
అనగకృపునిమ్రొక్కియడిగెను । అతడుమరణములేదనెను
ధర్మమేజయంబగుననెను । త్వరగబోయిశల్యునికనెను
శల్యుండనెదెలసితినయ్యా । సల్పెదనికజను మోయయ్యా
అనగధర్మజుండేతెంచే । ఆకౌరవులకు వినిపించే

ధర్మ॥ నాబలమున జేరెడువాడు । నాతమ్ములసరియగువాడు
విని యుయుత్సుడపుడేతెంచె । విజయునకాతనినర్పించె
అందరురథములకుజనిరి । అతిసంతసమున గనుగొనిరి
కర్ణునిగనిహరి యిట్లనెను । గాంగేయునిపలుకులవినెను
ఇంటమంటగల్గెనుగాదా । యిటసాయముజేయగరాద
అనగకర్ణుడపుడిట్లనెను । అదియన్యాయంబగుననెను

కర్ణు॥ కురుపతి సేమమ్మ గోరెదను । గోరరణంబకుజేసినను
అతనిబలమునాశముగాడ । హరినీవిటులనమర్యాద
అనగకృష్ణుడపుడేతెంచె । అర్జునురథమారోహించె
భీష్ముడుశంఖముపూరించె । భీకరమగుధ్వనియొనరించె
అచ్చటనాదములు సల్పిరి । ఇచ్చటనాదములుసల్పిరి
అర్జునుండు కృష్ణునికనెను । అచటివారలను గనియెదమ
అర్జు॥రెంటిమధ్యరథమిడుమయ్యా । కృష్ణుడట్లుజేసినదయ్యా

## (గీత)

అర్జునుడందరినింగాంచె । అతికారుణ్యము మదిగాంచె
అప్పుడుకృష్ణునివీక్షించె । అతనికిట్టుల విన్పించె
అర్జు॥దుర్యోధనుడిటులొనరించె । దుష్టమార్గమవలంబించె
వీరిని జంపగలేనయ్యా । విజయంబును గొనబోనయ్యా

## నెం. 5

తనువుకంపించె గాండీవముచే । త నిలువదేయయ్యా
ఇంతఘోరకార్యమాచరింపగ । నేనుజాలనయ్యా
ఎవరిని బోషింపగసామ్రాజ్యం । బేనుగోరితయ్యా
వారినెల్లసమరమందుజంపిన । వచ్చెడిదేమయ్యా
నెత్తుటమునిగినరాజ్యభోగముల । నేనుబొందనయ్యా
ఘనులనుబట్టి రణంబునజంపగ । కరములురావయ్యా
అతిలోభంబున దుర్యోధనుడిటు । లాచరించెనయ్యా
వీరినిజంపగ కులక్షయంబతి । వేగంబగునయ్యా
కులక్షయంబైనంతటయువతులు । గోరిచెడుదురయ్యా
సంకరుల్ బుట్టెదరు ధర్మంబులు । క్షయమగునోయయ్యా
పూజసేయదగినవారికమ్మలు । పోదువగదగందయ్యా
వీరిజంపిగొనురాజ్యముకన్నను । భిక్షము మేలయ్యా
చేతులు మొగిడ్చిబలికెనుయీపని । చేయజాలనయ్యా
అనుచుదుఃఖించుచరథమందుదా । నవుడునిలచెనయ్యా

అనుచుబల్కి శ్రీకృష్ణుడు నవ్వుచు । యపుడు బల్కినాడు
వగవదగనివారలగనియేడ్చుట । పనిగాదన్నాడు
తెలియవినుమంత తెలిసినవిధమున । బలికెదవన్నాడు
జ్ఞానవంతులేడ్వరెప్పుడీ వ । జ్ఞానివియన్నాడు
చచ్చుటయనునది పుట్టినవారికి । సహజంబన్నాడు

కృ॥ పసితనంబు యవ్వనంబువృద్ధాప్యం । బులుమూడయ్యా
తనువెప్పుడు యీమూడవస్థలకు । దాల్చుచుండునయ్యా
పసితనమందలి రూపమువయసున । బరగనుండదయ్యా
వయస్సునందలి రూపమువృద్ధా । ప్యంబునలేదయ్యా
చినిగినబట్టను విడచికొ్రొత్తదా । నినిగొనినట్లయ్యా
తనువువిడినంత యింకొకదేహము । త్వరగవచ్చునయ్యా
పోయినవస్త్రము వంటిదానినే । పొందజాలడయ్యా
ఇంచుమించుభేదంబుగల్గినది । ఇతనికబ్బునయ్యా
అతులఇట్టిదేహంబునొందుటకు । యాశబొందకయ్యా
హెచ్చుతగ్గులని ఎంచకుమొక్కటి । వచ్చుదప్పదయ్యా
వచ్చిపోవుటలు తనువునకెప్పుడు । వరలుచుండునయ్యా
ఆత్మకుశస్త్రాస్త్రబాధలొందవు । యాతడొక్కడయ్యా
జననమరణములు వృద్ధిక్షయములు । గనగజాలడయ్యా
అట్టియాత్మ శాశ్వతమగుగావున । యడలగవలదయ్యా
వచ్చిపోవునట్టి దేహమునకై । వగచుట దగదయ్యా
ఆత్మను పురుషుండందురు యొకనిని । యతడుగొట్టడయ్యా
అతడొక్కనిచే గొట్టగబడడా । యాత్మనునేనయ్యా
కరుణాశోకములహంకార మమ । కారభవములయ్యా
కావునవాటిని విడచిరణమునకు । గడగుటదగునయ్యా
స్వధర్మమందున జావుమేలనుచు । సరగదెల్యుమయ్యా
పరధర్మంబున భయముగల్గునది । వదలగదగునయ్యా
క్షత్రియులకు రణధర్మముత్తమము । స్వర్గమబ్బునయ్యా
చయ్యన గాండీవము గొనిరణమున । జయమునొందుమయ్యా
గనుకఫలము బ్రహ్మార్పణమనితగు । కర్మసేయుమయ్యా
తత్వజ్ఞానము బుట్టునప్పుడే । దలగుకర్మమయ్యా
వైరముచేతనె కర్మలుడుగునని । వాంఛించకుమయ్యా

కాలవశంబున పండుటాకులెటు । రాలియుండునయ్యా
అట్టులకాలవశంబునకర్మలు । యంతమొందునయ్యా
కర్మవశంబున వీరలు జత్తురు। కారణమిదయ్యా
చింతలుబొందకరణముజేయగా । సిద్ధముగావయ్యా
సం॥ అనవినిపార్థుడు కరములుమొగిడ్చి । యపుడుబల్కెనయ్యా
అర్జు॥ నీదయచేతను తత్వజ్ఞానము । నేనుబొందితయ్యా
గానినీవిశ్వరూపము జూడగ । కాంక్షించితినయ్యా
సం॥ అనగకృష్ణుడనెడివ్యక్తిష్టిగికొని । గనుగొనుమయ్యా
అనుచువిశ్వరూపంబుజూపింప । యాతడుగనెనయ్యా
సహస్రసూర్యులకాంతిమించు దే । జంబుగల్గెనయ్యా
ఆరూపంబునుగాంచి ధనుంజయు । డద్భుతపడెనయ్యా
అతిసంతసమున పులకాంకురమై । యపుడుబలికెనయ్యా
అర్జు॥ దేవనీదేహమందుసురాసుర । దేవులుండిరయ్యా
చరాచరాత్మకమైన యీజగము । సరిగజూచితయ్యా
అనేకశిరములు యనేకకన్నులు । యగుపడెనోయయ్యా
మొదలుతుదిలేదు నీరూపమునకు । యదిజూచితినయ్యా
జూడశక్యంబుగానిదినీదయ । జూచుచుంటినయ్యా
యీజగములు బుట్టగిట్ట కారణ । మీవేయగునయ్యా
నీకన్నులలో సూర్యచంద్రులగ । నేనుగంటినయ్యా
భయంకరంబగు కోరలచేనీ । వదనమొప్పెనయ్యా
సకలదేవతలు నీరూపంబును । సంస్తుతింతురయ్యా
మునులసంఘములు వచ్చినీయెడకు । పొగడుచుందురయ్యా
సిద్ధసాధ్యగరుడోరగులెల్లరు । సేవించెదరయ్యా
నీముఖములయందగ్నిజ్వాలలు । నేనుజూచితయ్యా
పదునెన్మిది యక్షోహిణులందున । ప్రవేశించెనయ్యా
యేమిచిత్రమో తెల్యజాలనీ । వెవరొచెల్పుమయ్యా
సం॥ అనగవినిపార్థునకు పరమేశ్వరు । డపుడుబల్కినాడు
లోకంబులక్షయమొనరించెడి కా । లుడనని యన్నాడు
యిచటగనుపించుజనులనెల్లర । గ్రహించెదనన్నాడు

యిదువరకే నాచేతజచ్చుటకు । యేర్పడిరన్నాడు
నిమిత్తమాత్రము గమ్ములెమ్మయని । నిజేయుమన్నాడు
అనవినిపార్థుడు గడగడవడకుచు । యపుడిటులన్నాడు
యీప్రపంచమునకాదికారణం । బీవేయన్నాడు
బావయనియాదవుండని సఖుడని । బలికితినన్నాడు
నిను దెలియక పరిహాసములాడిన । నీచుడనన్నాడు
తలిదండ్రులు తనయులనుగాచునట । దయగనుమన్నాడు
నాతప్పులు క్షమియించిబ్రోవగా । నాథుడవన్నాడు
యికనీ తొల్లిటిరూపముగైకొని । యటుగనుమన్నాడు
అనపరమేశ్వరుడనె నోపార్థా । యతిధన్యుడవయ్యా
ఘనతపోయోగములచే నియ్యది । గాంచజాలరయ్యా
అనుచుతనపూర్వరూపముగైకొని । యపుడునిలచెనయ్యా
కృ॥ నన్నుసేవించు నాభక్తుండే । నన్నుగాంచునయ్యా
అన్నిధర్మములు విడచినన్నొకని । యాశ్రయింపుమయ్యా
అన్నివిధంబులనేనుగాతునని । యాత్మనెంచుమయ్యా
సం॥ అనగపార్థుడాకృష్ణునిపదముల । కపుడుమ్రొక్కెనయ్యా
అర్జు॥ సంశయముదీరె నీవుజెప్పినటు । సలిపెదనేనయ్యా
సం॥ అనుచుగాండీవమును గొనిరథమున । యపుడునిలిచెనయ్యా
సంజయుండుధృతరాష్ట్రునకనెయది । సాధువాదమయ్యా
దయాపరుండగు వ్యాసునిదయచే । తత్వమెరిగితయ్యా
మరలమరలయిది దలచుకొంచునే । మురియుచుందునయ్యా
ధర్మమున్నకృష్ణుడుండుయచ్చట । తప్పదుజయమయ్యా
అనగధృతరాష్ట్రుడనెసమరంబెవ । రాచరించిరయ్యా
వై॥ అంతసంజయుడు సమరవార్తలను । యపుడుజెప్పెనయ్యా

## నెం. 2

అంతదుర్యోధనుడుగాంచె । ఆదిలోతమ్మునింబంచె
దుస్ససేనుండువచ్చెను । దురముసేయంగజొచ్చెను
భీమసేనుండువచ్చెను । భీకరంబుగాదాకెను
దుర్ముఖాదులైనమందుగురు । దుస్ససేనుగాపాడెదరు

అందరొకసారివచ్చిరి । అనిలజునిచుట్టుముట్టిరి
భీముడొక బొబ్బపెట్టెను । భీతియదివినగబుట్టెను
నకులసహదేవులటుజనిరి । నవ్వియొకసారి తలపడిరి
ద్రౌపదీతనయులేతెంచి । తలపడిరివారలంగాంచి
అంతయభిమన్యుడరిగెను । అందరికి సాయమాయెను
వాయుజునకంటె మునుజనిరి । వజ్రసమశరములేసిరి
అనినిసేయంగజొచ్చిరి । అందరతివిస్మయముగనిరి
అంతదుర్యోధనుడుగాంచె । అఖిలబలములజ బంపించె
ధర్మజుండంతవీక్షించె । త్వరగతనబలము బంపించె
పోరుఘోరముగ జరిగెను । పృథమిరక్తముననిండెను
అపుడుభీష్ముండుజూచెను । ఆగ్రహమునొందివచ్చెను
అంతపార్థుండువచ్చెను । అతనికియెదురునిలచెను
ఉభయులతికోపమొందిరి । ఉగ్రరణమంతజేసిరి
అపుడుకృతవర్మవచ్చెను । అంతసాత్యకియుజొచ్చెను
యిరువురనిసేయజొచ్చిరి । యిరువురతిశూరులనబడిరి
ఉభయులతికోపమొందిరి । ఉభయులతిఘాతజెందిరి
కనిబృహద్బలుడువచ్చెను । గాంచియభిమన్యుడరిగెను
అబృహద్బలుడుకోపించె । అతనిగుర్రముల ఖండించె
అతనిసారథిని జంపెను । అంతనరసుతుడుగాంచెను
అధికరోషంబునొందెను । అతనిధనువంతద్రుంచెను
ధ్వజముఖండించివైచెను । తనువునకుబాధజేసెను
భీష్ముడాభీమునింగాంచె । భీకరాస్త్రములనిగుడించె

## నెం. 5

దుస్ససేనుడానకులుని శరముల । దూలగొట్టినాడు
గనినకులుండొకశరమువనాతని । ధనువుద్రుంచినాడు
నకులుండిరువదియైదుశరంబుల । నాటగొట్టినాడు
ధనువునుగొనిదుస్ససేనుడాతని । ధ్వజముద్రుంచినాడు
సహదేవునిపై దుర్ముఖుడుకఠిన । శరములేసినాడు

సహదేవుడు కనలిసారథిని య । శ్వములద్రుంచినాడు
శల్యుండాధర్మజునిచాపమొక । శరమునఖండించె
ధర్మజుడింకొక ధనువునుగొనిమ । ద్రపతినివీక్షించె
పలుబాణంబుల శల్యునియురమును । బ్రద్దలుగావించె
ద్రోణుడుదృష్టద్యుమ్నునిరథమును । తునుకలుగావించె
కనలిపాంచాలుడొకవిలుగొని తీ । క్ష్ణ శరంబులనొంచె
భూరిశ్రవునిందాకి మాగధుడు । భుజములనొప్పించె
ఉగ్రశరంబున భూరిశ్రవుండు । యురమునుభేదించె
వృత్రవాసవులబోలిరారణము । భీతినిబుట్టించె
బాహ్లికునిపైన దృష్టకేతుండు । పదిశరములనుంచె
బాహ్లికుడా దృష్టకేతుపై తాం । బదిశరములనుంచె
అలంబాసురుడు ఘటోత్కచునితో । యాలమ్మొనరించె
అశ్వద్ధామ శిఖండివక్షమును । యప్పుడునొప్పించె
శిఖండి యశ్వద్ధామయురంబును । శీఘ్రముభేదించె
భగదత్తుడు విరాటునిపైబహు । బాణమ్ములనుంచె
బృహత్క్షత్రుడాకృపునికెదురగుచు । ధీరముజూపించె
ధనువుద్రుంచిహరులజంపియతనికి । తాపముగల్పించె
కృపుడతనికి తనకైనవిధంబున । యపుడుజేసిమించె
సైంధవద్రుపదులు రణమొనరింపగ । జనంబుకంపించె
యిరువురిబాణము లిరువురితనువుల । నెంతోబాధించె
యుధామన్యుడావికర్ణుతోడుత । యుద్ధంబొనరించె
చేకితానుడాసుశర్మతో నని । జేయుచుబాధించె
శకునితోడప్రతివింధ్యుడు కనలుచు । సమరముగావించె
సుదక్షిణునియాశ్రుతసోముసు మె । చ్చునట్లు గావించె
ఇరావంతుడాశ్రుతాయువునుగని । శరంబునిగుడించె
విందుడాకుంతిభోజువిగనికోపించి । యనికిమించె
అనువిందుడు పురుజిత్తునితోరణ । మతిశయమొనరించె
ఉత్తరునితోదీర్ఘాయువురణ । ముబ్బుచుగావించె
కరులుకరులతోహరులు హరులతో । కదనముగావించె

అనేకరథములువిరిగితునుకలై । యచ్చటగనుపించె
విరిగిన తొండమ్ములుగలయేన్గులు । వేలుగానుపించె
సంకులయుద్ధము మధ్యాహ్నమునకు । సమాప్తియనిపించె
అంతదుర్యోధనుండుకోపించి । యనుజులనంపించె
భీష్ముడపుడు పాండవవ్యూహమ్మతి । వేగమెఛేదించె
పిడుగులబోలిన బాణపంక్తులన్ । వేయుచుఖండించె
చేదిపాంచాలకేకయబలముల । చీల్చుచువిహరించె
యెదురువచ్చుయోధునితలనంతట । ఇలపైదొర్లించె
మృత్యురూపమై గన్పడివారిని ! మ్రింగగనేతెంచె
పాండవవీరుండొకడెదురింపగ । భయంబుగల్పించె
అంతటయభిమన్యుడుకోపించుచు । నాతనినెదిరించె
ఐదుబాణముల శల్యునిదేహం । బాతడునొప్పించె
ఒక్కశరంబునకృతవర్మయురము । గ్రక్కునభేదించె
కనలుచుదుర్ముఖసారథిశిరమును । ఖండనగావించె
వేగవివింశతికార్ముకముద్రుంచి । విహారమొనరించె
అమ్ములొకనాల్గువేసికృపునిదే । హమ్మునునొప్పించె
అమ్ములొకతొమ్మిదేసి భీష్ముదే హమ్మును బాధించె
సకలదేవతాగణములుమెచ్చగన్ । శంఖముపూరించె
భీష్మాదులకర్జునుని సముడంచు । బీరముజూపించె
కుపితుడై భీష్ముడతనిధ్వజంబును । గూల్చితనువునొంచె
కురునాథునితమ్ములైదుగురుపటు । శరములనిడగాంచె
ధనంజయసుతుడు భీష్మునితాళ । ధ్వజమునుఖండించె
కఠినశరంబులవెల్లరితనువుల । కదుపడినొప్పించె
కౌరవసైన్యంబదిగనిభీతిలి । కడుదైన్యముగాంచె
చాలసంతసించిభీముడతనికి । సాయంబరుదెంచె
కనలిభీష్ముడాభీమునిధ్వజమును । ఖండనగావించె
భీముడువడిగలమూడుబాణముల । భీష్మునినొప్పించె
కృతవర్మనుయెనిమిదింటనొక్కటి । కృపునిన్బాధించె
శల్యునొప్పించిరక్షణశూరుల । చాలగబాధించె
సాత్యకిమొదలగుశూరసమూహము । సాయంబరుదెంచె

భీష్ముడుమూడమ్ములనొకరొకరికి । విడికడునొప్పించె
ఉత్తరుండుకరిబలములగొనిజని । యుబ్బిశల్యునెంచె
ఉత్తరునిగజముశల్యుగుర్రముల । నత్తరివధియించె
కనలిశల్యుడొకశక్తిబాణమిడ । ఖండనగావించె
కరిపదములుశల్యుడుఖడ్గంబున । నరికినేలనుంచె
శల్యుడుత్తరుని నేలగూల్చితన । శౌర్యము ప్రకటించె
శంఖుడు తమ్మునిపాటుగాంచి యతి । సత్వరమేతెంచె
చతురంగ బలంబులతో శల్యుని । సరగముట్టడించె
కనలిభీష్ముండు శరవర్షంబును । కడువడిగురిపించె
బాణవర్షమునకాగలేకసా । బలముబోవనెంచె
విజయుడు బలముల నిలిపిశరంబుల । భీష్ముని నొప్పించె
సవ్యసాచిభీష్ములిటులబోరగ । శల్యుడువీక్షించె
విరాటసైన్యంబులపైదుముకుచు । బిరానహింసించె
గదాదండమును గొనియరథంబుల । ఖండనగావించె
విరథుడై ఖడ్గమునుగొని శంఖుడు । విజయునసమీపించె
భీష్ముడంతపాంచాలసైన్యముల । వేగమెహింసించె
ఎండినయాకులనగ్నివిధంబున । ఖండనమొనరించె
అంతటకేకయ సైన్యంబులగని । యటులేయొనరించె
విరాటుసైన్యంబులపై భీష్ముడు । పిడుగులుగురిపించె
పాండవసైన్యము తాళగజాలక । పారగయోచించె
అంతలొసూర్యుండస్తాచలమున । కపుడుప్రవేశించె
ఉభయసైన్యములు యుద్ధమాపిరది । యోగ్యంబనిపించె
తమతమనివాసములకు బోయి । శాంతంబుగ నిద్రించె
వై॥ మొదటినాటిరణవార్త సంజయుడు । పూర్తిగవిన్పించె
ధృతరాష్ట్రుడువిని రెండవనాటిది । దెల్పగ ప్రశ్నించె

—: ఫలశృతి :—

భారతవీరులచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుదీని । విరచించెనుభక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడుయీసత్కృతిని
సదయుండగు రామచంద్రుని । పదములకర్పించెనుకృతిని

# రెండవనాటి యుద్ధము

## నెం. 1

సం॥ ధర్మజుడనుజులతోజనెను । డామోదరునింగనియనెను
ధర్మ॥ గాంగేయుండతిబలుడయ్యా । కదనమ్మునపద్మండయ్యా
యింతటివాడనుకొనలేదు । యికయుద్ధముసేయగరాదు
విజయుడుభీష్మునియెదిరించె । వివిధబలంబులరకించె
జయముగాంచుననియనుకొంటి । సమరమజాలించెదనంటి
ఒక్కభీముడేమొనరించు । ఉగ్రతనపుడేటికిగాంచు
బలములనటుబంపగవలదు । ప్రాణంబులడియగవగదు
నాకుదోచినటునేనంటి । నాకరణ్యమేదగునంటి
శ్రీకృష్ణాచెప్పగదయ్యా । శీఘ్రంబుగజేసెదనయ్యా
సం॥ అనకృష్ణుండపుడిటులనెను । అతివేగముసేయకుమనెను
కృ॥ వీరులనేకులుగలరయ్యా । భీష్మాదులగెలిచెదరయ్యా
ధైర్యముతోనుండగదయ్యా । తగువిధముగజేసెదనయ్యా
సం॥ దృష్టద్యుమ్నునిగనుగొనెను । ధీరుండైధర్మజుడనెను
ధర్మ॥ క్రౌంచవ్యూహంబొనరించు । కడుజాగ్రతతోరకించు
సం॥ మంచిదనుచుయెల్లరుజనిరి । మందిరములసౌఖ్యముగొనిరి
అంతటమార్యుండుదయించె । ఆదృష్టద్యుమ్నుడుగాంచె
కాలకృత్యములనొనరించె । క్రౌంచవ్యూహమునిర్మించె
విజయుడుముఖమందునిలచెను । వెనుకధర్మరాజునిలచెను
శైబ్యకుంతిభోజులుకనుల । జేరిరిబలములతోమిగుల
శిఖపైద్రుపదుండునిలచెను । జేరెభీముడొకపకముచు
ద్రుపదపుత్రుడొకపకమును । తివరముగజేరినిలచెను
సౌభద్రుడుద్రౌపతిసుతులు । సాత్యకిమొదలైనబలములు
భీమునికైసాయముజనిరి । భీరమజూపించెదమనిరి.
సహదేవవృకోదరుసుతులు । శంబరనకులాదిబలములు
దృష్టద్యుమ్నునిగనుగొనిరి । తీవ్రంబుగసాయముజనిరి
దుర్యోధనుడదిగనినాడు । దురమునకిటుజనుమనినాడు

దుర్యో॥క్రౌంచవ్యూహముగనుడయ్యా । కదలుడుభేదించండయ్యా

## నెం. 5

దుశ్శాసనశూరసేనాదులొక । త్రోవనుజనుడయ్యా
ద్రోణగాంధారసైంధవాదులొక । త్రోవవెడలుడయ్యా
భీష్ముడుతక్కినబలములతోనొక । వైపుబోవునయ్యా
వెనుకకృతవర్మశల్యాదులతో । వెడలిగాతునయ్యా
సం॥ అనగభీష్ముడతిసంతసమొందుచు । యటులజేసెనయ్యా
భీష్ముడువ్యూహముపైనశరవృష్టి । వేగగురిసెనయ్యా
చించెరెక్కలనుకంఠముద్రుంచెను । శిఖనుగూల్చెనయ్యా
అన్నిచోట్లశరకోటినింపగా । యర్జునుడనెనయ్యా
అర్జు॥మనసేనలఖండించెవ్యూహమును । దునిమివేసెనయ్యా
రథమాతనికెదురుగదోలుముగ । ర్వంబుబాపుదయ్యా
సురలుమెచ్చనీవుమోదమొందగ । దురముజేయనయ్యా
సం॥ అనవినికృష్ణుండచటికిరథమును । యపుడుదోలెనయ్యా
రథమునిలిపిశూరసేనబలములు । రణముసలిపిరయ్యా
నరుడుచురుకుగలశరములు బరుపగ । వెరచిబారిరయ్యా
భీష్ముడుగని డెబ్బదేడు శరముల । విజయునేసెనయ్యా
యిరువదియైదమ్ములతో ద్రోణుడు । నరునిగొట్టెనయ్యా
మూటవికర్ణుడు కృపుడు శతంబున । పొంచికొట్టిరయ్యా
అరువదినాల్గిట దుర్యోధనుడా । నరునిగొట్టెనయ్యా
తొమ్మిది శరములనిడెశల్యుం డ । ద్భుతముదోచెనయ్యా
పర్వతంబుపైబడినవవర్షములు । పగిదినుండెనయ్యా

## నెం. 2

నరుడుగనికోపమునుగొని । యిరువదేనింట భీష్ముని
అరువదిశరముల ద్రోణుని । అమ్ములొకతొమ్మిటకృపుని
అటులశల్యునిం మూడింట । అవికర్ణునింమూడింట
ఐదిట రాజునేసెను । అద్భుతంబిట్లుజేసెను
ద్రౌపదీసుతాదులుగనిరి । త్వరగ భీష్మునిందాకిరి

భీష్ముడమ్ములన్నిగుడించె । విజయువక్షమును నొప్పించె
నరుడుకురుసేనజొచ్చెను । దురముసేయంగజొచ్చెను
సరగరథికులఁ ఖండించె । సారథులశిరములఁ ద్రుంచె
కురుబలముభీతినొందెను । నపసిగనలేకయుండెను

## నెం. 1

కురునాథుడు చింతనగొనెను । అరిగి భీష్ముగని యిట్లనెను
దుర్యో॥సవ్యసాచినింగనుమయ్యా । సకలబలముద్రుంచినడయ్యా
కర్షునివలదంటివినీవు । కదనంబున గనుచున్నావు
సం॥ అనభీష్ముడు మదిచింతించె । తనకుతానె శాంతముగాంచె
పాథుఁనిపైకప్రవేశించె । పాశస్త్రమ్ములవిపులనుంచె
పాండుతనయులదిగనినారు । పార్థునకటతోడైనారు

## నెం. 2

అందరొకచోటదలపడిరి । అద్భుతరణంబుజేసిరి
భీష్ముడమ్ములఁవిడచెను । విజయుడవ్వాటినరికెను
విజయుడమ్ములఁవిడచెను । భీష్ముడన్నిటినిద్రుంచెను
అంతభీష్ముండుకోపించె । అచ్యుతునియుంరముభేదించె
ఖరగరక్తమయమాయెను । పారిజాతమటుదోచెను
విజయుడతిక్రోధమునుగాంచె । భీష్మసారథినినొప్పించె
అపుడుశరవృష్టిగురిపించె । అఖిలబలములఁభేదించె
అంతభీష్ముండువారించె । అఖిలసైన్యముఃలరక్షించె
పమముగాబోరుచుండిరి । సకలసురలపుడు మెచ్చిరి
అపుడుమధ్యాహ్నమాయెను । అంతద్రోణుండులేచెను
ద్రుపదపుత్రుండులేచెను । దివ్యశశములఁ విడచెను
గురుడుసారథినిజంపెను । గుర్రములతలలుద్రుంచెను
ధ్వజమురెండుగాఖండించె । త్వరగనాతనిని బాధించె
ద్రుపదపుత్రుండుకోపించె । తీవ్రబాణముల సంధించె
గురుడుక్షణములో ఖండించె । సరగశరవృష్టిగురిపించె
ద్రుపదపుత్రుండు ఖండించె । ద్రోణుడతని ధనువుద్రుంచె

గొప్పగదనతడువేసెను । గురుడు చూర్ణముగ జేసెను
గురుడుకవచమ్ము ఖేదించె । సరగపార్థుని నొప్పించె
పార్థుడు విల్లుగైకొనెను । బాణవర్షంబుగురిపెను
గురుడువిల్లునందునిమెను । శరములఁ నాటగొట్టెను
అతనిగుర్రములఁజంపెను । అతనిసారథినిద్రుంచెను
రక్తసిక్తాంగుడాయెను । రథముపైనుండి దుమికెను
కత్తిబట్టుకొని యురికెను । కుత్తుకఁగోయదలచెను
గురుడుశరములం బరపెను । తరముగాకుండ నిలిపెను
గాంచి భీముండు వచ్చెను । కఠినశరములఁ గృచ్చెను

## నెం. 5

దృష్టద్యుమ్నుడు వేరొకరథమున । ద్రోణునేసెనయ్యా
దుర్యోధనుడాకళింగనాథుని । దురముకంపెనయ్యా
కళింగపతిబలములతోభీముని । కనలికొట్టెనయ్యా
భీమునిమార్కొనకేతుమంతుడతి । వేగవచ్చెనయ్యా
కళింగులనుభీముడు ఖడ్గంబున । ఖండించినడయ్యా
అనేకబలముల ఖండఖండలుగ । నతడుజేసెనయ్యా
కేతుమంతుడా కౌంతేయునిగని । గినిసికొట్టెనయ్యా
భీముని శరఘాతచేతనాతడు । వేగబారెనయ్యా
కళింగేశ సుతుడుశక్రదేవుడు । కనలివచ్చెనయ్యా
శరములనిగుడ్చి భీమాశ్వంబుల । జంపివేసెనయ్యా
అంతకోపించి భీముడుగదచె । యతనిగొట్టెనయ్యా
అశ్వముల్ జచ్చె యరథమువిరిగెను । నతడుమడసెనయ్యా
అంతటభీముడుఖడ్గంబునుగొని । యరదముదిగెనయ్యా
కళింగేశునిఁజంపుటకొరకై । కదలివచ్చెనయ్యా
కొడుకుచావుగనికళింగాధిపతి । కోపమొందెనయ్యా
అనేకశరములనిడెనుఖడ్గమున । యతడుద్రుంచెనయ్యా
భానుమంతుడన్నబాధగనుగొని । బరగివచ్చెనయ్యా
తానెక్కినగజమునుభీమునిపై । త్వరగదోలెనయ్యా
కనలిభీముడాగజమునెక్కిఖ । డ్గమునజంపెనయ్యా

రక్తధారగారెభానుమంతుడు । ప్రాణమువిడెనయ్యా
గాంచికళింగేశుడుతనబలమును । గలసివచ్చెనయ్యా
ఖడ్గముగొనిభీముడాబలంబుల । కనలిజొచ్చెనయ్యా
అనేకగజములతొండములనరికి । హతముజేసెనయ్యా
గుర్రంబులకంఠములగోసియొక । కుప్పజేసెనయ్యా
అరదంబులపాడిజేసిసారథుల । హతమొనర్చెనయ్యా
అంతసూతుడరదముగొనివచ్చిన । యాతడెక్కెనయ్యా
వేగశ్వేతాయువునవశరములచె । భీమునినొప్పించె
అంతమండిభీముడైదుశరముల । నతనికిసంధించె
చక్రరక్షకులజంపియొకబొబ్బ । చాలగగావించె
సరగకళింగేశుడుమూర్ఛిల్లిన । సారథివీక్షించె
అరదమునందిడుకొనిపోవుచుతా । నతిదుఃఖముగాంచె
భీష్ముడంతలోభీమునిగొట్టగ । వేగముజనుదెంచె
సాత్యకిశిఖండితోడభీమునకు । సాయంబరుదెంచె
అదిగనిభీష్ముడుఅందరితనువుల । నప్పుడునొప్పించె
అశ్వములజంపిభీమునిదేహమ్మా । తడునొప్పించె
కనలిశక్తిగొనిభీముడువేయగ । ఖండనమొనరించె
భీముడతికోపమొందిగదబూని । వేగంబరుదెంచె
భీమసేనుకంటెమున్నుసాత్యకి । భీష్మునియెదిరించె
కఠినశరంబిడభీష్మునిసారథి । కడువడిమరణించె
అశ్వములాతనిరథముగొనిజనగ । యద్భుతమనిపించె
భీముడుధృష్టద్యుమ్నునియరదము । వేగమధిష్ఠించె
శల్యకృపాశ్వద్ధామాదులపా । ర్షదుండువీక్షించె
శరదశకంబునయశ్వద్ధామా । శ్వంబులఖండించె
గురుకుమారుడాధృష్టద్యుమ్నుని । శరములపీడించె
అభిమన్యుండదిగనికోపించుచు । యచటికిజనుదెంచె
గురుసుతకృపులనుపదిహేనమ్ముల । గురిగనినొప్పించె
శల్యునియిరువదియైదమ్ములచె । చాలగనొప్పించె
ముగురభిమన్యునిశరవర్షంబున । ముంచివేసిరయ్యా

అభిమన్యునిపైలక్ష్మణుండంత । యమ్ములనిడెనయ్యా
యేబదిబాణంబులచేలక్ష్మణు । నెనసికొట్టెనయ్యా
త్వరగలక్ష్మణుడుయభిమన్యునిచే । ధనువుద్రుంచెనయ్యా
అభిమన్యుండింకొక్క ధనువుగొని । యతనినొంచెనయ్యా
తనయుడునొచ్చుటగనిసుయోధనుడు । త్వరగవచ్చెనయ్యా
ద్రోణభీష్ములభిన్యునకెదురుగ । గానవచ్చిరయ్యా
అభిమన్యుడుసుంత్తైనభీతిలక । యనినొనర్చెనయ్యా
అంతటపార్థుడుసుతుడొక్కండని । యపుడువెడలెనయ్యా
అడ్డగించుసైన్యంబులదునుముచు । యచటజేరెనయ్యా
ధర్మజుండుతనబలములనచటికి । త్వరగబంపెనయ్యా
నరునిశరఘాతచేకురుబలములు । నాశమొందెనయ్యా
రక్తనదులుబారజొచ్చెనోకురు । రాజావినుమయ్యా
భీష్మడంతద్రోణునిగనుగొని । యీవిధముబలికెనయ్యా
భీష్మ॥కృష్ణసారథ్యమునుబొందినయా । కిరీటిగనుమయ్యా
మనజాలవునేడుమనబలంబులు । మరల్పిమోయయ్యా
వం॥ సూర్యుడస్తాచలమునకుజనెయన । జూచివెడలెనయ్యా
సమరమాపిసకలబలములంతట । చల్లగజనెనయ్యా
వై॥ రెండవనాటిరణంబునుద్ధృతరా । ష్ట్రుండువిన్నడయ్యా
అపుడుబలికెమూడవనాడైనది । యాలకింతునయ్యా
అంతసంజయుండావృత్తాంతం । బాతనికనెనయ్యా

## మూడవదిన యుద్ధము

## నెం. 1

వం॥ అంతటసూర్యుండుదయించె । అంతకంతతేజముమించె
గాంగేయుండాలోచించె । గరుడవ్యూహమునిర్మించె
తానుముఖంబందుననిలచె । ద్రోణుడొక్కకన్నువనిలచె
యింకొకనేత్రమునఘనుండు । యేగినిలచెకృతవర్ముండు
గురుసుతకృపులంతటజనిరి । శిరమునెక్కిగాచెదమనిరి

శల్యుండునుభూరిశ్రవుఁడు । జయద్రథుడుభగదత్తుండు
కర్ణాటకులొకపక్షంబు । కళింగాదులొకపక్షంబు
నల్వురుకంఠంబునకేగ । నరపతిపుచ్ఛమ్మునకేగ
వ్యూహంబిటుజేసినరయ్యా । సాహసమునవిలచినరయ్యా
అర్జునుడీవార్తనువినెను । అపార్థునకునిట్లనెను
అ॥ చంద్రవ్యూహమునిర్మించు । చయ్యననాబలములగాంచు
గరుడవ్యూహముభేదించు । కురుబలమ్మునాశముగాంచు
సం॥ దృష్టద్యుమ్నుడుయోచించె । తీవరముగయటులొనరించె

## నెం. ౫

దక్షిణశృంగమునందుభీముండు । త్వరగనిలచెనయ్యా
పాండ్యమాగధులబలములగైకొని । బరగగాచెనయ్యా
పార్థుడుత్తరశృంగమునవిలచి । బలిమిగాచెనయ్యా
మహాశూరులగొనిధర్మజుడా । మధ్యనిలచెనయ్యా
నరుడంతటగరుడవ్యూహమునకు । శరములనిడెనయ్యా
హయములగజములరథికులనంతట । హతముజేసెనయ్యా
కౌరవులెల్లరునరునిజుట్టుకొని । కనలికొట్టిరయ్యా
పాండవబలములునరునకుదోడై । బాణములిడెనయ్యా
భీష్ముడునీబలములకురక్షకుడు । వెడలివచ్చెనయ్యా
భీముడువారలబలములగావగ । వేగజొచ్చెనయ్యా
ద్రోణభీష్మయశ్వత్థామాదులు । దురముజేసిరయ్యా
ద్రౌపదీసుతులుమొదలగుశూరులు । త్వరగవచ్చిరయ్యా
వారికివీరికిపోరుఘోరమై । వరలుచుండెనయ్యా
గాంధారబలంబుతోకురపతి । కనలికొట్టెనయ్యా
అభిమన్యుసాత్యకులుగాంధారుల । హతముజేసిరయ్యా
శకునికోపించిసాత్యకిరథమును । నరగద్రుంచెనయ్యా
సాత్యకియభిమన్యునిరథమెక్కుచు । శరములనిడెనయ్యా
యిరువురుశకునింగొట్టిభీష్ముడ । య్యెడకుదరలెనయ్యా
ధర్మజుండుభీష్మునిరథమాపుచు । త్వరగగొట్టెనయ్యా

అదిగనికురుపతిభీమునితనువున । కమ్ముకొనెనయ్యా
నవ్విభీముడొకకఠినశరంబును । నాటిగొట్టెనయ్యా
బాణఘాతచేకురుపతిరథమున । బడిమూర్ఛిలెనయ్యా
బలములంతభీమునికోపముగని । బారజొచ్చెనయ్యా
యురికెడిబలములధృష్టద్యుమ్నుడు । దరిమికొట్టెనయ్యా
కురునాథుడుమేల్కొనిబలముల । గూర్చితెచ్చెనయ్యా
గురుభీష్ములగనిసుయోధనుడుని । ష్ఠురములాడెనయ్యా

# నెం. 1

దుర్యో॥ యిరువురుకడుశూరులుమీరు । దురమునుగనుగొనుచున్నారు
పాండవబలమెరురగలేరా । పక్షపాతమునుగొనినారా
మీరిరువురుదలపడినంత । మిగులదుపాండవబలమింత
భీష్మునిగనియపుడిట్లనెను । వీరశిరోమణివీవనెను
కర్ణునివలడంటివిగాదా । గాకుండినగాదనరాద
సం॥ అనగనవ్విభీష్ముండనెను । హరునితరముగాదనియనెను
భీష్మ॥ పాండవవీరులుఘనులయ్యా । భండనపండితులోయయ్యా
వయసుమీరియున్నామయ్యా । వార్ధక్యమువచ్చినదయ్యా
ఐనగానిగనుగొనుమయ్యా । అబలములధృంచెదనయ్యా
సం॥ అంతటమధ్యాహ్నంబాయె । ఆభీష్ముండరుగగనాయె

# నెం. 2

భీష్ముడనిలోనజొచ్చెను । వేగశరవృష్టిగురిపెను
కఠినశరములన్నిగుడించె । ఖరులతొండముల్ ఖండించె
అమితబాణములసంధించె । అశ్వకంఠంబులనుద్రుంచె
అమ్ములన్వేగబంపించె । అరదములనెల్లఖండించె
రణములోరుద్రుడైమించె । అధికసంఘమునుపిడించె
సారథులతలలునరికెను । సమరమందిట్లుదిరిగెను
రక్తనదులంతబారెను । శక్తివలెనిట్లుజేసెను
పాండవులసేనదుఃఖించె । పద్మనాభుండువీక్షించె

పార్థునకు నిట్లు వినిపించె । ఖదరమును చేతజూపించె

కృ॥ భీష్మునిం గెల్తునంటివి । వెఱ్ఱివై చూచుచుంటివి
ధీరమును నీవు జూపించు । వేగమున బలము రక్షించు

సం॥ అనగ పార్థుండు వినినాడు । అరదమును దోలుమన్నాడు
అనగ హరి యట్లు లొనరించె । ధనువు టంకారమొనరించె
అపుడు భీష్ముండు కోపించె । హరినరుల నంతపీడించె
అర్జునుం డంత భీష్మించె । ఆతని చాపమును ఖండించె
వేరువిల్లతడు ధరియించె । విజయుడద్దాని ఖండించె
అంతనింకొకటి ధరియించె । అతికఠినశరములంపించె
చిత్రముగ రథము నడిపించె । శ్రీపతియు దాడి దప్పించె
మరల శరములన్ని పంపించె । మాధవుని నరుని పీడించె
నరుడు బాధగొని వీక్షించె । శరముల మితముగ సంధించె
అతడన్నిటిని ద్రుంచెను । అమ్ములన్ గ్రుమ్మరించెను
అర్జునుడు బాధనొందెను । హరియు కడుబాధజెందెను

## నెం. ౮

మాధవుండు నొచ్చిన పార్థునిగని । మదినిదలచినాడు
యీ భీష్ముని నే విడిపించెదనిక । దిటలేదన్నాడు
యాదవకేకయ పాంచాలాదులు । యలసినరన్నాడు
కౌరవసైన్యం బతిసంతసమును । గాంచినదన్నాడు
భీష్ముని జూచగ పాండవసైన్యము । భీతిలెనన్నాడు
శాంతముతో నేనున్న పాండవులు । జచ్చెదరన్నాడు
ఇతని జంపి పాండుతనయులకు జయము । నిచ్చెదనన్నాడు
మదిలో కృష్ణుడు దలపగ భీష్ముడు । మరలగొట్టినాడు
ఆశరముల ఘాతనొంది పార్థుడు । యలసటగొనినాడు
సమయమిదియని మెచ్చు కురుతనయాదులు । సరగవచ్చిరయ్యో
ఆడిగని సాత్యకి తమవిపులతో । యపుడిటుల నెనయ్యో
భీష్ముని గీష్మునికేల వెదకగా । వెతలుండ నెంతయ్యో
అనగ శ్రీకృష్ణుడతి కోపంబున । యపుడు దలచెనయ్యో

తనచక్రంబునుస్మరించినంతట । త్వరగవచ్చెనయ్యా
పగ్గంబులునొగలగట్టియరదము । డిగ్గిమరికెనయ్యా
అవనికంపించెపీతాంబరమం । దందుదూలెనయ్యా
కౌరవబలములుచక్రజ్వాలకు । కడుభీతిలిరయ్యా
పులినిగన్నలేళ్ళవిధముకూరులు । కలతజెందిరయ్యా
చిత్రప్రతిమలవిధ ఁనకౌరవ । సేనలాయెనయ్యా
భీష్ముడుతనపైకేగుదెంచునా । విష్ణునిగనెనయ్యా
భీష్మ॥ ధన్యునిసేయుముదయామయుడవై । త్వరరమ్మనెనయ్యా
నేనొనర్చుపుణ్యములుఫలించెను । నేటికియనెనయ్యా
పాథుఁడుమిత్రుండనిరథమందున । వరలుచుంటివయ్యా
భక్తుడనని నారథమందుననీ । పదముబెట్టుమయ్యా
సం॥ అనుచుభీష్ముడననరుఁడరదముడిగి । హరినిబట్టెనయ్యా
హరియర్జుననిఁగుంజూకొనిముందు । కరుగుచుండెనయ్యా
పదియడుగులుజనినరుడాకృష్ణుని । ప్రార్థిఁచినదయ్యా
అ॥ కోపమేలశాంతిబొందుమోయదు । కుంజరనిలుమయ్యా
ధర్మసుతునిప్రతిననిలుపదలచిన । దయాళుండవయ్యా
బహుకోపంబుననీవిటుజేసిన । భంగంబగునయ్యా
జనితివేనిసాత్యకివిబంపినటు । సరగమరలుమయ్యా
బ్రహ్మాండంబులుకనలినీవుగన । భస్మంబగునయ్యా
చక్రముధరించియుచుకనేలయిక । శాంతిబొందుమయ్యా
అణుమాత్రంబలసితినిటుజేసిన । యవమానంబయ్యా
సం॥ అంతటకృష్ణుండతిసంతసపడి । యపుడుమరలెనయ్యా
అరదమెక్కిచక్రముబనెశంఖం । బప్పుడుపూరించె
పాథుఁడంతదేవదత్తమొత్తగ । బలముభీతిగాంచె
వాడిగల్గుబాణములచేతకురు । బలమునుహింసించె
అపుడుభీష్మభూరిశ్రవశల్యులు । యచటికిజనిరయ్యా
శక్తిగదాబాణతోమరమ్ములు । చాలవేసిరయ్యా
అన్నిటిన్దునిమియైంద్రాస్త్రంబును । యపుడువేసెనయ్యా
దానిచేతకౌరవసైన్యంబులు । సైన్యమొందెనయ్యా

అవనిరక్తమాంససంకులంబై । యదిగన్పడెనయ్యా
భూతప్రేతపిశాచసంఘములు । మురిసివచ్చెనయ్యా
పాంచజన్యదేవదత్తనాదము । భయముగొల్పెనయ్యా
అంతసూర్యుడస్తాచలంబునకు । యపుడుజేరెనయ్యా
సకలబలంబులుతమగృహంబులకు । చయ్యనజనెనయ్యా
వై॥ మూడవనాటిరణంబునుకౌరవదూ । పుడువినెనయ్యా
నాల్గవనాటిదివినియెదననం । జయుడుబలికెనయ్యా

## నాల్గవనాటి యుద్ధము

## నెం. 2

సం॥ అంతసూర్యుడుదయించెను । అపుడుభీష్ముండుగాంచెను
సకలబలములకాదరలించె । సత్వరముతానుజనుమెంచె
పాండుసుతులంతవచ్చిరి । బహుబలంబులకాదెచ్చిరి
భేరులంతలోమ్రోగెను । భీకరధ్వనినిజేసెను
ఉభయుసైన్యములుపోరెను । ఉగ్రముగరణముమీరెను
గండ్రగొడ్డండ్లగొట్టిరి । ఖడ్గములుబట్టినరికిరి
శూలములతోడగృచ్చిరి । గూలుచునుజచ్చుచుండిరి

## నెం. 5

ద్రోణవివిశతిశల్యకురుపతులు । తొందరజనిరయ్యా
భీష్మకృపసోమదత్తులచటికి । వేగవచ్చిరయ్యా
ఒక్కయభిమన్యుపైకియేద్వుర । త్యుగ్రతజనిరయ్యా
వసివాడనుచునుకరుబలేకశర । పంక్తులవిడిరయ్యా
సురలునుతింపగయభిమన్యుండది । జూచినిలచెనయ్యా
ఇంతయైనభయముగొనకశరముల । నేసియార్చెనయ్యా
అంతభీష్ముడచటినుండివెడలుచు । జూడెనజనెనయ్యా
నరునిగాంచిశరవృష్టిగురియుగా । నరుడుమనిమెనయ్యా
అయిపవురకప్పడైనయుద్ధం । బద్భుతమగునయ్యా

కురుపతికృపాదులభిమన్యుపై । శరములనిడిరయ్యా
గనియభిమన్యుడునవ్వినీతనయు । దనువుద్రుంచెనయ్యా
అభిమన్యునిముప్పదివేలసైన్య । మంతటజుట్టెనయ్యా
ఒకడుభీతిలకనందరితోరణ । మొప్పుజేసెనయ్యా
హస్తలాఘవంబర్జునుకంటెను । యధికమతనిదయ్యా
నరుడుగాంచితనకొడుకొక్కండని । సరగునజనెనయ్యా
గనిదృష్టద్యుమ్నుడుబలములతో । కదలివచ్చెనయ్యా
శల్యపుత్రుడతనికడ్డముగజని । శరములనిడెనయ్యా
అంతకోపమునహయసారథులను । యణడుదునిమెనయ్యా
శల్యసుతుడువిరథుండైకనలుచు । శస్త్రముగొనెనయ్యా
అతనిగాంచియుభయసైన్యవీరులు । యతిభీతిలిరయ్యా
ద్రుపదసుతునిజంపెదననిచెంతకు । తీవ్రమరిగెనయ్యా
ద్రుపదకుమారుండనేకశరముల । నపుడువేసెనయ్యా
పలకచేతశల్యతనయుడవ్విటి । భంగపరచెనయ్యా
కత్తివేయగాదృష్టద్యుమ్నుడు । గదనువేసెనయ్యా
గదాఘాతచేకత్తివిరిగెతల । ఖండలాయెనయ్యా
కొడుకుజచ్చుటనుగనిశల్యుడుబహు । కోపమందెనయ్యా
అనేకకఠినశరంబులువేయగ । యతడునొచ్చెనయ్యా
అభిమన్యుడుగనిశల్యునిదేహం । బవయగొట్టెనయ్యా
గాంచినకులసహదేవులుశల్యుని । కనలిదాకిరయ్యా
శల్యుడందరినిబొడువవిరాటుడు । సరగవచ్చెనయ్యా
అనేకబలములతోడద్రుపదుడది । గనివచ్చినడయ్యా
కురుపతియనేకవీరులనచటికి । త్వరగబంపెనయ్యా
అంతమధ్యాహ్నమాయెభీముడపు । డచటికిజనెనయ్యా
గజసైన్యముతోమగధునికురుపతి । గాంచిపంపెనయ్యా
అదిగనిభీముడుగదగొనిమండుచు । యరదముదిగెనయ్యా
భయంకరధ్వనిజేయగజంబులు । భయముజెందెనయ్యా
అభిమన్యుడుద్రౌపదీసుతాదులు । యదిగనిజనిరయ్యా

తనగజమునుమగధుండభిమన్యుని । తాకబంపెనయ్యా
అభిమన్యుడుకరిమగధులగనుగొని । యుద్ధమునప్పెనయ్యా
శరద్వయంబునకరిమగధేశుల । జంపివేసెనయ్యా
భీమునిగదచేననేకగజములు । ఛిన్నులాయెనయ్యా
అంతటకురుపతియనేకబలముల । అచటికంపెనయ్యా
ప్రళయకాలరుద్రునివలెభీముడు । భంగపరచెనయ్యా
నీబలంబులాభీమునిచేరక । నిలువకజనెనయ్యా
అంతటభీష్ముడుభీమునికెదురై । యుద్ధముగాకైనయ్యా
సాత్యకిభీష్మునిపైకిరాగా । కనుచునిల్చెనయ్యా
భీకరమ్మునినిచేసిసాత్యకి । చిట్టునొంచెనయ్యా
సాత్యకికరినిశరంబులవిడుమా । ఛేదనుగొనిపడెనయ్యా
సోమదత్తుండునీసుతులతనిని । చుట్టుముట్టిరయ్యా
భీముడుగదగొనివేయనీసుతులు । రోతనువెంపిరయ్యా
అదిగనికురుపతితొమ్మిదిశరముల । నాతనినొప్పించె
అరదమెక్కిభీముడుపదిశరముల । నాతనిపీడించె
త్వరగదుర్యోధనుండుపవనజుని । ధనువునుఖండించె
పరగునభీముడువిల్లుగొనికురుపతి । చాపమ్ముఖండించె
త్వరగవిల్లుబానికురుపతిభీముని । యురమునుభేదించె
భీముడుమూర్ఛజాలెయభిమన్యాదులు । వేగవచ్చిరయ్యా
నీతనయునిచుట్టుముట్టిశరముల । నిగుడించిరయ్యా
అంతటభీముడుతెలివినొందిప్రళ । యాంతకువలెనయ్యా

## నెం. 2

శల్యకురుపతులగొట్టెను । చాలబలములజంపెను
భీమునిజూడకుండిరి । భీమునకుభయమునొందిరి
అంతనపరాహ్ణమాయెను । అప్పుడుకురుపతుడుగాంచెను
సుతులుపదునాల్గురేగిరి । జూచిభీమునిదాకిరి
కఠినశరములజరపిరి । గదాఖడ్గములువిసరిరి
భీముడవ్వారిజూచెను । పిల్లశేళ్ళగనుపులివలెను

అతికఠినబాణమును బంపె । ఆపుడు సేనాపతి నిజంపె
అపుడుమూడమ్ములను బంపె । అచిరాజలసంధు నిరాజంపె
కఠినశరమంతవిడచెను । గనిసుషేణునిరాజంపెను
వేగశరపంచకంబిడెను । భీమబాహుండు జచ్చెను
భీమభీమరథులను జంపె । వేగనాయుగ్రునిరాజంపె
అంతనవ్వుచునుశరమిడెను । ఆసులోచనునిజంపెను
అర్గురంతలో జూచిరి । అతిభయముజెందిబారిరి
అపుడుభగదత్తుడదిగనెను । అంతతనయేన్గనంపెను
కఠినబాణములవైచెను । గాంచియభిమన్యుడరిగెను
గజముపైబాణములనిడెను । గజముతబ్బిబ్బునొందెను
రక్తమయమగుచుకరిగనెను । రణముసేయంగయురికెను
పాండవులబలముపైబడెను । బలములనుజంపజొచ్చెను
దానినెదిరింపకుండిరి । తరముగాదనుచువెడలిరి
అపుడుదుర్యోధనుడుగనెను । అచిరాభీమునకుశరమిడెను
అంతభీముండుమూర్ఛపడె । ఆఘటోత్కచుడుదలపడె

## నెం. 5

తండ్రిపాటుగనిఘటోత్కచుండటు । దరలివచ్చినాడు
మాయజేసిజనకునిగైకొనిజని । మరలవచ్చినాడు
సహస్రాక్షుడగునింద్రునివేసము । సరగవేసినాడు
కైలాసపర్వతాకారముగల । గజమునెక్కినాడు
అష్టదిక్పాలకులవలెయసురుల । నంతజేసినాడు
యీపాండవులకుజయమిప్పించెద । నింద్రుడనన్నాడు
వేగవచ్చిభగదత్తునిగజమును । బట్టిగొట్టినాడు
దానిమదమడచికౌరవసేనల । దరుమగొట్టినాడు
అనేకరథగజహయకాల్బలముల । హతముజేసినాడు
దుర్యోధనుగనిమహాక్రోధమున । దురముజేసినాడు
భీష్ముడంతలోద్రోణువిగనియి । వ్యూధముబల్కినాడు
భీష్ము॥ ఘటోత్కచుడుమాయచేతవచ్చెను । గనుగొనుమన్నాడు
ఆతనిగొట్టకుండినచోకురుపతి । హతమగునన్నాడు

సం॥ అనుచుద్రోణభీష్మాదియోధులవు । డచటికిజనినారు
అనేకాస్త్రశస్త్రంబులనుపపై । యప్పడువేసినారు
అభిమన్యాదిమహావీరులుగని । యచటజేరినారు
ఉభయబలములకుపోరుఘోరమై । యొప్పినదన్నాడు
ఘటోత్కచుడుగనిసింహగర్జనము । కనలిజేసినాడు
సింహగర్జనమువినిగజసంఘము । చెదరిపారెనయ్యా
భీతిలినీసైన్యంబులజంపుచు । వెతలిపోయెనయ్యా
భీష్ముడుద్రోణునితోడనిట్లనెను । వీడసాధ్యుడయ్యా
అదుగోసూర్యుండస్తగిరికేగె । యనినినిలుపుండయ్యా
సాయంకాలంబాయెవీనితో । సమరముడగదయ్యా
అనగద్రోణుడారణమునునిలిపెను । అందుపుజనిరయ్యా
పాండవసైన్యంబందుజయధ్వని । ప్రబలమాయెనయ్యా
నీతనయులుచిన్నబోయితమతమ । నెలవులగనిరయ్యా
వై॥ నాల్గవదినయుద్ధవార్తలాకురు । నాథుడువినెనయ్యా
ఐదవనాటిరణంబుదెలుపుమన । యతడుజెప్పెనయ్యా

—: ఫ ల శ్రు తి :—

## నెం. 1

భారతవీరులచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుదీని । విరచించెనుభక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడుయీనత్కృతిని
నదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని

# ఐదవనాటి యుద్ధము

## నెం. 1

వై॥ ధృతరాష్ట్రుండాతనికనెను । దెలుపుమిద్దినేనడిగెదను
ధృ॥ పాండవబలమేఘనమనుచు । ఖండనమునగెలచినదనుచు

నాకుమారులోడినరనుచు । నాఖలంబుజచ్చినదనుచు
నాకెప్పుడుజెప్పితివయ్యా । నాసుతులకుజయమనవయ్యా
అధికవీరులిందునలేరా । అభీష్మద్రోణులులేరా
వై॥ అనగసంజయుండిట్లనెను । ఆకారణమికవినుమనెను
సం॥ సత్యధర్మములుగలవారు । శౌరిసాయమునన్నారు
జయముపాండవులకేయవును । సత్యంబిదియనిమదిబూను
నీతనయుడుభీష్మనిజేరి । నీవడిగినవడిగెనుకోరి

క్షేపకము

భీష్మా॥ గాంగేయుండపుడిట్లనెను । గలదుమానసంబనుకొలను
ఉత్తరమునగిరిగలదయ్యా । ఉత్తమస్థలమువినుమయ్యా
బ్రహ్మయందుసభగావించె । వరదేవతలనుబిల్పించె
ఘనవిమానమటకరుదెంచె । కమలభవుడువానినిగాంచె
విమానమునహరినింగాంచె । వినతుడగుచునిటువినుపించె
బ్ర॥ మర్త్యలోకమునుగనుమయ్యా । మహాపాపులటగలరయ్యా
మహీభారముడుపగదయ్యా । మనుజుడవైబుట్టుగదయ్యా
నరునివెంటగొనుమోయయ్యా । నరలోకమునేలగదయ్యా
భీష్మా॥ అనహరివినిదయతోగాంచె । అతులజేతునంచువచించె
అహరియేకృష్ణుండగును । ఆనరుడేయీనరుడగును
యిదితెలిసినవారికిసుఖము । యిదిపాండవులెరిగిరినిజము
యిపుడురణముమానగరాద । యెల్లరబ్రతికింపగరాద
సం॥ నీసుతునకుదెల్పినడయ్యా । నీసుతుడటుగాదనెనయ్యా
నీతనయులుజచ్చెదరయ్యా । నీకుదుఃఖమగునోయయ్యా
గానవారికేజయమయ్యా । గలుగునునీకపజయమయ్యా
ఐదవనాటిదివినుమయ్యా । అడలనేలధృతిగొనుమయ్యా
అంతటసూర్యుండుదయించె । అఖిలబలములనుజంపించె
మకరవ్యూహంబొనరించె । మరిభీష్ముండటుకరుదెంచె
చెలగిద్రుపదసుతుడరుదెంచె । శ్యేనవ్యూహమునిర్మించె
తగునట్టుగశూరులనుంచె । త్వరగభీష్ముడపుడరుదెంచె

## నెం. 2

వేగవ్యూహమునజొచ్చెను । భీష్మునింగాంచికొట్టెను
భీష్ముడాతనినిగొట్టెను । భీముడంతలోనొచ్చెను
అర్జునుండేగుదెంచెను । అఖిలసైన్యములద్రుంచెను
అపుడుభీష్ముసినిగొట్టెను । అతడంతలోనొచ్చెను
గాంచికురునాథుడరిగెను । కనలిద్రోణునకునిట్లనెను
పరమశూరులనియుచుకొంటి । పాండవులగెల్తురనుకొంటి
వీరలైయూరకుంటిరి । విజయునింగొట్టకుంటిరి
సరగద్రోణుండువెడలెను । సాత్యకియుగురునిదాకెను
కఠినబాణములద్రెచ్చెను । కనలిద్రోణుండుగొట్టెను
సాత్యకియువాలరెచ్చెను । పవనసుతుండువచ్చెను
గురునిబాణములగొట్టెను । గురుడువాటిచేనొచ్చెను
శల్యభీష్ములపుడేగిరి । సాయమైపోరసాగిరి
ద్రౌపదీసుతులుజేరిరి । త్వరగశరవృష్టిగురిసిరి
అంతయభిమన్యుడేతెంచె । అందరినిబాణములనొంచె
కనిశిఖండియటుజేరెను । ఘనశరముభీష్మునేసెను
అంతభీష్ముండుజూచెను । అపుడుయుద్ధమునుమానెను
ద్రోణుడదిగనుచువచ్చెను । ద్రుపదపుత్రునిగొట్టెను
పాండవులుగురునిదాకిరి । పటుశరంబులవేసిరి
పోరుఘోరముగజరిగెను । పుడమిరక్తముననిండెను
భీముడాభీష్మునెదిరెను । విజయుడాద్రోణునెదిరెను

## నెం. 3

పాండవబలములుకౌరవబలములు । వడిగబోరిరయ్యా
అభిమన్యునిపైలక్ష్మణుడంతట । నమ్ములవిడెనయ్యా
కఠినశరంబులలక్ష్మణుయురమును । గాఢనేసెనయ్యా
అంతబోకహయరథసారథులను । హతముజేసెనయ్యా
విరథుడైలక్ష్మణుండుశక్తినిడ । విరుగవేసెనయ్యా
అంతటకృపుడాలక్ష్మణుమరలిచి । యపుడుబంపెనయ్యా

అపుడుమధ్యాహ్నమాయెకురునాథు । డంతజూచెనయ్యా
రథములనిరువదియైదువేలనా । రణముకంపెనయ్యా
అర్జునుండుగనితీవ్రశరంబుల । నంతవేసెనయ్యా
అనేకరథములద్భంచిరథికులఁ । హతముజేసెనయ్యా
భీష్ముడపుడెల్లరకుసాయమై । విజయునేసెనయ్యా
నరభీష్ములకత్యద్భుతరణమా । నాడుజరిగెనయ్యా
భీష్ముండంతటనొచ్చిగురునకి । వ్విధముబలికెనయ్యా
అస్తగిరికిసూర్యుడుజనెసమరం । బాపివేయుమయ్యా
అనగద్రోణుడటులజేసెసైన్యము । లపుడువెడలెనయ్యా
వై॥ ఐదవనాటిరణంబునువినినృపు । డంతబలికెనయ్యా
ఆరవనాటిదిజెప్పుమనగనతడంత । బలికెనయ్యా

# ఆరవనాటి యుద్ధము

## నెం. 1

అంతటసూర్యుండుదయించె । అర్జునుండువడినేతెంచె
మహాసేనలనుబంపించె । మకరవ్యూహమునిర్మించె
వీరులనఁదంతటనుంచె । పోరుకుసిద్ధముగావించె
గాంచిభీష్ముడటకరుదెంచె । క్రౌంచవ్యూహమునిర్మించె
తగువారలనెల్లెడనుంచె । త్వరగభేరులనుమ్రోగించె

## నెం. 2

త్వరగద్రోణుండువెడలెను । శరములందందుగురిపెను
వ్యూహమునజేరజూచెను । పాంచిభీముండులేచెను
గురుడునవశరములపుడిడెను । శరములాభీముదాకెను
భీముడతికోపమొందెను । భీకరశరంబువిడచెను
గురునిసూతుండుజచ్చెను । అరదమునుగురుడెనడపెను
అంతదుర్యోధనుడువచ్చె । అధికబలములఁగొనితెచ్చె
భీముడెల్లరఁదాకెను । పిన్నపెంటలఁజేసెను

## నెం. 5

భీమసేనునిఁగాంచినీసుతులు । వేగవచ్చిరయ్యా
ఒక్కభీమునిఁబట్టిచంపుటకు । యుద్యమించిరయ్యా
గదగొనిభీముడురథముడిగినురికి । కరులఁజంపెనయ్యా
దృష్టద్యుమ్నుడుగురునకోడియా । డెసకువచ్చెనయ్యా
భీమసేనునకుసాయపడగనా । వీరులుగనిరయ్యా
ద్రుపదసుతుడుమోహనాస్త్రమిడగా । తెలివిబాసిరయ్యా
అంతటద్రోణుడుపడినవారిగని । అడిగనుగొనెనయ్యా
ప్రజ్ఞాస్త్రంబునమోహనశక్తిని । భంగపరచెనయ్యా
పన్నిద్దరునీసుతులుతెల్విగొని । బాణములిడిరయ్యా
అభిమన్యుడుద్రౌపదీకుమారులు । యుచటజేరిరయ్యా
వారికివీరికిఘోరమగురణము । వరలుచుండెనయ్యా
ద్రోణుడటువచ్చుటనుగనిదృష్ట । ద్యుమ్నుడాపెనయ్యా
డెబ్బదిబాణమ్ములతోద్రోణుని । దెబ్బదీసెనయ్యా
రక్తాక్షుండైద్రోణుడాతనిది । రథముద్రుంచెనయ్యా
వేరురథంబునదృష్టద్యుమ్నుడు । వేగవచ్చెనయ్యా
భీముండరదమునెక్కినీసుతుల । ఓట్టువాకెనయ్యా
సరగదుర్యోధనుండుతమ్ములకు । సాయమాయెనయ్యా
అంతద్రౌపదీసుతులుసుయోధను । నపుడుదాకిరయ్యా
రక్తసిక్తాంగుడగుచుక్రోధమున । రణముజేసెనయ్యా
అంతభీముడుసుయోధనుఁజంప । యుచటజేరెనయ్యా
అడ్డమైనిలచిబాణములనుగొని । యపుడిటులనెనయ్యా

## నెం. 2

భీ॥ నాడునినుఁజంపఁజూచితిని । నేడుసమకూరెనిలిపితిని
సం॥ అనుచుబాణములఁబరపెను । ఆతనిసారథినిఁజంపెను
అతనిగుర్రములఁజంపెను । అరదమునుద్రుంచివైచెను
అతనిచాపమునువిరచెను । అతనిధ్వజముఁబడవేసెను

వేరురథమెక్కివచ్చెను । వేగశరములనుగృచ్చెను
కనలిభీముండుజూచెను । కఠినబాణములగొట్టెను
వాటిఘాతచేమూర్ఛిల్లె । వానిసైన్యంబుదురపిల్లె
అపుడుకృపుడంతవచ్చెను । అతనినరదమునగొనిచనెను
అపుడుసైంధవుడుజూచెను । అధికక్రోధమునవచ్చెను
అంతయభిమన్యుడేతెంచె । వింతశరములన్నిగుడించె
సైంధవుడునొచ్చివెడలెను । సరగనీసుతులగాంచెను
చిత్రసేనాదులేగిరి । శీఘ్రముగజుట్టుముట్టిరి
పార్థసుతుడంతగాంచెను । బాణవర్షంబుగురిపెను
అఖిలబలములజంపెను । అందరికిబాధజేసెను
రక్తనదులంతబారెను । రణముభీభత్సమాయెను
ద్రౌపదీతనయులేగిరి । త్వరగశరవృష్టిగురిపిరి
సూర్యుడస్తాద్రికేగెను । జూచిబీష్ముండునిలచెను
సమరమునునిలిపివెడలిరి । సకలసైన్యములుదరలిరి

## నెం. 5

వై॥ అరవనాటిరరణంబునువినినృపు । డంతబలికెనయ్యా
సప్తమదినరణమునువినియెదనన । సంజయుడనెనయ్యా

# యేడవనాటి యుద్ధము

## నెం. 1

ఆరాత్రియెకురుపతిజనెను । అభీష్మునిగనియిట్లనెను
దు॥ మనబలములుజచ్చినవయ్యా । మనశూరులుబెదరినరయ్యా
నిన్నునమ్మివచ్చితినయ్యా । నీవిటుజేయగదగదయ్యా
మారుతిచేజిక్కితినయ్యా । మహాఖేదమొందితినయ్యా
సం॥ అనగభీష్ముడపుడిటులనెను । అటులచింతజేయకుమనెను
భీష్మ॥ జయాపజయములురణమందు । శాశ్వతములుగావనియందు
బడలియుంటివికజనుమయ్యా । తడయకనిద్రించగదయ్యా

సం॥ అనదుర్యోధనుడదివినెను । అప్పుడుతనగృహమునకుజనెను

## నెం. 2

అంతలోసూర్యుడుదయించె । అప్పుడుభీష్ముండుజనుదెంచె
మండలవ్యూహమొనరించె । ఖండనముసేయుటకుగాంచె
పాండవాగ్రజుడువీక్షించె । వజ్రవ్యూహంబునిర్మించె
భేరులంతటనుమ్రోగించె । వేగరణమునకుజనుదెంచె
ఒకరితోనొకరుపోరిరి । ఉగ్రశైలబాణములనిడిరి
అఖిలనృపగణమువచ్చెను । [illegible]
[illegible] । అస్త్రశస్త్రములవేసిరి
అర్జునుడువారిజూచెను । ఐంద్రబాణమునువిడచెను
దానిఘాతచెజచ్చిరి । త్వరగగనిజారజొచ్చిరి
కరులసంఘంబుజచ్చెను । తురగములునేలగూలెను
అరదములుచూర్ణమాయెను । అఖిలబలమంతజారెను
విరటుడాద్రోణుదాకెను । శరములమితముగవేసెను
గురునిహయసారథులద్రుంచె । గురునిధ్వజచాపములద్రుంచె
గురుడువేరొక్కవిల్లుగొనెను । విరటునరదంబువిరచెను
విరథుడైసుతునిజేరెను । వేగనాతండుదాకెను
గురునకతిబాధగలిగెను । గురుడుకోపించిశరమిడెను
శంఖునకుదెబ్బదగిలెను । సత్వరముమూర్ఛజెందెను
ద్రుపదసుతుడంతవెడలెను । అప్పుడుదుర్యోధనుడుగనెను
కురువరుడుయతనిదాకెను । ఘోరబాణములబరపెను
ద్రుపదసుతుడంతనొచ్చెను । తీవ్రమగుశరమువిడచెను
అతనియరదమునుగూల్చెను । అతనిధనువంతద్రుంచెను
విరథుడైకత్తిబట్టెను । వేగనదానిగూల్చెను
శకునిగనుగొనుచువచ్చెను । సరగకుపతినిగొనిచనెను
అపుడుభగదత్తుడేతెంచె । అంతతనగజమునంపించె
పాంతవబలంబుపైబడెను । బలములజంపదొడగెను

## నెం. 5

అదిగనిఘటోత్కచుండువేగమే । యనికిజొచ్చెనయ్యా
ఒక్కగడియలోకరినిబట్టుకొని । యుక్కుబాపెనయ్యా
పాండవబలములుఘటోత్కచునిచె । బరగనిలచెనయ్యా
బహుకోపంబునభగదత్తుడుఘన । బాణములిడెనయ్యా
బాణఘాతచేఘటోత్కచుండని । బాసిపోయెనయ్యా
అపుడునీబలములతిసంతసపడి । యనికినిలచిరయ్యా
చేకితానుడాకృపునితోరణము । జేయజొచ్చెనయ్యా
అతిఘోరంబుగపోరియాయిరువు । రవనింబడిరయ్యా
అంతటభీష్ముండతికోపంబున । యచటికిజనెనయ్యా
అడ్డగించిధర్మజుడుకరంబుల । నతనిగొట్టెనయ్యా
అతడుకోపించిధర్మజుహయముల । హతముజేసెనయ్యా
విరథుడైశక్తివేయగభీష్ముడు । విరుగగొట్టెనయ్యా
ఆసమయంబునపాండవవీరులు । యతనిదాకిరయ్యా
అనేకబలమిటుతనపైవచ్చుట । యరసినిలచెనయ్యా
అతిధైర్యమ్మునయనేకబలముల । హతముజేసెనయ్యా
పాండవబలములుభయమునుజెందుచు । బారజొచ్చెనయ్యా
యింకొకదిక్కునద్రోణుబలముల । నిటులగొట్టెనయ్యా
రక్తనదులుబారజొచ్చెవినుమా । రణమందోయయ్యా
సూర్యుడస్తాచలమునకుబోవుట । జూచినిలపిరయ్యా
అఖిలబలంబులుతమతమనెలవుల । కంతబోయెనయ్యా
ధృ॥ యేడవదినమునజరిగినయుద్ధం । బిపుడువింటివయ్యా
వై॥ అష్టమదినయుద్ధంబుదెలుపుమన । యతడుబలికెనయ్యా

## యెనిమిదవనాటి యుద్ధము

## నెం. 1

అంతటతెలవారగగాంచి । ఆభీష్ముడుత్వరజనుదెంచి
కూర్మవ్యూహమునిర్మించె । ఘోరరణముసలుపగనెంచె

దృష్టద్యుమ్నుడుయోచించె । శృంగాటకవ్యూహమునెంచె
పాండవబలమునురప్పించె । భండనంబుప్రారంభించె

## నెం. 2

రెండుసైన్యములుదాకిరి । మెండుగాగొట్టసాగిరి
అంతలోభీష్ముడేతెంచె । అప్పుడుశరవృష్టిగురిపించె
అంతటనుదిరుగుచుండెను । అందరినిగొట్టుచుండెను
పాండవులబలముజచ్చెను । భయముచేజారజొచ్చెను
పాండవులబలమునంపెకడు । భండనంబందునిలబడడు
భీష్మునెదిరింపకుండిరి । భీతిచేనొదుగుచుండిరి
అంతలోభీముడెదిరించె । అతనిరథసారథినిదునిచె
గుఱ్ఱములురథమునీల్చెను । కురుబలంబంతచింతిలెను

## నెం. 5

అంతనునాభుండనునీతనయుడు । అప్పుడువచ్చెనయ్యా
కనలిభీముడొకకఠినశరంబున । గళముద్రుంచెనయ్యా
నీతనయులేడ్వురడిగనిభీముని । నిలచికొట్టిరయ్యా
బాధజెందిభీముడుశరములను । బరపినిలచెనయ్యా
బాణఘాతచేనీసుతులచ్చట । బడిచచ్చినరయ్యా
నాడుసభలోనబలికినపలుకులు । నేడుబలికెనయ్యా
కొడుకులువినరనిబలికెదవునీవు । కులలాత్ముడవయ్యా
నీవూరుక్కుండినదానికిఫలమే । నీవుబొందుమయ్యా
నేటికైనపాండవులకుభాగము । నీవిడుమోయయ్యా
మిగిలినతనయులుబ్రతికెదరిప్పుడు । మేల్కొనొందుమయ్యా
అవ్వలికథదెల్పుమనగసంజయు । డప్పుడిట్లనెనయ్యా
అంతటకురుపతిచింతిలిభీష్ముని । చెంతకేగెనయ్యా
శోకింపుచుబల్కెజాలకతనిజ । జూచిబల్కెనయ్యా

## నెం. 1

దు॥ భీముండడిగోగనుమయ్యా । భీకరుడైయుండినదయ్యా
నాతమ్ములజంపినదయ్యా । నాకువేరుగతిలేదయ్యా

శూరుడవైయుటనున్నావు । చూచుచుంటివూరకనీవు
అతనిగనుచుభీతిలినావా । అతనితోడబోరగలేవా
అతనిగొట్టిచేతులురావా । అందరటులబోజూచెదవా
సం॥ దుఃఖించుచుకురుపతియనెను । దుఃఖమొందిభీష్ముండనెను
భీష్మ॥ మొదలేయిదిజెప్పితినయ్యా । అవియనుభవమిపుడగునయ్యా
భీమునికేదురేగెడువారు । భీమునిందుగెలిచెడువారు
మనబలమునతేరనుకొనుము । మానుముదుఃఖంబికజనుము
వీరస్వర్గమునేకోరు । వెఱలిరణమునలుపగగోరు
గాకుండినభాగంబిమ్ము । కదనంబిపుడాగునులెమ్ము
మిగిలినతమ్ముల బ్రతికించు । మీభాగమ్మునుపాలించు
దీనికొప్పకుండితివేని । తీవ్రంబుగపోరెదబూని
సం॥ అనవినికురుపతిజనెనయ్యా । అంతభీష్ముడేగినడయ్యా
అతిరోషమునొందినడయ్యా । ఆభీమునిడాకినడయ్యా

## నెం. 5

అంతటభీష్మునిగనియభిమన్యుం । డచటజేరెనయ్యా
ధర్మజాదులాభీష్మునికెదురై । త్వరగనిలచిరయ్యా
భీష్ముడెల్లరణాదర్మముకొట్టుచు । విహరించినడయ్యా
ద్రోణుడాపాండవవ్యూహంబును । ద్రుంచివెసెనయ్యా
అర్జునతనయుండిరావంతుడ । య్యదిగనిజనెనయ్యా
శకునితమ్ములార్వురుజనిశూరులు । శరములనిడిరయ్యా
ఇరావంతుడెల్లరపైశరముల । నేసియార్చెనయ్యా
బాధజెందికోపమొందివారలు । బాణములిడిరయ్యా
ఖడ్గముచేతనువారిడుశరములు । ఖండించినడయ్యా
అంతటకురుపతియలంబాసురుని । యపుడుబంపెనయ్యా
అశ్వసేనగనిమాయాశ్వంబుల । నతడుదెచ్చెనయ్యా
అశ్వసేనలంతబోరివేగమె । హతంబాయెనయ్యా
ఆకసముకేగిమాయాశరముల । నసురుడేసెనయ్యా
ఖడ్గంబునుగొనియిరావంతుడా । కాశమేగెనయ్యా

దానిఘాతనొందిపుడమికసురుడు । త్వరగవచ్చెనయ్యా
కనలినసురుడు కేసరూపమున । దనుజునొంచెనయ్యా
మాయాసర్పములెన్నో ప్రక్కైను । మహాద్భుతంబయ్యా
ఇరువురుమాయలనెడుగుదురందున । యిటులజేసిరయ్యా
అలంబాసురుడుగరుడరూపమును । అంతబొందెనయ్యా
అనేకసర్పంబులనుమ్రింగగా । యాతడెదిరెనయ్యా
అలంబసుడుఖడ్గముగొనినరసుతు । నంతగోసెనయ్యా
ఇరావంతుడంతప్రాణములవిడి । ఇలపైబడెనయ్యా
అనుజునిపాటునుజూచిఘటోత్కచు । డంతవచ్చెనయ్యా
చేతనున్నశూలముచేకౌరవ । సేనజంపెనయ్యా
అంతటదుర్యోధనుడువానితో । యునికినిలచెనయ్యా
క్రోధాగ్నిజ్వాలలచెశరముల । గొట్టిపలికెనయ్యా

ఘు॥ సత్యవంతులగుపాండవులకుకడు । శ్రమలబెట్టినావు
సాధ్వినిసభలోకీడ్చివస్త్రములు । సరగవొల్చినావు

వం॥ దానికిఫలమిచ్చెదననిశరములు । త్వరగవేసెనయ్యా
వెరువకనిసువదియారమ్ముల । కురువీరుడేసెనయ్యా
అంతటనసురుడుకనలిశక్తినే । యంగదీసెనయ్యా
భగభగమండెడువానినిభీష్ముడు । బరికించినడయ్యా

భీష్మ॥ భీమునితనయుడుసురలకువెరువడు । విభునిజంపునయ్యా

వం॥ యేలజూతురన్ద్రోణాదులుశర । జాలములిడిరయ్యా
అనేకవీరులుయనేకబలములు । యతనిదాకెనయ్యా
వెరువకయాతడుతనరక్కసులను । వేగబంపెనయ్యా
మాయజేసియాబలములజంపెను । మారివిధంబయ్యా
కొందరసూతులకొందరధనువుల । గూలవేసెనయ్యా
కొందరిరథములకొందరిహయముల । డిందుపరచెనయ్యా
అతిరథమహారథులుపీడలగని । యాచుకచుండిరయ్యా
అస్త్రగురుండుమహాస్త్రములిడగా । యలసివెడలెనయ్యా
ధర్మజుండుభీమునినపెఱనినీ । తనయుగావుమయ్యా
అనభీముడుత్వరగవెడలగనినీ । తనయుడెదిరెనయ్యా

ధనువుదునిమితీవ్రశరంబేయుగ । త్వరవమూర్ఛిల్లెనయ్యా
అభిమన్యుఘటోత్కచులుసీతనయు । నట్టైదాకిరయ్యా
అంతద్రోణాదులరుదునభీముం । డపుడిటులనెనయ్యా
కనలిభీముడొకశరమిడద్రోణుడు । కడుమూర్ఛిల్లెనయ్యా
ఘటోత్కచుండాగురుసుతాదులను । కనలికొట్టెనయ్యా
గురుడుమేల్కగనికోపముతోనిశి । చరునిగొట్టెనయ్యా
ఘటోత్కచుడుమాయజేసియెల్లర । గాసిబెట్టెనయ్యా
అంతనీకొడుకులేద్వురుభీముని । కట్టైదాకిరయ్యా
గదాదండమునయేద్వురిజంపుచు । కనలినిలచెనయ్యా
అంతసూర్యుడస్తాద్రికిజేరెను । యనినినిల్చెనయ్యా
వై॥ యెనిమిదవనాటియుద్ధమ్మునువిని । జనపతియనెనయ్యా
నవమదినరణముజెప్పుమనగనం । జయుడుబలికెనయ్యా

—: ఫ ల శృ తి :—

భారతవీరులచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుదీని । విరచించెనుభక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడుయీసత్కృతిని
వదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని

# తొమ్మిదవనాటి యుద్ధము

## నెం. 1

వం॥ దుర్యోధనుడతిదుఃఖించె । తొందరగాపురికరుదెంచె
శకునిదన్నసేనులకనెను । నరగకర్ణుదోడ్తెమ్మనెను
అంతకర్ణుడపుడేతెంచె । వింతలేమియనిప్రశ్నించె
కురునాథుండపుడిట్లనెను । ఔరపిరినాబలములననెను
దరు॥ గురుభీష్మకృపగురుసుతులు । అరయపక్షపాతసహితులు
వారిసేనలజంపనతీరు । వారిపైనదయగలవారు

వాతమ్ములుజచ్చినరయ్యా । నాసేనలుజచ్చినవయ్యా
సం॥ అనగకర్ణుడపుడిట్లనెను । ఆభీష్ముని వలదనుమనెను
కర్ణు॥ నేనప్పుడువచ్చెదనయ్యా । నీజాల...గాచెదనయ్యా
పాండవబలముసుహరియింతు । పాండుసుతులననిలోద్రుంతు
సం॥ అనకురుపతిసంతసపడెను । అటులజేతుననుచువెడలెను
భీష్ముని గనియపుడిట్లనెను । భీతిగలిగెనా మదికనెను
దు॥ నాబలంబుజచ్చినదయ్యా । నాపైనీకయులేదయ్యా
కదనంబునుమానగదయ్యా । కర్ణుని నేదెచ్చెదనయ్యా
సం॥ అంతటభీష్ముడుచింతిలెను । అప్పుడునిట్టూర్పువిడచెను
ఆకురుపతితోనిట్లనెను । ఆకర్ణునిగొనిరమ్మనెను
భీష్మ॥ పాండవబలమాతనికంటు । పాంచాలాదులునావంతు
పాండుసుతులగెల్వగరాదు । పాపపుసంకల్పము బోదు
సం॥ అనగనీకుమారుడుజనెను । ఆరాతిరినిద్దురగొనెను
అంతతెల్లవారగలేచి । అఖిలబలముగలయగజూచి
దుర్యోధనుడెల్లరకనెను । దురముసేడుగనుగొనుమనెను
పాంచాలులజంపెదననుచు । పాండుసుతులగెలచెదననుచు
నిన్నరాత్రిభీష్ముండనెను । అన్నమాటతప్పండనెను
వినిభీష్ముడుచింతనుగొనెను । అనవిమాటలకునుగుందెను
సర్వతోభద్రవ్యూహంబు । సత్వరమొనరించెఘనంబు
వీరులతగువిధముననుంచె । భీష్ముడట్లుజేసియుమించె
ద్రుపదపుత్రుడదివీక్షించె । అప్పుడుసేనలనువిర్మించె
శిఖండిపార్థుకాలముందుంచె । శీఘ్రముభేరులమ్రోగించె

## నెం. 2

అంతయభిమన్యుడేగెను । అఖిలబలములనుదాకెను
అతిరథులవెగడుపరచెను । అపుడుబలములనుద్రుంచెను
కౌరవవిద్రిప్పినట్లుండెను । కురువిభుండంతగాంచెను
అయులంబుసునిజంపెను । అసురులనుగూడివచ్చెను
పాండవులసేనవొచ్చెను । భయముచేబారజొచ్చెను

ద్రౌపదీసుతులువచ్చిరి । దనుజులనువేగజంపిరి
అతడుశరఘాతనొందెను । అల్పకాలంబుగుందెను
బహుగకోపంబునొందెను । వారిధనువులఁద్రుంచెను
వారిధ్వజములఁగూల్చెను । వారికతిబాధజేసెను
అంతయభిమన్యుడదిగనెను । అమ్ములఁగ్రుమ్మరించెను
అసురుడన్నిటినివిరచెను । అంతశరవృష్టిబరపెను
ఇరువురతిఘాతజెందిరి । ఇరువురతికోపమొందిరి
అసురుడొకమాయగావించె । అంధకారంబుగల్పించె
పార్థఁతనయుండువీకించె । భాస్కరాస్త్రంబుసంధించె
అంధకారమునుమ్రింగెను । అసురుమాయలనుమ్రింగెను
పార్థఁసుతుడొక్కశరమిడెను । బాధగొనియసురుడేగెను
అఖిలబలములఁద్రుంచెను । అతనిగనిసేనబారెను
భీష్ముడెల్లరఁగూడెను । వేగనభిమన్యుదాకెను
ఆతడుభయపడకనిలచెను । అందరికిబాణములనిడెను
త్వరగపార్థుఁడువచ్చెను । తనయునకుసాయమాయెను
కృపుడునరసుతునిదాకెను । కృపునిసాత్యకియుఁదాకెను
కోపమునబాణములనిడెను । గురుసుతుడువాటిదునిమెను
పోరుఘోరమైయుండెను । పుడమిరక్తముననిండెను
అంతద్రోణుండుదలపడెను । అర్జునునకుశరములనిడెను
అర్జునుడువాటిద్రుంచెను । అపుడుకఠినశరములనిడెను
శల్యదుర్యోధనులుజనిరి । సరగకృపబాహ్లికులుజనిరి
అందరొకసారిదలపడిరి । అర్జునిఁగొట్టమొదలిడిరి
అర్జునుండెల్లరమగాంచె । అపుడుశరవృష్టిగురిపించె
వీరులతిబాధజెందిరి । విజయునిఁజూచిభయపడిరి
వరునిగనిభీష్ముడదరెను । తరలితాఁదెసకువెడలెను

## నెం. 5

భీష్ముడుధర్మజునిదాకిశరముల । బీడజేసెనయ్యా
సాత్యకిభీమాదియోధులటుజని । శరములనిడిరయ్యా
అంతకోపించిభీష్ముండందరి । కమ్ములనిడెనయ్యా

అనేకయోధులునొచ్చిరిబలములు । హతంబాయెనయ్యా
పాండవమధ్యముడడిగనికనలుచు । బాణములిడెనయ్యా
భీష్ముడువాటినిద్రుంచిహరినరుల । బిట్టుగొట్టెనయ్యా
పార్థుడాతనివిల్లుద్రుంచివేరొకటి । బట్టగొట్టెనయ్యా
ఆశరఘాతకుపార్థుడునొచ్చిన । హరికనలినదయ్యా
పగ్గముల్ నొగలగట్టికోలచె । బట్టియేగెనయ్యా
అపుడునీబలంబులుకృష్ణునిగని । పరుగుచుండెనయ్యా
ధరణికంపించెకూరులమనములు । తల్లడిల్లెనయ్యా
చచ్చెచచ్చెభీష్ముండనుపల్కులు । చాలబుట్టెనయ్యా
భీష్మా॥ అంతటభీష్ముడునవ్విబలికెనీ । వాగకరావయ్యా
నీచేజచ్చిననీవైకుంఠము । నేనుగాంతునయ్యా
శాశ్వతకీర్తినిపొందుదువేగమె । జంపగరమ్మయ్యా
సం॥ అంతనరుడురథముడిగ్గికృష్ణుని । హస్తముగొనెనయ్యా
పదియడుగులవరకీడ్చుకొనిబోవ । పార్థుడండనెనయ్యా
అ॥ శాంతిజెందుమోదనుజాంతకకృష్ణ । యిదివినుమయ్యా
ప్రతినజేసితివిరణముసేయనని । పలుకుదప్పెనయ్యా
సం॥ అనవినికృష్ణుడుమరలిరథంబున । కంతజేరెనయ్యా
ఉభయబలంబులకతిఘోరంబగు । యుద్ధమాయెనయ్యా
అనేకపాండవబలములప్పటికి । హతంబాయెనయ్యా
అంతసూర్యుడస్తాద్రికిజనెరణ । మాపుజేసిరయ్యా
తమతమగృహములకెల్లబలంబులు । దరలిపోయెనయ్యా
వై॥ తొమ్మిదవనాటిరణమివ్విధమం । ధుండువిన్నదయ్యా
పదియవనాటిదివివియెదననగా । బల్కెసూతుడయ్యా

## పదవనాటి యుద్ధము
## నెం. 1

ధర్మజుండుచింతనుగొనెను । తమ్ములతోహరికిట్లనెను
ధర్మ॥ యాభీష్మునిగెలువగలేము । యీరాజ్యమునొందగలేము

అనుజులతో కానకుబోదు । అసుఖమునెకడిసరిరాదు
ఒకభూతంబునుహింసించి । ఒప్పినవస్తువలుభుజించి
బ్రతుకుకంటెతృణముభుజించు । పశుజన్మమెఘనమనిపించు
నాబలంబులెల్లనశించె । నామదిలోభీతిజనించె
సం॥ అనగకృష్ణుడపుడిట్లనెను । ఘనబలవంతులుమీరనెను
కృ॥ ఊరికేచింతిలబోకయ్యా । ఉపాయంబుజెప్పెదనయ్యా
భీష్మునిచెంతకుజనవలయు । వినతుడవైబలుకగవలయు
అతనిగెలుచుటెటులనవలయు । ఆయత్నముసేయగవలయు
సం॥ అనగమంచిదనుచువెడలిరి । గనియతనికిమ్రొక్కులనిడిరి
చయ్యనభీష్ముడుగనుగొనెను । సత్కరించివారలకనెను
భీష్మ॥ మీరేటికివచ్చితిరయ్యా । మీకేమముగోరితినయ్యా
సత్వరమదిజేసెదనయ్యా । సంశయంబునొందకుడయ్యా
సం॥ అనగధర్మజుండిట్లనెను । అఖిలబలముజచ్చినదనెను
ధర్మ॥ నీవతిబలవంతుడవయ్యా । నినుగెలుచుటపొల్లగునయ్యా
సం॥ అనవినిభీష్ముండునవ్వెను । అపుడువారికివ్విధమనెను
భీష్మ॥ హస్తమందునాయుధమున్న । అమరులునను గెలుచుటసున్న
యీకృష్ణుడుపరమాత్ముండు । యితడుమీకుసాయంబుండు
మీకుజయమునిశ్చయమయ్యా । మీకోరికదీర్చెదనయ్యా
ఐననొకటిజేయగదయ్యా । అపుడుజయమునొందెదరయ్యా
శిఖండినెదురుంచగదయ్యా । శీఘ్రమువిలువీడెదనయ్యా
అర్జునుండుగొట్టగవలయు । అవనింబడవేయగవలయు
కార్యముసాఫల్యంబగును । కదనమునందునజయమగును
సం॥ అనగవారుసంతసపడిరి । అపుడందరువెడలిపోయిరి
అపుడుకృష్ణునకునరుడనెను । అభీష్ముడుఘనుడగునెనెను
అ॥ మమ్మెల్లరబెంచినదయ్యా । మాపక్షముబలికినదయ్యా
అతనినెట్లుజంపెదనయ్యా । అదినాచేతనుగాదయ్యా
సం॥ అనుచుదుఃఖమొందుటగనెను । హరిపార్థుజానకపుడిటులనెను
కృ॥ స్వధర్మంబుసేయగదయ్యా । సమరముమీధర్మంబయ్యా

గీతనెల్లవింటివిగావ । నీతిదప్పకిదిమర్యాద
సం॥ అనుచుజెప్పికృష్ణుడుజనెను । అరాతికినిద్దురగొనెను
అంతటతెలవారినదయ్యా । అంపనుమేల్కాంచినరయ్యా
ధర్మజాదులెల్లపజనిరి । తగవిధముగనునికిలిచిరి
భీష్మాదులుయుటకేతెంచి । భేపలనంతటమోగించి
ఉభయబలముదలపడెనయ్యా । ఉగ్రంబుగబోరినరయ్యా

## నెం. 2

నరుడుయనిజేసెనొకవైపు । నకులసహదేవులొకవైపు
అఖిలబలములణజంపిరి । అమితముగశరములేసిరి
అంతభీష్ముండుజూచెను । అఘ్రహముతోడవచ్చెను
అశిఖండియెదిరించెను । అమ్ములణగృమ్మరించెను
అంతభీష్ముండుమరలెను । అప్పుడొకమాటబలికెను
భీష్మా॥ అడుజన్మంబునెత్తితివి । అంతమగవాడవైతివి
నీవుగొట్టినణన్నువ్వేదను । నిన్నుగొట్టంగదలపను
సం॥ ద్రుపదపుత్రుండుబలికెను । తీవ్రశరములణగనుమనెను
శిఖం॥ అమ్ములణగృమ్మరించెద । యమునిపాలికిణబంపెద
సం॥ అనుచుశరములన్నిగుడించె । అంతభీష్ముండుజనుదెంచె
దు॥ నిలపికురునాథుడిట్లనెను । నేడుబలమంతమడసెను
సం॥ అనగభీష్ముండుబలికెను । అపుడుబలికినదివినుమనెను
భీష్మా॥ నేనుపదివేలయోధులను । నిక్కముగబోయిచంపెదను
అటులనిప్పటికిజేసితిని । అధికమునుజేయయలసితివి
నేడుపాండవులగెలచెదను । నేడునేనైనగూలెదను
పాండవులగెలువజాలను । ఐవరమునుజేయుచుందుమ
సం॥ అనుచుశరములన్నిగుడించె । అఖిలసైన్యంబులనుద్రుంచె
రక్తనదులంతబారెను । రణముభీభత్సమాయెను

## నెం. 5

అంతద్రోణుడశ్వత్థామనుగని । అపుడుబలికెనయ్యా
ద్రో॥ చేతిధనువుకంపించెమేన్మడకె । చిత్రమాయెనయ్యా

మనబలములపైగ్రద్ధలాడెనిది । మహాద్భుతంబయ్యా
కౌరవులురాలెనుమింటనుండియిదుగో । గనుగొనుమయ్యా
ధర్మరాజుముఖముపైనక్రోధము । త్వరగబుట్టెనయ్యా
నేడుభీష్మునకుయాపదయగునిది । నిజముదప్పదయ్యా
యిపుడుప్రాణములుదాపకయుద్ధం । నీవుసేయుమయ్యా

వం॥ భీష్మునిచెంతకుజేరిసాయమై । యచటికిజనెనయ్యా
వరుడుశిఖండినిముందిడుకొనిశర । పరంపరులనొంచె
భగదత్తాదులుయడ్డపడగనా । పార్థుడునొప్పించె
భీముడెదిరిఛత్రచామరాదుల । వేగమెఖండించె
త్రిగర్తులనుగొనికురుపతినరుపై । తీవ్రశరములేసె
భీమార్జునులందరినిదాకగా । భీతిబొందిరయ్యా
అంతలోనయభిమన్యసాత్యకులు । యనికినిలచిరయ్యా
యేమిజెప్పదారుణమునురక్తపు । టేరుబారెనయ్యా
భీష్ముడాధర్మజునిగనుగొనియి । వ్విధముజప్పెనయ్యా

భీష్మ॥ ఉత్తమక్షత్రవంశమందునే । నుద్భవించితయ్యా
పదివేవురవీరులపదినాళ్ళకు । బడవేసితినయ్యా
జన్మమొదలుగాక్ష్రూరవృత్తినే । సలుపుచుంటినయ్యా
పరశురామునిజగురువనియెంచక । భంగపెడితినయ్యా
నాహితమునుగోరిశిఖండినిగొని । నన్నుబొదవుడయ్యా
ఆలస్యంబొనరించినమీకే । హానిగలుగునయ్యా

వ॥ అనుచుభీష్ముడాపాండవబలముల । యందుజొచ్చెనయ్యా
భీమార్జునసాత్యకియభిమన్యులు । వేగదాకిరయ్యా
ఎల్లరనుగాంచిభీష్ముడుశరముల । నేసియార్చెనయ్యా
శల్యకృపాశ్వత్థామద్రోణులు । సాయంబైరయ్యా
విరటునితమ్ముడుశతానీకుడా । భీష్ముదాకెనయ్యా
కఠినశరంబులగొట్టగభీష్ముడు । కనలికొట్టెనయ్యా
ధనువుద్రుంచిసారథినిజంపియరదం । బువిరచెనయ్యా
శతానీకుడతికోపముగొనిఘన । శక్తివేసెనయ్యా
శక్తినిజదునిమికంఠంబునకొక । శరమువేసెనయ్యా
కంఠముతెగిప్రాణములుబాసెనది । గనగచిత్రమయ్యా

నరుడుశిఖండినిముందిడుకొనిఘన । శరములేసెనయ్యా
అర్జునుడాభీష్మునిచాపంబును । యపుడుద్రుంచెనయ్యా
అంతటశిఖండికఠినబాణముల । నతనిగొట్టెనయ్యా
వేరొకవిలుగొనికఠినశరంబుల । భీష్ముడేసెనయ్యా
అంతటపార్థుడుశిఖండివెనుకై । యమ్ములనిడెనయ్యా
భీష్మునిధనువునుద్రుంచిశరములిడ । భీష్ముండనెనయ్యా
పిడుగువంటిబాణములివినరుడే । వేసినడనెనయ్యా
శిఖండికింతటిశక్తిలేదనుచు । జెప్పుచుండెనయ్యా
కనలిశక్తిబాణమునిడపార్థుడు । ఖండించినదయ్యా
భీష్ముడుఖడ్గముగొనిరథముడిగ । విజయుడుగనెనయ్యా
దానినరుడుఖండించిశరములను । త్వరగవేసెనయ్యా
అవశమైతూర్పునకుశరమగునటు । అతడుగూలెనయ్యా
ధరపైవీరులశరములుండశర । క్షితల్పుడాయెనయ్యా
అంతసూర్యుడస్తాద్రిజేరెసుర । లపుడుబల్కిరయ్యా
దక్షిణాయనంబిపుడుజచ్చునని । త్వరచింతిలిరయ్యా

భీష్మా॥ ఎరిగిభీష్ముడనెతండ్రివరంబున । నిపుడుజావనయ్యా
నాయిష్టమువచ్చినపుడుజావగ । నాకదిగలదయ్యా

సం॥ అనసురలేగిరితల్లిగంగయిది । యంతదెలసెనయ్యా
మునులబంపగాహంసరూపముల । గొనివచ్చినరయ్యా
దక్షిణాయనంబనుచువేగమే । దరలిపోయిరయ్యా
ద్రోణుడీవార్తవినిమూర్ఛనుగొని । తెలివిబొందెనయ్యా
అంతటదుఃఖించుచువేగంబున । యతనిగాంచెనయ్యా
సకలబలంబులుదుఃఖించుచుగన । చయ్యనజనిరయ్యా
చింతించుచ సుతులుపాండవులు । జేరబోయిరయ్యా
అర్జునుడొక్కడుధనుర్ధారియై । యచటికిజనెనయ్యా
తలక్రిందికినేమైనదెమ్మనగ । త్వరగజూచిరయ్యా
కౌరవులదివినిమెత్తనివిడగా । గాంచినవ్వెనయ్యా
భీష్ముడునరునకుజెప్పమ్రొక్కుచతి । వేగలేచెనయ్యా
గాండీవముచేమూడమ్ములుతల । గడనుజేసెనయ్యా

సంతసపడినీరుగోరనీసుతు । లంతదెచ్చిరయ్యా
అంతటగనియనెకరతల్పునకిది । యయోగ్యంబులయ్యా
భీష్మ॥ పాతాళోదకమిటుదెచ్చినచోజహు । సంతసమయ్యా
సం॥ అరసినీసుతులుయూరకుండగా । నరుడులేచెనయ్యా
పర్జన్యాస్త్రంబునువిడిభూమిని । బగులగొట్టెనయ్యా
త్వరగపాతాళజలముగాగగని । తానుద్రాగెనయ్యా
కౌరవులెల్లరుభయకంపితులై । గాంచుచుండిరయ్యా
నరునిగనిసమర్థుండవనుచుకురు । నాథునికనెనయ్యా
భీష్మ॥ నరనారాయణులువీరిగెల్వగ । సురలకుగాదయ్యా
నేటికైనవారిభాగమిడుమా । నీకుసుఖంబయ్యా
అటుగాకుండినభీమునిగదచె । హతంబగుదువయ్యా
సం॥ అంతకౌరవులుయతనికిమ్రొక్కుచు । యపుడువెడలిరయ్యా
పాండవులతనికితగునటురక్షణ । భక్తిజేసిరయ్యా
అతనికిమ్రొక్కుచుయుద్ధాజ్ఞనుగొని । యచటికిజనిరయ్యా

## నెం. 1

అపల్కులుకర్ణుడువినెను । అతివేగంబచటికిజనెను
అతనిపాదములకుమ్రొక్కెను । అతిదయతోననుగొనుమనెను
భీష్ముడంతచేరగబిలచి । చెప్పెనొకటిమదివయదలచి
భీష్మ॥ కౌంతేయుండవునీవయ్యా । ఘనకులమునబుట్టితివయ్యా
రాధేయుండవుగావయ్యా । సాధువులాపాండవులయ్యా
నీసోదరులనుకొనుమయ్యా । నీవచటికిజనసుఖమయ్యా
సం॥ అనగకర్ణుడపుడిట్లనెను । అదినేనెర్గినదేయనెను
కర్ణ॥ కురపతిననునమ్మినవాడు । గొప్పసౌఖ్యములనిడినాడు
ప్రాణములతనికినర్పించె । బవరముతరియిటువచియించె
అపకీర్తినిబొందగలేను । ఆపాండవులనుగనబోను
ధర్మాత్ములుపాండవులయ్యా । దయతోకృష్ణుడుగనునయ్యా
వారికిచటజయమగునయ్యా । యారీతిగతెలియుదునయ్యా
బనసీదుయాజ్ఞనుగొందు । అనిసేయగనేగెదముందు

సం॥ మెచ్చిభీష్ముఁడపుడిట్లనెను । ఇచ్చితియాజ్ఞనుఁగొనుమనెను
భీష్మ॥ తగినట్టులసేయుగదయ్యా । ధర్మంబునువీడకుమయ్యా
సం॥ అనగమ్రొక్కికర్ణుఁడుఁజనెను । మనమునసంతోషముగొనెను
విధు॥ వైశంపాయనుఁడిట్లనెను । భీష్మపర్వమియ్యెడియనెను
వ్యాసునిదయఁబొందితిననెను । యథాశక్తిఁజెప్పితిననెను

—: ఫ ల శ్రు తి :—

భారతవీరులచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుఁడుదీని । విరచించెను భక్తినిఁబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాఁడు యీసత్కృతిని
సదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని

( భీ ష్మ ప ర్వ ము )

స మా ప్త ము.

## మొత్తము సేనయొక్కసంఖ్య

| పాండవసేన ౭ అక్షౌహిణులు | కౌరవసేన ౧౧ అక్షౌహిణులు |
|---|---|
| ౧౫౩౦౯౦ ఏనుగులు, | ౨౪౦౫౭౦ ఏనుగులు, |
| ౧౫౩౦౯౦ రథములు, | ౨౪౦౫౭౦ రథములు; |
| ౪౫౯౨౭౦ గుర్రములు, | ౭౨౧౭౧౦ గుర్రములు, |
| ౭౬౫౪౫౦ బంట్రోతులు, | ౧౨౦౨౮౫౦ బంట్రోతులు, |
| ౧౫౩౦౯౦౦ మొత్తము పాండవబలము. | ౨౪౦౫౭౦౦ మొత్తము కౌరవబలము |

(రెండు సైన్యములు మొత్తము ౩౯౩౬౬౦౦.)

౨౧౮౭౦ ఏనుగులు,
౨౧౮౭౦ రథములు,
౬౫౬౧౦ గుర్రములు,
౧౦౯౩౫౦ బంట్రోతులు,
౨౧౮౭౦౦ ఒక్క అక్షౌహిణియగును.

---

ఓం.

శ్రీకృష్ణాయనమః

# తందనాన

# శ్రీమహాభారతము

## ద్రోణపర్వము

## నెం. 1

శ్రీమద్భారతచరితంబు । చెవులవిన్నగల్గుముదంబు
జనమేజయభూపుండనెను । శాంతనవునిపాటునువినెను
జన॥ ధృతరాష్ట్రుండెటులసహించె । ద్రోణుండపుడేమొనరించె
కురువీరులచరితంబయ్యా । కరుణతోడ దెల్పగదయ్యా
అనవైశంపాయనుడనెను । ఆకథదెల్పెదవినుమనెను
వై॥ ధృతరాష్ట్రుడు సంజయుగనెను । తీవ్రముచటికేగగవలెను
అనగసంజయుండటుజనెను । గనిభీష్మునిచంతనుగొనెను
మరలివచ్చి యాతనిగనెను । సరగనచటివార్తదెలిపెను
వినిధృతరాష్ట్రుండిటులనెను । తనయులేమిజేసిరనెను
అనసంజయుడిటువినిపించె । అతనిగనగసుయోధనుడెంచె
భీష్మునిగని కడువిలపించె । వేగమరలియటుజనుదెంచె
యెల్లరతోనిదురనుగాంచె । తెల్లవారగా మేల్కాంచె
అఖిలబలములనుబిలపించె । అనిసేయుటకై జనుదెంచె
ధీరులనంతటప్రోగించె । భీష్మునికై కడు విలపించె
గలవీరవరుల బరికించె । కర్ణునిరాకనువీక్షించె
పతిగడచిన పడతివిధంబు । పంటలేని భూమివిధంబు
హరివిస్మరింపనిజన్మంబు । అటులదోచెనీసైన్యంబు
భీష్ముడులేనట్టిబలంబు । వెలవెలబారినదినిజంబు
అంతటకర్ణుండేతెంచె । ఆభీష్మునియాజ్ఞనుగాంచె

అఖిలరాజులను బరికించె । అప్పుడుదానిటువచియించె
కర్ణు॥ దమముసత్యమునుగలవాడు । తపోదానములుగలవాడు
ధనుర్వేదమెరగినవాడు । అనిలోగనబల్మొనగాడు
కురుపతిధనమనబడువాడు । గూలెనురణమందునసేడు
సం॥ అనుచుకంటనీరిడెనయ్యా । అందరుగనియేడ్చిరయ్యా
అంతటధైర్యంబునుగాంచె । అందరువిననిటువివరించె
కర్ణు॥ పాండుకుమారులనోడింతు । పార్థునిశిరమును ఖండింతు
గొప్పసైన్యములనేర్పుంతు । కురుపతిచేయిలనేలింతు
అటులగాకరణమొనరింతు । అపార్థునిచేమరణింతు
స్వర్గవైభవమునుగాంతు । సత్యంబిటుసేయగనెంతు
సం॥ అనగనీకుమారుడుజనెను । అతిసంతసమున నిట్లనెను

## నెం. 5

దు॥ మనవీరులలో సేనాపత్యముగొన । ఘనులెవరయ్యా
సం॥ అతనినిజెప్పినయదిజేసెదనన । యతడుబలికెనయ్యా
కర్ణు॥ యెవరికిడినయాార్యరు ద్రోణునకె । యిచ్చినసుఖమయ్యా
బ్రాహ్మణుండువృద్ధుడురణమందున । ప్రళయరుద్రుడయ్యా
అతడేసేనాధిపత్యమొందగ । యర్హుండగునయ్యా
సం॥ వినిసంతసపడికురుపతిద్రోణుని । గనియిటులనెనయ్యా
దు॥ నీకుసేనాధిపత్యతంబిడగా । నేనుదలచితయ్యా
భీష్ముడులేనట్టి లోపమిక గా । న్పింపనీయకయ్యా
యెల్లవిధంబులదగినవాడవని । యేర్పరించితయ్యా
సకలశత్రువులగెలచిజయంబును । సత్వరమిడుమయ్యా
ద్రో॥ అనగద్రోణుడనెసకలశత్రువుల । హతముజేతునయ్యా
యధాశక్తినీశత్రులగెలచి జ । యమ్ముగొందుదయ్యా
సం॥ అనగదుర్యోధనుండుమోదమున । యపుడుబలికెనయ్యా
అనవినికురుపతిసైన్యాధిపత్య । మతనికిచ్చెనయ్యా
వీరులు సంతసమందిరిభేరులు । వేగమ్రోగెనయ్యా

అంతట ద్రోణుడు మహానందముగ । యరదమెక్కెనయ్యా
దుర్యోధనుగని యతిసంతసంబు । తోడబల్కెనయ్యా
వరమిచ్చెదగోరుమనగనాకురు । వరుడుగోరెనయ్యా
దు॥ ప్రాణంబులతో ధర్మసంభవుని । బట్టియీయుమయ్యా
జూదమాడి వనమునకంపించెద । మోదంబగునయ్యా
యింతటితో రణమాగుసామ్రాజ్య । మేలుకొందునయ్యా
ద్రో॥ అనద్రోణుండనె మహాకఠినవర । మడిగితివేమయ్యా
అర్జునుండెదురురాకుండినచో । యదియొనర్తునయ్యా
సం॥ అంతనీతనయులదిజేసెదమని । యరిగియుండిరయ్యా
అవార్తనువినిధర్మజుండు వి । వ్వచ్చునకనెనయ్యా
ధర్మ॥ గురుడుననుబట్ట శపథముగొనెమీ । రరయుచుండుడయ్యా
అ॥ అనగనవ్విపార్థుడాండుబలికెనిది । యబద్ధమగునయ్యా
నాతనువునప్రాణముండశపథము । నడపజాలడయ్యా
సం॥ అనిక్రౌంచవ్యూహమునిర్మించియు । యనికినిలచెనయ్యా
అఖిలయోధులావ్యూహరక్షణకు । యపుడునిలచిరయ్యా
వ్యూహముఖంబున నరుడునిలచె । యుబ్బురముదోచెనయ్యా
నీతనయులుశకటవ్యూహంబును । నిర్మించినరయ్యా
కర్ణుడావ్యూహముఖమునందు జా । గ్రతగనుండెనయ్యా
మొగులులేకరక్తంబుగురిసె నె । మ్మలునురాలెనయ్యా
మనసైన్యముపైగ్రద్దలాడెనిది । మహాభయంబయ్యా
అపశకునంబులుగనుచు నీతులు । యాగకుండిరయ్యా
అప్పుడుభయసైన్యములు దలపడెను । యతిఘోరంబయ్యా
గురుడుకనలి పాండవులసేనపై । శరములనిడెనయ్యా
అనేకగజములునేలబడిదారి । కర్దమాయెనయ్యా
గుఱ్ఱముల కాల్బలములశవంబుల । కొండలాయెనయ్యా
రక్తపుటేరులుబారెను కౌరవ । రాజావినుమయ్యా
భూతభేతాళసంఘముజేరుచు । ముదముజెందెనయ్యా
అంతమధ్యాహ్నమాయెపార్థుడద । య్యాదిగనుగొనెనయ్యా
అతిక్రోధమ్మున నీసైన్యంబుల । హతముజేసెనయ్యా

## నెం. 2

అంతలో సైంధవుడుజూచె । అప్పుడే ధైర్యముగలేచె
పార్థుతనయునిఁ దాకెను । బరగఖడ్గమును వైచెను
త్వరగయభిమన్యుఁడదిగనెను । శరముతోదానివిరచెను
సైంధవునితనువునొప్పించె । సైన్యములనంతఖండించె
సైంధవుడువేగబారెను । సత్వరగశల్యుఁడేగెను
శక్తిబాణంబువైచెను । చాలఘోరముగవచ్చెను
కనలియభిమన్యుడెదిరెను । కఠినశక్తినింబట్టెను
శల్యసూతునిఁగొట్టెను । సత్వరంబతడుజచ్చెను
విరథుడైశల్యుఁడేతెంచె । విజయసుతునంతగోపించె
గదను చేబూనివచ్చెను । కనలియభిమన్యుజూచెను
నరసుతుడుగదనుబూనెను । అరదమునుడిగ్గినిలచెను
భీముడంతలోవీక్షించె । వేగమచ్చటికిజనుదెంచె
వెనుకకభిమన్యుద్రోచెను । అనికిదాబూనినిలచెను
శల్యుడాతనిఁదాకెను । చాలగాకోపమొందెను
ఉభయులతిబలముగలవారు । ఉగ్రముగబోరుచున్నారు
గదతోఘాతనొందిరి । కదనమున మూర్ఛచెందిరి
అతనిగృతవర్మగొనిచనెను । అంతభీముండు మేల్కొనెను
గదనుసారించివచ్చెను । కలననీసేనగూల్చెను
నీబలంబంతకంపించె । నిలచికర్ణాత్మజుడుగాంచె
అపుడుశరవృష్టిగురిపించె । అచటిబలములను హింసించె
రక్తధారలఁ బారించె । రణముభీభత్సమొనరించె

## నెం. 5

శతానీకుడను నకులాత్మజుడతి । సత్వరమేతెంచె
అతికఠినములగు పదిశరములక । ర్ణాత్మజునొప్పించె
కర్ణసుతుడతనిధ్వజచాపంబుల । ఖండనగావించె
ద్రౌపదీసుతులువచ్చివృషసేను । తనువునొంచిరయ్యా
అశ్వద్థామాదులునకులాత్మజు । నంతజుట్టిరయ్యా

ధర్మజుడు కఠినశరములనందరి । దరిమికొట్టిరయ్యా
యుధిష్ఠిరుండత్యుగ్రుడైనిలచి । యొకడుబోరెనయ్యా
అంతటద్రోణుండతికోపధమ్మున । యతనిదాకెనయ్యా
కనలిధర్మజుడుశరవర్షంబున । గప్పివేసెనయ్యా
గురుడొకశరమున ధర్మజుధనువును । విరుగజేసెనయ్యా
పాండవయోధులుగురునిపైబాణ । వర్షముంచిరయ్యా
అంతగురుడుకోపించియెల్లరకు । యపుడుగొట్టెనయ్యా
నకులసహదేవులకుకడు శరముల । నాటగొట్టెనయ్యా
తొమ్మిదమ్ములనువిరాటభూపుని । దూలగొట్టెనయ్యా
ధర్మరాజునకుపంద్రెండమ్ముల । దాకగొట్టెనయ్యా
యుగంధరునికంఠంబుశరముచే । యుర్విగూల్చెనయ్యా
సింహసేనవ్యాఘ్రదత్తశరముల । క్షితినిగూల్చెనయ్యా
పాండవబలమునగురునికెదురేగు । బలియుడులేడయ్యా
గురునిశరబాధనొందియోధులటు । వెరచిపారిరయ్యా
ధర్మజునిజిక్కబట్టెగురుడని । త్వరగబల్కిరయ్యా
ఆపలుకులువిని పార్థుడురుద్రుం । డగుచువచ్చెనయ్యా
అడ్డపడినరథగజతురగంబుల । హతముజేసెనయ్యా
నరుడు వాడిబాణంబులచేగురు । వరునిగొట్టెనయ్యా
సకలసేనలాద్రోణునిగావగ । సరగవచ్చెనయ్యా
అంతపార్థుడాగ్రహమునవారల । హతముజేసెనయ్యా
రక్తప్రవాహమంతబారెనో । రాజావినుమయ్యా
అంతటసూర్యుండస్తాచలమునకు । కపుడుజేరెనయ్యా
తమతమనెలవులకెల్లసైన్యములు । త్వరగవెడలెనయ్యా
వై॥ గురునిప్రథమదినయుద్ధంబాకురు । వరుడువిన్నడయ్యా
రెండవనాటిదిదెల్పుమనగ సంజ । యుడుబల్కెనయ్యా

# రెండవనాటి యుద్ధము

## నెం. 1

సం॥ అంతటసూర్యుండుదయించె । ఆద్రోణుడుచింతనుగాంచె
దుర్యోధనుగనియిటులనేను । దుజడాయుడాయర్జునుడనెను
ద్రో॥ ధర్మజునొక్కనిజేసితిని । తనరక్షకులనుగెలచితిని
అంతలోనెనరుడేతెంచె । అన్నదివ్యథడాముగావించె
ఫల్గుణుండుగావకయున్న । బట్టెదధర్మజునోయన్నా
ధనంజయుని నిలుపుడుమీరు । తగనిబలంబులా గొనుడీరు
ధర్మజునిడాబట్టెదనేడు । తగునట్టుగజేసెదజూడు
వినిసుశర్మదానిట్లనెను । ధనంజయునకోడతిమనెను
పాథుడానైనజంపెదనయ్యా । ప్రాణమైనవీడెదనయ్యా
త్రి॥ పదివేలత్రిగర్తులమేము । పలుకునునిలుపగయున్నాము
సం॥ అర్జునునిడాజంపగవారు । అపుడుశపథమునుగొన్నారు

## నెం. 5

గోబ్రాహ్మణహత్యలపాపంబును । గొనియెదమన్నారు
పరస్త్రీధనాపహరణపాపము । బట్టెదమన్నారు
శరణాగతులనుగావనిపాపము । సలిపెదమన్నారు
అసత్యమాడినపాపంబునమే । మరిగెదమన్నారు
గురుజనత్యాగపాతకంబుగతి । కరిగెదమన్నారు
యాచకులనిందజేసినపాపం । బందెదమన్నారు
మద్యపానమునగల్గినపాపము । మాకగునన్నారు
గృహదాహంబునగల్గినపాపము । వహింతుమన్నారు
అర్జునునిజంపకున్ననీయఘము । లందెదమన్నారు
అతనిచేజచ్చి పుణ్యాత్ములగతి । కందెదమన్నారు
సంశాపములొనరించిరిగావున । సంశప్తకులయ్యా
గురుండువినిగరుడవ్యూహంబును । కూర్మిజేసెనయ్యా
ముఖమందునతానునిలచియెల్లర । ఖాననిల్పెనయ్యా

కర్ణుడు పుచ్ఛమునందునిలచియు । గ్రఘుగజూచెనయ్యా
మదగజంబెక్కి భగదత్తుండా । మధ్యనిలచెనయ్యా
అనియొనర్పసంశప్తకులర్జును । నపుడు బిలచిరయ్యా
పాండవసైన్యము సమరమొనరింప । బరగనిలచెనయ్యా
అర్జునుండుధర్మసంభవునిగని । యపుడుబలికెనయ్యా
అ॥ అహంకారమునత్రిగర్తేశులిపు । డనికిబిలచిరయ్యా
శత్రుడుబిల్వగగాదనియనినా । స్వాంతమొప్పదయ్యా
ధర్మ॥ వినిధర్మజుడనెద్రోణునిప్రతినను । వింటివినీవయ్యా
అతనినెదిరించి ప్రతినజెడగొట్టి । యహుఁడెవడయ్యా
అ॥ అనగనరుండనెబలుడుసత్య జి । త్తదినొనర్చునయ్యా
తనువునప్రాణంబుండువరకునిను । తప్పకగనునయ్యా
యెదిరిచచ్చునెడనీవుగురునిపై । కేగకుమోయయ్యా
అతడుబలశాలినిన్నుబట్టుకొన । యాపదయగునయ్యా
సం॥ వినిధర్మజుడాసత్యజిత్తుతో । యనికిజొచ్చెనయ్యా
అతికోర్థమ్మున ఉభయసైన్యములు । యనియొనర్చిరయ్యా
హరిణములపైకియాకొనుసింహం । బరిగెడువిధమయ్యా
హరిసహాయుడగునరుడుత్రిగర్తుల । యందుజూచెనయ్యా
త్రిగర్తులెల్లరు పదివేలర్జును । దేరిజూచిరయ్యా
అర్ధచంద్రాకృతిగవారలు పై । ల్లార్చినిలచిరయ్యా
అర్జునుడుగాంచినవ్వి శ్రీహరికి । అవుడుబల్కెనయ్యా
అ॥ బలవంతులమనిమదగర్వంబున । వరలుచుండిరయ్యా
జగద్రక్షకా నీసహాయమున । సాహసింతునయ్యా
సంశప్తకులతిశూరులుగెలువన । సాధ్యకార్యమయ్యా
పదివేవురువన్ను జంపవెడలుచు । బాసజేసిరయ్యా
వారికిసాయముజేయబలంబులు । వచ్చినిలచెయ్యా
ప్రాణమానములుగావగనీయవి । భారంబగునయ్యా
రథమువారిపైకికబోనిమ్మా । రణ...జేతునయ్యా
కృష్ణ॥ అనగకృష్ణుడనెధైర్యము వీడుట । యయోగ్యమగునయ్యా

సల్పవలయుయత్నంబునీశ్వరుడు । సాయంబగునయ్యా
యేలజింతింతువెల్లకార్యముల । నేనెజేతునయ్యా
చెప్పినబోధనుమరచితివేని । చింతమిగులునయ్యా
సం॥ అనియరదమునంశప్తకులపైకి । యపుడుదోలెనయ్యా
దేవదత్తంబునరుడుబూరింప । దిగులుజెందిరయ్యా
హరికారుణ్యంబేమొగానియది । యద్భుతమగునయ్యా
దేవదత్తనాదమువిన్నంతనె । చావగుననిరయ్యా
శపథములన్నియు జ్ఞప్తిదెచ్చుకొని । శరములవిడిరయ్యా
అందరొకసారి శరములవిడనరు । డంతకనలెనయ్యా
ఒక్కసారి శస్త్రాస్త్రములిడనరు । డుగ్రుడాయెనయ్యా
గాండీవముటాంకరించి శరముల । గ్రుక్కననిడెనయ్యా
పదియేనువేలరథికులొకసారి । పడిచచ్చినరయ్యా
అంతనెల్లరానరుపైపదిపది । యమ్ములనిడిరయ్యా
నరుడొకనొకరికిమూడుశరంబులు । నాటగొట్టెనయ్యా
సురథసుశర్మసుధన్వసుబాహులు । శూరులుగనిరయ్యా
అతికాఠిన్యశరంబునసుధన్వు । హతముజేసెనయ్యా
తక్కినముగ్గురిధ్వజములఖండించి । తర్మికొట్టెనయ్యా
పోటుమగలనైదువేలనంతట । పుడమిగూల్చెనయ్యా
బలములెల్లభీతిల్లివేగమె । బారజొచ్చెనయ్యా
సుశర్మబారెడి తనసైన్యంబుల । జూచిబలికెనయ్యా
సు॥ చావెన్నటికినిదప్పదుమీరిటు । జనగగూడదయ్యా
యెప్పుడర్జునున కోడిబారితిమి । యిప్పుడుదగదయ్యా
బాసజేసివచ్చితిమిమనకింక । భావ్యముగాదయ్యా
సం॥ అనగకోపించియెల్లరుమరలుచు । యనికినిలచిరయ్యా
నారాయణగోపాలురనాకురు । నాథుడంపెనయ్యా
పదివేవురొక్కవైపువచ్చియా । పార్థుడాకిరయ్యా
హరినరులను శస్త్రాస్త్రములచేత । యపుడుగొట్టిరయ్యా
అన్నిదిశలందు త్రిగర్తులంతట । యపుడుదాకిరయ్యా
అనేకశరములవేయనరునిరథ । మంతనిండెనయ్యా

హరికినరుడు నరునికిశ్రీకృష్ణుం । డగుపడజేడయ్యా
వాసుదేవపార్థులాలుజచ్చినరను । వార్తనించెనయ్యా
వినినీసైన్యము భేరీనాదము । వేగజేసెనయ్యా
అర్జునాయర్జునాయనుచునుహరి । యపుడుబిలచెనయ్యా
బ్రతికియుంటివా ప్రాణముండెనా । బలుకుమనియెనయ్యా
అనగనరుండనె బ్రతికియుంటినిక । యగుపరచెదనయ్యా
త్వష్టయొసంగిన యుపష్టంభమను । దానిదీసెనయ్యా
పమంత్రకంబుగగోపాలురపై । సరగవేసెనయ్యా
అన్యోన్యంబుగయర్జునుడనుకొని । యస్త్రములిడిరయ్యా
తమలోతామిటు మహాస్త్రములతో । ధ్వంసంబయిరయ్యా
అస్త్రమంతశాంతించియర్జునుని । యపుడుజేరెనయ్యా
అర్జునుండంతవాయువ్యాస్త్రం । బపుడువేసెనయ్యా
వాయువశంబున యెండిననాకుల । పలెయైరోయయ్యా
అప్పుడువీరుచె గూలినబలముల । జెప్పజాలనయ్యా
హతశేషులుభయమందినీసేన । కంతజేరిరయ్యా

## నెం. 2

అంతధర్మజుడుజూచెను । అఖిలబలములనుబంపెను
ద్రోణుడవ్వారిజూచెను । దురములోద్రుంచజొచ్చెను
వేలకరులంతజచ్చెను । వేలహరులంతజచ్చెను
కాల్బలంబులనుజంపెను । కనకరథములనుగూల్చెను
రక్తనదులంతబారెను । రణముగనభయంబాయెను
గురుడుధర్మజునిగాంచెను । గొప్పప్రతినదలంచెను
సత్యజిత్తంతవచ్చెను । సత్వరముగురునిదాకెను
గురునిసారథినినొప్పించె । గురునికాయమునునొప్పించె
గురుడుగనిధనువుద్రుంచెను । క్రూరబాణములనుంచెను
సత్యజిత్తొక్కవిలుగొనెను । సాయమైవృకుడుజేరెను
అరవదిశరములవృకుడిడెను । గురునికవిబాధజేసెను
తవలిగురుడంతజూచెను । కనులనిప్పులంరాల్చెను

అమ్మ్రలిపురకునిగుడించె । అధికతాపంబుగల్పించె
వారలతికోపమందిరి । వచ్చిసారథినిగొట్టిరి
అశ్వములనంతగొట్టిరి । అద్భుతంబట్లుజేసిరి
వేగగురుడొక్క శరమిడెను । వృకునికంఠంబుదెగిపడెను
సత్యజిద్ధనువుద్భంచెను । సరగవేరొకటిగైకొనెను
దానినాగురుడుద్భంచెను । త్వరగనింకొకటిగైకొనెను
సత్యజిత్తెన్నొగైకొనెను । శస్త్రగురుడంతదునిమెను
చాలకోపించి శరమిడెను । సత్యజిత్తంతగూలెను
జూచిధర్మజునిదాకెను । సూర్యదత్తుండువచ్చెను
అదుశరములజానొప్పించె । అంతద్రోణుండుకోపించి
కుండలములుగలశిరమును । గూల్చగాసేనగనియెను
ఎల్లరొకపెట్టుదాకిరి । బల్లములనెన్నొవేసిరి
గురుడువీక్షించికోపించె । శరములెన్నియోనిగుడించె
అఖిలబలములను హింసించె । అపుడురక్తమును జారించె
ధర్మజునిబట్టనేతెంచె । త్వరయుధామన్యుడరుదెంచె
ఉత్తమౌజుండు జనుదెంచె । యుగ్మ్రడుశిఖండియరుదెంచె
సాత్యకీక్షత్రవర్ములు । సత్వరమువచ్చిరీబలులు
సమరమతిఘోరమాయెను । సరగద్రోణుండుగనియెను
వాడిశరములజాగూర్చెను । వసుసనొకనొకనిగొట్టెను
త్వరగవసుధానుడిలబడెను । త్వరగక్షేముండుగూలెను
అనుమిత్రుండుజచ్చెను । అపుడునీసుతుడు మెచ్చెను
కర్ణుగనిముదముతోననెను । గాంచుమాగురునిరణమనెను
పాండవులసేనజచ్చెను । బవరమునజయమునిచ్చును
జేయరికపాండవులురణము । శీఘ్రమగుమనకుజయము

## నెం. 5

అంతటధర్మజాడెల్లరదోడ్కొని । యపుడువచ్చినాడు
గురునికెదురగుచు యనేకశరముల । గొట్టసాగినాడు
చచ్చెనుగురుడని నీసైన్యంబులు । సరగవచ్చెనయ్యా

అంతమహ్నాహ్నమాయెసమరమిటు । లగుచునుండెనయ్యా
మత్తగజమెక్కి నీతనయుండా । మారుతిగనెనయ్యా
మారుతిపైవాడిబాణములను కు । మారుడేసెనయ్యా
అతిక్రోధమ్మున భీముడుధ్వజమును । హతముజేసెనయ్యా
పదపడిగదచే నీకుమారునకు । బాధజేసెనయ్యా
అత్తరికురుపతినొచ్చియుంటభగ । దత్తుడేసెనయ్యా
సుప్రతీకమనుగజముపైపవన । సుతునిదాకెనయ్యా
యీకరినెక్కుచు సురేంద్రుడసురుల । యేపుమాపెనయ్యా
ఆగజమప్పుడుకాలుని వాహన । మట్లువచ్చెనయ్యా
గదలనుబోలినదంతంబులతో । కనలివచ్చెనయ్యా
దండధరునిదండమువలెతొండము । దాల్చివచ్చెనయ్యా
భీమునిజంపుటకై భగదత్తుడు । వేగదోలెనయ్యా
చచ్చెచచ్చెభీముండనువార్తలు । చాలబుట్టెనయ్యా
అంతటధర్మజుడఖిలబలంబుల । నచటికంపెనయ్యా
అనేకయోధులు వేలబాణముల । నతనిగొట్టిరయ్యా
భగదత్తుడు మహాంకుశంబుచె । వాటిదునిమెనయ్యా
తనగజమ్మునాబలములజంపగ । త్వరగపోలెనయ్యా
అనేకగజములనేకహయముల । హతముజేసెనయ్యా
తొండముతోగొనియనేకరథముల । ద్రుంచివేసెనయ్యా
కాల్బలములతనకాళ్ళగాద్రొక్కుచు । కనలిచంపెనయ్యా
దశార్ణేశుడొకగజమునెక్కియ । ద్దానినెదిరెనయ్యా
రెండుకొండలటులుండెగజంబులు । మెండుబోరెనయ్యా
దశార్ణేశుడేడమ్ములనాభగ । దత్తునేసెనయ్యా
అంతభగదత్తుడేడుశరమ్ముల । నతనిజంపెనయ్యా
భగదత్తునిగజమాతనిగజమును । బట్టిచంపెనయ్యా
పాండవసైన్యముజంపుచాగజము । బలసితిరిగెనయ్యా
గనిసాత్యకి తనరథముతోడనా । గజమునెదిరెనయ్యా
పిడుగువంటిబాణములాగజముకు । వేగగొట్టెనయ్యా
అంతమహాక్రోధముననాగజము । అరచివచ్చెనయ్యా

అశ్వసహితరథమును తొండముతో । అప్పుడుబట్టెనయ్యా
దానిబలంబెరుగును సాత్యకి స । త్వరముదుమికెనయ్యా
అనేకమారులు ద్రిప్పియాకసము । కంతవిసరెనయ్యా
వసుధబడిరథాశ్వంబులుసారధి । బ్రతికియుండిరయ్యా
భీముడంతలోదానినెదుర్కొన । వేగవచ్చెనయ్యా
తొండముతోడుతభీమాశ్వంబుల । తొలుగగొట్టెనయ్యా
అంతసుపర్వ్వండనెడి భూపుడా । హస్తినెదిరెనయ్యా
భగ్గుమనిమండియుతని యరథంబు । నుగ్గుజేసెనయ్యా
నిమిసమాత్రమునయతనికంఠమును । నేలగూల్చెనయ్యా
అభిమన్యుండును ద్రౌపదీతనయు । లంతదాకిరయ్యా
చేకితానధృష్టకేతులచటికి । శీఘ్రమేగిరయ్యా
అందరొకపెట్టుచుట్టుముట్టుకొని । యమ్ములనిడిరయ్యా
వారిశరంబులు లెక్కగొనకకరి । వారిదాకెనయ్యా
అభిమన్యభీమసేనాదులుభయ । మందిబారిరయ్యా
పశుపాలకులకు వెరచినపశువుల । భంగిదోచెనయ్యా
అంతటపార్థుడు శ్రీకృష్ణునకిటు । లప్పుడుబలికెనయ్యా
అ॥ అటుగనుగొనుమాధూళిలేచెనా । యాకసమునకయ్యా
భగదత్తునికరిమనసైన్యంబుల । బాడుజేసెనయ్యా
మనయోధులయస్త్రశస్త్రములకది । మరలజాలదయ్యా
నీవైననునేనైనలేకున్న । నిలువదుబలమయ్యా
అరదమాగజముపైకిదోలుమా । హతముజేతుమయ్యా
సం॥ అనగమంచిదని శ్రీకృష్ణుడురథ । మంతద్రిప్పెనయ్యా
సంశప్తకులొకపదునాల్గువేలు । సరగజుట్టిరయ్యా
అదిగనిపార్థుడు శ్రీకృష్ణునితో । యప్పుడుబల్కెనయ్యా
అ॥ అటుజనకుండినకరిచేబలముల । కాపదయగునయ్యా
తమనుశతృవులునిలుపుమనజనులు । ధర్మముగాదయ్యా
యీరెంటిలో మొదటసేయునది । యేర్పరించుమయ్యా
కృ॥ అనగకృష్ణుడనెరెంటినొనర్చిన । యధికయోగ్యమయ్యా

అ॥ అనవినినరుడనెనీదయచేరెం । డాచరింతునయ్యా

సం॥ అనుచుపామునాలుకలంబోలిన । యమ్ములనిడెనయ్యా
వేలబాణములసంశప్తకులను । ఓట్టుగొట్టెనయ్యా
విరగెడురథములునొరగెడుగజములు । వేలునిించెనయ్యా
ఖండఖండలుగ సకలసైన్యముల । గావించినడయ్యా
పదునాల్గువేలసైన్యమునిట్టుల । బాడుజేసెనయ్యా
శ్రీకృష్ణుడు భళిభళినరుడాయని । చేప్పృశించెనయ్యా
అరదముగపలగసుశర్మవేగమె । యపుడుబలికెనయ్యా
నన్నువిడచియెటకేగెదవనగా । నరుడుగొట్టెనయ్యా
వాడిశరంబులు తాకినంతనె । వసుధంబడెనయ్యా
అంతరథంబతివేగమె శ్రీకృష్ణుడు । యుటకుదెచ్చెనయ్యా

## నెం. 2

కొందరినికాళ్ళతోజంపె । కొందరిని తొండమునజంపె
అర్జునుండంతజేరెను । అమ్ములనాగృమ్మరించెను
అపుడుభగదత్తుడదిగనెను । అతికఠినబాణములనిడెను
అర్జునుడునవ్వి ద్రుంచెను । అతనికినిబాధజేసెను
కనలితనగజమునంపెను । గజముకడుకోపమొందెను
నరునిరథముగొనివచ్చెను । హరినిరథమునందిప్పెను
సత్వరముగజమువెదకెను । శౌరిభయమందితిప్పెను
సైన్యములపైనకరిబడెను । సైన్యములద్రొక్కిచంపెను
హరికినరుడంతబలికెను । అరదమునుద్రిప్పదగదనెను
హరియనెను దానినెరుగుదును । అరదమునుద్రుంచునిదియనెను

కృ॥ దానిబలమింతదెలియవు । దానికోపంబుగనుగొనవు

సం॥ అనుచునరదమటుపోలెను । అంతభగదత్తుడదిగనెను
కఠినబాణముల నొప్పించె । కనలినరుడతనివిలుద్రుంచె

## నెం. 5

శక్తిబాణమును భగదత్తుంపతి । సత్వరమిడినాడు
హరుడుఖండించియాతని ఛత్రము । నరికివేసినాడు

మహాంకుశంబునుభగదత్తుండభి । మంత్రించినడయ్యా
పార్థుని పైకిడయఖిలబలంబులు । భయముజెందెనయ్యా
అతివేగమ్మునవచ్చెడుదానిని । హరిగనుగొనెనయ్యా
దానిబలమునెరుగుగానదేహము । త్వరగబెంచెనయ్యా
అర్జునుండుగనుపడకుండగదా । నడ్డమాయెనయ్యా
అంకుశమువచ్చిహరిమెడలో సుమ । హారమాయెనయ్యా
అంతనరుండా కృష్ణునిగనుగొని । యపుడుబలికెనయ్యా
అ॥ అడ్డమైతివిదియేలదానినే । నణచివేతునయ్యా॥
బలహీనునిగానన్ను దలపనిది । భావ్యముగాదయ్యా
కృ॥ వాసుదేవుడనెదానిద్రుంపనీ । వశంబుగాదయ్యా
అదిదాకినచో యీనిముసంబున । హతంబగుదువయ్యా
స॥ ఆకారణంబుదెలిపెదవినుమని । యపుడుబలికెనయ్యా
కృ॥ శ్రీవిష్ణువుతొల్లియోగనిద్రను । జెందుచుండెనయ్యా
కామమొందిభూదేవితనపతిని । గలయవచ్చెనయ్యా
దెలసియోగనిద్రాంతమందు । తనచెలియగూడెనయ్యా
నాతిబలికెనీయంశంబుననొక । నందనునిడుమయ్యా
వైష్ణవాస్త్రమునభయంబునొందని । వరమొకటిడుమయ్యా
అనగవిష్ణువనె నేనులేనియెడ । యటులగుననెనయ్యా
వినిసతిజనెనరకాసురుడాపెకు । జననమాయెనయ్యా
వాడీయస్త్రముచేత జగంబును । వడికించినడయ్యా
వానిజంపితిని యస్త్రంబితనికి । వాడిచ్చినడయ్యా
మహాఘోరాస్త్రమెరుగుదుగావున । మాయజేసితయ్యా
నేనులేకున్న యీయస్త్రముచే । నీక్లైదవీవయ్యా
అస్త్రమునెదుర్పనెంతవారలకు । యసాధ్యమగునయ్యా
పరమాస్త్రంబిటువ్యర్థమాయెనని । వరలెగొంచుమయ్యా
సం॥ వీనినికజంపుమాలసింపకన । విజయుండనెనయ్యా
సర్వజ్ఞుండవు నీవుజెప్పినటు । సలిపెదనన్నాడు
కఠినబాణమును గజమునుగనుగొని । కనలికొట్టెనయ్యా
అతిబాధజెంది గజముకిర్రుమని । యవనిపై బడెనయ్యా

అర్ధచంద్రమునసరుడు భగదత్తు । నపుడుగొట్టెనయ్యా
వాడునేలబడిజచ్చెబలంబుల । బాధబాసెనయ్యా
శకునితమ్ములిరువురుక్రోధంబున । జనుదెంచినరయ్యా
పంచశతరధికబలములతో న । ప్పార్థుదాకిరయ్యా
అంతనరుడు ప్రళయాంతకువిధమున । యమ్ములనిడెనయ్యా
శకునితమ్ములాపంచశతరధిక । సైన్యముబడెనయ్యా
అంతనీసుతులు మామలచావుకు । యపుడేడ్చినరయ్యా
శకునిగాంచినరునిదాకిమాయల । సల్పెనువినుమయ్యా
ఆయుధంబులను శిలలవృక్షముల । నాతడువర్షించె
కటికచీకటుల జలవర్షంబులు । ఘనముగగురిపించె
పులులసింగములక్రూరసర్పముల । బుట్టించుచుగాంచె
పాండవబలములకెల్లవిధంబుల । బాధలగావించె
అన్నిటిపార్థుండస్త్రబలంబున । హతంబుగావించె
శకునిమామనపుడు గాంచిపార్థుడు । చయ్యనవిన్పించె
పాండవకౌరవులకుమాయలచే । బవరముప్రాప్తించె
పారిపోకనిలువుమంచుశరముల । పంక్తులనిగుడించె
బహుబాధనుగనిరక్తకాయుడై । పయనముగావించె
నరుడతిబలముతోజనిచనియా । గురునిదాకెనయ్యా
సాత్యకిధర్మజభీములుగురునకు । శరములనిడిరయ్యా
నీలుడంతగురుసుతునిరానీక । నిలిపికొట్టెనయ్యా
గురుసుతుడంతటయతిక్రోధమ్మున । శరంబునిడెనయ్యా
హస్తలాఘవంబేమోనీలుం । డపుడుజచ్చెనయ్యా
భీమసేనుడానీలునిచావును । వేగజూచెనయ్యా
గదగొనిగురుతనయునిచురచురగని । కనలికొట్టెనయ్యా
అంతనీసుతుడు బాహ్లికకర్ణులు । యతనిదాకిరయ్యా
చూచినీబలములొక్కపెట్టతని । జుట్టుముట్టెనయ్యా
అభిమన్యాదులుగమగొనివేగమె । యచటజేరిరయ్యా
ఉభయబలశూరులకుయుద్ధంబత్యు । గ్రమాయెనయ్యా
ఆదినమందున యనేకబలములు । హతములాయెనయ్యా

ప్రవాహముగరక్తంబుబారె భూ । పాలావినుమయ్యా
అంతనపరాణ్ణామాయెసురలుగని । యద్భుతపడిరయ్యా
దృష్టద్యుమ్నుడుమనసైన్యంబుల । దునుముచుండెనయ్యా
తనసైన్యములను ద్రోణునిజంపగ । దల్చుచుండెనయ్యా
సమయమిదిగురునిజంపరండనుచు । చాలబిలచెనయ్యా

## నెం. 2

అర్జునుండంతజేరెను । అపుడునీబలముజారెను
గురునినొప్పించజొచ్చెను । కురుబలంబంతజచ్చెను
కర్ణుడదిగనుచువచ్చెను । కనలియగ్న్యస్త్రమపుడిడెను
వారుణాస్త్రంబునరుడిడెను । పావకాస్త్రంబుమడిసెను
నరుడుశరములజ న్నిగుడించె । తరణితనయునిజ నొప్పించె
గనుగొనిభీముడేతెంచె । కర్ణుబలములజ నొప్పించె
కర్ణుబంధువులువచ్చిరి । కనలిపదివేలుదాకిరి
భీముడవ్వారినెదిరించె । భీమకరుండగుచునొప్పించె
కర్ణుదేహంబుబాధించె । కరుకుటమ్ములజవిగుడించె
దృష్టద్యుమ్నుండుగాంచెను । తొందరగకర్ణుదాకెను
కర్ణుధనువునుజద్రుంచెను । కనలిసాత్యకియుదాకెను
కర్ణుసారధినిజంపెను । కఠినశరములజగ్రుచ్చెను
అంతద్రోణుండు వచ్చెను । అరులసైన్యమునజొచ్చెను
అపుడుశరవృష్టిగురిపించె । అఖిలబలములజ బీడించె
రక్తధారలజబారించె । రణముభీభత్సమనిపించె
సూర్యుడస్తాద్రిజేరెను । జూచిభూతములుజేరెను
కంకగృధ్రాదులేతెంచె । కడువడిగనక్కలరుదెంచె
సైన్యముల్ఘనరణముజాలించె । సత్వరంబిళ్ళకరుదెంచె
పాండవబలంబుమోదించె । బరగనీబలమువిలపించె
అపుడుసుఖనిద్రజెందిరి । అర్జునునిమెచ్చుచుండిరి
వై॥ రెండవదినంబుయుద్ధమును । రేడువినియపుడుబలికెను
మూడవదినంబుయుద్ధమును । తేడుతాసంజయుంతనెను

—: ఫలశృతి :—

భారతవీరులచరితమ్ము । పఠియంచినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుదీని । విరచించెను భక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడు యీసత్కృతిని
సదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని

# మూడవనాటి యుద్ధము

## నెం. 1

స॥ అంతతెల్లవారినదయ్యా । అపుడు నీసుతుడుజనెనయ్యా
గురునిచెంతకేగినడయ్యా । కోపంబుననిటులనెనయ్యా
దు॥ ధర్మజునిజబట్టెదననుచు । త్వరగనప్పగించెదననుచు
అపల్కులుసేయగలేవు । అబద్ధంబులాడితివీవు
అర్జునునిజగొట్టగబోవు । అతికపటపుమానిసివీవు
వం॥ అదివినిగురుడపుడిట్లనెను । హరిసహాయుడానరుడనెను
పో॥ ఆతడులేకుండిననేడు । అధర్మజుబట్టెదజూడు
అబద్ధంబులాడగలేను । అంగమైనవీడెదనేను

## నెం. 5

అనగసంశప్తకులువినివేగమె । యపుడుబల్కినారు
నేడాపార్థునితోయుద్ధమునకు । నిలచెదమన్నారు
అతిదూరంబునకతనినిదోడ్కొని । యరిగెదమన్నారు
అంతటరెండుబలంబులుజేరగ । యర్జునుగనినారు
బవరమునకురమ్మనుచుబిల్వాగా । పార్థుడుజనెనయ్యా
అతిదూరమునకు జనియుద్ధంబును । యపుడుజేసిరయ్యా
ఆతనికూపిరియాడకుండునటు । లనియోనర్చిరయ్యా
గురుడిచ్చటపద్మవ్యూహంబును । నెరపినిలచెనయ్యా
దళముఅవిధముననకలరాజులను । త్వరగనిలపెనయ్యా

భూపతిసుతులనుకేసరములవలె । వొనరనిలపెనయ్యా
కర్ణదుశ్శాసనులగొనికురుపతి । కర్ణికాయెనయ్యా
వ్యూహముఖంబునగురుడునిలచెనతి । సాహసపరుడయ్యా
సైంధవగురుసుతకృపశకునులుపా । ర్శ్వములనిలచిరయ్యా
శల్యభూరిశ్రవాదులొకవైపు । సరిగనిలచిరయ్యా
పాండవవీరులువ్యూహమునంతట । బరగజూచిరయ్యా
ముఖమునందున్నద్రోణునిశూరులు । బొదవుచుండిరయ్యా
అందరొకకొంతకాలంబాతని । కట్టిదాకిరయ్యా
ప్రళయాంతకుడౌగురునిశరములకు । బడలియుండిరయ్యా
మహాఖేదమునధర్మజుండుయభి । మన్యునకనెనయ్యా
ధర్మ॥ యీవ్యూహముభేదించుమార్గమే । మెరుగకుంటిమయ్యా
శ్రీకృష్ణార్జునులున్నచోదీని । జించివేతురయ్యా
ప్రద్యుమ్నుండుండినచోదీనిని । భంగపరచునయ్యా
దీనినిభేదించెడిమార్గంబును । దెలియుదువీవయ్యా
అర్జునుడులేని లోపముగలుగని । యటులసేయుమయ్యా
సం॥ అనగవినిసంతసించియభిమన్యు । డపుడుబలికెనయ్యా
అభి॥ దీనినిభేదించెడిమార్గంబును । దెలియుదునేనయ్యా
నాజనకుండిందుజొచ్చువిధమును । నాకుదెల్పెనయ్యా
వెడలునట్టిమార్గమెరుగనైనను । వెరువజాలనయ్యా
ధర్మ॥ వినిధర్మజుడనెకసింతమార్గము । వేగజేయుమయ్యా
అపుడుమాబలంబులగైకొని సా । యంబుజేతుమయ్యా
భీ॥ భీమసేనుడనెదారిజేయుమా । వెంటనుందుమయ్యా
సాత్యకిధృష్టద్యుమ్నులతో నీ । చాయవత్తునయ్యా
సం॥ అనవినియభిమన్యుండాభీమున । కపుడుబలికెనయ్యా
అభి॥ కఠినశరంబులద్రోణునిగీఱుని । గారించెదనయ్యా
శీఘ్రంబుగపద్మవ్యూహంబును । జించివేతునయ్యా
ధర్మాత్ముండగు పెదతండ్రికిసం । తసముజేతునయ్యా
నాతలిదండ్రులకానందము యీ । నాడుజేతునయ్యా
కర్ణాదులసంగరంబునందున । గలచివేతునయ్యా

చిన్నవాడననిమదినిసందియము । జేయబోకుమయ్యా
పులిగన్నవేళ విధముకౌరవ । బలమ్ములగునయ్యా
మామలేనట్టిలోపమ్మనునే । మానిపింతునయ్యా
సం॥ అనగధర్మజుడు జయముబొందుమని । యపుడుబంపెనయ్యా
అతనిసారథి సుమిత్రుడుయరదం । బపుడుదెచ్చెనయ్యా
అభిమన్యుండరదమెక్కసారథి । యపుడుబలికెనయ్యా
సుమి॥ ద్రోణకర్ణాదులతిశూరులుయిా । కొందరదగదయ్యా
అర్జునుండులేనట్టివేళయని । కరుగకుమోయయ్యా
సం॥ అనగసుమిత్రునితోనభిమన్యుం । డపుడుబలికెనయ్యా
సందియంబేల రథముదోలుమా । సత్వరమన్నాడు
అమరులగొని దేవేంద్రుడువచ్చిన । అనిగొనుదన్నాడు
ప్రమథులగొనిరుద్రుండేవచ్చిన । భయపడనన్నాడు
యింతయేలనాతండ్రిమామలను । యెదుర్తునన్నాడు
వృద్ధులైనగురుకర్ణాదులకిక । భీతిలనన్నాడు
అనగమాతుడనుమానముతో । రథమంతదోలినాడు
గురునిపైకి అభిమన్యుడమితముగ । శరములనిడినాడు
గురునినొప్పించియభిమన్యుడు । మొగ్గరముజొచ్చినాడు
ప్రళయభైరవునివిధముగశూరుల । భంగపెట్టినాడు
కరులజంపియరదములధ్వంచిహయ । గణముజంపినాడు
కొందరిధనువులకొందరిధ్వజముల । గూలజేసినాడు
కొందరిసారథులధ్వంచిరథికుల । మ్రందజేసినాడు
నీసైన్యంబునయనేకవీరుల । నిలచికొట్టినాడు
అంతసహింపక నీసుతుడాతని । నపుడుదాకినాడు
అభిమన్యునిబలమెరుగుగానగురు । డందరికన్నాడు
ద్రో॥ చచ్చెచచ్చెకురురాజు నరసుతుడు । సమరవీరుడయ్యా
సం॥ అనవినికర్ణుడు కృపుడు గురుసుతుడు । యతనిదాకిరయ్యా
సోమదత్తిశల్యుడుకృతవర్మడు । సరగగొట్టిరయ్యా
వృషసేనుడుదుర్యోధనశకునులు । వేగదాకిరయ్యా
అందరొకసారి యనేకశరముల । నతనికొట్టిరయ్యా

అభిమన్యుడుభీతిజెందకందరి । కమ్ములనిడెనయ్యా

# నెం. 2

కొందరిరథములఁగూల్చెను । కొన్నిధనువులఁద్రుంచెను
హస్తలాఘవముజూపెను । అందరికిబాధజేసెను
పులినిగన్నట్టిలేళ్ళరి । కలనయందరటుబారిరి
గురుడుగనివేగవచ్చెను । అరుగువారలనుబిలచెను
అందరొకపెట్టుదాకిరి । అపుడుశరవృష్టిగురిపిరి
అర్జునాత్మజుడుజూచెను । అమ్ములఁగ్రుమ్మరించెను
గురుడుపదియేడుశరములు । కురువిభుడుమూడుశరములు
గురుసుతుండైదుశరములు । కృపుడుగనిమూడుశరములు
శకునిపండ్రెండుశరములు । శల్యుడొకయేడుశరములు
అన్నిదిశలందునిలచిరి । అందరొకసారిగొట్టిరి
అంతనరసుతుడుగాంచెను । అన్నిటినివిరుగగొట్టెను
అందరికిమూడుమూడేసి । అమ్ములఁదాకగాజేసి
అశ్మకునిసూతుజంపెను । అతనియరదంబుగూల్చెను
అతనికంఠంబునరికెను । అశ్మకుడునేలగూలెను
అమ్ములందరికిగ్రుచ్చెను । అందరికినొప్పిజేసెను
రక్తధారలఁగారించె । రణము భీభత్సమొనరించె
కర్ణునంతలోవీక్షించె । కఠినబాణములనిగుడించె
కవచమునుభంగమొనరించె । కర్ణుదేహంబునొప్పించె
అంతకర్ణుండు మూర్ఛిల్లె । అపుడునీసుతుడుదురపిల్లె
నరసుతుడు సైన్యములగనెను । శరఘటలిడిదునుమజొచ్చెను
అంతశల్యుండుదాకెను । అపుడునరసుతుజూచెను
కఠినశరములన్ నిగుడించె । కడువడిగమూర్ఛనొందించె
అపుడునీబలముబారెను । అనికిజనగవేసారెను
శల్యుతమ్ముండుజూచెను । శరములొకపదిటివిడచెను
శరములభిమన్యునొప్పించె । సరగనాతండుకోపించె

## నెం. 5

అభిమన్యుండతనిసూతరథముల । హతముజేసెనయ్యా
అతనికంతమును నరుకగవీరులు । యపుడుజూచిరయ్యా
గురుగురుసుతకృపకృతవర్మాదులు । గూడివచ్చిరయ్యా
అనేకబలములతోడ మెసారి । యతనిజుట్టిరయ్యా
అపరిమితంబుగ నస్త్రశస్త్రముల ।నతనిగొట్టిరయ్యా
అంతనతడుధనువు టాంకరించుచు । యమ్ములనిడెనయ్యా
అనేకవీరుల హతమొనర్చినది । యద్భుతమగునయ్యా
గురుడునొచ్చిగనుచుండెగానియొక । శరంబునిడడయ్యా
కౌరవిద్రిప్పినవిథంబునయంతట । దరుగుచుండెనయ్యా
పీనుగుపెంటలు గాగవ్యూహమున । విరిగెనుబలమయ్యా
అంతనీసుతుడు ద్రోణకృపులగని । యపుడుబలికెనయ్యా
దు॥ బాలుడొకడిట్లుసేయగజూచుట । పరమనీచమయ్యా
పక్షపాతముననరునికుమారుని । భంగపరుపరయ్యా
అనవినికర్ణాదులు మనమీతని । హతముజేతమయ్యా
సరెమంచిదియని యెల్లరనగ దు । శ్శాసనుడనెనయ్యా
దుశ్శా॥ అందరేల నేనొక్కడవీనిని । హతముజేతునయ్యా
వీనిచావువినికృష్ణార్జునులతి । వేగజత్తురయ్యా
సం॥ మనపగదీరునటంచుబోయి । యభిమన్యుదాకెనయ్యా
అంతనరసుతుడుగని యిరువదియా । రమ్ములనిడెనయ్యా
శరబాధనుబొందియతడు కనలుచు । శరములనిడెనయ్యా
ఇటులాయిరువురు యతిఘోరంబుగ । యెదిరిపోరిరయ్యా
అంతయభిమన్యుడతనివిలుద్రుంచి । యమ్ముగ్రుచ్చెనయ్యా
పలికెవోరిసభలోనతండ్రులను । వంచించితివయ్యా
దానికిఫలమిచ్చెదనవిశరముల । త్వరగవేసెనయ్యా
మర్మములందునశరములునాటగ । మహినిగూలెనయ్యా
ఆతనిసారథియతనినిగైకొని । యపుడువెడలెనయ్యా
అభిమన్యుండాపద్మవ్యూహము । నంతజించెనయ్యా
యెదురుబడినవారలఱంపుచుముం । దేగుచుండెనయ్యా

పాండవవీరులుయాతనివెంబడి । వచ్చుచుండిరయ్యా
అంతటకురుపతికర్ణునిజనుమన । యతడుదాకెనయ్యా
పార్థజసుతుడు కర్ణునిపైడెబ్బది । బాణములిడెనయ్యా
రక్తనయనుడైకర్ణుడుదివ్యా । స్త్రంబులనిడెనయ్యా
అభిమన్యుండాయస్త్రములకు ప్ర । త్యస్త్రములిడెనయ్యా
అంతటొకనరసుతుడువాడిగల । యమ్ములనిడెనయ్యా
కర్ణుడంతయతిపీడనుబొందుచు । కదలకుండెనయ్యా
అతనిగతిగనుచుయతనిసోదరుడు । యపుడుదాకెనయ్యా
అభిమన్యుడు క్షణములోననాతని । హతముజేసెనయ్యా
తమ్ముని పాటునుగనిబలములతో । త్వరగవచ్చెనయ్యా
పిడుగువంటియమ్ములనభిమన్యుడు । వేగవిడచెనయ్యా
అంతటకర్ణునిబలములునిలువక । యపుడుబారిరయ్యా
అప్పుడుద్రోణుడుయురికెడివారల । నాగుమన్నడయ్యా
మహాశూరులగుకర్ణాదులువిని । మరలకజనిరయ్యా
అంతయభిమన్యుడఖిలబలంబుల । హతముజేసెనయ్యా
పద్మవ్యూహంబందుశవంబులు । వరలుచుండెనయ్యా
అనేకరక్తపుధారలుబారెను । యధిపావినుమయ్యా
అంతమధ్యాహ్నమాయెబాలుడొక । డాచరించెనయ్యా
అపుడభిమన్యుండతిదూరమునకు । యరుగుచుండెనయ్యా
పాండవవీరులుయతనిజేరగా । వచ్చుచుండిరయ్యా
అడ్డపడినసైన్యములనువారలు । హతముజేసిరయ్యా
అంతసైంధవుడువారినిలపిరణ । మాచరించెనయ్యా
అందరినొక్కడుశివునివరముచే । నాపుచుండెనయ్యా
వై॥ వరముదొరకినట్టివిధంబాకురు । వర్యుడడిగెనయ్యా
సంజయుడు బలికెపాండవవనవా । సంబునవినుమయ్యా

## నెం. 8

వం॥ పాండవులులేనివేళసైంధవుడు । బరికించినడయ్యా
బలాత్కారముగ ద్రౌపదిగ్గికొని । బయనమాయెనయ్యా

పాండవులంతటవచ్చియీ—నిని । బట్టికొట్టిరయ్యా
బంధువుండనుచు పల్చుచుదయతో । బట్టికొట్టిరయ్యా
అవమానంబున శివునిగూర్చితప । మాచరించెనయ్యా
హరుడుమెచ్చివరముగోరుమనగా । యతనిగోరెనయ్యా
పాండవులను గెలచునట్టివరమును । ప్రార్థించినడయ్యా
అంతటహరుడనెనరునిగెల్వగా । నసాధ్యమగునయ్యా
అతనిగాకనొకనాడు పాండవుల । ననినగెల్తువయ్యా
అనిహరుడేగెను అవరమిప్పుడు । యక్కరపడెనయ్యా
సైంధవుడావరమహిమంబుతో । జయంబునొందెనయ్యా
శరత్రయంబునసాత్యకివక్ష । స్థలముబగిలెనయ్యా
భీమసేనునకు బాణాష్టకమిడి । బీరము డిపెనయ్యా
దృష్టద్యుమ్నుని యిరువదిశర...ల । దూలగొట్టెనయ్యా
విరటశిఖండులపడిపడియమ్ముల । వేగగొట్టెనయ్యా
ద్రౌపదీసుతుల పనియేనింటను । త్వరగగొట్టెనయ్యా
ధర్మసంభవుని డెబ్బదియమ్ముల । దాకగొట్టెనయ్యా
అందరిటులశరఘాతనొందిమరి । యమ్ములనిడిరయ్యా
వారిడుశరములు పరమహిమంబున । వానిదాకవయ్యా
సైంధవుండిడినయమ్ములచేతను । చాలనొచ్చిరయ్యా
అనేకవిధముల యత్నించిరి ముం । దరుగజాలరయ్యా
సైంధవుండపుడునీసైన్యంబుల । సాకుచుండెనయ్యా
పాండవవీరులనెల్లరగొట్టుచు । పరగనిలచెనయ్యా

## నెం. 5

అంతయభిమన్యుడావ్యూహంబును । హతముజేసెనయ్యా
వృషసేనుండభిమన్యునిగనుగొని । బిట్టుగొట్టెనయ్యా
అభిమన్యుడురథహయసారథులను । హతముజేసెనయ్యా
కఠినశరంబులయతనిమేనుర । క్తమునసింపెనయ్యా
స్థాతియనుభూపుండదిగనుగొనివ । చ్చిదాకెనయ్యా
త్వరగయభిమన్యుడొకశరమునయమ । పురికిబంపెనయ్యా

అంతసత్యశ్రవాదిభూపులను । హతముజేసెనయ్యా
అతనిచేతనిబలమతివేగము । హతంబాయెనయ్యా
శల్యనందనుడు రుక్మరథుండతి । సత్వరజనెనయ్యా
తొమ్మిదియమ్ములచేయభిమన్యుని । దూలగొట్టెనయ్యా
కనలియభిమన్యుడొక్కశరంబున । గళముద్రుంచెనయ్యా
అంతయతని బంధువులువేనవే । లంతదాకిరయ్యా
అభిమన్యుడుగంధర్వమాయదా । నపుడుజేసెనయ్యా
మాయాశస్త్రంబులచేనెల్లరు । మహినిగూలరయ్యా
కనలినీసుతుడు కర్ణకృపాదుల । గలసిదాకెనయ్యా
అనేకాస్త్రశస్త్రంబులిడనతడు । హతముజేసెనయ్యా
నీపౌత్రుడు లక్ష్మణుడభిమన్యుని । నిలచికొట్టెనయ్యా
అందరొకసారి యభిమన్యునిపై । యస్త్రములిడిరయ్యా
నరసుతుడన్నిటిదునిమిలక్ష్మణుని । నరికిచంపెనయ్యా
అంతనీసుతుండెల్లరగనుగొని । యపుడుబలికెనయ్యా
చంపుడువీనిని దయదల్పకుడన । సరగవాకిరయ్యా
మొండిధైర్యమున యెల్లరతని క । మ్ములనుగొట్టిరయ్యా

# నెం. 2

నరసుతుడుశరములేసెను । విరథులజేసియాచెను
యెరుకులొకవైపుగొట్టిరి । యేనుగులతోడ జచ్చిరి
అంతకాళింగులటుజనిరి । అమ్ములగ్రమ్మరించిరి
అంతలోయోధులేగిరి । అస్త్రశస్త్రముల గురిపిరి
నరసుతుడువేగజూచెను । గురునియేబదిట గొట్టెను
గురుసుతునిపదిటగొట్టెను । కుపితుడైకర్ణుగొట్టెను
కృపునివిరథునిజేసెను । క్రూరశరములగొట్టెను
అబృహద్బలునిదాకెను । అతనికంఠంబునరికెను
అంతనశ్వంతకునిద్రుంచె । అఖిలబలములఖండించె
అపుడుశత్రుసంజయుడుజచ్చె । అపుడుచంద్రకేతుడుజచ్చె

ఆసువర్చసుడుజచ్చెను । అంతసూర్యభానుడుజచ్చె
మేషువేగునిజ ద్రుంచెను । మిగతవారలనుద్రుంచెను
కర్ణుడాగురునికిట్లనెను । కదనశూరుండువీడనెను
కర్ణు॥ వీనిచేనోడియుంటిమి । వీనిచేబాధజెందితిమి
సం॥ కనలిగురుడంతబలికెను । కవచధారణముగలదనెను

## నెం. 5

దో॥ అశ్వరథసూతధనువులద్రుంచిన । యపుడుజిక్కునయ్యా
వీనిచేతధనువున్నమనకింక । వీడుజిక్కడయ్యా
సం॥ జెలగిమనమొక్కసారియీవిధము । జేయుదమనెనయ్యా
తానువానిచేనోడెనుగావున । త్వరగబల్కెనయ్యా
త్వరగకర్ణుడొక చెంతదాగుకొని । ధనువుద్రుంచెనయ్యా
కృపుడుసారథిని జంపెయశ్వముల । గురుడుగూల్చెనయ్యా
అయుధహీనుని విరథునివీరులు । యపుడుగొట్టిరయ్యా
కత్తిచేబూనిభీతివీడి యా । గ్రహముజెందెనయ్యా
గురుడుగాంచిఖడ్గమునురెండుగా । నరికివేసెనయ్యా
అభిమన్యుడుదనరథచక్రముగొని । యపుడువెడలెనయ్యా
గురునిజంపుటకు నురుకునతనిపై । శరములనిడిరయ్యా
కనలిచక్రమునుతునియలుసేయగ । గదనుబట్టెనయ్యా
అతనిమేనరక్తంబుధారలై । యపుడుగారెనయ్యా
గురుతనయునిగనిగదగొనిజనగా । వెరచిపారెనయ్యా
అతనిరథసారథులనుద్రుంచిముం । దరుగుచుండెనయ్యా
యిరువదియేడ్గురగాంధారులనతి । త్వరగజంపెనయ్యా
వసాతియ్యులను పదియేన్గులతో । వధనొనర్చెనయ్యా
యేడ్వురకేకయులనురథములతో । యిలనుగూల్చెనయ్యా
అంతనిలువశక్తిలేకదూలుచు । యరుగుచుండెనయ్యా
దుశ్శాసనసుతురథసారథులను । ద్రుంచివేసెనయ్యా
అతడువిరథుడైగదగొనియుద్ధం । బపుడుజేసెనయ్యా
ఇరువురుసేమమూగబోరియుద్ధమున । యిలనుగూలిరయ్యా

సకలసురలుయభిమన్యుబొగడుచు । సరగునజనిరయ్యా
సూర్యబింబమిల బడినట్టులనర । సూనుడుండెనయ్యా
అడవిగాల్చిచల్లారునగ్నివలె । యాతడుబడెనయ్యా
పూర్ణిమచంద్రుండిలబడినటునర । పుత్రుడుబడెనయ్యా
అతడిడుశరములుపంటచేనువలె । యచటనుండెనయ్యా
నీవారలకతిసంతసమాయెను । నిలచిచూచిరయ్యా
పాండవసైనికులెల్లదుఃఖమున । వరలుచుండిరయ్యా
ఒకబాలకునిపెక్కండ్రువిధి । యుర్విగూల్చిరయ్యా
అధర్మఫలమనుభవింతృకౌరవు । లనుచుబల్కిరయ్యా
అంతసూర్యుడస్తాద్రికిజనెబల । మంతవెడలెనయ్యా
భూతభేతాళసంఘములచటికి । ప్రీతివచ్చెనయ్యా
కౌరవబలములుసంతసమందుచు । కదలిపోయిరయ్యా
పాండవబలమతిదుఃఖముతో తమ । వసతికిజనెనయ్యా
యావార్తనుధర్మసంభవుడువిని । యటులయేడ్చెనయ్యా

## నెం. 3

అదివినిధర్మజుడేడ్చెను । (శ్రీ) హాపుత్రాయనుచుబడెను
ధర్మ॥ నేనేటికెబొమ్మంటిని । నీకుమృత్యువైయుంటిని
సాహసమునవెడలితివి । వ్యూహముభేదించితివి
కర్ణునియురికించితివి । ఘనబలమునుజూపితివి
దున్నసేననొంచితివి । దుర్యోధనుగొట్టితివి
గురుసుతునురికించితివి । గురునిబాధజేసితివి
నీకోడనివాడులేడు । నీతోసరివాడులేడు
బాలుడవిటుజేసితివి । బహుకీర్తినిబొందితివి
సం॥ అపుడువ్యాసుడేతెంచెను । అధర్మజునిగాంచెను
వ్యా॥ దుఃఖమొందదగదయ్యా । దొడ్డవాడుసుతుడయ్యా
వీరవర్యుడగునయ్యా । వెతజెందకుమోయయ్యా
విధితప్పదువినుమయ్యా । వీరగతికిజనెనయ్యా
రణధర్మముకఠినమయ్యా । రాజులకిదిదగునయ్యా

సం॥ అనుచువ్యాసుడంతజనెను । అర్జునుడాహరికనెను
అ॥ సంశప్తకులనుదునిమితి । సరగవెడలగాదలచిత
సం॥ అనహరిరథమునుదోలెను । అర్జునుడపుడిట్లనెను
అ॥ దుశ్శకునములాయెనయ్యొ । దుఃఖముమదిగలిగెనయ్యా
అభిమన్యుండెదురురాడు । అపవజెందిరిచూడు
గురుడతిబలవంతుండు । కురునాథుడుకపటుండు
అన్నలుబాధలగొనిరో । అనుజులెబాధలుగొనిరో
సం॥ అచటజేరిరథముదిగిరి । ఆధర్మజుగనజనిరి
అందరినిజగనుగొనిరి । అభిమన్యునిగనకుండిరి
అర్జునుడెల్లరగనెను । అభిమన్యుండేడనెను

## నెం. 8

అ॥ పద్మవ్యూహముభేదించుటకై । బంపితిరేమయ్యా
చొచ్చుటేగాని వెడలుటతెలియని । సుతునంపితిరయ్యా
దుష్టులొక్కచోగూడియందుసుతు । ద్రుంచినరేమయ్యా
హరిమేనల్లుడునాకుమారు । డత్యంతవీరుడయ్యా
సుతునిమోముగనకున్నభూమిపై । బ్రతుకదలపనయ్యా
హంసతూలికలబండెడివాడిపు । డవనిబండెనయ్యా
కాంతలుగొలువగనుండువాడున । క్కలలొనుండెనయ్యా
నానాజనములనాథుడు నేడు య । నాథుడాయెనయ్యా
మందభాగ్యులకునట్టికూరుడెటు । మనకుదక్కునయ్యా
యేలసంశప్తకులుబిలువగనే । నేగియుంటినయ్యా
సాత్యకిదృష్టద్యుమ్నభీములే । చాయనేగిరయ్యా
నీవుద్రుపదమత్స్యనాథులెచటికి । నేడుబోతిరయ్యా
సింగారమునకు దాల్చితిరేమా । చేతిధనువులయ్యా
మనుజులవలెగన్పింత్రుగానియభి । మానహీనులయ్యా
నేనులేనపుడుతనయునిగావగపూ । నకుంటిరయ్యా
సం॥ తలచితలచి కన్నీరుగార్చుచా । ధరణింబడెనయ్యా
కొంతవరకుతెల్విబొందికొడుకును । గూర్చిపలికెనయ్యా

అ॥ యెటులజొచ్చెనాపద్మవ్యూహము । యెవరుజంపిరయ్యా
శీఘ్రంబుగనావృత్తాంతంబును । జెప్పవిందునయ్యా

# నెం. 5

ధర్మ॥ అనధర్మజుడనెయుద్ధమునకు మీ । రరిగియుంటిరయ్యా
పద్మవ్యూహముగురుడునిల్పగా । బయనమైతిమయ్యా
అందరముదానిభేదించుటకై । యత్నించితిమయ్యా
గానివిధముదెలియకున్నద్రోణుని । ఘాతబడితిమయ్యా
అంతనేనుచింతించియభిమన్యు । నంటినిట్టులయ్యా
సూదిమొనయంతదారిజేయగా । జొత్తుమంటినయ్యా
అనగసుతుడనెనుచింతయేలనే । నందుజొత్తునయ్యా
వెడలుమార్గంబుదెలియగానిమరి । భీతిజెందనయ్యా
అనుచుయుద్ధమునకందరమేగితి । మతడుజొచ్చెనయ్యా
అంతమేమేగుచుండగ సైంధవు । డడ్డమాయెనయ్యా
అందరమాతనితోడబోరగా । యదలకుండెనయ్యా
శివునివరమహిమచేతమమ్ములను । జిక్కుపరచెనయ్యా
బాలకుడొకడందుజొచ్చివీరుల । బాధించినడయ్యా
యెనిమిదివేలరథంబులనొక్కడె । యిలనుగూల్చెనయ్యా
తొమ్మిదినూర్లగజంబులనాతడు । దునిమెనువినుమయ్యా
బలవంతుల రెండువేలరాజుల । బడవేసినడయ్యా
యింకననేకులగూల్చితనయుడీ । యిలపైబడెనయ్యా
అందరొకనితో యధర్మయుద్ధం । బాచరించిరయ్యా
సం॥ అనవినిపార్థుడుమండిపడుచు । దానపుడుబలికెనయ్యా
అ॥ రేపుప్రొద్దుగ్రుంకకమునుసైంధవు । రూపుమాపుదయ్యా
నిన్నుకృష్ణునిశరణుజొరకున్న । నేనొనర్తునయ్యా
బాలఘాతకుని జంపగశపథము । బల్కెదవినుడయ్యా
బ్రహ్మహత్యగురుహత్యపాపముల । బడయుదునోయయ్యా
సకలసురాసురులడ్డమువచ్చిన । జంపుదునిజమయ్యా
అటుగాకుండినగాండీవంబుతో । యగ్నిజొత్తునయ్యా

వం॥ అనుచుదేవదత్తముపూరించెను । యతిభయదంబయ్యా
హరియుఃపాంచజన్యముపూరించెను । యత్యద్భుతమయ్యా
శంఖధ్వనులనువిని నీబలములు । చాలబెదరెనయ్యా
త్వరగూఢచారులుదెల్పగ సైం । ధవుడువిన్నడయ్యా
గడగడవడకుచు త్వరగబోయినీ । కొడుకునకనెనయ్యా
సై॥ అందరొనర్చిరి పాథుఁడునాపై । యాగ్రహించెనయ్యా
నన్నురేపుజంపుటకుశపథమును । నరుడుజేసెనయ్యా
అతనినెదిరించి ప్రతినజెడగొట్ట । యర్థుండెవడయ్యా
అమరవరులకిదిసాధ్యముగాదెట । కైనబోదునయ్యా
ద్రోణకర్ణకృపశల్యబాహ్లికులు । దొడ్డవీరులయ్యా
యమునిబట్టుకొన్నవానిగావగ । యతిసమర్థులయ్యా
అనిపాథుఁనిబలమెరుగుగానమరి । యపుడుబల్కెనయ్యా
యేఘడియయెట్లువచ్చునో తెలియ । దేనేగెదనయ్యా
పలికెకురునాథుడేటికినీవిటు । భయమునొందెవయ్యా
దు॥ నీవుమెచ్చుశూరులునిఁగావగ । నిలచియుండిరయ్యా
నాతమ్ములతో నాబలములతో । గాతునిలువుమయ్యా
వం॥ అనుచుద్రోణుకడకేగియావిధము । నంతజెప్పెనయ్యా
వినిగురుడనెసైంధవునకునీవిటు । భీతిజెందకయ్యా
ద్రో॥ నేనుండగయాదేవతలైనను । నిన్నుజూడరయ్యా
నరునకుఘోరశక్యంబుగాని మొ । గ్గరముజేతునయ్యా
నీవువేదములజదివిక్రతువులఁ । నెరపితివోయయ్యా
కులధర్మంబునువీడిచావునకు । గుందెదవేమయ్యా
యెన్నటికైనను మృత్యువుప్రాణికి । యేర్పడెనోయయ్యా
గాననీవు మృత్యువునకుశంకక । కలననిలువుమయ్యా
వం॥ అనగసైంధవుడు చింతనువీడుచు । యపుడువెడలెనయ్యా

## నెం. 1

శ్రీకృష్ణుడుపాథుఁనకనెను । జేసితివెటుశపథంబనెను
కృ॥ గురుడతిబలవంతుండయ్యా । గూర్చువ్యూహమద్భుతమయ్యా
కర్ణాదులుబలయుతులయ్యా । గాతురు సైంధవునోయయ్యా

యెటులగెలుపునొందెదవయ్యా । యేలయిట్లుబలికితివయ్యా
వం॥ అనగనవ్వినరుడిట్లనెను । అసంశయమునుగొనకనెను
అ॥ శపథమునేజేసితినయ్యా । సలుపుటనీభారంబయ్యా
భీతినిబుట్టింపకుమయ్యా । వేగనన్నుగావగదయ్యా
గాండీవంబుధరియించితిని । ఘనునిసారథిగబొందితిని
హరుడెదిరించిన భయపడను । అన్నటుజేసెదనీదయను
వం॥ హరినరులిటుబలుకుచునుండ । సురలువినుచుభయపడుచుండ
అంతభూమిపడకినదయ్యా । ఆయెనుదుశ్శకునములయ్యా
నరుడుకృష్ణునకునిట్లనెను । నాసతిచెంతకుజనుమనెను
అ॥ నిన్నసతులువచ్చినరయ్యా । నీవోదార్పగజనుమయ్యా
వం॥ శ్రీకృష్ణుడువినియటుజనెను । చెల్లెండ్రనుగని యిట్లనెను
కృ॥ రాజధర్మమెరుగుదువమ్మా । రణమరణంబుత్తమమమ్మా
వీరమాతవీవైనావు । వీరపత్నివీవైనావు
కొడుకుకొరకువగవకుమమ్మా । కోడలినోదార్పగదమ్మా
అనేకులనుజంపినడమ్మా । అనిసేయుచుజచ్చినడమ్మా
స్వర్గంబునకేగినడమ్మా । చాలుదుఃఖమొందకుమమ్మా
మీకుసాయమొనరించుటకు । మీకుమేలుగూర్చుటకొరకు
జనులెందరొవచ్చినరమ్మా । సంగరమునజచ్చినరమ్మా
వారునీసుతునివలెగాదా । వారికొరకుపగవగరాద
ఒక్కసుతునికేడ్చెదవమ్మా । నిక్కంబిదితప్పగునమ్మా
రేపుసైంధవునిజంపెంతు । నీపతిపలుకులనొనరింతు
తనయునికైవగవకుమమ్మా । ధైర్యంబునుమదిగనుమమ్మా
వం॥ వినిసుభద్రకడువిలపించె । వెతనుకృష్ణునకువిన్పించె

## నెం. 3

సుభ॥ హాపుత్రాయెటుబోతివి । (శ్రీ) అకటనన్నువీడితివి
మామవచ్చినాడయ్యా । మామనుబిల్వగదయ్యా
సగముమేనునాపైన । సగముమేనుశయ్యాపైన
ఉంచినిద్రగొందువయ్యా । ఉర్వివేడుబండితయ్యా
భీమునిబలమెటుజనెను । విరటుడేమిజేయుజనెను

సాత్యకిబలమెటుబాయె । నరగద్రుపదుడెటుబోయె
అందరుండినినుజంపిరి । అవనిజావగాజూచిరి
నీవులేనిలోకంబు । నేడుపాడులోకంబు
నరునికిదగుతనయుండవు । హరికిదగినయల్లుండవు
ఓతనయారావయ్యా । ఉత్తరనిటుగమమయ్యా
వం॥ ఉత్తరకడువిలపించే । ఉర్విబడుచుశోకించే
ద్రౌపదికడుదుఃఖించే । త్వరగకృష్ణుడదిగాంచె

## నెం. I

వారికిశాంతముగావించె । వచ్చివిజయునంతటగాంచె
యెల్లరనంతటబంపించె । ఏకాంతంబునకేతెంచె
దర్భశయ్యనపుడొనరించె । దానికిపూజలుగావించె
అందుబండనరునంపించె । ఆయుధంబులనుపూజించె
హరితనవసతికిజనుదెంచె । అందునసుఖనిద్రనుగాంచె
అంతనరుడునిద్రనుగాంచె । అందొకస్వప్నంబునుగాంచె
శ్రీకృష్ణునికలలోగనెను । జెప్పినపల్కులనిటువినెను
కృ॥ కొడుకునకై వగవకుమయ్యా ।పుడమిస్థిరంబెవ్వనికయ్యా
అనగనరుడుకృష్ణునకనెను । ఘనశపథముజేసితిననెను
అ॥ కర్ణాదులగెలుచుటయెట్లు । కలనవానిగూల్చుటయెట్లు
జంపకున్నబ్రతికెడిదెట్లు । నరగవగపుబోయెడిదెట్లు
వం॥ అనగకృష్ణుడపుడిట్లనెను । హరునిపాదములగనుగొనెను
పాశుపథముతోనిదియౌను । పరమేశునివేడగబూను
వినికలలోనరుడుజేసెను । విశ్వేశునివేడుచుండెను
హరినరులాకాశముజనిరి । త్వరగనుత్తరమునకుజనిరి
కైలాసంబునుగనుగొనిరి । కనులపండువనియనుకొనిరి
ప్రమథుల బూజలుగొనుచుండె । పార్వతీసహితుడైయుండె
ఆమహేశ్వరునిగనుగొనిరి । ఆతనికిప్రణుతులను సలిపిరి
నరనారాయణులనుగనెను । నవ్విశివుండపుడిట్లనెను
కుశలంబాయనిప్రశ్నించె । కోరికలేమనివచియించె
హరినరునకుమెల్లగయనెను । అడుగుముపాశుపతంబనెను

అనవిని నరుడంతటజనెను । హరునిపాదములపైబడెను
వేగముందుకృష్ణునిగనెను । వెనుకకంతకృష్ణునిగనెను
హరిహరరూపంబునుగనెను । అతిసంతసమునమరిగనెను
పరమేశ్వరునంతటగనెను । పాశుపతంబిడుమనియనెను
అంతశివుండపుడిట్లనెను । ఆకొలనునగలదనియనెను
మీరుదానిగొనితెమ్మనెను । మీరుమహాబలులనియనెను
అంతనటకునుజనిరయ్యా । అచటసర్పములగనిరయ్యా
విషజ్వాలలనుగనిరయ్యా । భీతివిడచిమ్రొక్కినరయ్యా
రుద్రసూక్తములను జదివిరి । రుద్రునిదలచుచును ముట్టిరి
ధనుర్బాణమగుటనుగనిరి । త్వరగవాటినింగైకొనిరి
మరలిశంకరునిముందిడిరి । మహేశుకడబాలునిగనిరి
విడిచెటివిధమునుజూపించె । వేగమంత్రముపదేశించె
నరుడుమంత్రమునుగొనెనయ్యా । శరమునువిడుపెరిగినడయ్యా
కొలనుకడకుబోయినడయ్యా । కొలనునవవిబెట్టినడయ్యా
హరునకుబ్రాణమిల్లినడయ్యా । ధరకువేగవచ్చినరయ్యా
పార్థుఁడిట్లుకలలోగనెను । పరమానందంబునుగొనెను
అంతటతెలవారినదయ్యా । అర్జునుండులేచినదయ్యా

—: ఫ ల శ్రు తి :—

భారతవీరులచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుదీని । విరచించెనుభక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడుయీసత్కృతిని
సదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని

# నాల్గవనాటి యుద్ధము

## నెం. 5

అంతధర్మజుడు కాలకృత్యముల । నాచరించెనయ్యా
అచటికిమాధవుడేతెంచగగని । యాదరించెనయ్యా

భీమనకులసహదేవసాత్యకులు । వేగవచ్చిరయ్యా
అందజేరగధర్మజుండు శ్రీ । హరికిబలికెనయ్యా
ధర్మ॥ పద్మనాభమొదటనుండి మమ్ముల । పాలించితివయ్యా
నేడునరునిప్రతిననిల్పిగావగ । నీభారంబయ్యా
వం॥ అనగకృష్ణుడనెచింతిలబోకుము । యటులజేతునయ్యా
అంతనరుండేతెంచిధర్మజున । కపుడుమ్రొక్కెనయ్యా
గనిశ్రీకృష్ణుని సంతసమొందుచు । కలనుజెప్పెనయ్యా
అందరువినియాశ్చర్యమగ్నులై । హరినివేడిరయ్యా
నీమాయలు దెలియంగరావనుచు । నిలచిమ్రొక్కిరయ్యా
అంతటనరుడాసాత్యకిగనుగొని । యపుడుబలికెనయ్యా
కలనసైంధవునిజంపెదధర్మజు । గాచుటవీవయ్యా
సర్వేశ్వరుడీకృష్ణుడందరికి । సాయంబగునయ్యా
అందరిదివినుచు సమరరంగమున । కంతటజనిరయ్యా
హరిరహస్యముగతనసారధికిటు । లాజ్ఞజేసెనయ్యా
కృ॥ నేడునారథముసిద్ధమొనర్చుచు । నీవుజూడుమయ్యా
హస్త్రాదికిసూర్యుడేగువరకీ । వరయుచుండుమయ్యా
పార్థుడుడస్సినప్రతిననెరవేర్ప । వలయునునేనయ్యా
నాదుపాంచజన్యధ్వనిగనుగొని । నన్నుగలయుమయ్యా
వం॥ వినిదారకుడనెవెరపించెదవిటు । విశ్వమయుడవయ్యా
అనవినిహరిజనినరునిరథమెక్కి । యపుడుదూలెనయ్యా
యుద్ధస్థలమునుగాంచినరుండ । త్యుగ్రుడాయెనయ్యా
వై॥ అంతటధృతరాష్ట్రుండుసంజయున । కపుడుబల్కెనయ్యా

నెం. 1

వం॥ ఒక్కనరునిదాకగలేరు । యుగ్రంబుగబోరగలేరు
యీపురిలోయేడ్చెడువారు । యెక్కువగనబడుచున్నారు
సైంధవునకుగతిలేదయ్యా । చావేనిక్కంబగునయ్యా
గురుభీష్ములుజెప్పినరయ్యా । హరిపల్కులువినుమనిరయ్యా
కర్ణునినమ్మకుమనిరయ్యా । కపటంబులువిడుమనిరయ్యా

శకునినినమ్మకుమనిరయ్యా । సవ్యసాచికూరుండయ్యా
నరుడేబలవంతుండయ్యా । హరిసాయముజేరినడయ్యా
తనయుడువినకిటులొనరించె । జనకియుంబునుగావించె
వై॥ అనగసంజయుంట్లనైను । అంతకుమూలంబీవనెను
సం॥ మాయజూదమెరిగితివయ్యా । మాన్పింపకజూచితివయ్యా
అద్దానికిఫలమిదియయ్యా । అలకింపుమేడ్వకుమయ్యా
సంధిజెడగజేసితివయ్యా । చాలగలుబ్ధుడవీవయ్యా
నరునికెదురుసురలేరారు । నందనులెటునిల్చెడివారు
సమరవార్తదెలిపెదనయ్యా । శాంతముతోవినగదవయ్యా

# నెం. 5

ఉభయబలంబులురణభూమికిజని । యుబ్బుచుండిరయ్యా
అస్త్రగురుడుసైంధవునిగాంచిముద । మారబలికెనయ్యా
ద్రో॥ భూరిశ్రవుగొనిమూడామడవెను । జేరియుండుమయ్యా
కర్ణాశ్వత్థామశల్యులెప్పుడు । గాతురునిన్నయ్యా
గజములుపదునాల్గువేలెపుడునిను । గాచుచుండునయ్యా
అరవదివేలరథంబులరథికులు । యరయుచుందురయ్యా
లక్షాశ్వంబులుపదిలక్షలకాల్బ । లములములుగనునయ్యా
స॥ ఇరువదినాలుగుక్రోసులపొడవుగ । యేర్పరించెనయ్యా
వెడల్పుపదిక్రోశంబులుగలయటు । వేగజేసెనయ్యా
శకటవ్యూహంబివ్విధంబుగా । నలిపియుండెనయ్యా
దానిమధ్యమునపద్మవ్యూహము । త్వరగజేసెనయ్యా
దానికిమొదలేసూచివ్యూహము । బూనినిల్పెనయ్యా
శతసహస్రవీరులతోసీసుతు । సరగనిల్పెనయ్యా
దానిముఖమ్మునతానునిలచెనతి । ధైర్యయుతుండయ్యా
అంతనరుడువ్రాళయాంతకువిధమున । యమ్ములనిడెనయ్యా
దుర్మర్షణుడతివేగవచ్చినరు । దూలగొట్టెనయ్యా
అతనిసేనయజూ~నునిదాకగా । అతడుగనెనయ్యా

అతికతిపబాణములనిడిబలముల । హతముజేసెనయ్యా
కరిరథహయకాల్బములనన్నిటి । ఖండించినడయ్యా
అపుడురక్తప్రవాహముబారెను । యధిపావినుమయ్యా
దుర్మషణదుశ్శాసనులంతట । దొలగిపారిరయ్యా
నరుడావ్యూహముఖంబుననిలచిన । గురువునుగనెనయ్యా
చేతులుమొగిడ్చిగురువుతోనిట్లు । జెప్పెనువినుమయ్యా
అ॥ గురువరయశ్వత్థామవలెనన్ను । నరయుదంటివయ్యా
మేలుదలచిసైంధవునిజంపగా । మాగణంబిడుమయ్యా
సం॥ అనగనవ్విగురుడనెనను గెల్వక । యరిగెదవెటులయ్యా
అనుచశ్వంబులపైనకృష్ణుపై । యమ్ములేసెనయ్యా

## నెం. 2

నరుడుశరములణనిగుడించె । గురుడునడుమనేఖండించె
గురుడుహరినరులగొట్టెను । నరుడుయతికోపమొందెను
గురునిమేనంతనొప్పించె । గురునిసేనలణఖండించె
కనలిగురుడొక్కశరమిడెను । నరుడుమూర్ఛిల్లిమేల్కొనెను
ఇరురివ్విథముబోరిరి । ఇరువురతికోపమొందిరి
అంతకృష్ణుండుబలికెను । అర్జునాయిట్లువలదనెను
అనుచురథమంతదోలెను । అంతకుడివైపునడచెను
అరదమతివేగబోయెను । అపుడువ్యూహమునజొచ్చెను
హరికిగురుడంతబలికెను । అకటమోసగించితివనెను
నరుడుగురువునకునిట్లనెను । హరుడున్నినుగెలువలేడనెను
అనుచురథముబోజొచ్చెను । కనుచుగురుడువెనుదగిలెను
అపుడుకృతవర్మదాకెను । అపుడుకాంభోజుడేగెను
అచటబలమంతదాకెను । అపుడుశరవృష్టిగురిపెను
నరుడుశరములణఖండించె । నవ్వుచవ్వారినొప్పించె
గురుడుశరవృష్టిగురిపించె । నరుడువేగముగఖండించె
శరములొకకొన్నినిగుడించె । గురునిదేహమునునొప్పించె
గురుడుకడుబాధనొందెను । మరలితనవెలపుజేరెను

హరిరథముముందుకంపెను । అపుడుకృతవర్మదాకెను
నరుడుశరములనునిగుడించె । త్వరగనాతనినినొప్పించె
అతనిబలములనుఖండించె । అంతభోజునిలబడనొంచె
అరదమికకొంతనడచెను । అశ్వతాయుథుండెదిరెను
నరునిమూడింటగొట్టెను । హరినిడెబ్బదింటగొట్టెను
పాథుఁడతికోపమొందెను । బరగశరవృష్టిగురిపెను
అతనియరదమునుఖండించె । అతనియశ్వములఖండించె
అతనిధనువంతదృంచెను । అతడుగదగొనుచువచ్చెను

## నెం. 5

అతనికిమునువరుణుడుగదనిచ్చుచు । యపుడుబలికెనయ్యా
పవరమొనర్పనివానిపైననిది । ప్రయోగించకయ్యా
యెరుగకప్రయోగమొనరించినచో । మరణమొందుదయ్యా
వరుణదేవుడిటుజెప్పెనిప్పుడది । మరచియుండెనయ్యా
అతిక్రోధమ్మునశ్రీకృష్ణునిపై । కంతవేసెనయ్యా
హరికిదాకిబాధించకమరలుచు । యతనిజంపెనయ్యా
హాహాకారంబొనర్చిసైన్యం । బంతబారెనయ్యా
అదిగనికాంభోజుడుపెక్కమ్ముల । నంతవేసెనయ్యా
వరుడుకనలివానిరథాశ్వంబుల । నరికివేసెనయ్యా
ఒక్కబాణమునయాతనికంఠము । ఉర్విగూల్చెనయ్యా
అరువేలరథికులనాక్షణమున । హతముజేసెనయ్యా
శ్వతాయువయుతాయువులనురాజులు । జేరినిలచిరయ్యా
ఇరువురుభయపాశ్వంబులశరముల । నేయుచుండిరయ్యా
తోమరంబుచేశ్వతాయువర్జును । దూలగొట్టెనయ్యా
అర్జునుడుబాధజెందెనయుతాయు । వంతగొట్టెనయ్యా
శూలముచేనప్పాథుఁనియురమును । స్రుక్కగొట్టెనయ్యా
అంతనరుండతిభాధచెమూఛఁ । నందియుండెనయ్యా
అంతటనీబలమతిసంతసమున । యార్చుచుండెనయ్యా
క్షణములోనపరుడుమూఛఁదేరుచు । కవలిచూచెనయ్యా

ఇంద్రదత్తమగునైంద్రాస్త్రంబవు । డేసియార్చెనయ్యా
ఆయస్త్రంబిరువురికంఠంబుల । నవనిగూల్చెనయ్యా
అయిదునూర్లరథికవరులనంతట । హతముజేసెనయ్యా
వచ్చినయిరువురికిరువురుతనయులు । సరగవచ్చిరయ్యా
నియుతాయువుదీర్ఘాయువులంతట । నిలచిపోరిరయ్యా
అర్జునుడువారినరనిముసంబున । హతముజేసెనయ్యా
యవనకబర్బరాదులునరుపై । యమ్ములనిడిరయ్యా
నరుడుతుంగమడుగుజొచ్చుకరివలె । నరుకుచుండెనయ్యా
విజయాగ్నినికృష్ణుండనువాయువు । వీచుచుండెనయ్యా
కురుసైన్యంబనువనమునుగాల్చుచు । గూల్చుచుండెనయ్యా
అంతనీసుతుడుద్రోణునిగనుగొని । యపుడుబల్కెనయ్యా
దు॥ నరుడునిన్నెట్లుగెలచుచుయీమొ । గ్గరముజొచ్చెనయ్యా
మనసేనలబాడుజేసెనయ్యది । గనుగొనవేమయ్యా
నీవుపాండవులపక్షపాతివని । నేనెరుగుదునయ్యా
వాకుధర్మజునిబట్టియిత్తువని । నమ్మియుంటినయ్యా
కప్పకూతపామురీతియయ్యెడ । గావించితివయ్యా
నిన్నునమ్మిసైంధవుడెటువెడలక । నిలచియుండెనయ్యా
తేనియబూసినకత్తివిధంబున । గానిపించెనయ్యా
సైంధవుండున్నచోటికిపాథుఁడు । సరగబోయెనయ్యా
యిటుబల్కితిననికోపముజెందక । యేగికావుమయ్యా
ద్రో॥ వినిగురుడనెనీపలుకులకునేను । వెతనుజెందనయ్యా
హరితనసారథ్యపుమహిమచేత । నందుజొచ్చెనయ్యా
నేనిటునుండకపోయినపాండవ । సేనజొచ్చునయ్యా
వారలిందుజేరినమనవ్యూహము । భగ్నంబగునయ్యా
అతిబలవంతుడవీవాతనితో । యనియొనర్పుమయ్యా
వం॥ వినినీసుతుడనెయతనినెదిరింప । భీతిగలుగునయ్యా
దు॥ వినుగెల్చిననరునకునేనెంతయొ । నీవెజూడుమయ్యా
ద్రో॥ అనగగురుండనెకవచమునిచ్చెద । యదిధరింపుమయ్యా

దానిచేతశస్త్రాస్త్రములెప్పుడు । దాకవుజనుమయ్యా
సం॥ అనిసమంత్రకంబగుకవచమ్మును । యాతడిచ్చెనయ్యా
గొనినీతనయుడుముదమునపార్థుని । జెనకవచ్చెనయ్యా
పాండవబలములులోపలజేరగ । బ్రయత్నించెనయ్యా
అంతగురుడుశస్త్రాస్త్రములవారి । నాపుచుండెనయ్యా
గురుడొక్కడు పాండవవీరులతో । దురముజేసెనయ్యా
గురుడుకనలిదృష్టద్యుమ్నునకొక । శరంబునిడెనయ్యా
వేగముగవచ్చుశరమునుసాత్యకి । విరచివేసెనయ్యా
కనలిగురుడుశరవర్షముగురియగ । ఖండించినదయ్యా
గురునిధనువుద్రుంచి బలమునంతట । గూలనేసెనయ్యా
గురుడువేరొక్కధనువునుగొనగా । విరచివేసెనయ్యా
గురుండిట్లెన్నిధనువులబట్టిన । విరువజొచ్చెనయ్యా
ఆయుద్ధంబునుగనిదేవతలత్య । ద్భుతపడిరయ్యా
అచటవ్యూహమధ్యమునకు హరిరథ । మంతదోలెనయ్యా
యెదురుపడినవారలనాపార్థుం । డిలనుగూల్చెనయ్యా
విందానువిందులనుశూరవరులు । విజయుదాకిరయ్యా
హరిపైనరుపైయశ్వంబులపై । యమ్ములనిడిరయ్యా
కనలిపార్థుడాయిరువురిధనువుల । ఖండించినదయ్యా
ఇరువురితలలనునరికినరుడుముం । దరుగుచుండెనయ్యా
కారుచిచ్చువిధమునసైన్యంబుల । గలచుచుండెనయ్యా
హరియునెయశ్వంబులకునీరిడక । యరుగజాలవయ్యా
అనగనరుడుభూమిబగులయస్త్రం । బంతవేసెనయ్యా
మంచినీరంతపైకివచ్చినది । మహాద్భుతంబయ్యా
అఖిలసురలునీసైన్యములదిగని । యద్భుతపడిరయ్యా
అశ్వములకునీరుబెట్టిరథమున । కంతగట్టెనయ్యా
అపుడుహరిరథము ముందుకునడిపెను । యతివేగంబయ్యా
పొద్దువ్రాలె హరినరులు శంఖముల । పూరించినరయ్యా
అపుడునీసుతుడు కడుబలములచే । యుద్ధపడియెనయ్యా
హరినరాశ్వములపైశరవృష్టిని । బరపుచుండెనయ్యా

## నెం. 2

నరుడుపదునాల్గుశరములిడె । కురువరునికవ్విదాకిపడె
నరుడుమరితొమ్మిదిడెనయ్యా । త్వరగనవినేలబడెనయ్యా
పార్థుఁడైదమ్ములిడెనయ్యా । వ్యర్థఁముగభూమిబడెనయ్యా
యిరువదెనమిదమ్ములనిడెను । కురుపతికిదాకకిలబడెను
హరినరునకపుడుబలికెను । అకటనీబలముజెడెనెను
కనలినరుడంతయోచించె । కవచబలమనుచువచియించె
అన్యులెరుగలేరిదియనెను । అస్త్రగురుడెరుగుననియనెను
గురుడుజెప్పెనాకిదియనెను । అరయుమొకయస్త్రమిడుదనెను
త్వరగనొకయస్త్రమిడెనయ్యా । గురుసుతుడుదున్మెగనుచయ్యా
అస్త్రమిటువ్యర్థమాయెను । అర్జునుడు ఖిన్నుడాయెను
మరలయదిబవికిరాదనెను । త్వరగనింకొకటియిడుదనెను
త్వరగనీతనయుడడిగనెను । శరములిరువురకునాటెను
అంతనరుడాగ్రహించెను । అతనిసారథినిద్రుంచెను
అరదమునుద్రుంచివేసెను । అశ్వములనేలగూల్చెను
కరతలములంతనొప్పించె । అరచినీసుతుడుకోపించె
కవచమునునేలవైచెను । కనలిశరములఁవిడచెను
అర్జునుండతనినొప్పించె । అఖిలబలములఁ హింసించె
దేవదత్తంబుపూరించె । దివ్యబలమంతజూపించె
శల్యవృషసేనులేగిరి । శరములన్నరుపైనిడిరి
కర్ణగురుసుతులు దలపడిరి । కఠినశరవృష్టిగురిపిరి
సైంధవుడు శరములేసెను । సరగకృపుడమ్ములేసెను
నరుడు వారలఁగనుగొనెను । శరములధికముగగురిపెను
హస్తలాఘవముజూపించె । అందరికిబాధగావించె

## నెం. 5

వ్యూహముఖంబునపాండవులసేన । సాహసించెనయ్యా
గురునితొనమరమొనరింపగనా । సురలుమెచ్చిరయ్యా
గురునియురమునకుధర్మజుండునవ । శరములేసెనయ్యా

యిరువదియేనిటగురుడుధర్మజుని । యురమునొంచెనయ్యా
అంతఖోకగురుడుగాన్త్రంబుల । నప్పుడేసెనయ్యా
అవలీలగధర్మజుడస్త్రంబుల । నణచివేసెనయ్యా
కనలిగుపడుధర్మజునివిలుద్రుంచి । తనుపునొంచెనయ్యా
సరగధర్మజుండింకొకవిలుఁగొని । శక్తినేసెనయ్యా
భగభగమండుచుగురునిజంపుటకు । బయనమాయెనయ్యా
అదిగనిద్రోణుడుకుపితుడగుచు బ్ర । హ్మాస్త్రంబిడెనయ్యా
శక్తినిక్రమింగుచుధర్మజుపైకతి । సత్వరజనెనయ్యా
ధర్మజుండు బ్రహ్మాస్త్రముఁ నంతట । త్వరగవేసెనయ్యా
మరలనైదుబాణములచేత గురు । వరునిగొట్టెనయ్యా
మరలగుపనివిల్లుఖండించిన । గురుడుకనలెనయ్యా
గదనువేయగాధర్మజుండుతన । గదనువేసెనయ్యా
ద్రోణుడుహయరథసూతధనువులను । ద్రుంచివేసెనయ్యా
ఆయుధహీనుండైనధర్మజుని । యతడువీడెనయ్యా
సహదేవుడునిరమిత్రునికంఠము । సరగదునిమెనయ్యా
సోమదత్తినాద్రౌపదీసుతులు । సరగజంపిరయ్యా
బకునితమ్ముఁడగుయలంబుసుండను । వాడుజచ్చెనయ్యా
భీమసేనుఁడాయసురునిపైశర । వృష్టిగురిపెనయ్యా
అలంబసుడుమాయజేయభీముడు । గలచివేసెనయ్యా
అంతఘటోత్కచుడలంబసునితో । యనియొనర్చెనయ్యా
భూమిపైనగగనంబునవారలు । బోరుచుండిరయ్యా
ఘటోత్కచుడుకత్తిబూనియసురుని । గళముగూల్చెనయ్యా
సరగగురుడు పాంచాలకేకయుల । జంపుచుండెనయ్యా
హరినరశంఖధ్వనులనుధర్మజు । డాలకించెనయ్యా
సాత్యకినపెహరినరులకుసాయము । సలుపనేగుమయ్యా
అనేకవీరులుగలరుపార్థుఁడొక । డచటికేగెనయ్యా
ఘటోత్కచద్రుపదాదులునన్నిట । గాతురుజనుమయ్యా
సాత్యకిభీమునియుచటనిలువుమని । సత్వరజనెనయ్యా
అంతటసాత్యకివాడిబాణముల । యస్త్రగురునినొంచె

గురుడనేకశరములనిగుడించిన । త్వరలోఖండించె
హరిబోయినమార్గమునజనుచుమొ । గ్గరముప్రవేశించె
యెదురుబడినకృతవర్మదేహమును । యెంతోనొప్పించె
దారికడ్డబడునట్టినీబలము । ధ్వంసంబొనరించె
జలసంధునితోబోరిపోరియమ । సన్నిధికంపించె
అంతనీసుతుడుతమ్ములతోజని । యాతనినొప్పించె
సాత్యకినీసుతురథముద్రుంచిఘన । శరములబాధించె
అంతనీసుతుడుబారెబలంబుల । నాతడుహింసించె
అదిగనికృతవర్ముడుసాత్యకినొక । యమ్మునొప్పించె
భూరికోపమునసాత్యకియాతని । మూర్ఛనుబొందించె
గురుడుకనలిసాత్యకిచేధనువును । త్వరలోఖండించె
సాత్యకివేరొకవిలుగొనిద్రోణుని । సారథిబడనొంచె
అరదమునశ్వములీడ్చుకొనిజనెను । యతడుచింతగాంచె
సుదర్శనుండడ్డపడినకంఠము । బెదరకఖండించె
జనుచుండదుశ్శాసనాదులపు । డనికినిలచిరయ్యా
శకకిరాతబర్బరయవనాదులు । శరములనిడిరయ్యా
సాత్యకిశస్త్రాస్త్రంబులనెల్లర । జంపివేసెనయ్యా
దుస్సేనుడతిబాధనుబొందుచు । దొలగిపోయెనయ్యా
సుదర్శనుండనురాజెదిరించిన । క్షోణిగూల్చెనయ్యా
సాత్యకినెదిరింపగనీవారిక । సాధ్యమాయెనయ్యా
అనేకనెత్తురువరదలుబారెను । యధిపావినుమయ్యా
ధనంజయునిశిష్యుడనుపేరుసా । ర్థకముజేసెనయ్యా
అచటగురుడుపాంచాలబలంబు । హతముజేసెనయ్యా
శిశుపాలునితనయునితోబోరుచు । శిరముద్రుంచెనయ్యా
జరాసంధతనయుండుగురునిగని । చాలగొట్టెనయ్యా
గురుడుకొంతవరకతనితోబోరి । గూల్చెనువినుమయ్యా
క్షత్రవర్మనొకకఠినశరంబున । జంపివేసెనయ్యా
అపుడుద్రోణునెదిరింపపాండవుల । కర్హతలేదయ్యా
ధర్మజుండుచింతిల్లిభీమునకు । త్వరగబల్కెనయ్యా

నరునకుపాయంబేగుమునేనిట । వెరువకుందునయ్యా
అనగవినిపోదుననుచురథమెక్కి । యపుడువెడలెనయ్యా
కొందరునీతనయులుదలపడగా । గూల్చియేగెనయ్యా
గురుడుగనిబల్కె తమ్ముడడిగిమొ । గ్గరముజొచ్చెనయ్యా
ననుగెల్వకపోలేవనభీముడు । నవ్విబలికెనయ్యా
వినిభీముండడనెగురుడపుమునుపిట । వైరివగుదువయ్యా
వేడిచొచ్చుటకునరుడగానురణ । భీముడగనుమయ్యా
యనియురదముదిగిగదనుసారించి । యపుడువేసెనయ్యా
సారథిజచ్చెనురథముబడెనుయ । శ్వములుజచ్చెనయ్యా
అంతనీబలముభీమునిదాకగ । యదరగొట్టెనయ్యా
గురుడువేరొక్కరథమునెక్కిఘన । శరములేసెనయ్యా
వానకెదురుతలవంచిబోవువృష । భముచవలెజనెనయ్యా
వేగరథంబొకచేతబట్టుకొని । విసరివేసెనయ్యా
అరదమువిరిగెనుగురుడింకొకదెస । కంతబారెనయ్యా
బలములెల్లభీమసేనుగనుగొని । బారుచుండెనయ్యా
అడ్డులేకభీమునిరథమందున । యరుగుచుండెనయ్యా
గదచేకరిహయరథకాల్బలముల । గలసివేసెనయ్యా
సమరమొనరించుసాత్యకిగనుగొని । జనుచునుండెనయ్యా
దూరమునుండియెహరినరులెక్కిన । తేరుగాంచెనయ్యా
త్వరగబలముభీతిల్లసింహనా । దంబుజేసెనయ్యా
హరినరులదివినిశంఖనాదముల । నంతజేసెనయ్యా
ఆనాదంబులవినుచుధర్మజుడు । హర్షమొందెనయ్యా

## నెం. 2

కర్ణుడంతలోనేతెంచె । కఠినశరములన్నిగుడించె
భీముడన్నిటినిఖండించె । బిట్టుగాకర్ణునొప్పించె
కర్ణుచాపమునుఖండించె । కర్ణుడింకొకటిధరియించె
భీముడరదమునుదృంచెను । విరథుడైకర్ణుడేగెను

## నెం. 1

అంతనీకుమారుడుగనెను । అపుడుగురుని చెంతకుజనెను
దు॥ సమరమందు యోడితివెట్లు । సముద్రంబులింకినయట్లు
ముగ్గురినిట వీడితివయ్యా । మొగ్గరమ్ము జెరచినరయ్యా
సైంధవుచెంతకు జనెనయ్యా । సవ్యసాచినిఁ గనుమయ్యా
మాపైదయవీడితివయ్యా । మాబలములు జచ్చినవయ్యా
సం॥ అనవినిద్రోణుండిటులనెను । అఖిలశూరులనుగనుమనెను
ద్రో॥ అర్జునిఁదలపడుమయ్యా । ఆసైంధవుగావగదయ్యా
నేనుముఖమువీడితినేని । నిముసములోజొత్తురుబూని
శకునినియిటుబిల్వగదయ్యా । సమరంబునకంపగదయ్యా
మాయజూదమపుడొనరించె । మహాసంపదలగ్రహియించె
అపుడుగెల్పునందినదయ్యా । యిపుడుగెల్వుమనగదవయ్యా
దుశ్శాసనుడెటుజనెనయ్యా । దురముసేయరాడేమయ్యా
నమ్మినకర్ణుం డెటుజనెను । నరునిజంపగా జనుమనెను
అపుడుసైంధవుడు జీవించు । అందరికిని సుఖమనిపించు
తనువుపైన యాసనువిడితి । ధర్మంబునుమున్నేవిడితి
నీచేరక్షణమునుగొంటి । నీకైయనిసేయుచునుంటి
మనమున చింతిల్లకుమయ్యా । జనుముసైంధవునిగనుమయ
సం॥ వినినీసుతుడంతట జనెను । వినిధృతరాష్ట్రుండిటులనెను
కర్ణుడుభీమునితోబోరె । క్షణమునవిరథుండైబారె
వై॥ అవ్వలికథవినియెదననెను । అతనికి సంజయుడిటులనెను

## నెం. 5

సం॥ వేరొకరథమున కర్ణుడుభీముని । బిలచుచుండెనయ్యా
వినిభీముడుజనితీవ్రశరంబుల । వేగవేసెనయ్యా
అంతనొచ్చికర్ణుండు వాడిగల । యమ్ములనిడెనయ్యా
యిరువురిశరములనిరువురుబాధల । నెంతొగొనిరయ్యా
కనలిభీముడు రథంబునుసూతుని । ఖండించినదయ్యా
బాణములఘాతనొందియు కర్ణుడు । బారజొచ్చెనయ్యా

వేరొకరథమునవచ్చి పవనజుని । బిట్టుదాకెనయ్యా
వారలిరువురొనరించినయుద్ధము । భయానకంబయ్యా
కర్ణుడుభీముని ముప్పదియమ్ముల । కనలికొట్టెనయ్యా
కనలిభీముడాకర్ణునిసూతుని । ఖండించినడయ్యా
కర్ణుడు శక్తినివైవగభీముడు । ఖండించినడయ్యా
భీముడతని విలుదునిమిహయంబుల । వేగద్రుంచెనయ్యా
అంతనీసుతుడు దుర్జయుడనువా । డమ్ములనిడెనయ్యా
ఆరమ్ములనిడిభీముండాతని । హతముచేసెనయ్యా
అంతవేరొక్క రథమున కర్ణుం । డతనిగొట్టెనయ్యా
కఠినశరములాభీమునికతిశయ । ఘాతచేసెనయ్యా
లెక్కగొనక భీముడతనిరథ మవ । లీలదునిమెనయ్యా
అంతనీసుతుడు దుర్ముఖుడాతని । కమ్ములనిడెనయ్యా
కర్ణునెదురు నాభీముడు నీసుతు । గళముగోసెనయ్యా
బాణత్రయమున కర్ణుని యురమును । బగులగొట్టెనయ్యా
బాణఘాతనుండి నొచ్చి కర్ణుడు । బారిపోయెనయ్యా
ధృ॥ వినిధృతరాష్ట్రుండనెనాకొడుకు । వీనినమ్మెనయ్యా
నరునిజాదునిమెడువాడు భీమునకు । వెరచిపారెనయ్యా
వినెను జరాసంధాదులజంపిన । విధముసుతుండయ్యా
తనపట్టునువీడడు సుకుమారులు । ధ్వంసంబయిరయ్యా
వై॥ అని దుఃఖింపగ సంజయుండుగని । యపుడుబల్కెనయ్యా
సం॥ పాండుసుతుల నాయాసపరచుటకు । ఫలమునొందుమయ్యా
అంతకుమూలమునీవై తనయుని । యనఫలమేమయ్యా
ఇప్పటికైనను పాండవులభాగ । మిమ్మగు సుఖమయ్యా
గాకయున్న దుఃఖింపకుముందరి । కదనము వినుమయ్యా
కనలినీతనయులైదుగురొడిన । కర్ణునిగనిరయ్యా
కఠినబాణముల విడచిభీమునకు । ఘాతజేసిరయ్యా
మండిపడుచైదుగురి నాభీముడు । ఖండించినడయ్యా
అదిగని కర్ణుండేడ్చుచు బ్రతుకున । కాసవీడెనయ్యా
అలసియు జనిరోసంబున భీమున । కమ్ములనెడెనయ్యా

నొచ్చిభీముడరథంబును దనువును । నుగ్గుజేసెనయ్యా
గదగొనికర్ణుండేయభీముడా । గదనుగూల్చెనయ్యా
నీసుతులేడ్వురు కర్ణునిగావగ । నిలచిపోరిరయ్యా
భీముడేడ్గురనుగనుచుకనలుచును । పృథ్విగూల్చెనయా
ఇరువురురథముల నెక్కి ఘోరముగ । దురముజేసిరయ్యా
కర్ణుడతిబాధనొందిబారగా । గాంచుచుండెనయ్యా
చచ్చిననీసుతులనుగనివెడలక । సలుపుచుండెనయ్యా
కర్ణునిగావగనీసుతులేడ్వురు । కనలిదాకిరయ్యా
కనలిభీముడేడ్వురకంఠంబుల । ఖండించినడయ్యా
భీముడొకబొబ్బసేయధర్మజుడు । వినియుబ్బినడయ్యా
అంతదుర్యోధనుండుజచ్చిపడు । యనుజులగనెనయ్యా
అతిదుఃఖముదనమదిలోనొందుచు । యనుకొనెనిటులయ్యా
నాడువిదురుండుజెప్పినవిధమీ । నాడుజరిగెనయ్యా
పాండుసుతులుపుణ్యాత్ములనినాడు । బల్కిరెల్లరయ్యా
అట్టివారికాపదలిడువారికి । యపజయమనిరయ్యా
అనుచుసైన్యములభీమునిదాకగ । యపుడుబంపెనయ్యా
గనిభీముడుశరపరంపరలనిడి । ఖండించినడయ్యా
నెత్తురుటేరులుబారజొచ్చెకురు । నేతావినుమయ్యా
కర్ణుడుభీమునితనువునరక్తము । గారగొట్టెనయ్యా
అంతటభీముండొక్కడగుటచే । యలసిపోయెనయ్యా
త్వరగనప్పుడెకర్ణుడుభీముని । ధనువుద్రుంచెనయ్యా
ఖడ్గముగొని భీముండాకర్ణుని । కనలికొట్టెనయ్యా
దాకిన భయపడి కర్ణుడొక్కదెస । దాగియుండెనయ్యా
అస్త్రహీనుడై భీముడుకర్ణుని । యరదమెక్కెనయ్యా
అరదమందువెదకెనులేకుండిన । యడుగుజొచ్చెనయ్యా
అచటలేకున్నవెడలగ కర్ణుం । డమ్ములనిడెనయ్యా
చేతనున్న యాయుధములేకున్న । చింతనొందెనయ్యా
చచ్చినకరిహయశవములగైకొని । సరగవిసరెనయ్యా
యొడమచేతగొని కుడిచేవాటిని । యెన్నోయిడెనయ్యా

కర్ణుడన్నిటిని ఖండించుచుశర । ఘాతజేసెనయ్యా
బలములతోకర్ణునితోబోరెను । బడలియుండెనయ్యా
అస్త్రహీనుడైమరలిపోయియొక । యరదమెక్కెనయ్యా
అమ్మపలుకుదలచికర్ణుడాతని । కపుడుబల్కెనయ్యా
తిండిపోతభండనమ్ముసేయుట । దెలియవన్నడయ్యా
కర్ణు॥ నీవింటికిజనికడుపునిండదిని । నిద్రబొందుమయ్యా
మునివైవనముననుండుమివ్విధము । యనికిరాకుమయ్యా
వచ్చినచోనావంటివానితో । బవరముతగదయ్యా
సం॥ అనుచునవమానపరుపగగనినరు । డమ్ములనిడినిడెనయ్యా
అలసికర్ణుడరదంబుదోలుకొని । యపుడుబారెనయ్యా
చిన్నబోయిభీముడురథమెక్కుచు । జేరెపార్థుడనయ్యా
అలంబుసుండనుభూపునిసాత్యకి । హతముజేసెనయ్యా
ఐదునూర్లరథికులనాసాత్యకి । హతముజేసెనయ్యా
అలసినసాత్యకినాభూరిశ్రవు । డంతదాకెనయ్యా

## నెం. 2

అంతభూరిశ్రవుడుగాంచె । అపుడుశరవృష్టిగురిపించె
సాత్యకియువాటిఖండించె । శరములొకకొన్నిగుడించె
ఇరువురతిఘాతనొందిరి । విరథులైనేలకేగిరి
గదలతోకొంతబోరిరి । ఖడ్గములకొంతబోరిరి
రక్తమయులగుచుదలపడిరి । రణముభయదముగజేసిరి
అంతసాత్యకియుయలసెను । అపుడుభూరిశ్రవుడుగనెను
సాత్యకినినేలబడవైచె । సరగతలనరుకగాజొచ్చె
ఖడ్గమునుచేతబట్టెను । గాంచిహరినరునకపుడనెను
కృష్ణు॥సాత్యకినిజూడవేమయ్యా । శ్రమనుగొనినేలబడెనయ్యా
ముఖమునక్షగురునిగెలిచెను । మొగ్గరంబందుజొచ్చెను
నీకుసమముగనుబోరెను । నీకుశిష్యుడనుపేర్గాంచెను
సం॥ వేయువేయుమనిహరియనెను । విజయుడొకబాణమపుడిడెను
యెత్తినభుజంబునరికెను । యెరిగిభూరిశ్రవుండనెను

భూ॥ నరుడధర్మంబువీడితివి । హరివచనములవింటివి
యిపుడధర్మంబుజేసితివి । యింతనీచంబొనర్చితివి
సం॥ అనగనరుడంతబలికెను । అలసెసాత్యకియునేడనెను
అ॥ అట్టివానినిలగూల్చితివి । అతనితలగోయనుంటివి
మీరుధర్మమునువీడితిరి । చేరినాసుతునిజంపితిరి
సం॥ అపుడుభూరిశ్రవుడువినెను । అంతమౌనమునదిగియెను

నెం. 5

అ॥ మహాత్ముడవు నిన్నలయించితినను । మన్నింపగదయ్యా
బాహ్లికపౌత్రుడ వీకురువంశవి । వధఁజనుండవయ్యా
యింతకుమాలం బాసుయోధనుం । డేమిసేతుమయ్యా
సం॥ అనవిని యోగ్యుండగుటచేనప్పు । డతడుబలికెనయ్యా
కదనధర్మమిది నీతప్పేమని । కరుణించినడయ్యా
భూ॥ అతడు దుగఁతికి బోవుసద్గతికి । యరిగెదవీవయ్యా
సం॥ అనుచపసవ్యకరంబునశరముల । నమర్చుకొనెనయ్యా
అందుజేరి ప్రాణాయామంబును । యాచరించెనయ్యా
శ్రీకృష్ణుని తనహృదయకమలమున । జేర్చిగొలిచెనయ్యా
కనలుచుసాత్యకి ఖడ్గంబునుగొని । గళముగోసెనయ్యా
భూరిశ్రవుం డత్యుత్తమలోకము । జేరెను వినుమయ్యా

—: ఫలశృతి :—

భారతవీరులచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుదీని । విరచించెనుభక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడుయీసత్కృతిని
సదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని

వై॥ అనెను ధృతరాష్ట్రుడతిశూరుడు సా । త్యకి యెటుబడెనయ్యా
సంజయుండనెను యావృత్తాంతము । చయ్యనవినుమయ్యా
సం॥ మున్నుశూరునకు వసుదేవుండను । పుత్రుడుండెనయ్యా

దేవకునకు దేవకియనుకన్నియ । దేజరిల్లెనయ్యా
తనపుత్రికకుస్వయంవరోత్సవము । త్వరగజేసెనయ్యా
శినియనువాడా కన్నియకొరకై । యనియొనర్చెనయ్యా
సోమదత్తుడని యొనర్చివేగమె । భూమిగూలెనయ్యా
జంపకదయచేవిశచెను శినియా । శ్చర్యమాయెనయ్యా
సోమదత్తుతతి చింతచేయడవి । జొచ్చినిలచెనయ్యా
హరునిగూర్చి తపమొనరింపగ ప్ర । త్యక్షమాయెనయ్యా
శినియుతత్సుతుండానాటికిచ । చ్చినదియెరిగెనయ్యా
శినిమనుమనిగెలిచెడిదనయునియా । చించెనువినుమయ్యా
అటులౌననిహరుడేగెభూరిశ్రవు । డతనితనయుడయ్యా
పరమహిమంబునసాత్యకినాతడు । బడవేసినడయ్యా
అపుడుకర్ణసాత్యకులకుయుద్ధం । బావటిల్లెనయ్యా
హరిశంఖమునొత్తగదారకుడపు । డచటజేరెనయ్యా
అరథంబుసాత్యకికిడికృష్ణుడు । యనికిదోలెనయ్యా
అంతకర్ణసాత్యకులద్భుతముగ । యనినొనర్చిరయ్యా
అనేకబలములుసాత్యకినేయగ । యపుడువచ్చెనయ్యా
కనలుచుసాత్యకియనేకబలముల । ఖండించినడయ్యా
కర్ణునిఛత్రధ్వజరథహయముల । కనలిగూల్చెనయ్యా
కర్ణుడలసినిలువగపార్థుడాడుగని । కడువడియనెనయ్యా
యేమిరాకర్ణభీమునిదిట్టితి । వేటికియనెనయ్యా

అ॥ యెన్నియోసార్లుభీమునకునోడి । యేగియుంటివయ్యా
ఒక్కసారిభీముడుశ్రమనొందిన । యుబ్బిపోతివయ్యా
యిప్పుడుసాత్యకికోడిపోతి । వింకేమిజేతువయ్యా
జయాపజయములురణమునఘనులకు । సహజములగునయ్యా
తులువానీకులమునకుదగినట్లు । బలికితివనెనయ్యా

వై॥ అనుచుపార్థుడతివేగముముందుకు । యరుగుచుండెనయ్యా
కురుపతిభయపడికర్ణునితోతాం । దరగబలికెనయ్యా
అదుగోపార్థుడాసైంధవుడున్నెడ । కరుగుచుండెనయ్యా
అదివినికర్ణుండేగినరుపైన । యమ్ములనిడెనయ్యా

సాత్యకినరభీమసేనులొకనికి । శరములనిడిరయ్యా
అరవదిచొప్పునముప్వురికాతం । డమ్ములనిడెనయ్యా
గాంచినరుడునూరుబాణములనా । కర్ణునేసెనయ్యా
నొచ్చికర్ణుడైదునూర్లశరముల । గ్రుచ్చెనరునకయ్యా
విజయుడుకర్ణునిరక్తాయునిగ । వేగజేసెనయ్యా
అలసెకర్ణుడశ్వత్థామాదులు । యపుడుదాకిరయ్యా
అపుడుయుద్ధమతిఘోరమైరక్త । మంతబారెనయ్యా
హరిమాయాతిమిరంబనుసూర్యున । కంతగప్పెనయ్యా
అంతసైంధవుండరదమెక్కియును । నమ్ములనిడెనయ్యా
గనినరుడాతనికద్భుతబాణము । కనలివేసెనయ్యా
శిరముదెగియాకసముపైకెగరెను । హరియపుడనెనయ్యా
శిరమునేలబడనీకైయుంచుమరి । జెప్పెనువినుమయ్యా
కృ॥ ఇతనితండ్రివృద్ధ క్షత్రుడుమును । సుతునిగోరెనయ్యా
తపోబలంబున యితడుబుట్టె మో । దంబునొందెనయ్యా
ఆకసమిట్లనెవీనిశరంబెవ । డవనిగూల్చునయ్యా
వానిశిరంబొక నూరువ్రక్కలై । వసుధంబడునయ్యా
అన్యశరంబునగాదుపాశుపథ । మంపవలయునయ్యా
శమంతపంచకసమీపమందున । చరించునతడయ్యా
సం॥ అనవినిశివునకు మ్రొక్కినరుండపు । డటులజేసెనయ్యా
పాశుపతము శిరముగొని తండ్రితొడ । పైనవేసెనయ్యా
యెరుగకతడు నేలగూల్చనాతని । శిరముబగిలెనయ్యా
ప్రొద్దుకొంచముగనుండెసైంధవుడు । పుడమిగూలెనయ్యా
అంత నీవారలెల్లరుదుఃఖము । నందుచుండిరయ్యా
హరినరసాత్యకి భీములు హర్షం । బందుచుండిరయ్యా
శంఖనాదములు చేయుధర్మజుడు । సంతసించెనయ్యా
పాండవసేనలభేరీధ్వనులు య । ఖండమాయెనయ్యా
కౌరవనాథాసైంధవుడీగతి । కలనగూలెనయ్యా
అధర్మమెప్పుడు జయముబొందదని । యాత్మనెంచుమయ్యా
వై॥ అవ్వలియుద్ధపువార్తవినుమనుచు । యపుడుబలికెనయ్యా

సంతసమున పాండవబలములు గురు । సంతదాకిరయ్యా
గురుసుత కృపులతికనలినరునిపై । శరముల నిడిరయ్యా
అపుడునరుడు కోపించి శరమిడగ । కృపుడుగూలెనయ్యా
గురుసుతుడంతట నరునిశరములకు । వెరచిపారెనయ్యా
కౌరవబలములు నరునిగనివెరచి । బారజొచ్చెనయ్యా

## నెం. 1

కృష్ణుండతిసంతసపడెను । కిరీటితోనపుడిట్లనెను
కృ॥ సైంధవునిజ జంపితివయ్యా । శపతంబును జేసితివయ్యా
సగము సంతసమునొందితిని । సమరశూరతనుగాంచితిని
కర్ణునింకజంపిననాడు । గలుగుపూర్ణమోదముజూడు
సం॥ అనుచుకౌగలించినడయ్యా । అర్జునుడపుడిట్లనెనయ్యా
అ॥ నన్నేటికి బొగడెదవయ్యా । నాబలమెంతటిదోయయ్యా
నీదయయజమొందితినయ్యా । నీకు సతము(మొక్కెదనయ్యా
సం॥ అని యచ్చటినుండివెడలిరి । అందరువ్యూహంబుదాటిరి
ధర్మజుండువారలగనెను । త్వరగరథముదిగుచువచ్చెను
ఆనందాశ్రువులను విడెను । హరినరాదులను గనుగొనెను
హరినరులాతనికి(మొక్కిరి । ఆనందాశ్రువులవీడిరి
సంతసమునధర్మజుడనెను । జయశీలురు మీరనియనెను
హరినిగాంచి యపుడిట్లనెను । పరమాత్ముడవీవని యనెను
ధ॥ దయాదృష్టిజూచితివయ్యా । త్వరగజయము నిచ్చితివయ్యా
నీభక్తులకే జయమగును । నీదాసుల మెల్లరమనెను
సం॥ విజయునిగని యపుడిట్లనెను । వీరవర్యుడవు నీవనెను
సాత్యకి భీములగనుగొనెను । సమరశూరులేరనియనెను
అనుచువిశ్రమించినరయ్యా । అపుడునీసుతుడు జనెనయ్యా
అతిదుఃఖమునొందినడయ్యా । అపుడుమదినిదలచినడయ్యా
నరునిగెలువసురలకుగాదు । గురుకర్ణాదులననరాదు
అనుచుగురునిచెంతకుజనెను । అతిశోకంబుననిట్లనెను
దు॥ పిడకక్షౌహిణులిలబడెను । నేడుసైంధవుండిలబడెను

అతిశూరులు జచ్చినరయ్యా । అరసి యూరకుండకుమయ్యా
నిన్నునమ్మియున్నానయ్యా । నీవుదయనుజూడగదయ్యా
సం॥ అనవినిగురుడపు డిట్లనెను । ననుదూరుటదగదని యనెను
దో॥ అతివనుసభకీడ్చితిరయ్యా । యవమానముజేసితివయ్యా
అడవికిబంపించితిరయ్యా । అధర్మంబుజేసితిరయ్యా
అట్టిమిమ్ము జేరితినయ్యా । అధముడవిప్రుడగానయ్యా
దివ్యబాణఘాతనుగొంటి । దేహబాధజెందుచునుంటి
మరికటువచనంబులనీవు । మదికిబాధజేసెదవీవు
బనధైర్యముజెడకయ్యా । అలకింపుమిది మాయయ్యా
పాంచాలురనెల్లరనేడు । ధృంచకకవచము విడజూడు
నాచేదెగకుండినవారు । నాసుతుచేజచ్చెడివారు
సం॥ అనుచుబలికి జనుమనియనెను । తనయుడుజనికర్ణునకనెను
దు॥ గురుడువ్యూహమును నిర్మించె । నరునికిమాగణమునుద్యజించె
అతడుమొగ్గరమ్మునుజించె । అఖిలసేనలను ఖండించె
సైంధవుప్రాణమును హరించె । జయమునుగొని హర్షణముగాంచె
గురునినమ్మగావలదయ్యా । దురమువిధము దెల్పగదయ్యా
సం॥ అనగకర్ణుడపుడిట్లనెను । ఆగురునిందింపకుమనెను
కర్ణు॥ నరునిగెలువ సురలకుగాదు । నరులనింకననబనిలేదు
వారికి విషమిచ్చితిమయ్యా । వారియిల్లు గాల్చితిమయ్యా
ధర్మాత్ములు పాండవులయ్యా । ధర్మహీనులము మనమయ్యా
వనమున కంపించితిమయ్యా । పలుబాధలబెట్టితిమయ్యా
దైవమె సైంధవునిజదునిమె । ధర్మమునకు జయమనవినమె
అధైర్యంబునొందకుమయ్యా । అనికినిలచిజేసెదమయ్యా

## నెం. 5

సం॥ అనగసుతుడు ధైర్యమొందిబలముల । నంతబంపెనయ్యా
పాండవసేనలుబోరుచుండెనది । భయంకరంబయ్యా
గురుడాధృష్టద్యుమ్నుని తనయుల । నరికివేసెనయ్యా
శిబియనువాడెదిరించివేగమే । శరముద్ధృంచెనయ్యా
భీముడంతకోపించుచు సేనల । ఖండిజేసెనయ్యా

దుర్మదదుష్కర్ణులును నీసుతులు । దురముజేసిరయ్యా
కాలనొకని కేలనొకనిభీముడు । కనలిజంపెనయ్యా
పాండుసహాయమొనర్పరుద్పుడు । బరగినడనియయ్యా
భీమునపుడుగని రెండుసేనలతి । భీతిజెందిరయ్యా
ఘటోత్కచుని సుతుడంజనపర్వుడు । కనలివచ్చెనయ్యా
వీరులెల్లవానితోడబోరుచు । వెరచిపారిరయ్యా
గురుసుతుడొక్కడు నిలచివాడిగల । శరములనిడెనయ్యా
అసురుని మాయాయుద్ధముచే నా । యాసమొందెనయ్యా
గురుసుతుడొక్కశరంబునయాతని । శిరముద్రుంచెనయ్యా
అంతఘటోత్కచుడసురులసేనతో । యతనిదాకెనయ్యా
పాండవబలములు యతనికి దోడై । బరగనిలచిరయ్యా
అయ్యెడగురుసుతుడనేకసేనల । హతముజేసెనయ్యా
ఘటోత్కచుండతనిఘాతకాగక । కడుపడిజనెనయ్యా
అక్షోహిణినొక్కటి గురుతనయుడు । హతముజేసెనయ్యా
భీముడతికోపమున గురుతనయుని । బిట్టుగొట్టెనయ్యా
అలసినగురుతనయుని గనిబాహ్లికు । డంతవచ్చెనయ్యా
ఉగ్రశక్తిచే భీమునిగొట్టగ । యుర్విగూలెనయ్యా
క్షణమాత్రంబునమూర్ఛదేరిము । ద్గరమును గొనెనయ్యా
అతికోపంబున ముద్గరమును శిర । మందువైచెనయ్యా
కురువృద్ధుండైనట్టి బాహ్లికుని । శిరము బగిలెనయ్యా
నీతనయులు పదిమంది భీముగని । నిలచికొట్టిరయ్యా
పదిశరములచే దనయులశిరములు । బగులగొట్టెనయ్యా
నరభీములు నీబలంబుపైబడి । నరుకుచుండిరయ్యా
ద్రోణాశ్వద్ధామలాసైన్యముల । దునుముచుండిరయ్యా
కటికచీకటులుగ్రమ్మినగాని । కదనమాపరయ్యా
అనేకదీపంబులనుగూర్చిరది । యద్భుతమగునయ్యా
జటాసురునిసుతుడలంబసుండతి । సత్వరజనెనయ్యా
ఘటోత్కచుండెదురేగి యాతనిని । కనలికొట్టెనయ్యా
ఇరువురునిశాచరులు భయదంబుగ । దురముజేసిరయ్యా

అనేకమాయారూపంబులతో । యపుడుబోరిరయ్యా
అంతటభీమాత్మజుండువేగమె । యతని జంపెనయ్యా
కర్ణుడుగని చని శరములేయగా । ఖండించినడయ్యా
గగనమందుదిరుగుచు నీబలముల । కలచివేసెనయ్యా
అతనితోడయనిసేయగనీబల । మందున లేడయ్యా
కరిరథహయకాల్బలములనెన్నో । ఖండించినడయ్యా
కర్ణునకసాధ్యమాయెయోధులి । క్కరణిబల్కిరయ్యా
వీనిబొలియింపకున్నరణమునకు । వెడలజాలమయ్యా
కర్ణుడింద్రదత్తంబగుశక్తిని । కనలివేసెనయ్యా
మహాశక్తియురమును బేధించెను । మహినిగూలెనయ్యా
పాండవబలమాభీముని తనయుడు । బడుటకు దుఃఖించె
జనిధర్మజుడా భీమాత్మజుగని । చాలగదుఃఖించె
హరిసంతసమున నవ్వుచు శంఖము । నప్పుడుపూరించె
అంతటపార్థుడాండాకృష్ణునిగని । యప్పుడు ప్రశ్నించె
అందరుదుఃఖింతురు నవ్వెద వీ । వన హరివిన్పించె
కృ॥ శక్తినికర్ణుడు దాచెనీబ్రతుకు । సంశయమనుపించె
కవచకుండలంబులతోబుట్టిన । ఘనుండు వీడయ్యా
కవచకుండలములతనికున్నచో । గాదపజయమయ్యా
జనకుడెరిగి వాటినిగ్రహియించెను । శక్తినిచ్చెనయ్యా
శక్తిచేత నీయసురుడుజచ్చెను । సంతసపడితయ్యా
ఏకలవ్యశిశుపాల జరాసుతు । లెంతోఘనులయ్యా
వారుండినకురుపతికి సహాయము । వచ్చియుందురయ్యా
అనేకతంత్రంబులచేవారిని । హతముజేసితయ్యా
మనకు సాయమొనరించుననుచు యే । మనకయుంటినయ్యా
రావణునంతటి బలవంతుండీ । రాక్షసుడోయయ్య
ధర్మనాశకుడుజచ్చె ననుచు మో । దంబుజెందితయ్యా
సం॥ అంతటధృతరాష్ట్రుండు చింతిల్లి । యపుడుబలికెనయ్యా
ధృ॥ యాశక్తిని నరుపైనవేయక । యేలదాచెనయ్యా
నరుడొక్కడు గూలినచోవారలు । దురముసేయరయ్యా

కర్ణునితోనియ్యదిసేయింపక । గందురుఫలమయ్యా
నీవైనను కర్ణునితోననవిది । నీకుదగనిదయ్యా
సం॥ అనసంజయుడనెకర్ణునితోనిటు । లంటిమివినుమయ్యా
నరునిజంపుటకుశక్తివేయుమన । యెరుగుదుననునయ్యా
శక్తినిరేపానరునిపైననిడి । జంపుదుననునయ్యా
అందరిటులరాత్రికాలమందున । యందురువినుమయ్యా
త్వరగయుదయమునలేచియీపలుకు । మరతురువినుమయ్యా
హరిమాసంకల్పంబుదెలసియే । మరుపుజేయునయ్యా
జేసితినివ్విధమనుచువిజయునకు । జెప్పెనువినుమయ్యా
హరిధర్మాత్ములకెప్డుసాయమై । యలరుచుండునయ్యా
ఇంతకుమీరలధర్ములుగావున । యిటులేయగునయ్యా
చింతనుబొందకముందరివిధమును । చిత్తగించుమయ్యా
ఉభయసైన్యములురణమొనరించుచు । యుబ్బుచుండెనయ్యా

## నెం. 2

గురుడురణమునకుజొచ్చెను । విరటుడదిగనుచువచ్చెను
త్వరగశరవృష్టిగురిపించె । గురుడువేగముగఖండించె
గురుడుశరమొకటివిడచెను । విరటుడిలబడుచుజచ్చెను
దృపదుడతివేగవచ్చెను । ద్రోణునకుశరముగృచ్చెను
గురుడుకడుబాధజెందెను । శరమునొకదానివిడచెను
దృపదుడిలగూలిచచ్చెను । దృపదబలమతనిదాకెను
అందరినిగురుడుగూల్చెను । అర్జునుడువేగదాకెను
గురుడు యస్త్రములవిడచెను । నరుడుగని వాటిద్రుంచెను
పాండవులబలము నొచ్చెను । పార్థునకు కృష్ణుడిట్లనెను

## నెం. 5

కృ॥ గురునిగెలచుటకు యుపాయమొక్కటి । యెరిగించెదనయ్యా
చచ్చె నీసుతుండనిన చే ధనువు । సరిగవీడునయ్యా
అపుడీతని జంపుటకై సాధ్యం । బగునిదివినుమయ్యా
సం॥ అర్జునుండొప్పకుండె ధర్మజుం । డతిచింతిలెనయ్యా
అశ్వత్థామ గతించెనని భీము । డపుడుబలికెనయ్యా

వినిచింతించుచు గురుడు కోపమున । విడచెశరములయ్యా
పాంచాలుల నిరువదివేలనుయిల । పైనగూల్చెనయ్యా
మత్స్యబలంబులపైకిబోయి యి । మ్మాడిక్క జేసెనయ్యా
హయములు పదివేల్ రథములేనూరు । హతంబాయెనయ్యా
గజములపదివేలతి వేగంబున । కనలిజంపెనయ్యా
భరద్వాజకశ్యపాదిమౌనులు । బరగవచ్చిరయ్యా
అకటబ్రాహ్మణుడవై యిటుసేయుట । యధర్మమనిరయ్యా
భర॥ కశ్య॥ వేదవేదాంగములు జదివితివి । వ్విధముమానుమయ్యా
సం॥ ద్రోణుని యుద్ధము నిలుపుమనుచు । దయబూనిపలికిరయ్యా
అనియదృశులై పోయినద్రోణుం । డవుడుబలికెనయ్యా
ద్రో॥ సత్యవంతుడా ధర్మజుడాడిన । శరము విషుతునయ్యా
కృ॥ హరియనెధర్మజునకు నీవిట్టుల । యనకతప్పదయ్యా
గురుడుబడకున్న యాపదయగునిక । త్వరజనియనుమయ్యా
అశ్వద్ధామమ్మనునొకయేనుగు । హతంబాయెనయ్యా
అనుమశ్వద్ధామ జచ్చెకుంజర । మనుచుబలుకుమయ్యా
దానితో కార్యసాఫల్యంబౌ । గానబలుకుమయ్యా
సం॥ హరివాక్యమువినియసత్యమునకై । యతిచింతిలెనయ్యా
కాగలదెప్పుడు కాకమానదని । కదలిపోయెనయ్యా
ధర్మ॥ స్పష్టాక్షరముల యశ్వద్ధామా । జచ్చెనువినుమయ్యా
సం॥ గజమనుస్పష్టంబుగనాతడు । కనలిబలికెనయ్యా
ద్రోణుడువిని సత్యంబనుకొనుచును । దూలిపోయెనయ్యా
అదివరకాగురు నరదముభూమిని యంటకుండెనయ్యా
యీవాక్యము విన్నంతతోడనే । యిలకుజారెనయ్యా
గురుడుగని నాకు జయమికలేదని । గుందుచుండెనయ్యా
ద్రో॥ గానిధర్మాత్ములగు పాండవులకు । హానిజేసితయ్యా
సం॥ అనుచునిలువగా దృష్టద్యుమ్నుం । డంతవచ్చెనయ్యా
శరములనేకము విడుచుండగనా । గురుడుగాంచెనయ్యా
నిక్కముఠణమికవీడితివీనికి । జిక్కతనియెనయ్యా
మహాస్త్రములవేతుననగనయ్యవి । మాయమాయెనయ్యా
గనియాంగిరసంబనుధనువునుగొని । కనలికొట్టెనయ్యా
దృష్టద్యుమ్నునిరథహయధనువుల । ద్రుంచివేసెనయ్యా

కనలియతడుశతచంద్రంబనియెడి । ఖడ్గముగొనెనయ్యా
మునుహిరణ్యకశిపునకునారసిం । హునివలెనోయయ్యా
గురునకుదృష్టద్యుమ్నుడవ్విధము । గోచరించెనయ్యా
మరణకాలమికప్రాప్తమాయెనని । హరినిదలచెనయ్యా
గురుడిటుగనుగొనిశరములేయుగా । వెరచిపారెనయ్యా
శాంతమొందియపుడెల్లరువినగ । సరగబలికెనయ్యా
ద్రో॥ దుర్యోధనకృపకర్ణులారనే । దొలగుచుంటినయ్యా
సం॥ తెలివితోడమనుడనిశరధనువుల । దిగవిడినడయ్యా
యోగనిష్ఠతోకదలకరథమున । యుండెనువినుమయ్యా
అవనికంపించెకొరువులురాలెను । యత్యద్భుతమయ్యా
వాహనములకంటనీరుగారెను । భయముబుట్టెనయ్యా
గురుడుతనదుహృదయాకాశంబున । హరినినిలపెనయ్యా
అంతగురుడుప్రాణములవీడినొక । వింతబుట్టెనయ్యా
తేజమొకటియతనిమేనునుండియు । దివికిబోయెనయ్యా
హరినరధర్మజకృపులేనయ్యది । అరసియుండిరయ్యా
సురలుగనిసంతసించిరయ్యలిక । జూడకుండిరయ్యా
అతేజముబ్రహ్మలోకమునకపు । డరిగియుండెనయ్యా
గురుశవకంఠముదృష్టద్యుమ్నుడు । గోసివేసెనయ్యా
హాహాకారంబొనర్చియీపని । యధర్మమనిరయ్యా
అతనిజంపుటకుబుట్టెనీతడని । యనిరికొందరయ్యా
అంతపాండవులునీవారలుదుః । ఖాబ్ధిజాబడిరయ్యా
పాండవబలములునీబలములపై । బడగజూచెనయ్యా
దిక్కొకడులేకనీసేనలున । ల్దిక్కులజనెనయ్యా
కర్ణదుర్యోధనాదికూరులది । గనిభీతిలిరయ్యా
మనసేనలకధిపుండులేడనుచు । మరలిపోయిరయ్యా
త్వరగనేగువారల నాయశ్వ । ద్ధామజూచెనయ్యా
యేలమీరు చిన్నబోయిమరలుట । కేమిహేతువయ్యా
అనవినికృపుడతి దుఃఖముతోనపు । డంతజెప్పెనయ్యా
వినిగురుతనయుడులయాంతకునివలె । వేగబలికెనయ్యా
తండ్రినిదలచుచుకనులనీర్గార్చి । త్వరగబలికెనయ్యా
అకటపాండవులుగురుహత్యనుసే । యంగజొచ్చిరయ్యా

నాజనకుండొకదివ్యాస్త్రంబును । నాకిచ్చినదయ్యో
దానివిడతుహరినరాదులెల్లరు । ధ్వంసమగుదురయ్యా
అనుచునకలసేనలమళ్ళింపుచు । యనికినిలచెనయ్యా
అంతధర్మజుడువిజయునిగనుగొని । యపుడుబలికెనయ్యా
మరలిపోయిమరలవచ్చుటేటికి । యెరుగకుంటినయ్యా
అనగనరుడనెనుగురుసుతుడయ్యెది । యంతవిన్నడయ్యా
అ॥ మహాస్త్రవేదుండెల్లరదొడ్డని । మరలవచ్చెనయ్యా
అతిశూరుడుబ్రాహ్మణుడీతనికెదు । రదుగజాలరయ్యా
జననకాలముననితడశ్వముపలె । ధ్వనియొనర్చెనయ్యా
అవనికంపించెసకలజనంబులు । యతిభీతిలిరయ్యా
అంబరమశ్వద్ధామనామమిడె । యతిశూరుండయ్యా
తదుపరి యీశునిగొల్చిమహత్వము । తానుబొందెనయ్యా
సం॥ అనగురుసుతుడునారాయణాస్త్ర । మంతవిడచెనయ్యా
దిరిగె భూచక్రమపుడు భాస్కరుడు । తెలివిబాసెనయ్యా
దిశలువడకెమిన్నదిర్చె సేనలు । దిగులుజెందెనయ్యా
ప్రత్యస్త్రంబేసిశాంతిజేయగ । పార్థుడెరుగడయ్యా
ఆయస్త్రంబాపాండవబలముల । నంతజుట్టెనయ్యా
అనేకమంటలగ్రక్కుచు యస్త్రం । బపుడువచ్చెనయ్యా
సర్వజ్ఞుండా కృష్ణుడెల్లరకు । సరగబలికెనయ్యా
కృ॥ యీయస్త్రమునకు ప్రత్యస్త్రంబీ । యిలలోలేదయ్యా
మహావిష్ణువిచ్చెడివేళల యి । మ్మాడిక్కజెప్పెనయ్యా
సం॥ దీనికి ప్రత్యస్త్రంబులేదనుచు । దేవుండనెనయ్యా
శాంతినొందింపదలచిన నివ్విధి । సలుపుమనియెనయ్యా
కృ॥ వాహనములు దిగి యస్త్రంబులవిడి । వందనమిడుమయ్యా
సం॥ శాంతినొందు యస్త్రము మీరావిధి । సల్పుండనెనయ్యా
అనుటయేతడవు యెల్లరావిధం । బాచరించిరయ్యా
భీముడొక్కడా విధమునుసేయక । విర్రవీగెనయ్యా
అందరినివీడి భీమునిజంపగ । యదివెడలినదయ్యా
హరినరులంతట భీమునిక్రిందికి । యపుడుద్రోచిరయ్యా

హరినరులంతట భీమునిక్రిందికి । యపుడుద్రోచిరయ్యా
శాంతినిజెంది నారాయణాస్త్రమతి । సత్వర జనెనయ్యా
మహాస్త్రమీవిధి బోవుటగురుని కు । మారుడుగనెనయ్యా
హరిదీనికి శాంతియెరిగియివ్విధ । మాచరించెనయ్యా
ఒక్కయక్షౌహిణిని యాయస్త్రం । బుర్విగూల్చెనయ్యా
విజయుడెన్నియో యస్త్రములిడెనది । వెడలకుండెనయ్యా
బ్రహ్మాస్త్రంబును వేయగయగ్నిని । బట్టిమ్రింగెనయ్యా
హరినరులంతట శంఖధ్వనులను । యాచరించిరయ్యా
పాండవసైన్యంబందు వాద్యములు । బరగమ్రోగెనయ్యా
గురుతనయుడు దివ్యాస్త్రము లిట్టుల । గూలుటగనెనయ్యా
ధనువుదాల్చుటేటికనుచురథము ం । త్వరగబెట్టెనయ్యా
అరదంబును దిగిరణజేయనని । యరుగుచుండెనయ్యా
కొంతదూరమిటులేగివ్యాసముని । నంతజూచెనయ్యా
చేతులుమొగిడ్చియతనితోనిట్లు । చెప్పదొడగెనయ్యా
అశ్వ॥ అమరులకసాధ్యమైన యస్త్రములు । వ్యర్థమాయెనయ్యా
మనుజులైనకృష్ణార్జును లెటు లి । మ్మాడ్కిజేసిరయ్యా

## నెం. 1

సం॥ అనగ వ్యాసుడాలోచించె । వినుమనియతనికి విన్పించె
వ్యా॥ ఆదిదేవుడగువిష్ణుండు । అవనిభారముడుపఘనుండు
మైనాకము జేరినడయ్యా । మహాతపము మొదలిడెనయ్యా
సిద్ధిలింగమును గనెనయ్యా । జేసెనిష్ఠనదివినుమయ్యా
వాయుభక్షణం బొనరించె । బాహువులూర్ధ్వంబొనరించె
చాలాకాలం బొనరించె । శర్వునిప్రత్యక్షముగాంచె
అనేకనుతులపుడొనరించె । హరుడాతనికిటువివరించె
శం॥ భూభారంబుడుపగదయ్యా । భూమిలోన బుట్టగదయ్యా
యెంతటితేజోనిధులైన । యెట్టి యస్త్రశస్త్రములైన
నిన్నెదిరింపగలేవయ్యా । నీచేనిలబడునోయయ్యా
నేనెదిరించినచోగాని । నీవుగెల్తువిక ననుబూని

వ్యా॥ అనుచుహరుడువెడలినడయ్యా । ఆవిష్ణువెకృష్ణుండయ్యా
ఆతనియంశమెనరుడయ్యా । అపజయమెటులొందెదరయ్యా
నీసంశయ మెరిగితినయ్యా నీవు శివునిగొలచితివయ్యా
మృత్తికమూర్తిని జేసితివి । యుత్తమపూజలజేసితివి
శివానుగ్రహమునొందితివి । జెట్టివనుచు పేర్పొందితివి
హరిలింగంబునుపూజించె । అధికతపంబుతడొనరించె
మూర్తినిబూజించితివీవు । బొందజాలవంతటిదీవు
హరునిమూర్తి రూపముకన్న । హరునిలింగమే ఘనమన్న
శాంతినొంది మరలగదయ్యా । సలుపుమునీకృత్యంబయ్యా
సం॥ అనివ్యాసుండంతటజనెను । వినిగురుతనయుండు మరలెను
నీతనయుని చెంతకుజనెను । నేటికిరణమాపుదమనెను
వై॥ వినిదుర్యోధనుడు నిలిపెను । జనిరెల్లరుసదనమ్ములను
పాండవబలమంతటజనెను । పశ్చమాద్రికారవిజనెను
సంజయుడాకురుపతికనెను । సమరవార్త యివ్విధమనెను
విధు॥ ద్రోణపర్వమిది జనులార । పూనివినుడిదిచవులూర
శ్రీకృష్ణుండతిదయతోను । శిరులొసంగిగావగబూను

—: ఫలశ్రుతి :—

భారతవీరులచరితమ్ము । పఠియంచినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుదీని । విరచించెను భక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడు యీసత్కృతిని
సదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని

( ద్రోణపర్వము )

సమాప్తము.

ఓం

శ్రీకృష్ణాయనమః

# తందనాన శ్రీమహాభారతము

## కర్ణపర్వము

## నెం. 1

వై॥ శ్రీజనమేజయభూపాలా । చిత్తగించుసద్గుణజాలా
కర్ణపర్వమును వినుమయ్యా । ఘనసుఖంబులందెదవయ్యా
ధృతరాష్ట్రుండపుడిట్లనెను । ద్రోణుండిహమును విడిజనెను
ధృత॥ యెంతపాపకర్ముడనైతి । యెంతఘోరమును విననైతి
సుతులకుశరవిద్యనుజెప్పి । మతిమంతుండనగానొప్పి
విప్రులకులమునజన్మించె । వేదంబులనెల్లపఠించె
సమరంబునవీరులద్రుంచె । శాశ్వతసుఖమునుగడియించె
భీష్మద్రోణులు జనిరయ్యా । విననాప్రాణము జనదయ్యా
నాసుతులకుదిక్కెవరయ్యా । నాకదిజెప్పగదోయయ్యా
వై॥ అనవినిసంజయుడిట్లనెను । అదిదెల్పెదవినుమనియనెను
సం॥ ద్రోణుడు మరణించుటగనెను । ద్రోణసుతుడు రణమునలిపెను
అంతరణము నిల్పినరయ్యా । అందరిండ్లకేగినరయ్యా
నీపుత్రుడుదుఃఖముగొనెను । నీవారలకపుడిట్లనెను
దు॥ ద్రోణభీష్ములతి బలయుతులు । దురమున బడిరిరువురుఘనులు
యెవరినిసేనాపతినిందు । యెరిగింపుడు జేసెదముందు
మనసేనలగాచెడివాని । అనిలోవెనుదీయనివాని
శత్రువులనుగెలిచెడువాని । సరగదెల్పుడతిదయబూని
సం॥ అనవినిగురుసుతుడిటులనెను । అంగరాజు తగువాడనెను

అశ్వ॥ బలముమిగులగల్గినవాడు । ఫల్గుణునెదిరించెడివాడు
కర్ణుడు సేనాపతియైన । గల్గుసుఖము మనకుబిరాన
సం॥ అనకురుపతియానతిజేరి । అపుడుబల్కె మోదముమీరి
దు॥ సేనాపత్యముగొనుమయ్యా । శీఘ్రముజయమును గొనుమయ్యా

## నెం. 5

గురుభీష్ములులేనట్టిలోపమును । మరిపింపగదయ్యా
సం॥ అనగకర్ణుడనెతనుధనమనముల । నర్పించితినయ్యా
కర్ణు॥ అర్జునుజంపుటకమోఘశక్తిని । యార్జించితినయ్యా
తృణసమానుడగు ఘటోత్కచునిపని । దీరిపోయెనయ్యా
ధనంజయుని జంపుటకికమూడ । స్త్రంబులుగలవయ్యా
భయములేదునరునికిపుడుసేనా । పత్యంబిడుమయ్యా
సం॥ అనవినికురుపతి సేనాపతిగా । నతనిజేసెనయ్యా
భేరులుమ్రోగెను వందిమాగదులు । వినుతిజేసిరయ్యా
అందరుసుఖనిద్రజెందిరుదయం । బాయెలేచిరయ్యా
కాలకృత్యములదీర్చి రణమునకు । కదలిపోయిరయ్యా
కర్ణుండభేద్యమకరవ్యూహము । గావించినడయ్యా
తగుస్థానములనెల్ల వీరులకా । త్వరగనిల్పెనయ్యా
వ్యూహముఖంబునదానునిలచెనతి । సాహసపరుడయ్యా
అంతటకురుపతి సంతసించిమది । యందుదలచెనయ్యా
నేడుపాండుతనయులతో కృష్ణుడు । గూడజచ్చునయ్యా
పాండవబలములు రణమునకప్పుడు । బరగవచ్చెనయ్యా
ధర్మజుండు కలయజూచినరునకు । త్వరగబల్కెనయ్యా
ధర్మ॥ కర్ణుడుసేనాపతియైముందర । గానగబడెనయ్యా
కౌరవబలమునవీడొక్కడె మొన । గాడు దెలియుమయ్యా
వివిధశ్రమలను మనకుగూర్పుటకు । వీడెమూలమయ్యా
దుర్యోధనుడనుయంత్రమునడుపగ । దొడ్డవీరుడయ్యా
వీనినొకనిజంపినచో కురుపతి । బీరముడుగునయ్యా
కావునవీనికిదగినవ్యూహమును । గావింపగదయ్యా

సం॥ అనగవినినరుడు చంద్రవ్యూహము । అపుడుజేసెనయ్యా
అన్నిచోట్లందరిని నిలిపిమధ్య । అతడునిలచెనయ్యా
ధర్మజుండుగనుగొని తనమదినిటు । దలచుచుండెనయ్యా
కృష్ణుతోడకౌరవులునేటితో । క్షయింతురనెనయ్యా
రెండుబలంబుల భేరీమ్రోతలు । నిండిపోయెనయ్యా
అంతటసంకులసమరంబాయెను । యద్భుతమాయయ్యా
ఖండితరథహయగజకాల్బలముల । కొండలాయెనయ్యా
అంతభీముడొకగజమునెక్కి రణ । మందుజొచ్చెనయ్యా
గజమునెక్కి క్షేమధూర్తియనుభూ । కాంతుడడ్డెనయ్యా
యిరువురిగజములు కడుకోపంబున । దురముజేసెనయ్యా
కొంతవరకుతోమరములనిరువురు । గొట్టుకున్నరయ్యా
యిరువురితోమరములునేలంబడ । శరముులేసిరయ్యా

# నెం. 2

భీముడవ్వాటిఖండించె । వేగశరములన్నిగుడించె
అతనియేనుగనునొప్పించె । అతడితనికరినినొప్పించె
భీముడతికోపమొందెను । వేగకరినుండిదుమికెను
గదనుగొనికరినిజంపెను । క్షణములోవాని సంపెను
అంతవిందానవిందులు । అపుడుగనివచ్చి రతిబలులు
సాత్యకియువేగదలపడెను । సరగధనువులనుద్రుంచెను
వారువేరుధనువులగొనిరి । ఘోరశరవృష్టిగురిపిరి
అతనిధనువంతదునిమిరి । అద్భుతంబుగాబోరిరి
వేగసాత్యకియుభీష్మించె । వేరుధనువొకటి ధరియించె
కఠినశరమంత సంధించె । క్షణములోవిందు తలద్రుంచె
గనుచు యనువిందుడేధిరిగెను । కఠినశరములనా నాటెను
సాత్యకినిచాలనొప్పించె । సత్వరముసారథినిద్రుంచె
సాత్యకియు యతనినొప్పించె । సరగనతని సూతునిద్రుంచె
అశ్వములనేలపైగూల్చె । అతడితనియశ్వములగూల్చె
విరదులైయసికెనిలచిరి । సరగఖడ్గముల చెగొనిరి

ఖడ్గయుద్ధమును జేసిరి । కదనవీరులని పేర్కొనిరి
సాత్యకియువానిద్రుంచెను । సత్వరరథమునెక్కెను
చిత్రసేనుండువచ్చెను । శీఘ్రముగననికిజొచ్చెను

## నెం. 5

అంతసహదేవునిసుతుండు । అనికినిలచెశ్రుతసేనుండు
చిత్రసేనుడైదుశరములిడగా । శ్రుతసేనుడు ద్రుంచె
చిత్రసేనునింతొమ్మిదిశరముల । శీఘ్రమునొప్పించె
సారథినిదునిమి యతనివక్షమును । శరమునబాధించె
అతడుమూర్ఛగొనిలేచికనలి పె । క్కమ్ములనిగుడించె
అంతశ్రుతసేనుడతనితలద్రుంచి । యతనిసేననొంచె
ధర్మజపుత్రుడు ప్రతివింద్యుండతి । త్వరతోనేతెంచె
చిత్రుడనురాజుతోడబోరికడు । శీఘ్రమునొప్పించె
ఘనశరముల చిత్రుడువిడెనాతడు । ధనువునుఖండించె
మరలనైదుబాణములచేనతని । యురమునుపీడించె
గనిచిత్రుడుశక్తివైవనాలుగు । తునియలుఖండించె
అతడుగదవిసరి ప్రతివింద్యునిసు । తాశ్వంబులద్రుంచె
ప్రతివింద్యుండతనిగదనుచేగొని । వడిగప్రయోగించె
చిత్రునికవచముద్రుంచెనాతడతి । శీఘ్రముకోపించె
చిత్రుడుతోమరమిడప్రతివింద్యుడు । శీఘ్రముగ్రహియించె
అద్దానినెప్రతివింద్యుడేయుగా । యాతడుమరణించె
మనసేనలుప్రతివింద్యునిజుట్టుచు । ఘనశరములనుంచె
వెరువకనాతడు మనసైన్యంబుల । బిట్టుగనొప్పించె
గురుపుత్రునిపై భీముడొక్కడెన । శరములనిగుడించె
అంతగురుసుతుడు నడుమదునిమి । పెక్కమ్ములసంధించె
వారికిరువురకు నతిఘోరంబుగ । పోరుసంభవించె
యిరువురిబాణసమూహంబి । ద్వరనెంతోపీడించె
మూర్ఛగొనిరిరక్తదేహులై యు । బ్బురమదియనిపించె
శల్యునితోనరసుతుడుశ్రుతకీర్తి । సమరముగావించె

పదునొకండు శరములచే శల్యుడు । బాధనుగావించె
కృతక్షత్రియుశల్యునివిలుదునుముచు । శీఘ్రము నొప్పించె
త్వరగనింకొక్క విలుగొని శల్యుడు । ధనువునుఖండించె
నరసుతుడింకొక విలుగొని యరువది । శరములసంధించె
శల్యుడు తొంబది బాణంబులనిడి । చాలగనొప్పించె
సమరమిటుగాగపార్థుకుమారుని । సారథివీక్షించె
బాలుడవీతని నెదురవలదనుచు । ప్రార్థనగావించె
రణశూరుడు శల్యుండనిదెలుపుచు । రథమును దొలగించె
దుశ్శాసనుడా సహదేవునితో । దురంబుగావించె
గనిసహదేవుడు మూడమ్ములచే । కడువడినొప్పించె
డెబ్బదిశరములు దుస్సేనుడపు । డుబ్బుచుసంధించె
త్వరగసహదేవుడొక ఖడ్గంబున । ధనువునుఖండించె
దుశ్శాసనుడింకొకవిలుగొనియొక । తూపునుసంధించె
ఖడ్గముచే సహదేవుడు దానిని । ఖండనగావించె
యిరువురిటుల ఘోరగసహదేవుడు । శరమువిసర్జించె
దుస్సేనుండు మూర్ఛిలెసారథి । దొడ్డనిజనుదెంచె
కర్ణుడుడెబ్బదిమూడు శరమ్ములు । కడువడినిగుడించె
కనలుచునకులుడు శరవర్షంబును । ఘనముగ గురిపించె
గనుగొనికర్ణుండతికోపంబున । ధనువును ఖండించె
అంతటనకులుడు వేరొకవిలుగొని । యమ్ముల నిగుడించె
కర్ణసారథికి బీడజేసిముక్కలుగ । ధనువుద్రుంచె
కర్ణునితనువును రక్తమయంబుగ । క్షణమునగావించె
అంతరక్షాక్షుడైకర్ణుడు పె । క్కమ్ములనిగుడించె
అపుడుమాద్రీకుమారునిగనిర । క్తాంగునిగావించె
నకులుడిడుయస్త్రములకర్ణుడు ఖం । డంబుగనొనరించె
కర్ణుడతనిధనువుద్రుంచెసారథి । కంఠముఖండించె
అశ్వములద్రుంచి చక్రరక్షకుల । అప్పుడు తలద్రుంచె
నవ్వుచుధ్వజమును గూలజేయగా । నకులుడు భీష్మించె
ఖడ్గమువిసరగ కర్ణుడుదానిని । ఖండనగావించె

గదనువేయగా నిముసములోపల । కనలుచుఖండించె
పరిగమువేయగ కర్ణుడువేగమె । భంగము గావించె
అస్త్రహీనుడై విరదుడైనకులు । డరుగగయోచించె
నకులునిమెడ ధనువువేసినిలుపుచు । నవ్వుచువచియించె
చాలునాయింక కావలెనాయని । చయ్యనవిన్పించె
జననిమాటలనుజ్ఞప్తిదెచ్చుకొని । చంపకపంపించె
అవమతితోజనినకులుడు ధర్మజు । నరదమధిష్ఠించె
కర్ణుడంతమార్తాండునివిధమ్ము । కదనమ్మొనరించె
సూతులకేతనములనశ్వమ్ముల । చూర్ణముగావించె
చామరఛత్రభూషణరథముల । చయ్యనఖండించె
శిరముల తుండంబులకుంభంబుల । శీఘ్రంబుగద్రుంచె
అపుడు పాండవులసేనారక్తం బం । తట ప్రవహించె
ఒకచోయులూకుడతికోపంబున । యుయుత్సునెదిరించె
నీతనయుండుయుయుత్సుండాతని । చేతిధనువుద్రుంచె
యులూకుడాతని రథహయసూతుల । నుజ్జుచుఖండించె
యుయుత్సుడంతటనిలువకబారెను । యులూకుడదిగాంచె
శతానీకుడనునకులునితనయుడు । శ్రుతవర్మనినొంచె
అతనిరథంబును యశ్వంబులతో । హతంబుగావించె
గదగొనిశ్రుతవర్ముడురథహయముల । ఖండనగావించె
శ్రుతసోముండా శకునికమ్ములిడి । శీఘ్రముబాధించె
శకునిభీమాత్మజునిరథధనువుల । చయ్యనఖండించె
వెరువకశ్రుతసోముండొకధనువున । శరములసంధించె
శకునిశ్రుతసోముడేసినశరముల । క్షణములోనద్రుంచె
అన్నిటిందునిమి యస్త్రహీనునిగ । యప్పుడుగావించె
అస్త్రహీనడై శ్రుతకీర్తిరథం । బందుననివసించె
దృష్టద్యుమ్నుడుకృపునిపైనకడు । తీవ్రశరంబుంచె
కనలికృపుడతనిమేనునరక్తము । గారగబడించె
అంతటసారథియతనిజాదొడ్కొని । యరదముమరలించె

# నెం. 2

అంతకృతవర్మజనుదెంచె । ఆశిఖండినపుడెదిరించె
అయిదుశరముల శిఖండిడెను । యాదవుడుమండిగఁగొనెను
అరవదిశరములసంధించె । అతనిధనువపుడు ఖండించె
అంతట శిఖండి విలుగొనెను । అపుడుతొంబదిశరములిడెను
యాదవుండన్ని దునిమెను । ఆశిఖండుండుకనలెను
యాదవునిధనువుఖండించె । యాదవునిమూర్ఛనొందించె
అంతపార్థుండువచ్చెను । అపుడునీబలముజూచెను
అతనియరదమునుజుట్టిరి । అస్త్రశస్త్రములగురిపిరి
అందరొకసారిదలపడిరి । అద్భుతంబుగా బోరిరి
సవ్యసాచికడు భీష్మించె । సత్యసేనుశిరమునుద్రుంచె
మిత్రదేవునిఁ దునిమెను । మిగతవారలఁ దునిమెను
అంతసంశప్తకులుజనిరి । అస్త్రశస్త్రములబరపిరి
పార్థుఁడైంద్రాస్త్రమునువిడెను । బాణములువేలుబుట్టెను
అరదములునేలగూలెను । తురగములుతునుకలాయెను
కరులుఖండంబులాయెను । కాల్బలముఁ నేలసోలెను
కొందరిటుభూమిపైబడిరి । కొందరతిభీతిబారిరి
రక్తనదులంతబారెను । రణముకడుభీతిగొల్పెను
అంతదుర్యోధనుడు జనెను । అపుడుధర్మజుండెదిరెను
అపుడునీసుతుడు కనలెను । అమ్ములొకతొమ్మిదేసెను
ధర్మజునిమేనునొప్పించె । ధర్మజునిసూతుబీడించె
అంతధర్మజుడు భీష్మించె । అతనిగుర్రములఖండించె
అతనిధ్వజధనువులఁద్రుంచె । అతనిమేనంతనొప్పించె
అతనిఖడ్గమును ఖండించె । అతడుభయముచే బరతెంచె
కర్ణగురుసుతకృపాదులు । కనలిసాయమైరతిబలులు
ధర్మజునితమ్ములదిగనిరి । త్వరగవచ్చియమ్ములనిడిరి
అంతనపరాహ్ణమాయెను । అపుడుఘోరరణమాయెను
కురువరుడురథమునెక్కెను । పరగధర్మజునిదాకెను

ధర్మజునిధనువుద్రుంచెను । ధర్మజుడువేరువిలుగొనెను
నీసుతునిధనువుఖండించె । నిలువునిలువనుచునొప్పించె
కురువరుడువేరువిలుఁగొనెను । సరగనస్త్రములవిడిచెను
ధర్మజుండెదురుపడచెను । త్వరగయస్త్రములుసమసెను
కురువరుడు శక్తివైచెను । యెరిగిధర్మజుడుద్రుంచెను
మరలనింకొక్క శరమిడెను । యురమునందాకనొచ్చెను
అగ్రహంబంతజెందెను । అపుడుగదబూనివచ్చెను
ధర్మజుడుశక్తివైచెను । దానిగదతోడద్రుంచెను
రక్తనేత్రుడై శరమిడెను । రక్తదేహుడై మూర్ఛిలెనూ
అపుడుకృతవర్మజనుదెంచె । అంతభీముండు యెదురించె
అంతనర్జునుడువచ్చెను । అపుడుకురువరుడులేచెను
నరునిపైయమ్ముతేసెను । నరుడుభీకరుండాయెను
అరదమునువిరుగనేసెను । అతనిసూతునిఁ దునిమెను
ప్రాణములదీయదలచెను । వాడిబాణమును విడచెను
కడువడిగ శరమువచ్చెను । గాంచిగురుసుతుడుద్రుంచెను
నరుడుగనికోపమొందెను । గురుసుతునిధనువుద్రుంచెను

## నెం. 5

అశ్వద్ధామహయంబులఁదునిమి । యంగమునొప్పించె
కృపకృతవర్మల యశ్వధనువులఁ । గినిసివేగద్రుంచె
దుస్ససేనుడెదిరించినధనువును । తునియలుగావించె
అంతనరుడు కనలుచుసైన్యంబుల । హతంబుగావించె
అంతటకర్ణుడు అరువదిశరముల । నచ్యుతునొప్పించె
అనేకశరములు పార్థునిపైదా । నపుడు ప్రయోగించె
కనలుచుసాత్యకి తొంబదిశరముల । కర్ణునినొప్పించె
పాండవవీరులు కర్ణునియరదము । బరగజుట్టిరయ్యా
అందరొకసారి శస్త్రాస్త్రంబుల । నతనిగొట్టిరయ్యా
గాంచుచుకర్ణుడు కోపముతో చీ । కాకుపరచెనయ్యా
అంతయర్జును మహాగ్రహంబున । యతనిదాకెనయ్యా

అతనికూపిరాడకుండశరముల । నంతవిడచెనయ్యా
అంతటసూర్యుం డస్తాచలమున । కపుడుజేరెనయ్యా
కౌరవవీరులు కడుదుఃఖమ్మున । గాంచుచుజనిరయ్యా
అంతటపాండవవీరులు ముదమున । యరిగియుండిరయ్యా
వ॥ మొదటినాటియుద్ధమును సంజయుడు । భూపునకనెనయ్యా
అంతధృతరాష్ట్రుడతిఖేదంబున । యపుడుబలికెనయ్యా

# నెం. 1

౧॥ నరుడుబలముగల్గినవాడు । నారాయణునకు చెలికాడు
యాదవులన్ గెలిచెనునాడు । ఆసుభద్రనుం గొనినాడు
ఆకాండవమును దహియించె । అగ్నికితృప్తినిగావించె
ఎరుకువేసమొందెనుహరుడు । యెరుగకయెదిరించెనునరుడు
గంధర్వులగెలచుచుసుతుని । గాచివిడచెనీదుర్మతిని
కాలకేయులను వధియించె । క్షత్రియులను చాలవధించె
అతనిగెలువయమునకుగాదు । ఆత్మజునకు దుర్మతిబోదు
అంతవానితోమనవారు । అనిసల్పుచునేయున్నారు
ముందరేమిజేసినరయ్యా । విందునింకదెలుపగదయ్యా
వినిసంజయుడపుడిట్లనెను । తనయుడుకడుచింతిలెననెను
వ౦॥ పార్థునిమది దలచుచుండెను । బవరమునకు భీతినొందెను
అంతకర్ణుడాతనికనెను । అర్జునుడతివీరుండనెను
ధనుర్వేదమున పండితుడు । తప్పదుర్గణమందునఘనుడు
యెప్పుడైన దప్పినగాని । యెరిగించును హరిదయబూని
అమరేంద్రుని శక్తినిగొంటి । అర్జునునిన్ జంపగనుంటి
హరిమాయను మరచితిగాదా । అల్పునిపై వేయగలేదా
దైవముప్రతికూలముమనకు । తప్పెజయము మనకీవరకు
దైవసహాయులువారయ్యా । తప్పకజయమును గొనిరయ్యా
ఓపినలతుచింతిలకయ్యా । రేపుసరునిజంపెదనయ్యా
అంతటముదమొందెనురేడు । అప్పుడునిద్రగొనెనావాడు
అప్పుడు దెలవారినవయ్యా । అంపరుమేల్కొనినారయ్యా

ధర్మజుండుబలములతోడ । త్వరగవచ్చె తమ్ములతోడ
వ్యూహమునిర్మించినరయ్యా । సాహసమున నిలచినరయ్యా
వై॥ ధృతరాష్ట్రుడు మరియిట్లనెను । సుతుడెట్టుల రణముకుజనెను
ధృ॥ కర్ణుండెటురణమొనరించె । కదనంబున నరునెటునొంచె
నాతనయుడు దుష్టాత్ముండు । నాపల్కులువినడుఖలుండు
జూదంబునబుట్టినదయ్యా । లేదుజయము మాకికనయ్యా
దీనికిప్రతిజేసెడువాడు । భూనభోంతరంబులొలేడు
అతిదుఃఖముబొందితినయ్యా । అంతవినెదదెల్పగదయ్యా
వై॥ అనగసంజయుండపుడనెను । వినుముదుఃఖమొందకుమనెను
సం॥ యెందరెన్నిజెప్పినవినక । యీపూరకయుంటివిగనుక
నీకోరికజరిగినదయ్యా । నీవారలుక్షయమయిరయ్యా
కర్ణుడు నీతనయునిగనెను । కడుప్రేమతోనిట్లనెను
కర్ణ॥ ఇంద్రశక్తిబోయినదనుచు । ఇంద్రసుతుడుక్రోధముగొనుచు
నామీదికివచ్చునునేడు । నాబలంబునెరుగగలేడు
నాకంటెనుబలహీనుండు । నాకుసమరమందెదురుండు
సారథిఘనుడాతనికుండె । సారథినాకిటలేకుండె
శల్యునివేడగజనుమయ్యా । సారథిగాజేయుగదయ్యా
అపుడునాదుబలమునుగనుము । అధికంబననేమగుఫలము
నరునినేడు జంపెదనయ్యా । నాబలంబు జూపెదనయ్యా
సం॥ అనగనీసుతుడు జనినాడు । జనిశల్యునకపుడన్నాడు
దు॥ నీవతిబలవంతుడవయ్యా । నీవుసత్యవంతుడవయ్యా
భీష్మద్రోణులు జనిరయ్యా । వీరులుభయులేమిరయ్యా
అన్యథాదలంపకుమయ్యా । అకృష్ణసమానుడవయ్యా
నరుడుకృష్ణసారథ్యమున । వెరవకజయమొందుదురమున
కర్ణునిసారథివీవగుచు । కదనంబున కిర్వురుజనుచు
జయముబొందినాకిడుడయ్యా । సామ్రాజ్యంబేలేదయ్యా
సం॥ అనవినిశల్యుడు కోపించె । అవుడివ్విధముగ వివరించె
శల్య॥ వర్ణధర్మమెరుగుదువయ్యా । కర్ణుడు నీచకులుండయ్యా
క్షత్రియకులజుండనునేను । సమరవీరుడనబడినాను

నీచునకెటుసారథినౌదు । నీవునీచమతిగొనరాదు
నాశక్తిని దెలియగలేవు । ననుసారథిగమ్మన్నావు
బలాధిపత్యంబిడుమయ్యా । పాండవులను గెలచెదనయ్యా
కర్ణుడునాతో సరిగాడు । కదకుషోడశాంశమురాడు
నీచపుబనిజెప్పితివయ్యా । నేనుపురముకేగెదనయ్యా
సం॥ అనుచులేవకురుపతిగనెను । అతివినయంబుగ నిట్లనెను
దు॥ నరునికంటెకర్ణుడుఘనుడు । దురమందునయుగుపురహరుడు
గాని కృష్ణసారథ్యమున । కర్ణుడోడుచుండెదురమున
సారథ్యంబునహరికంటె । సమర్థుండవగుదువువింటె
కర్ణునిసారథివీవయినా । కలననరుడు జచ్చునుగానా
నీవీకార్యము కరుణించి । నెరవేర్పుము మదియాచించి
సం॥ శల్యుడువిని సంతసపడెను । సారథినికనయ్యెదననెను
శల్యు॥ ఎన్నినేను దిట్టినగాని । యాతడూరకుండిననేని
సారథ్యముజేసెదనయ్యా । జయమునుయార్జించెదనయ్యా
సం॥ వినిదుర్యోధనుడిట్లనెను । వివేకవంతుడవీవనెను
దు॥ దీనికొక్కకథ దెలిపెదను । తిన్నగనదివినుమనియనెను

## నెం. 5

తొల్లికమలాక్ష తారకాక్షులతి । దొడ్డవీరులయ్యా
విద్యున్మాలియు యీముగురెప్పుడు । విబుధశత్రువయ్యా
సురలకోడి కడుఘోరతపంబును । నెరపుచుండిరయ్యా
అంతకమలాసనుండువచ్చి వర । మడుగుండనెనయ్యా
వారుమరణంబులేనివరంబును । గోరుకొన్నరయ్యా
విరించియటుతగదనగవారలతి । వేగగోరిరయ్యా
నీవు సృజించినవారిచేతమర । ణింపకుందుమయ్యా
అన్యులకగోచరంబగు పురముల । నపుడు గోరిరయ్యా
అంతకమలాసనుండావరమిడి । యపుడుబలికెనయ్యా
ఋ॥ మూడుపురములొక్కచోటగూడిన । నాడుజత్తురయ్యా
దు॥ వారుగోరినటుమాయాపురములు । బరగనిచ్చెనయ్యా

విరించివెడలెను మయునకావార్త । వినిపించినడయ్యా
మయుడు మూడుపురములనిర్మించెను । మహాద్భుతములయ్యా
ఒక్కటొకటి శతయోజనదీర్ఘము । యిచ్చివేసెనయ్యా
తారకాక్షునకు స్వర్ణపురంబును । త్వరగనిచ్చెనయ్యా
స్వర్గసమీపంబందునదానిని । సరగనిల్పెనయ్యా
అపుడురజితపురమును కమలాక్షున । కాతడిచ్చెనయ్యా
ఆకసంబందు నుండుమనుచుదా । నపుడునిలిపెనయ్యా
విద్యున్మాలికిలోహపురంబును । వేగనిచ్చెనయ్యా
భూమిపైననుండుమనుచు మోదము । బొందియుండెనయ్యా
త్రిపురంబులలో త్రిపురాసురులతి । తేజమొందిరయ్యా
త్రిలోకంబులను వశముగగైకొని । తృప్తివీడిరయ్యా
అఖిలరాక్షసులకోట్లకువారే । యధిపతులయిరయ్యా
యిష్టమున్నచోట్లకుపురములగొని । యేగుచుండిరయ్యా
దేవబ్రాహ్మణులకు కడుబాధలు । గావించినరయ్యా
ఇటులబహుకోటివత్సరకాలం । బేగుచుండెనయ్యా
తారకాక్షునకు హరియనుతనయుడు । తపముజేసెనయ్యా
అంతబ్రహ్మజనుదెంచియొకవరము । నడుగుమనియెనయ్యా
అంతవాడడిగెయమృతజలకూపము । మర్తునవెనయ్యా
రక్కసుండొకడు జచ్చినజలమును । గ్రుక్కననిడుమయ్యా
ఒకనికిపదిమందిబుట్టినట్లుగ । యుబ్బికోరెనయ్యా
తథాస్తనుచు బ్రహ్మ వెడలెయాతడు । త్వరగవెడలెనయ్యా
సరగ నొకభావిద్రవ్విరక్షణము । సల్పుచుండెనయ్యా
సురలతోడ రణముజేసిగెలచిరి । వెరవకుండిరయ్యా
సమరమునబడినవానిపైనీరు । జల్లుచుండిరయ్యా
ఒకడుమరణింపత్వరగపదిమంది । యుద్భవించిరయ్యా
అంతటముప్పదిమూడుకోట్లసుర । లార్తిజెందిరయ్యా
బ్రహ్మదేవునకుమ్రొక్కిచింతిలుచు । బాధజెప్పిరయ్యా
విశ్వేశునిచే యీపనియగునన । వెడలిపోయిరయ్యా
అనేకవిధముగనుతులుజేసితమ । యార్తిజెప్పిరయ్యా

అంతశివుండనెయీపనిజేయుట । కసాధ్యమగునయ్యా
శం॥ సకలరాక్షసులు నాకుభక్తులెటు । జంపబోదునయ్యా
మీరునాకు భక్తులు గావుననెటు । మేలుజేతునయ్యా
అయినగాని ధర్మనాశకులనిక । హతముజేతునయ్యా
అఖిలసురల తేజంబుసగమిడిన । యాపనియగునయ్యా
అంతసురలుసంతసించితేజం । బర్ధంబడిరయ్యా
అంతలోత్వష్టతపోమహిమనిటు । లాచరించెనయ్యా
భూదేవినియరదంబుగాచేసి । ముందునిలిపెనయ్యా
చంద్రసూర్యులను రథచక్రములుగ । నలిపియుంచెనయ్యా
సముద్రంబులొక తూణీరంబుగ । సరగజేసెనయ్యా
సప్తగిరులనందవయువమ్ములుగ । సరగజేసెనయ్యా
మేరునగమునొక ఛత్రమువిధమున । గోరిజేసెనయ్యా
వేదచతుష్టయమశ్వంబులుగా । వేడ్కజేసెనయ్యా
త్వరగసంవత్సరాత్మకమగునొక । ధనువుజేసెనయ్యా
అఖిలరక్షకుండగుహరినప్పుడు । యమ్ముజేసెనయ్యా
త్వష్టతనతపోమహిమ నీరథము । త్వరగనిచ్చెనయ్యా
సురలారథమిడి సారథియెటులన । హరుడుబలికెనయ్యా
నాకంటెను బలవంతుండరదము । నడుపవలయునయ్యా
అంతవారు చింతనొంది బ్రహ్మకు । యపుడుబలికిరయ్యా
యితనికంటెబలవంతుండెవ్వడొ । యీవుదెలుపుమయ్యా
నీవుదప్ప నింకెవడులేడనగ । యీవిధియనెనయ్యా
సకలబలాఢ్యుండు సారథియగుచో । జయముగలుగునయ్యా
యింకొకడీయరదంబునుడుపడు । యేనువత్తునయ్యా
సారథినై చతురాననుండు కడు । సంతసపడెనయ్యా
మహేశ్వరసృష్టికర్తయీపని । మానకగొనెనయ్యా
నీచకార్యమనిమదిలోదలపక । నీవుబూనుమయ్యా
సం॥ అవలికథదెల్పుమనగకురుపతి । యప్పుడుబలికెనయ్యా
దు॥ హరబ్రహ్మలాయరదమునందున । యపుడెక్కినరయ్యా
ఇరువురిభరమును మోయకగుర్రము । లిలనుగూలెనయ్యా

అంతలో బ్రహ్మతనశక్తినియది । యపుడులేపెనయ్యా
అతివేగంబున త్రిపురంబులకై । యపుడువెడలిరయ్యా
పాశుపతాస్త్రము నా శ్రీహరిపై । బరగనిలిపెనయ్యా
మూడుపురములొకచోటజేరుటకు । వొనరదలచెనయ్యా
హరుడుమూడుపురములపైకస్త్రము । నంతవేసెనయ్యా
పాశుపతసాయమున శ్రీనాథుడు । వాటిగాల్చెనయ్యా
క్షణములోన భస్మమాయసురలతి । సంతసపడిరయ్యా
త్రిమూర్తులనువినుతిజేసిమ్రొక్కుచు । దివిజులు జనిరయ్యా
అంతటలోకంబులుసౌఖ్యంబుల । నపుడుబొందెనయ్యా
తమతమస్థానములకు త్రిమూర్తులు । త్వరగవెడలిరయ్యా
బ్రహ్మవలె నీవు తగుసారథ్యము । బరగజేయుమయ్యా
శంభునివలెయేకర్ణుండనిలో । జయముబొందునయ్యా
యీకథనాజనకుండుజెప్పెనది । యెరిగించితినయ్యా
ఇంకొకఇతిహాసంబుజెప్పెదను । యీవదివినుమయ్యా
భార్గవవంశంబందుజమదగ్ని । పరమయోగ్యుడయ్యా
హరియంశంబున యతనికి సుతుడై । యవతరించెనయ్యా
పరశురాముడను పేరిడెనతడు త । పంబుజేసెనయ్యా
హరుడు ప్రత్యక్షమై యభీష్టమును । యడుగుమనియెనయ్యా
పరమాస్త్రంబులనిడుమని యనగా । హరుడుబలికెనయ్యా
అశుచులస్త్రములగొనినయంతనే । హతంబగుదురయ్యా
పవిత్రుండవైగొనుమనియనగా । నివసించినడయ్యా
పరమభక్తితోహరునిసేవలో । బరగుచుండెనయ్యా
అనేకసంవత్సరములు గడచెను । హరుడుబలికెనయ్యా
అతిపవిత్రుండవైతివనియతని । కస్త్రములిడెనయ్యా
అతడా యస్త్రమ్ములచే భూభర । మంతబాపెనయ్యా
అతడతిప్రీతిచేతకర్ణునకు । యస్త్రములిడెనయ్యా
ఆకర్ణుడు నీచకులుండనుటకు । యర్హతలేదయ్యా
సహజకవచకుండలములచేతనె । జన్మమాయెనయ్యా
దేవతాంశసంభవుడు కర్ణుడని । దెలియగదగునయ్యా

సూతుడు టెంచినయంతలోనీచ । జాతియనకుమయ్యా
సింహముకడుపునలేడియెటుబుట్టు । శీఘ్రమెదుగుమయ్యా
సారధివగుమిక యనుమానమువిడి । జయముబొందుమయ్యా
అంతటశల్యుడు యతిసంతసమున । యపుడుశాల్కెనయ్యా
కర్ణునిగనియనె హితవచనములకు । కనలకుమనెనయ్యా
శల్యు॥ శ్రీకృష్ణుని మించెడిసారథ్యము । జేసిచూపుదయ్యా
నావచనంబులువినకజెడునటుల । గావింపకుమయ్యా
సం॥ అనుచునొకదివ్యరథమును శల్యుం । డపుడుదెచ్చెనయ్యా

## —: ఫ ల శ్రు తి :—

భారతవీరులచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుదీని । విరచించెను భక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడు యీసత్కృతిని
సదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని

## నెం. 1

కర్ణుండారథమునుగనెను । కడుభక్తిగమ్రొక్కియెక్కెను
అంతటకురునాథుడుజనెను । ఆకర్ణునకపుడిట్లనెను
దు॥ భీష్మద్రోణులు ఘనులయ్యా । విజయునిపైవయగొనిరయ్యా
నీవాపనిసేయకుమయ్యా । నీవునరుని జంపగదయ్యా
కొండంతటియాశనుగొంటి । పాండుసుతులవీడకుమంటి
సం॥ అనగకర్ణుడటులౌననెను । వినిశల్యుడు రథమునడపెను
కదలిరథంబేగినదయ్యా । కర్ణుడు శల్యునకనెనయ్యా
కర్ణు॥ మద్రరాజవినగదవయ్యా । మహాస్త్రములు దెచ్చితినయ్యా
సురలకద్భుతముగల్పింతు । సరగపాండవులనిజింతు
నీమదినంతసమొనరింతు । నిఖిలబలంబులహింసింతు
సం॥ శల్యుడు మదినిట్లనుకొనెను । సత్యముదప్పుటదగదనెను
నాడుధర్మజుడుననుజేరె । నరునిగావుమనుచునుగోరె
ఆసమయంబిపుడేతెంచె । అటులసేయుటకు యోచించె

ధర్మతత్పరులు పాండవులు । దామోదరునకు నతిప్రియులు
అధర్మపరులీకౌరవులు । ఆశ్రయించితిని దుర్మతులు
తనువువీరలకు నిచ్చితిని । మనమువారలకు నిచ్చితిని
వీరికిసాయముసల్పితిని । వారికిజేయగదలచితిని
కర్ణునిమదిద్విప్పగవలయు । కలననరునిగావగవలయు
అనియావిధిదలచినదయ్యా । అపుడుపైకి బలికినదయ్యా
శల్యు॥ రాధేయా యిటువినుమయ్యా । రణశూరులుపాండవులయ్యా
సత్యవంతులతిఘనులయ్యా । శౌర్యధైర్మవిధులోయయ్యా
వారలనిందింపకుమయ్యా । దూరినఫలమేమగునయ్యా

# నెం. 5

నరునిగాండీవనాదంబులుక । ర్ణములసోకునయ్యా
భీమునిగదమెరుగులునీకనులకు । భీతిగొల్పునయ్యా
నరునిచేబడెడురథశతములు నీ । వరయుచుందువయ్యా
భీముడీకౌరవులను ద్రుంపగా । వెల్లబోదువయ్యా
ఆసమయంబుననకులసహదేవు । లనికినిల్తురయ్యా
ధర్మజుండు క్రోధోగ్రమూర్తియై । త్వరగవచ్చునయ్యా
అప్పుడీపలుకులాడుదువేమో । యాలకింతునయ్యా
సం॥ అనుచుణనుచుండ దుశ్శకునంబులు । యుగపడెవినుమయ్యా
నెత్తురుగురిసెను యాకసముమ్రోగె । నేలకదలెనయ్యా
పిడుగులుబడెనక్కలంచెకౌరవులు । వేగగూలెనయ్యా
కౌరవనాశము సూచించుటకిది । గానంబడెనయ్యా
సరకుగొనక గర్వంబునకర్ణుడు । శల్యునకనెనయ్యా
కర్ణు॥ వినుమోమద్రేశ్వరయుద్ధంబున । గనునాబలమయ్యా
సురపతినైనను గెల్చెదపార్థుణాని । సరకుసేయనయ్యా
పాండుకుమారుల తలలీనాడే । బడవేసెదనయ్యా
భీష్మద్రోణులగెలిచెనరుడనుచు । వెరపుజెందకయ్యా
అతనినిగొట్టక భీష్మద్రోణులు । యంతమొందిరయ్యా
భార్గవరాముని దయనీయరదము । బడసియుంటినయ్యా

అన్యులెరుంగని యస్త్రరాజములు । నందియుంటివయ్యా
అందుచేత పాండవులను గెలుచుట । యనాయాసమయ్యా
సం॥ అనుచుగర్వోక్తులాడినశల్యుం । డపుడుబలికెనయ్యా
శల్యు॥ కర్ణానీపలుకులువిని జనములు । కడునవ్వెదరయ్యా
అర్జునుబలశౌర్యసంపదలుజన । మంతదెలియునయ్యా
అతడు బలశాలి పౌరుషహీనుడు । వందురునిన్నయ్యా
ఘోరయాత్రలోచిత్రసేనుడీ । కురుపతిగొనెనయ్యా
చిత్రసేనునకు నోడిపాఱునకు । జెందోతివయ్యా
నరుడాగంధర్వునిగొలచుచుకురు । వరునివిడచెనయ్యా
ఖాండవవనదహనంబునయిందున్ని । గలచివేసెనయ్యా
యెరుకువేసమున వచ్చినరుద్రుని । తన్తికొట్టెనయ్యా
నీవాభీష్మద్రోణులేగితిరి । గోవులకొరకయ్యా
గురుసుతకృపగురునాథులుసేన । గూడివచ్చిరయ్యా
అపుడొకనరుడేమిమ్ములఁగెలచి । యావులగొనెనయ్యా
యిపుడాపార్థుఁడు బలహీనుండని । యెంచెదవేమయ్యా
అతనిబాణములు తృప్తుబట్టెనని । యనుకొనదగదయ్యా
అపుడొక్కఁడె యంచరమిముగెల్చెను । యతనికిప్పుడయ్యా
భీమకృష్ణులు సహాయులగుదురు । విజయమందునయ్యా
తొలగకపార్థుడు నిన్నేరణమున । గెలుచును వినుమయ్యా
సం॥ లోనకసలిపైకికర్ణుడోపిక । నూనిబలికెనయ్యా
కర్ణు॥ యేలనన్నిటుల దూలనాడెదవు । యాలముగనుమయ్యా
నాబలమావిజయుని బలములుయీ । నాడుదెల్యుమయ్యా
అంతవరకేమి బలుకకయరదము । నడుగనీయుమయ్యా
సం॥ అంతశల్యుడూరకుండియరదము । నడుపుదోలెనయ్యా
పాండవులసేనగనికర్ణుండి । ప్పగిదిబలికెనయ్యా
ధనంజయునిజూపించినవారికి । ధనమునిత్తునయ్యా
అనుచుబలికిశంఖమొత్తకురుపతి । వినియుబ్బినదయ్యా
అపుడు మనసేనలన్ని సంతసము । నందుచుండెనయ్యా
అంతటశల్యుడు కర్ణునిగనుగొని । యపుడుబలికెనయ్యా

శల్యు॥ గర్వమొందనేల పార్థుఁడిపుడె । గానంబడునయ్యా
నీపలుకులు విని జనులునవ్వేదరు । నీవుదెలియవయ్యా
అధికధనమున్న సత్పాత్రంబుల । నరసియొసగుమయ్యా
ఈయపాత్రదానంబిడనామది । నేవగించునయ్యా
కృష్ణార్జునులను గెల్తునంటివది । కీర్తికిలోటయ్యా
నక్కసింగమును గెల్తునన్నటుల । నిక్కబోకుమయ్యా
యిటులబల్కఁగాఁ పదవాటిల్లును । యిటులయనకుమయ్యా
నీకుకాలమాసన్నమైనటుల । నేడుదోచెనయ్యా
అసహాయుడవైయనికివెడలకుము । యపజయమగునయ్యా
హితముజెప్పితిని కోపపడకుమా । మతిమంతుడవయ్యా
సం॥ అనగకర్ణుడనెవెరపుమాటలను । వినుపింపకుమయ్యా
కర్ణు॥ సురలునన్నెదురలేరనకృష్ణా । జనులదెంతనయ్యా

## నెం. 1

సం॥ అనగశల్యుడపుడిట్లనెను । అతిగర్వము నొందితివలెను
శల్యు॥ హరిణముతోసింగముబడున । అర్జునుండు నీతోబడునా
శార్దూలమునక్కకోడునా । సవ్యసాచినీతోబడునా
చెవులపిల్లికరినిగూల్చున । చెనటివతడు నీతోబడున
క్రిందుమీదు తెరుగవునీవు । కిరీటిపైకేగెదవీవు
సం॥ వినికర్ణుండపుడిట్లనెను । వివేకహీనుడవీవనెను
కర్ణు॥ నరునిగొప్పజేసెదవీవు । నాబలమెరుగకయున్నావు
నాగాస్త్రంబిదిగనుమయ్యా । నరునితలను దునిమెదనయ్యా
భార్గవాస్త్రమిది గనుమయ్యా । వాసుదేవుదునిమెదనయ్యా
యిరువురినిటుగూల్చితినేని । వెరతురెల్లరతిభయమూని
నరులోకవదివేలిటురాని । సరకుసేయధైర్యముబూని
కృష్ణులెదుగురు దలపడిన । గెలతుభీతిమానిదురమున
పిరికివాడవగుదువుగాన । భీతిజెందుదువుమదిలోన
అధికంబులు బలికితివేని । హతమొనరించెదనినుబూని
పాపదేశమున బుట్టితివి । వావివరుసలనువీడితివి

అనవరతముకలుద్రావెదవు । అందుచేత నిటుబలికెదవు
చాలురథంబికబోనిమ్ము । శక్తినిగనబరచెదసుమ్ము
సం॥ అనవినిశల్యుం డిట్లనెను । అరయుమొక్కవిషయంబనెను
శల్యు॥ నీబలంబునెరుగుదునయ్యా । నీకుహితముజెప్పితినయ్యా
సారధిరధికుని మానంబు । సాకుగానవినుము నిజంబు
దీనికొక్కదృష్టాంతంబు । దెలిపెదవినుమగునుముదంబు

## నెం. ౫

తొల్లిసముద్రంబుననొకద్వీపము । దొడ్డదగుచుమించె
ఆద్వీపంబునధర్మవర్తియను । యధిపతినివసించె
అతనిపురినొక్కవైశ్యవరుడుండి । యతికీర్తినిగాంచె
ధనపుత్రాన్వితుడై ద్విజులకు । దానముగావించె
అతడిటులుండగ కాకంబొక్కటి । యచ్చటికపుదెంచె
అతనిపుత్రులెంగిళులిడ ప్రతిదిన । మదిజనిభుజియించె
బలసిక్రొవ్వినాసరితేరంచును । పక్షులనిందించె
గరుడినితోసమమేగెడుహంసల । కాకియపుడుగాంచె
వైశ్యునిపుత్రుడు కాకినిగని యి । ప్పగిదినివచియించె
పక్షులలోపల మహాబలుడవని । పలుతీర్లనుతించె
హంసలకంటెను ముందుజనుమనగ । యాకారముగాంచె
తారతమ్యమెరుగనిబాలునిపలు । కారసిదర్పించె
యెంగిళులుదిన్న బలమునకాకము । యెగిరియరుగుదెంచె
జనియొకతావున నిలచిహంసలను । గనియిటువచియించె
కాకి॥ హంసలారమీలోనతిశీఘ్రుం । బరిగెదరెవరయ్యా
నాతోసమానమేగుదానీనీ । నాడుబంపుడయ్యా
శల్యు॥ అనవినిహంసలు పకపకనవ్వుచు । యపుడుబల్కిరయ్యా
హంస॥ మానససరముననుందుము నడకకు । మాసరిరారయ్యా
పక్షిజాతులెల్లను మముగనుగొని । ప్రస్తుతింతురయ్యా
ఒకదానినిరమ్మంటివిమాతో । యోపజాలవయ్యా
యెంతదూరమేగిననాయాసము । నంతబొందమయ్యా
కావునమాతోరాజాలవు । నిక్కంబదివినుమయ్యా
శల్యు॥ అనగకనలికాకంబాహంసల । కపుడుబలికెనయ్యా

కాకి॥ గమనంబులు నూటొక్కటిగలవా । గతులు జూపుదయ్యా
శల్యు॥ అనగనొకహంసవినియిట్లనె । నటులైనబోదమయ్యా
అంతకొన్నికాకంబులునవ్వుచు । నపుడుబల్కెవయ్యా
కాకులు॥ హంసరాజ మాదీనితోడ నీ । వరుగజాలవయ్యా
అనేకగతులెరిగినకాకంబిది । యపజయమగునయ్యా
శల్యు॥ అయినమంచిదని హంసకాకములు । యరుగుచుండెనయ్యా
అంతటమిగిలినహంసకాకములు । యచటనుండెనయ్యా
అకసంబందుకాకివేగమున । యరుగుచుండెనయ్యా
హంసరాజు తనపూర్వపువిధమున । యరుగుచుండెనయ్యా
వెనుకబడితివా రమ్మనికాకము । వెడలుచుండెనయ్యా
అంతటకాకము హంసనుగని పరి । హసించిజనెనయ్యా
అపుడుతీరమునసున్న కాకము । హంసలకనెనయ్యా
కాకులు॥ అదుగోచూడుము మావాడేముం । దరుగుచుండెనయ్యా
శల్యు॥ అపజయమాయెను హంసకనుచు । ముదమందుచుండెనయ్యా
పకపకనవ్వుచు దిరుగుచువదరుచు । బలుకరించునయ్యా
వానిగనుగొనుచు హంసరాజము । మౌనమూనెనయ్యా
కాకమంతయతివేగంబురుకుచు । కడుడస్సినదయ్యా
అపుడుదుఃఖించి తనమదిలోని । ట్లనుకొనెవినుమయ్యా
అంతటనీరేగన్పడుచెట్టొక । టైనలేకయుండె
హంసతోడ పంతగించిప్రాణం । బకటబోవనుండె
నీటబడినజలచరముల్ననుగని । నోటబట్టనుండె
వెనుకకైనమరలెదమనుకొన్నను । ఘనదూరంబుండె
అతిబాధనుగొనుకాకినిగనుగొని । హంసబలుకుచుండె
గతులునూటొక్కటెరిగితివివి । గతియేమనుచుండె
రెక్కలాడింపజాలకుంటివిక । దిక్కెవరనుచుండె
అంతకంతకాకము క్రిందికిజని । సుంతయెగురకుండె
నీరులోనున్నచేపలుమ్రింగగ । నోరుదెరచుచుండె
ఇటులకాకిశ్రమనొందుచుహంసకు । యీవిధియనుచుండె
ఎంగిళుళ్ గుడిచి క్రొవ్విపదానికి । యిదిఫలమనుచుండె

యెల్లపక్షులను జయింతుననుటకు । యిడిఫలమనుచుండె
సత్వరంబుననుగావకున్నచో । చచ్చెదననుచుండె
నాబంధువులలో నన్నుగలుపుమా । నశింతుననుచుండె
అనగవినిహంసదయచేపిప్పున । యాశ్రయమిడియుండె
దానినిమోయుచు మరలహంసతొలి । తావుజేరియుండె
తీరమునకుజని కాకమొకంతకు । తెలివిబొందియుండె
కాకులువినగా హంసకాకికి । కృతజ్ఞతబల్కుచుండె
వాయసాధమాయెప్పుడిటుసేయుట । వలదనిజనియుండె
వైశ్యులయెంగిలిదినినకాకివలె । వదరుచుంటివయ్యా
కౌరవులయెంగిళులఁదినిక్రొవ్వుచు । కారులందువయ్యా
నీతమ్మునినరుడు జంపినప్పుడు । నీవుగంటివయ్యా
నరునిగెలువ నీతరముగాదురక । మరలిపోదమయ్యా
అటుగాకుండిన తగుసాయముగొని । యరుగగదగునయ్యా
నీమేలుకు జెప్పితినిగాని । నిన్దించుటగాదయ్యా
అనగవినికర్ణు డతికోపంబున । యపుడుబలికెనయ్యా
కర్ణు॥ నీవచనములకు పరితాపంబును । నేనుబొందనయ్యా
అనిలోకృష్ణార్జునులనుగనిభయ । మందజాలనయ్యా
బ్రాహ్మణ శాపంబునకు వెరతునది । వచింతువినుమయ్యా

## నెం. 1

అస్త్రంబులుబొందదలచితి । అమహేంద్రనగరముజేరితి
భార్గవరామునిగాంచితిని । బహుభక్తిగ మ్రొక్కులిడితిని
నంతసించియతడిట్లనెను । జన్మించినకులమేమనెను
పల్కులువినిమది యోచించి । బ్రహ్మాస్త్రము గైకొననెంచి
బ్రాహ్మణుండననిదెల్పితిని । బహుమోసంబునుసల్పితిని
ననుశిష్యునిగా గైకొనెను । నాపైకడుప్రేమజూపెను
బ్రహ్మాస్త్రంబును నిడెనయ్యా । భార్గవాస్త్రమును నిడెనయ్యా
అనేకాస్త్రములనిడెనయ్యా । అన్నిటిగతి దెలిపినదయ్యా
ఇటులకొంతకాలముగడచె । యెంతోమదిధైర్యమునిలచె

నచుగొనియడవికిజనుదెంచె । వనమునకడుశ్రమలనుగాంచె
తొడపైశిరముంచినడయ్యా । దొడ్డనిద్రజెందినడయ్యా
అమరేంద్రుండదిగుర్తించె । అర్జుననింగావదలంచె
పురువురూపమునుధరియించె । భూమినుండితాజనుదెంచె
తొడకొకరంధ్రముగావించె । తొడనెరక్తముప్రవహించె
నిద్రాభంగముగనకువెరచి । నేనుంటిని తనువునుమరచి
అధికబాధజెందితినయ్యా । అంతగురుడుమేల్కొనెనయ్యా
పారెడురక్తంబునుగనెను । బలుకుము నీవెవ్వడవనెను
ఇంతయోర్పుద్విజునకుగాదు । ఈవుద్విజుడవనసరిగాదు
అసత్యంబుజెప్పెదవేని । హతముజేతుశాపముతోని
అనగనేనుభీతినిగొంటి । అపుడుసూతుడనునేనంటి
అద్భుతమగు పురుగునుగంటి । అమరేంద్రుండేయనుకొంటి
క్షణమున పురుగెటకోజనెను । ఘనుడుదివ్యదృష్టినిగనెను
కనికనలుచునాకిట్లనెను । కర్ణాయెటుజేసితివనెను
మోసగించి బ్రహ్మాస్త్రమును । ముదముతోడ బొందితివనెను
అక్కరపై బ్రహ్మాస్త్రంబు । నిక్కము స్మృతిరాదునిజంబు
నీకుమరణసమయమునందు । నీకదిస్మృతియగుమున్ముందు
భార్గవాస్త్రమిటులేయగను । వచ్చునప్పుడప్పుడు జనును
స్మృతినిబొందవిడచితివేని । మృతులసల్పువైరులబూని
అనుచుశాపమిడి జనెనయ్యు । వినుమింకొక్కటిగలదయ్యా
బాల్యంబందున నొకనాడు । వనమునందు జేరితిచూడు
శరవిద్యనునేర్చుచునుంటి । చయ్యనగుర్తునుగనుచుంటి
అనేకశరములనిడుచుంటి । అవువచ్చుటనుగనకుంటి
గానకశరమేసితినయ్యా । క్షణముననది జచ్చినదయ్యా
అంతదానియజమానుండు । ఆగ్రహమునబల్కెద్విజుండు

బ్రా॥ హోమధేనువును జంపితివి । ఉగ్రకార్యమును సల్పితివి
గావుననీరథచక్రంబు । కదనంబునగృంకునిజంబు
ఇదినీమృత్యువుకాలమున । యేర్పడు బహుఘోరరణమున

కర్ణు॥ ఇటులశాపమిచ్చినడయ్యా । యెంతోకోపముగొనెనయ్యా

అంతనేనుభయమునుగొంటి । అవిప్రునకపుడిటులంటి
అనూర్ణవృషభములిడెద । అరువులొక్క వేయిటినిడెద
నూరుమంచిరథములనిడెద । నూరుగురనువనితలనిడెద
ఏడునూర్లగజములనిడెద । ఇంటనున్నవన్నియునిడెద
శాంతిబొందిదయగనుమయ్యా । శాపముమరలింపగదయ్యా
శాంతిగొనకవిప్రుండనెను । సల్పితివని పాతకమనెను
శాపముతో పాపముజనును । జచ్చువరకు శాపముండును
పరసుఖమున కీపాపంబు । భంగముగాదిదియెనిజంబు
ఘోరనరకమందునబడవు । గోహత్యాపాపముగొనవు
అనుచుబ్రాహ్మణుడు జనెనయ్యా । అయినగాని భీతిలనయ్యా
అనేకాస్త్రములుగలవయ్యా । అర్జునునిజ్ఞ జంపెదనయ్యా
కర్మమెపుడుదప్పనిదయ్యా । కాగలదేయగు వినుమయ్యా
జ్ఞప్తివచ్చెబ్రహ్మాస్త్రంబు । చావుగల్గునింకనిజంబు

నెం. 5

దుర్యోధనునకు హితముజేతునని । దొలగగపగదయ్యా
నీవుభీతిబుట్టించినపార్థుడని । నేనువిడువనయ్యా
బ్రహ్మాస్త్రంబిపుడుస్మృతికివచ్చెను । భీతియెలేదయ్యా
విజయునిచేనేజచ్చెదనని యెంచి । భీతియెలేదయ్యా
నేడురథముభూమిగ్రుంకకుండిన । నిజముజెప్పదయ్యా
బ్రహ్మాస్త్రమువేసెద నావిజయుడు । భస్మంబగునయ్యా
శల్యులొక్క వేయిమందిజెప్పనిది । సల్పకవిడనయ్యా
సం॥ చాలుపల్కులిక రథమునడుపుమన । శల్యుండనెనయ్యా
శల్యు॥ పాండుకుమారులు ధర్మపరులనుచు । బరగపల్కుమయ్యా
కర్ణులొకవేయిమందియైనని । కర్ణబొసేయరయ్యా
సం॥ యేలవృథాలాపంబులనిరథము । దూలెనువినుమయ్యా
వారిటువివాదమొనరింపగ । కుమవరుడువచ్చెనయ్యా
ఇరువురికప్పుడు శాంతినొనరించి । యేగెను వినుమయ్యా
శల్యుడు కర్ణునిగనుగొనియనెదు । శ్శకునములగునయ్యా
యెదురుగాలివీచెనక్కలరచెను । యుదుగోగనుమయ్యా

గ్రద్దలాడెగుమిగూడియొక్కచో । కాకులరచెనయ్యా
అదుగోకపిధ్వజ మదుగోపార్థుని । యరదముగనుమయ్యా
కేలపగ్గములగొని సారథియగు । కృష్ణునిగనుమయ్యా
సూర్యచంద్రులఁబోలినవారల । శోభగాంచుమయ్యా
అనగకర్ణుడనె సంశప్తకులే । యాపివేసిరయ్యా
వారుబలవంతులతి ఘోరంబుగ । పోరుజేతురయ్యా
మరలశల్యుడనె సంశప్తకులొక । మశకమాత్రులయ్యా
శ॥ సత్యముగనరుడుజంపదలంచిన । క్షణముజాలదయ్యా
వరుణదేవుడెన్నటికినీళ్ళచే । వధింపబడడయ్యా
సమిధలచేనగ్ని హోతృడెన్నడు । జావడువినుమయ్యా
అటులసంశప్తకులు యాపాథుఁని । యాపజాలరయ్యా
యెంతవారైన కృష్ణార్జునులను । యెదురజాలరయ్యా
చచ్చెచచ్చెనరుడంచుమనంబున । సంతసపడుమయ్యా
మేరునగమువలెవచ్చెడిభీముని । యారయవేమయ్యా
అదుగోధర్మజానకులసహదేవు । లరుగుదెంచిరయ్యా
ముగ్గురొక్కచోదలపడి బలమును । బూదిజేతురయ్యా
ధర్మపరులైన పాండుతనయులకు । తప్పదుజయమయ్యా
ధర్మోజయతియనెడువాక్యములు పె । ద్దలుబల్కెదరయ్యా
అప్పు డుభయసైనికులు సమరమును । యాపివేసిరయ్యా

## నెం. 2

సం॥ ఉభయసైన్యములుదాకెను । ఉగ్రముగపోరుజరిగెను
అమరులతివిస్మయముగొనిరి । అపుడుప్రళయమగుననుకొనిరి
కర్ణుడంతలో జనుదెంచె । కనలిశరములఁ గురిపించె
అపుడు పాంచాలులేగిరి । అందరొకసారి పలపడిరి
కర్ణుడవ్వారినెదిరించె । గాంచియేడ్వురనుఖండించె
మరలయిరువదేడ్వురుజనిరి । త్వరగకర్ణునొప్పించిరి
కర్ణుడందరినిఖండించె । కదనవీరుడనిపేర్గాంచె
వరగవృషసేనుడరుదెంచె । జనకునకు సాయమొనరించె

కర్ణతనయుడు సుషేణుడు । కనలిగనెసత్యసేనుడు
యీముగురుకర్ణతనయులు । భీమునిఁదాకిరతిబలులు
సరగభీముండుకోపించె । సత్యసేనుధ్వజమునుద్రుంచె
భీముడొకకఠినశరమిడెను । వేగసత్యసేనుడుబడెను
ఆసుషేణునిఁదాకెను । అమ్ములఁగుర్మ్మరించెను
కర్ణుడవ్వాటిఖండించె । కడువడిగభీమునొప్పించె
అంతసాత్యకియుజనుదెంచె । ఆసుషేణుసూతునిద్రుంచె
అతనియరదంబుఖండించె । అతనిమేనంత నొప్పించె
కర్ణుడతికోపమొందెను । కఠినశరములఁ గురిసెను
పాండవులసేన బీతిలెను । బవరమతిఘోరమాయెను
ధర్మజునికర్ణుడెదిరెను । ధర్మజునిధనువుద్రుంచెను
అతనికవచమును ఛేదించె । అప్పుడురక్తాంగునొనరించె
ధర్మజుడుకోపమొందెను । త్వరగఘనశక్తివైచెను
కర్ణుడేడుశరములనిడెను । ఖండలుగనేలగూల్చెను
ధర్మజుడు వేరువిలుగొనెను । త్వరగకఠినశరములనిడెను
కర్ణుధనువు ఖండించెను । కర్ణురక్తమయుజేసెను
కర్ణుడింకొక్క విలుగొనెను । కరకుటమ్ములఁ గుర్మ్మెను
ధర్మజునిసూతుద్రుంచెను । ధర్మజునిరథముగూల్చెను

## నెం. 5

సాత్యకి శిఖండులాధర్మజునకు । సాయపడినరయ్యా
కర్ణునితనువునకస్త్రశస్త్రములు । కనలివేసిరయ్యా
అంతకర్ణుడన్నిటినిద్రుంచికఠి । నాస్త్రము లిడెనయ్యా
త్వరగవారినిటులజేసి ధర్మజు । దాకనేగెనయ్యా
ధర్మజుతనువునకనేకశరముల । దాకించినదయ్యా
అనేకబాధనుజెంది ధర్మజుం । డరుగదలచెనయ్యా
అంతధర్మజుడుశరవేదనచే । యలసియుండెనయ్యా
అంతనతనినిలువునిలువుమనిపరి । హాసమాడెనయ్యా
క్షత్రియకులమునబుట్టి రణమువిడి । జనుటకుతగదయ్యా

విప్రునివలె యాగాధ్వయునంబుల । విధమెరుంగుదయ్యా
ఇంకనైనయుద్ధమునకు రాకుము । యిపుడెవెడలుమయ్యా
అచటకృష్ణార్జునులుగలరరుగుము । అంతమగుడుపవయ్యా
తల్లివచనములు దలచిచంపకయె । త్వరగవిడచెనయ్యా
వెడలెధర్మజుడు పాండవసైన్యము । భీతిజెందెనయ్యా
అంతభీముడదిగని ప్రళయాంతకు । డగుచువచ్చెనయ్యా
సాత్యకిదృష్టద్యుమ్నాదులుగని । సాయపడినరయ్యా
ప్రళయకాలరుద్రులవలెసేనల । బరిమార్చినరయ్యా
భీముడుదృష్టద్యుమ్నసాత్యకుల । బిలచిచెప్పెనయ్యా
భీ॥ కర్ణునిచే ధర్మజుడవమానము । గాంచెనుగనుడయ్యా
మీరుధర్మజునిగాచుచుండిరా । పోరునుగనుడయ్యా
నేనేకర్ణుడొ నేడుజావవలె । నిక్కంబిదియయ్యా
సం॥ అనుచుసింహనాదముజేసెను బల । మతిభీతిలెనయ్యా
కాలాంతకుని విధమ్మున కర్ణుని । గనుచువచ్చెనయ్యా
అంతటశల్యుడు కర్ణునిగనుగొని । యుపుడుబల్కెనయ్యా
శల్యు॥ అదుగోభీముండుగ్రమూర్తియై । యరుగుదెంచునయ్యా
ఘటోత్కచుండిలబడిననాడిటుల । కనలకుండెనయ్యా
అన్నకవమానమాయెననుచిటుల । యాగ్రహించునయ్యా
కావుననందరుమెచ్చునటురణము । గావింపగదయ్యా
సం॥ అనకర్ణుడనె భీముడతిబలుం । డౌటనెరుగుదయ్యా
కర్ణు॥ కీచకాదులననిలోపలను । గెలచినవాడయ్యా
వీనిమదంబడగింతుమనరథము । వేగదోలుమయ్యా
సం॥ భీముడనేకాస్త్రమ్ములకర్ణుని । బిట్టుగొట్టెనయ్యా
కర్ణుడతనియస్త్రములనువేగమె । ఖండించినడయ్యా
అంతటభీమునియురముబగుల మూ । డమ్ములనిడెనయ్యా
ప్రళయాంతకుడై భీముడుకర్ణుని । పైశరమిడెనయ్యా
దానిచేనొచ్చికర్ణుడు భీముని । ధనువుద్రుంచెనయ్యా
వాడిగల్గినశరంబునభీముని । బాధజేసెనయ్యా

భీముఁడొక్కవిలుగొనికర్ణునిగని । బిట్టుగొట్టెనయ్యా
కర్ణుండిరువదియైదుశరంబుల । కనలివేసెనయ్యా
బాణఘాతచేతాళకభీముఁడు । బడిమూర్ఛిలెనయ్యా
క్షణమునమేల్కొనికఠినశరంబున । కర్ణునేసెనయ్యా
ఆశరఘాతకుకర్ణుఁడుమూర్ఛిలి । యవనింబడెనయ్యా
అంతటభీముఁడుమహాక్రోధమున । యరదముడిగెనయ్యా
కర్ణునినాల్కనుగోయబూనియొక । ఖడ్గముగొనెనయ్యా
భీమునియత్నముగనిశల్యుండి । వ్విధముబల్కెనయ్యా
శల్యు॥ కర్ణునకదిమూర్ఛగానిమరణము । గాదువెల్యుమయ్యా
యితనినాల్కగోయబూనితివిక్షమి । యించినిల్వుమయ్యా
ఇతనిజంపుటకుసభలోపార్థుఁడు । ప్రతినజేసెనయ్యా
నాల్కగోయమరణించునితఁడుప్రతి । నభంగమగునయ్యా
అవిమర్శగజేసినకార్యమునకు । హానిగల్గునయ్యా
సం॥ అంతటభీముఁడుశాంతిగశల్యున । కపుడుబల్కెనయ్యా
భీ॥ నాఁడుద్రౌపదినిసభలోదురుక్తు । లాడెనువీఁడయ్యా
నవ్వుచునిందించెనుధర్మజునీ । నాఁడుగంటినయ్యా
గానదురాత్మునినాల్కనుగోయగ । బూనియుంటినయ్యా
మాతమ్ముఁడుజేసినశపథంబును । మరచియుంటినయ్యా
వీఁడుమరణింపప్రతినజెడునరుఁడు । గూడఁజచ్చునయ్యా
నరుఁడుమరణింపతక్కినవారము । నశింతుమోయయ్యా
మామాయుపకారముజేసితివిది । మరువజాలనయ్యా
సం॥ అనుచుమ్రొక్కిశల్యుఁడురథమునుగొని । యపుడువెడలెనయ్యా
అరదమెక్కిభీముండుసైన్యముల । హతముజేసెనయ్యా
వైశం॥ అనవినిధృతరాష్ట్రుండతిదుఃఖము । నందిబల్కెనయ్యా
ధృ॥ నాటినుండినమ్మినకర్ణుండీ । నాఁడుగూలెనయ్యా
అర్జుననిజంపుననినాతనయుం । డాశబొందెనయ్యా
భీమునిచేతనెకర్ణుఁడుగూలుట । విపరీతంబయ్యా
అంతనాతనయుఁడేమిజేసెనో । యదిదెల్పగదయ్యా
వైశం॥ అనసంజయుఁడనెనీసుతుఁడంతట । యనుజులకనెనయ్యా
దు॥ తమ్ములారభీమునిచెకర్ణుఁడు । సొమ్మసిల్లెనయ్యా
మీరలరిగిరాభీమునిమదమును । వారింపండయ్యా

సం॥ వినివేగమెశ్శృతవర్ముడుమొదలగు । వీరులుజనిరయ్యా
అంతటభీమునియావరించుకొని । యమ్ములనిడిరయ్యా
త్వరగభీముడాశృతవర్మనితల । దరిగివేసెనయ్యా
ఐదునూటయేబదిరథములగని । హతముజేసెనయ్యా
క్రోధివికటసములనియెడుముప్వుర । గూల్చియార్చెనయ్యా
అంతనందోపనందులనిర్వుర । హతముజేసెనయ్యా
ఇటులనీసుతులనార్వురజంపుచు । యేగుచుండెనయ్యా
అనేకబలములధ్వంచెనుకర్ణుం । డపుడులేచెనయ్యా
కర్ణభీములకుయతిఘోరంబగు । కదనమాయెనయ్యా
కర్ణుడుభీమునిధనువును వేగమె । ఖండించినడయ్యా
సరగునభీముడుగదగొనికర్ణుని । జంపనురికెనయ్యా
అంతదుర్యోధనుండుబలంబుల । నడ్డమంపెనయ్యా
మూడువేలగురంబులభీముడు । పుడమిగూల్చెనయ్యా
బలవంతములగు పదియేనుంగుల । బడవేసినడయ్యా
అనేకకాల్బలములసైన్యంబుల । హతముజేసెనయ్యా
అప్పుడు రక్తపుకేరులుబారెను । యధిపావినుమయ్యా
అంతటమధ్యాహ్నమాయెరణమిటు । లగుచునుండెనయ్యా
సంశప్తకులకు విజయునితోఘన । సమరమాయెనయ్యా

# నెం. 2

అంతసంశప్తకులుజనిరి ॥ అర్జునునిరథము జుట్టిరి
హరినరులజంపదలపడిరి । అద్భుతాస్త్రములవిడచిరి
నరుడుగనికోపమొందెను । త్వరగసర్పాస్త్రమును విడెను
సర్పములువేలుబుట్టెను । సైన్యములనంతగట్టెను
నరుడుశరవృష్టిగురిపెను । శిరములొకకొన్నిగూలెను
ఆసుశర్ముండుజూచెను । అంతగరుడాస్త్రమేసెను
వేలగరుడపక్షులుబుట్టె । వేగసర్పములు తుదముట్టె
అంతసర్పాస్త్రమేగెను । ఆసుశర్ముండుగనుగొనెను
అస్త్రమింకొకటివేసెను । అర్జునువికంతదాకెను

అరదమునసరుడు మూర్ఛిలెను । కురుబలముసంతసముగొనెను
అంతలోనరుడులేచెను । ఆగ్రహముబొందినిలచెను
అప్పుడైంద్రాస్త్రమును విడెను । అదియుపదివేలుగూల్చెను
కర్ణుడతికోపమొందెను । ఘనబలంబులనుద్రుంచెను
భార్గవాస్త్రంబువిడచెను । బలములనేకాన్నేలగూల్చెను
పాండవులసేన బారెను । పాండవాగ్రజుడునొచ్చెను
అంతశిబిరమునకేగెను । చింతతో నేలబండెను
అంతకృష్ణార్జునులుజనిరి । అతనిగని ప్రణుతిజేసిరి

## —: ఫలశృతి :—

భారతవీరులచరితమ్ము । పరియంచినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుదీని । విరచించెను భక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడు యీసత్కృతిని
సదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని

## నెం. 1

కర్ణునిజంపినరనుకొనెను । గాంచి ధర్మజుండిటులనెను
ధ॥ కర్ణుండతిశూరుండయ్యా । గలదుభార్గవాస్త్రంబయ్యా
నన్నవమానించినడయ్యా । నాకుబాధసల్పినడయ్యా
అతనినిమదిదలచుచునుంటి । అతిభీతిని జెందుచునుంటి
పదమూడేండ్లిటులగడచెను । బాధనేటితోడదీరెను
గానియెటులజంపితివయ్యా । ఘనబలుడాకర్ణుండయ్యా
ఆవిధంబు దెల్పగదయ్యా । అతిసంతసమొందెదనయ్యా
సం॥ నరుడిదివినియిటులబల్కెను । గురుసుతుడీనాడుకనలెను
అ॥ అనేకాస్త్రశస్త్రములిడెను । అనేకబాధలను సల్పెను
అతనిబీరముడిపితినయ్యా । అపుడునిన్నువెదకితినయ్యా
శిబిరంబునుజేరితివనుచు । జెప్పెను భీముండదివినుచు
నీకుశలంబెరుగగనెంచి । నేనువచ్చితిని ప్రేమించి

ఇకకర్ణునిదునిమెదనయ్యా । ఇప్పుడాజ్ఞనిడగదవయ్యా
ప్రతినజేతువినగదవయ్యా । బాహుబలము జూపెదనయ్యా
బ్రాహ్మణోత్తముని బిలపించి । బరగదానమిడగదలంచి
ఇచ్చెదనని ముందువచించి । ఈయననుచుపిదపవచించి
బొమ్మనిపల్కినపాపంబు । బొందుదు దప్పినశపథంబు
వేగనాజ్ఞనిడ గదవయ్యా । భీముడచటక్రమగొనునయ్యా
నం॥ అనగధర్మజుడు కోపించె । అత్యుగ్రుండగుచువచించె
ధ॥ నీవచనంబులునమ్మితిని । నేనుమోసమును బొందితిని

## నెం. 5

ఇట్టివాడవనియెరుగకరణమున । కేనుదలచితయ్యా
అస్త్రశస్త్రములు యమరులిచ్చిరని । యాశజెందిరయ్యా
నేడు కర్ణునకుయోడితిభీముడు । నిన్నయోడెనయ్యా
నకులసహదేవులోడి రీవు ఈ । నాడెనోడితయ్యా
చాలురణమింక యడవులకుజేరి । సంతసిలుదమయ్యా
కురుపతి చెంతకు బోయిశరణమని । కోరుకొందమయ్యా
నందనందనుడుమనలగూడియు । నాడుయోడెనయ్యా
నేడభిమన్యఘటోత్కచులుండిన । దోడునిల్తురయ్యా
నిన్ననలాభములేదు నాకర్మ । నేనుబొందితయ్యా
కర్ణునిచేయవమానము నొందితి । గానబ్రతుకనయ్యా
వనితవైపుట్టికేలనీవుమగ । వాడవైతివయ్యా
బుట్టినంతనెజచ్చినచో బహు । మోదంబగునయ్యా
నీచేగాదికకర్ణునిజంపగ । నేనుదెల్పుదయ్యా
గాండీవంబికృష్ణునకిడుమా । కర్ణుగూల్చునయ్యా
సారథివైయరదంబునడుపుమా । జయముగలుగునయ్యా
నం॥ అనవిని యర్జునుడతిక్రోధంబున । యపుడులేచెనయ్యా
ఖడ్గముగొనిధర్మజుని జంపుటకు । గడగుచుండెనయ్యా
గాంచికృష్ణుడతివేగనరునిచే । ఖడ్గముగొనెనయ్యా
కృష్ణు॥ అన్నగారిక్షేమంబడుగుటకై । యరుదెంచితివయ్యా

వైరులులేరిటఖడ్గముబూనగ । కారణమేమయ్యా
పం॥ పాథుఁడువినియనె మునునేనొక్కటి । ప్రతినజేసితయ్యా
అ॥ బరులకుగాండివమిమ్మనువారల । నరుకుదంటినయ్యా
ఈతడెంతనిందించినమదిలో । యేవగింపనయ్యా
గానిగాండివము నీకిమ్మనుచో । కనలుచుంటినయ్యా
ఈతడెంతమహాత్ముడైనవధి । యింపకవిడనయ్యా
అసత్యమాడినవానిదప్పుదు । యథఃపతనమయ్యా
గానప్రతిననెరవేర్చుకొందునా । ఖడ్గమునిడుమయ్యా
కృష్ణ॥ అనగకృష్ణుడనెమహాపరాధం । బగునిదివినుమయ్యా
సత్యమునకుసమయాసమయంబులు । చాలవెల్గునయ్యా
సమయాసమయము లెరుగని సత్యము । చాలపాపమయ్యా
దీనికొక్కకథ దెలిపెదను సావ । ధానము వినుమయ్యా
తొల్లికౌశికుండనెడివాడుండే । దొడ్డవిప్రుడయ్యా
అతడుమహాత్ముడు తపోధనుడు పర । మార్థమెరుగునయ్యా
సమయాసమయంబెరుగక జేసెడి । సంతతవ్రతుడయ్యా
అతడిటులతన యాశ్రమమందున । యులరుచుండెనయ్యా
జనులుతీర్థయాత్రకొరకువనమున । జనుచునుండిరయ్యా
చోరబాధచేయాశ్రమంబునకు । బారివచ్చిరయ్యా
అతడుజూడగ రహస్యస్థలముల । యందుదాగిరయ్యా
సత్యముచెల్పును మునియనిచోరులు । సరగబల్కిరయ్యా
జనులిచ్చటికరుదెంచిరి యెచటికి । జనిరొదెల్పుమయ్యా
సమయంబెరుగక సత్యమాడుడని । జాడదెల్పెదయ్యా
చోరులతివేగమచటికిజనియు । వ్వారిజంపిరయ్యా
కాంతలవృద్ధులశిశువులనెల్లర । ఖండించినరయ్యా
అంతటచోరులుజనిరి కౌశికుం । డంతమాయెనయ్యా
వారలజంపిన పాపంబీతని । వదలకుండెనయ్యా
ఘోరనరకములగూలికష్టముల । బొందుచుండెనయ్యా
గావునహింసాకరమగుసత్యము । కడుపాతకమయ్యా
లేనిపోనట్టి ప్రతినలెల్లనవని । లేకబూనితయ్యా

చంపుటనిందించుట యొకటేయని । శాస్త్రంబనునయ్యా
గాననితనినిందింపుము సత్యము । దీనని లచునయ్యా
సం॥ అనగవిజయుడా ధర్మజుగనుగొని । యపుడుబలికెనయ్యా
అ॥ వీరుడైన భీముడు నిందించిన । వెతనుజెందనయ్యా
పారుబోతువై వెడలివచ్చియిటు । బల్కగతగదయ్యా
యేలనీనాల్కనూకతునకలై । యిలనుగూలదయ్యా
యెన్నడెవరినెదిరించి జంపితివొ । యేర్పరించవయ్యా
దుష్టబుద్ధివై జూదమాడనీ । కష్టమబ్బెనయ్యా
పండ్రెండేండ్లడవినపడజాలని । పాట్లుగలిగెనయ్యా
విరటునికడనొకయేడజ్ఞాతము । జరిపియుంటిమయ్యా
పాలతిసభలో కడుబాధలు నీ । మూలమాయెనయ్యా
పుత్రుడురణమున మరణించుట నీ । మూలమాయెనయ్యా
పుడమి మనభాగమునుగోల్పడనీ । మూలమాయెనయ్యా
అనినిందించుచు మునుపటిఖడ్గం । బంతదీసెనయ్యా
సం॥ అతిదుఃఖముచేయాత్మహత్యజే । యంగనుండెనయ్యా
అంతటకృష్ణుండిదియేమనునరు । డపుడుబల్కెనయ్యా
అ॥ మందబుద్ధినై యీమహనీయుని । నిందించితినయ్యా
మహాపాపమొనరించితిగావున । మరణించితినయ్యా
దీనికిప్రాయశ్చిత్తంబిదియని । బూనియుంటినయ్యా
సం॥ అనగకృష్ణుడనె తననుబొగడుకొను । టరయమరణమయ్యా
అర్జునుండువిని మంచిదనియన్న । కపుడుబలికెనయ్యా
అ॥ హరుడుదప్పనన్నెదిర్చివాడీ । యవనినిలేడయ్యా
రాజసూయయాగముజేయించితి । రణశూరుడనయ్యా
అనేకరాజులగెల్చిధనంబుల । నార్జించితినయ్యా
సంశప్తకులజయించిరణంబున । జయముబొందితయ్యా
సం॥ అనుచుబల్కిధర్మజునిపాదముల । కపుడుమ్రొక్కెనయ్యా
అ॥ ధర్మాత్ముండవునినునిందించితి । దయనుజూడుమయ్యా
అవివేకంబునజేసితినివ్విధి । యాగ్రహింపకయ్యా
సరిగదీవించిపంపుము కర్ణుని । జంపివత్తునయ్యా

సం॥ ఇటులబల్కిపాదములపైబడుచు । యేడ్చుచుండెనయ్యా
అంతధర్మజుడు కన్నీరొలుకుచు । యపుడుబలికెనయ్యా

## నెం. 1

ధర్మ॥ ఖడ్గంబును చేగొనుమయ్యా । కంఠముదెగవేయగదయ్యా
వెనుకకడుగువేయకుమయ్యా । విధినాకిటులుండెగదయ్యా
నాచేశ్రమలనుబొందితిరి । నాచేరాజ్యముబాసితిరి
భీముండే రాజగుమందు । ప్రీతినాకు లేదనియందు
ననుజంపక విడచితివేని । వనమునకేగెదనికబాని

సం॥ అనుచులేచి వెడలుచునుండె । హరియడ్డము జనియనుచుండె
కృ॥ సత్యవంతుడవు నీవయ్యా । సద్ధర్మాత్ముడవీవయ్యా
నరునిశపథమెరుగవునీవు । బరులకుధనువిమ్మనినావు
శపథమునకు నరుడిటులనెను । కృపజూడుముదాసుండనెను
కర్ణునినేడిక జంపింతు । కల్లగాదు నినుమురిపింతు
నీకోపమె కర్ణునిజంపు । నీదయయేవీరికిపెంపు
సం॥ అనుచుపాదములబడెనయ్యా । గనియతండులేపినడయ్యా
అర్జునుండు దుఃఖముగొనెను । అన్నపాదములపైబడెను
గనుచుధర్మజుడు విలపించె । కౌగలించియిటువినిపించె

ధ॥ కర్ణుడునన్నవమానించె । ఘనబాణంబులనొప్పించె
అతిశ్రమనుబలికితినయ్యా । అదిమదిలోనుంచకుమయ్యా
సం॥ కృష్ణునిగనియపుడిట్లనెను । కేవలమాప్తుడవీవనెను
ధర్మ॥ అవివేకులగాచితివయ్యా । ఆపరమాత్ముడవీవయ్యా
జనుడుమీచరణమొనరింప । సమరంబునకర్ణునిజంప

సం॥ జయమునొందుడనుచుబల్కెను । సవినయముగ నరుడిట్లనెను
అ॥ యెన్నడు నీమాటకునేను । యెదిరించినవాడనుగాను
హరిదయచే బ్రతికితివీవు । అకటనాకుదప్పెనుచావు
సం॥ అనుచుపాదములపైబడెను । అర్జునొందిరథమునెక్కెను
శ్రీకృష్ణుడు రథమునడిపెను । శీఘ్రమురణభూమిజేరెను
గనిభీముడు మోదమందెను । కదనంబునకంతటజనెను

# నెం. 5

దురమునభీమార్జునులు నీబలము । ద్రుంచుచుండిరయ్యా
కర్ణుడు పాండవబలమునంతటు । గొల్చుచుండెనయ్యా
నరుడు నీతనయుల పదిమందిని । త్వరగదునిమెనయ్యా
మరలతొమ్మండుగురుజనుదెంచిన । మ్రుందించినడయ్యా
ఇటులనీసుతుల జంపుచుండగా । నెల్లరుగనిరయ్యా
దుశ్శాసనుండు తమ్ములపాటుకు । దుఃఖించినడయ్యా
అత్యుగ్రుండైరథముదోలుకొని । యపుడువచ్చెనయ్యా
ఆతనిగనుగొనుచు భీమసేనుడపు । డద్దమాయెనయ్యా
వడ్డితోగూడ రుణమునిత్తు నీ । వారిబిలువుమయ్యా
అనియాతనిరథహయసారథులను । హతముజేసెనయ్యా
అంతనతడు పరిఘముచేభీముని । యార్చికొట్టెనయ్యా
పరిఘఘాతచే భీమసేనుడతి । బాధజెందెనయ్యా
సింహముగ్రమై లేడిపైకురుకు । చెలువుదోచెనయ్యా
అతిభీకరముగగదగొని భీముడు । యరదముదిగెనయ్యా
గిరగిరద్రిప్పుచువిసరివేయనది । త్వరగదాకెనయ్యా
గిరిశృంగమువలెదుశ్శాసనుడా । ధరనుగూలెనయ్యా
అంతటభీముండతనిరొమ్ముపై । యపుడునిలచెనయ్యా
అతిభయంకరమగు ఖడ్గంబును । యపుడుదీసెనయ్యా
దుస్ససేనుకనులకు ఘుళిపించుచు । తొడరిబలికెనయ్యా

భీ॥ నాడుసతినీడ్వుమనిన వానినీ । నాడుబిల్వుమయ్యా
వెలదివలువలొలువుమన్నవానిని । వేగబిల్వుమయ్యా
నాడుదుష్కర్మవృక్షమిడి వీ । నాడుబండెనయ్యా

సం॥ అనుచురొమ్ముబగులదీసి నెత్తురు । నపుడుద్రాగెనయ్యా
తల్లిపాలకంటె మధురమని మో । దంబు నొందెనయ్యా
సత్వరమాతని రక్తంబుననె । స్నానమాడెనయ్యా
నీకుదిక్కెవరు రారమ్మనుచును । నిలచిబలికెనయ్యా
భయంకరంబగు భీమునిగనినీ । బలముబారెనయ్యా

కొందరు రాక్షసుడనుకొని భీతిలి । గూలిచచ్చిరయ్యా
గురుసుతకృపకృతవర్మాదులుగని । వెరచిపారిరయ్యా
శకునిదుర్యోధనాదులు గనుగొని । జనభీతిలిరయ్యా
కర్ణుడుభీతిలిజూచుచుండె దు । ష్కర్మదలచెనయ్యా
పాండవవీరులు భీమసేనుగని । భయముజెందిరయ్యా
వెయ్యేటికికృష్ణార్జునులదిగని । విస్మయపడిరయ్యా
శపథము నెరవేరినదని భీముడు । సంతసించెనయ్యా
చచ్చిపడినదుశ్శాసనుశవమును । సరగవీడెనయ్యా
అప్పుడుకౌరవయోధులువినునటు । లార్చిబలికిరయ్యా
భీ॥ శపథములురెండు జేసితినొక్కటి । సాంతమాయెనయ్యా
త్వరగదుర్యోధనునిగూల్చుచుతల । దన్నుటగలదయ్యా
నేడోరేపో యీకార్యంబును । నెరవేర్చెదనయ్యా
వై॥ ధృతరాష్ట్రునిదుర్మతముననూర్గురు । సుతులుజత్తురయ్యా
అఖిలరాజ్యపాలనము పాండవుల । కందునిజంబయ్యా
ధృతరాష్ట్రునకిక దుఃఖమేమిగులు । సుతులుమిగులరయ్యా
సం॥ కర్ణునితనయుడు వృషసేనుండది । గనుచువచ్చెనయ్యా
అంతపార్థుగాడడ్డగించిశరముల । నపుడువేసెనయ్యా

## నెం. 2

అంతవృషసేనుడెదిరెను । అమ్ములనాదృంచివైచెను
అంతశరవృష్టిగురిపెను । హరికికడుబాధజేసెను
అర్జునునిధ్వజముగదిలించె । హనుమనికిబాధగావించె
త్వరగకర్ణుండు జనుదెంచె । తనయునకు సాయపడనెంచె
నేనులేకుండజూచితివి । నీవునాసుతుని జంపితివి
నీవుఇటనుండజూచితిని । నీసుతునిజంపదలచితిని
సం॥ అనుచుశరమొకటిసంధించె । కనలివృషసేనుతలద్రుంచె
గనుచుకర్ణుండువిలపించె । కర్మదప్పదనిమదినెంచె
దుఃఖసమయంబుగాదనుచు । దురముసేయుటేఘనమనుచు
ప్రళయరుద్రుడై జనుదెంచె । పార్థునికజంపగానెంచె
అరదమునునడుపుమనియెను । అంతశల్యుండుబలికెను
అర్జునునివేగగనుమనెను । అతనినికగెల్వుమనియెను

కురువరుడునిన్నునమ్మెను । ధరను పాలింపదలచెను
సమయమిదియంచుదెలిపెను । సత్వరము రథము నడిపెను
అంతకృష్ణుండుగాంచెను । అపుడువిజయునకు నిట్లనెను
అదిగోకర్ణునిజగనుమనెను । అంతకుండగుచువచ్చెను
కృ॥ సుతునిదుఃఖంబునొందెను । జూడుమాయుగ్రుడాయెను
అస్త్రశస్త్రములవిడువుము । అంతమొనరింప దలపుము
జాగుసేయంగ వలదయ్యా । శపథమును దలచుకొనుమయ్యా
సం॥ అమరులదిగనుచువచ్చిరి । అద్భుతంబంచునిలచిరి

## నెం. 5

బ్రహ్మదేవుడాశంకరునింగని । బలికెను వినుమయ్యా
బ్ర॥ కర్ణార్జున యుద్ధమునలోకములు । కలతజెందునయ్యా
గానవీరిరణమాపిలోకములు । గావదలపుమయ్యా
సం॥ అనగశర్వుడనెవారలుమనపలు । కాలకింపరయ్యా
ఇటులవారలను కొనుచుండగనపు । డింద్రుండనెనయ్యా
ఇం॥ నరునకేజయుంబగును కర్ణునకు । నాశంబగునయ్యా
బ్ర॥ అనగబ్రహ్మయనె జయాపజయములు । యనుమానములయ్యా
నరగనరునకేజయమంటివి ప । క్షపాతమగునయ్యా
శం॥ అనగశర్వుడనె బ్రహ్మతోడనీ । వటులనదగదయ్యా
నరనారాయణులే కృష్ణార్జునను । లెరిగిమరచితయ్యా
అవనీభారంబుడుపభూమిపై । యవతరించిరయ్యా
తపోధనులు వారినెదురనెవరికి । దరముగానిదయ్యా
ఇంద్రుండనినటునరునకుజయమగు । నిపుడెజూడుమయ్యా
అధర్మపరులకు సాయపడువారి । కగునెటు జయమయ్యా
కర్ణుడుబలవంతుడెధర్మాత్ముడె। ఘనుడేయగునయ్యా
అధర్మపరులగు కౌరవులకు సా । యంబుజేసెనయ్యా
ఆకారణమున కర్ణునకిప్పుడు । యపజయమగునయ్యా
సం॥ వినిసురనాథుడు పుష్పవృష్టినతి । వేగగురిపెనయ్యా
సురదుందుభులంతమ్రోగెసురలని । జూడనిలచిరయ్యా

అందరు తమతమశంఖములొత్తిరి । యత్యద్భుతమయ్యా
అంజనేయుడాహస్తికక్ష్యపై । యపుడుదుమికెనయ్యా
తపోబలంబునకర్ణుడుగూర్చిన । ధ్వజమతిఘనమయ్యా
కపిపతితనపదవాలంబులతో । ఘాతజేసెనయ్యా
ప్రళయకాలానలముపలెనదికపి । పతినిడాకెనయ్యా
యిరువురికిఘోరయుద్ధమాయెకరి । యిలనుగూలెనయ్యా
అంజనేయుడాయర్జునురథమును । యధిష్ఠించెనయ్యా
కర్ణహయంబులు నరునిహయంబులు । కనలిపోరెనయ్యా
శల్యునికనెకర్ణుడు నేజచ్చిన । సలిపెదవెటులయ్యా
నరుడనెకృష్ణునకేను బడినచో । దురమెటులగునయ్యా
అనగకృష్ణుడనెక్షణమున కర్ణుని । హతముజేతునయ్యా
కృ॥ కౌరవబలములనన్నినిముసమున । గాల్చివేతునయ్యా
వేయియేల పట్టముధర్మజునకు । వేగగట్టుదయ్యా
సూర్యుతు భూమినబడిననిదిగాదు । ధైర్యముగొనుమయ్యా
భూమిబ్రద్దలైనను మరణంబును । బొందవునీవయ్యా
మేరువువిరిగిన కర్ణుడు నినుదుని । మివేయడోయయ్యా
సం॥ అనగనరుండనెపరిహాసంబున । కంటినిట్టులయ్యా
అ॥ మంగళప్రదుడవీవుండగనే । మ్రిందుదునెటులయ్యా
అలగికర్ణశల్యులభార్యలవిధ । వలనుజేతునయ్యా
ధర్మజకుంతీ ద్రౌపదులకు సం । తసముజేతునయ్యా
సం॥ శూరులిర్వురనికి నిల్వగాగురు । సుతుడుజూచెనయ్యా
అతివేగంబుగ దుర్యోధనుగని । యపుడుబలికెనయ్యా

## నెం. 1

అశ్వ॥ భీష్మద్రోణులు ఘనులయ్యు । వెనుకాడక నిలచినరయ్యా
అంతవారి నీయర్జునుడు । హతముజేసెనతిబలయుతుడు
వానిముందుకర్ణుండెంత । వానినెనమ్మితి విదివింత
కర్ణుడు జయమును గొనలేడు । కదనంబున జావగరాడు
నరగనాదుపల్కులువినుము । సంధియొనర్చెదవగుసుఖము

ఇప్పటికైననుగుర్తించు । ఇప్పుడునీతలపంకించు
త్వరగపాండుసుతులనుగాంతు । తప్పకనీతులు వినుపింతు
సమరముసేయుట మాన్పింతు । సగభాగమునీకిప్పింతు
నాపల్కులుమీరరువారు । నాపైకడుదయగలవారు
కృష్ణునిసంధికియొప్పింతు । కేలుమోడ్చియతనినుతింతు
హతశేషులు బ్రతికెదరయ్య । మతినిదప్పి యొప్పగదయ్యా
సం॥ అంతటకురునాథుండనెను । అటులసేయుటకు దగదనెను
దు॥ నాతమ్ములుజచ్చినరయ్య । నాకికభాగమువలదయ్య
అంతిరాజ్యమేలెదనయ్య । అటులగాకజచ్చెదనయ్య
అనిలోకర్ణుడు బడునేని । అగ్నిశీతలంబగుబూనీ
అతడునరునిజంపుటనిజము । అప్పుడు గాంచెదకడుసుఖము
సంధిపనిని మానగదయ్యా । సాయముకర్ణునకగుమయ్య
సం॥ అనుచుకురువరుడు జనెనయ్య । అఖిలబలము జంపినదయ్యా
రణముసేయ మొదలిడిరయ్య । రణభేరులు మ్రోగినవయ్య

## నెం. 2

అంతనపరాహ్ణమాయెను । అపుడుకర్ణుడమ్ములనిడెను
నరుడు యవ్వారిదునిమెను । నరుడుశరములజా విడచెను
కర్ణుడతికోపమొందెను । ఖండలుగవాటిజేసెను
కర్ణుడచ్యుతునినొప్పించె । కనలినరునికడుబాధించె
అర్జునుడు శరములైదిడెను । అంగపతితనువుగృచ్చెను
రక్తసిక్తాంగుడాయెను । రక్తనేత్రుడై దలపడెదు
అగ్నియస్త్రంబునరుడిడెను । యంతటనుమంటలెగసెను
కర్ణుడద్దాని గనుగొనెను । కనలివారు ణాస్త్రంబిడెను
వర్షధారలే గనుపించె । వహ్నియస్త్రంబు సమయించె
నరుడుమేఘాస్త్రమునుయిడెను । త్వరగచీకటులుగ్రమ్మెను
వారుణాస్త్రంబు సమసెను । బలములతిభీతిజెందెను
అంగపతివేగగనుగొనెను । అపుడుసూర్యాస్త్రమునువిడెను
చీకటులనంతమ్రింగెను । శీఘ్రముగ మేఘముల్ జనెను
పార్థుడైంద్రాస్త్రమునువిడెను । బలములజా ధనువుజొచ్చెను

కర్ణుడమ్ములఁ బాఁడవిడచెను । క్షణములోదానినిలిపెను
అంతభీముండు జనుదెంచె । అర్జుననకిట్లు వినిపించె
భీ॥ చాలజాగుసేయకుమయ్యా । శపథమును సల్పుకొనుమయ్యా
గాక నా కాజ్ఞయిడుమయ్యా । క్షణములోగూల్తుగచుమయ్యా
సం॥ అపుడుశ్రీకృష్ణుడిట్లనెను । అర్జునా మేలుఁకొమ్మనెను
బలము క్షీణించెనేమనెను । ప్రతిననెరవేర్చుకొమ్మనెను
గాకనా కాజ్ఞయిఁడుమనెను । క్షణములోద్రుంచివైచెదను
పార్థుఁడదివినుచునవ్వెను । భయములేదనుచు బల్కెను

## నెం. 5

అర్జునుడంతట బ్రహ్మాస్త్రంబును । యపుడువేసెనయ్యా
సరగునకర్ణుడు బ్రహ్మాస్త్రంబిడ । శాంతిబొంధెనయ్యా
కృష్ణనరులపైకర్ణుడు శరముల । గృమ్మరించెనయ్యా
అర్జునినారిదెగవ్రేయగజను । లద్భుతపడిరయ్యా
నరుడునారిగూర్చుచుండె కర్ణుడు । శరములనిడెనయ్యా
అంతనరుడు కర్ణునికవచంబును । హతముజేసెనయ్యా
తనువునందు విషబాణమిడరక్త । ధారగారెనయ్యా
అంతటకర్ణుండమోఘశరముల । నప్పుడిడినడయ్యా
ఘనులాయిరువురి శరములుసూర్యుని । కాంతిగప్పెనయ్యా
కౌరవయోధులు పాండవయోధులు । గాంచుచుండిరయ్యా
ఇంతవరకింతయుద్ధముఁగనమని । సంతసించిరయ్యా
అంతటదుర్యోధనుడు సైన్యముల । నంపుచుండెనయ్యా
అర్జునుండుగని క్షణమున వాటిని । హతముజేసెనయ్యా
కర్ణుడంత సర్పాస్త్రము వేయగ । గాంచుచుండెనయ్యా
సర్పాస్త్రంబును తనకరమందున । సరగబట్టెనయ్యా
ఆకసమందున యమరగణంబులు । యతిభీతిలిరయ్యా
సవ్యసాచికంఠమునకు దానిని । సంధించినడయ్యా
అంతటశల్యుడుగనియనెరణమరి । యాదనెరుగవయ్యా
ఇటులసంధింప కంఠముదెగునని । యెటులదలచితయ్యా
పైకిశరముసంధించిన క్రిందికి । బరగదాకునయ్యా

అంతలోకర్ణుడాగ్రహమొందుచు । యపుడుబలికెనయ్యా
యీకర్ణుండింకొకని బోధగ్రహి । యింపడువినుమయ్యా
చాలుచాలు నీవాక్యమనిశరము । సంధించినడయ్యా
కోపమొందితనువు వణికెగావున । గుర్తుదప్పెనయ్యా
అనుచు సర్పాస్త్రమును విడనయ్యది । యపుడువచ్చెనయ్యా
శ్రీకృష్ణుడు దీకొరకుచింతను । జేయుచుండెనయ్యా
ఐదంగుళములు రథమునభూమిని । యణగద్రొక్కెనయ్యా
యెవ్వరెరుగరది సురలుదెలసిహరి । నెచ్చరించిరయ్యా
హరికారుణ్యముబొందిననరునకు । అపజయమెటులయ్యా
పుష్పవృష్టిగురిపించి శ్రీహరిని । బొగడుచుండిరయ్యా
భయంకరంబగు సర్పాస్త్రంబటు । వడిగవచ్చెనయ్యా
తలపైనున్నకిరీటముగైకొని । ధరనుగూలెనయ్యా
అనేకులనేకయుద్ధంబులలో । యస్త్రములిడిరయ్యా
ఇంతటిఘోరాస్త్రంబిడరెవ్వరు । ఇదిబహుఘనమయ్యా
క్షణమునకిరీటముంగొనిపోయెను । సర్పాస్త్రంబయ్యా
పూర్వవైరమును స్మరించియీపని । బూనిచేసెనయ్యా
అర్జునుతలదెగవేయకశరమిటు । వ్యర్థమాయెనయ్యా
అంతసర్పాస్త్రమాకర్ణునిదెస । కపుడువెడలెనయ్యా
గుర్తుదప్పిసంధించినకంతము । గోసెదనెటులయ్యా
గనుచుమరలసంధింపుమనగనా । కర్ణుండనెనయ్యా
అన్యునిబోధనువినిరణమును నే । నాచరింపనయ్యా
జాలువెడలుమనసర్పముపాథుణాని । జంపవెడలెనయ్యా
అంతటకృష్ణుడు నరుననెదీని । హతముసేయుమయ్యా
ఖాండవదహనంబందు పీడగొని । కనలివచ్చెనయ్యా
ఆనవిని నరుడైదుబాణములచే । హతముజేసెనయ్యా
సర్పాస్త్రమువ్యర్థమగుట కర్ణుడు । చయ్యనగనెనయ్యా
అపుడుమదినఖేదంబునొందుచు । యనుకొనెవినుమయ్యా
ఆనొక్కటిదలచినచోదైవము । దలచునొక్కటయ్యా

ఇంకొక్కటిగలదఁద్దానిని నే । నిపుడువేతునయ్యా
అనుచురౌద్రాస్త్రమునుగొనిధనువున । కపుడుగూర్చెనయ్యా
బ్రాహ్మణశాపంబునరథచక్రము । బరగకృంగెనయ్యా
అంతటకర్ణుడు తనకుమరణమిక । యగుననుకొనెనయ్యా
క్రిందికిదిగి రథచక్రము నెత్తుచు । కిరీటికనెనయ్యా
ధర్మంబెరిగినవాడవు శరములు । తాళువిడువకయ్యా
అరదమెక్కి రణముసేతుననగా । యచ్యుతుడనెనయ్యా
కృ॥ తరుణినిసభలో కీడ్చినయప్పుడు । ధర్మములేదయ్యా
త్వరగననుగట్ట బూనినయప్పుడు । ధర్మములేదయ్యా
తనయునిపదుగురు గూల్చినయప్పుడు । ధర్మములేదయ్యా
తరచుగ పాండవులను నిందింపగ । ధర్మములేదయ్యా
ఆనాడీధర్మవాక్కులుయెచటికి । యరగియుండెనయ్యా
ధర్మమెపుడు పాండవుల పాలగున । ధర్మమునీకయ్యా
యీవిజయుండొకవేళవిడమృత్యు । దేవతవిడడయ్యా
జేసినయధర్మమున కికఫలమును । శీఘ్రమెగొనుయయ్యా
సం॥ అరదమెక్కి రౌద్రాస్త్రముధనువున । కపుడుగూర్చెనయ్యా
రథచక్రము మరలనేలగృంగెను । రథమునుదిగెనయ్యా
అంతటకన్నీరొలుక కర్ణుడపు । డాత్మదలచెనయ్యా
అనవినికర్ణుడు మోకాలునరథ । మప్పుడెత్తెనయ్యా
కాలమాసన్నమయినయటుమదికి । గానుపించెనయ్యా
కర్ణు॥ ఉత్తమక్షత్రవంశమందునే । నుద్భవించితయ్యా
కన్నతల్లిదయ లేకనీటిలో । నన్నువిడచెనయ్యా
రాధనన్నుపాలించెనుగావున । రాధేయుడనయ్యా
భార్గవరాముని గొలచియస్త్రములు। బడసియుంటినయ్యా
కురుపతిదయచేయంగ రాజ్యమును । గొనిసుఖించితయ్యా
అనేకవిప్రులకతిదానంబుల । నరయనిచ్చితయ్యా
దానకర్ణుడనిపేరు బొందితిని । ధర్మమెరిగితయ్యా
అధర్మపరులగు కౌరవులకు సా । యంబుజేసితయ్యా
మానవతియైన ద్రుపదపుత్రినవ । మానపరచితయ్యా

సత్యవంతులగు పాండుసుతులకతి । శ్రమలనిడితినయ్యా
సమరమందుప్రాణములనువీడుచు । స్వర్గమేగుదయ్యా
అధర్మపరులకు సాయముజేయుట । హానికరంబయ్యా
సం॥ అనుచువిలపింపపార్థుఁడొకశర । మంతదీసెనయ్యా
దానికిపార్థుఁడు తపోబలంబును । ధారబోసెనయ్యా
క్షణములోనజనికర్ణునిశిరమును । ఖండించినదయ్యా
అంతటసూర్యునివిధమునకర్ణుం । డవనింబడెనయ్యా
కర్ణునితేజము సూర్యబింబమున । గలసిపోయెనయ్యా
అంతటశల్యుడు రథమునుగైకొని । యరుగుచుండెనయ్యా
కృష్ణుడతిసంతసంబుతోడనా । కిరీటినసెనయ్యా
కృ॥ భళిభళిపార్థా శపథమునిల్పిన । వాడవైతివయ్యా
యీభువిలోపలనిన్నుజయింపగ । యెవ్వరుతేరయ్యా
సురలనుగెల్చినవానికినీకీ । నరులేమగునయ్యా
సం॥ అనవినిపార్థుఁడు హరినిగనుగొనుచు । యపుడుబలికెనయ్యా
అ॥ సత్యసంకల్పుడవు నీదయచే । జయమునొందితయ్యా
పరాత్పరుండవు పరమాత్ముండవు । బంధువుండవయ్యా
భక్తులమగుమముగావగబుట్టిన । పరమేశుడవయ్యా
నిమిత్తముగ నీయుద్ధంబునునే । నిలచిజేసితయ్యా
యెల్లరునీచేజంపబడిరినే । నేనెమివేసితయ్యా
నిన్నుస్మరించినవారికి సాయము । నిలచిజేతువయ్యా
సం॥ సతతంబీవిధిదయనుజూడుమని । సరగమ్రొక్కెనయ్యా
అంతటసూర్యుండస్తాచలమున । కరిగియుండెనయ్యా
అంతటనీబలమతిదుఃఖంబున । యరుగుచుండెనయ్యా
దుర్యోధనుడతిదుఃఖముతోకడు । దూలిపోయెనయ్యా
పాండవబలములు సంతసమొందుచు । బరగబోయెనయ్యా
అమరగణములత్యద్భుతమొందుచు । యపుడుబోయెనయ్యా
కృష్ణార్జునులాధర్మజుగనుగొని । కేలుమోడ్చిరయ్యా
కర్ణునిమరణముదెలుపధర్మజుడు । కౌగలించెనయ్యా

ధ॥ మాధవానీయనుగ్రహమునదు । న్మాడెనరుండయ్యా
భయమునేటితోదీరెసుఖనిద్ర । బడయుదునేనయ్యా
సం॥ సంతసమొందుచు తమతమ ఇండ్లకు । చయ్యనజనిరయ్యా
ఓధృతరాష్ట్రమహీశ్వర కర్ణుం । డుర్విగూలెనయ్యా
నీవారలుకడుదుఃఖంబులతో । నెలవుజేరిరయ్యా
ఇంతటితో కర్ణపర్వమాయె । మహీశావినుమయ్యా
జనమేజయునకు వైశంపాయన । మునియిటులనెనయ్యా
భక్తితోడవినువారిని హరిగా । పాడునుదయమీరా
హరిచరణంబులకర్పించెను పర । మార్థము జెలువార

(వాక్యములు ౧౧౬౦)

—: ఫలశ్రుతి :—

భారతవీరులచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుదీని । విరచించెను భక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడు యీసత్కృతిని
పదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని

( కర్ణపర్వము )

సంపూర్ణము.

ఓం

శ్రీకృష్ణాయనమః

# తందనాన

# శ్రీ మహాభారతము

## శల్యపర్వము

## నెం. 1

వై॥ శ్రీయుతజనమేజయభూప । చిత్తగించుశశికులదీప
సాత్యవతేయుని వినుతింతు । శల్యపర్వమును వినుపింతు
కర్ణునిమరణంబునువినెను । కడుశోకంబును మదిగొనెను
ధృతరాష్ట్రుండపుడిట్లనెను । సుతుడొక్కడుదిక్కేవరనెను
ధృ॥ పాండుసుతులలోనొక్కండు । ఖండనముజావకయుండు
నాసుతులేజచ్చినరయ్యా । నావిధియిటులుండెగదయ్యా
దుర్యోధనుడేమొనరించె । ధైర్యముతోనెటులచరించె
సమరమెట్లు జరిగినదయ్యా । చయ్యనదిదెల్పగదయ్యా
వై॥ అంతసంజయుండిటులనెను । అవృత్తాంతము వినుమనెను
సం॥ కర్ణుడు మరణించుటగాంచె । ఘనదుఃఖము తనయుడుగాంచె
అంతటకృపుడాతనికనెను । అరయుమొకటిదెల్పెదననెను
కృపా॥ నీమదినిదియాలోచించు । నిజమనిపించిన యొనరించు
ద్రోణభీష్ములతి ఘనులయ్యా । దురముజేసి చచ్చినరయ్యా
మరియునేకయోధులుజనిరి । మనకొరకై రణమున బడిరి
పాండుసుతులు్బ్రతికియుండిరి । పరమాత్మునిసాయముగొనిరి
నరుడు సింహమనదగునయ్యా । కురుబలములు కరులగునయ
నరుండగ్ని హెూత్రంబయ్యా । కురుబలమెండినచెట్లయ్యా
హరిభీములు వాయువులయ్యా । అగ్నివృద్ధిగాంచినదయ్యా

గాల్చెను మనసేనలనయ్యా । గాదుమనకుజయమోయయ్యా
పదియేడుదినంబులుగడచె । బలముకొంచమై యిటనిలచె
మిగిలినబలమేస్వల్పంబు । మిగులశ్రమనుబొందెనిజంబు
సమరవాంఛవీడగదయ్యా । సంధికొప్పుమాసుఖమయ్యా
పాథుౕనియెదిరించెడువారు । బలవంతులుమనలోలేరు
అర్ధమువారికి నిడుమయ్యా । అథకామీవుగొనుమోయయ్యా
యీవిధివారల నొప్పింతు । యెల్లరకును సుఖమిప్పింతు
సం॥ అనవినిదుర్యోధనుడనెను । అదియెన్నటికిక గాదనెను
దు॥ కపటజూదమునుజేసితిని । కాంతనుసభకీడ్పించితిని
హరినిగట్టిగా దలచితని । అభిమన్యుని వధియించితిని
దుస్ససేనుమరణముగంటి । దురమునభీమునిగనుగొంటి
నాకుచావుగలదనుకొంటి । నాపల్కులు విడవలదంటి
క్షత్రియకులమున జన్మించి । శత్రువులకు భీతినిగాంచి
భిక్షమడిగిబ్రతుకగరాదు । బీరమువిడధర్మముగాదు
అల్పసేనయంటివిగాని । అదిదెల్పెదవినుమికబూని

## నెం. 5

అరదంబులు పదకొండువేలుమన । యందున్నవయ్యా
గజమును పదివేలేడునూర్లు ని । క్కముగనుండెనయ్యా
రెండులక్షల హయంబులిపుడుమన । యండనుండెనయ్యా
మూడుకోట్ల కాల్బలముగలవీ । నాడు దెలియుమయ్యా
పాండవులకారువేలరథంబులు । వరలుచున్నవయ్యా
లక్షగుర్రములు కోటికాల్బలము । తీక్షణమునకయ్యా
మూడువేలమత్తకరులుగలవీ । నాడుదెలియుమయ్యా
అల్పబలమువారిదగును సంశయ । మందగవలదయ్యా
తనువులుదాపకయుద్ధముసేయగ । దరలుచుండుడయ్యా
సం॥ అనుచును శల్యునిసేనాపతిగా । యపుడుజేసెనయ్యా
దు॥ ద్రోణకర్ణభీష్మాదులవలెయో । ధుండవునీవయ్యా
సరగపాండవులజంపి రణంబున । జయముబొందుమయ్యా

నిన్నునమ్ముకొని సేనలువెడలును । నీవుగావుమయ్యా
శల్యు॥ అనగశల్యుడనె పాండుకుమారుల । నైనదునుముదయ్యా
అటులగాకున్న చచ్చిస్వర్గమున । కందబోదునయ్యా
సం॥ తగువిధముగ బోరెదననగా సం । తసమునొందిరయ్యా
పాండుసుతులేమిజేతురోయనుచు । భయము నొందిరయ్యా
సరస్వతీతీరమునకుజని వి । శ్రాంతినొందిరయ్యా
ధర్మజుడావార్తనువినిమదిలో । తాపమొందెనయ్యా
శ్రీకృష్ణునకనె సేనానాథుడు । శల్యుడువినుమయ్యా
అనవిని కృష్ణుండనెశల్యుడు స । త్యముగ యోగ్యుడయ్యా
కృ॥ ద్రోణభీష్మకర్ణాదులకంటెను । దొడ్డవీరుడయ్యా
భీమపార్థ దృష్టద్యుమ్నాదుల । వీరముడుపునయ్యా
అతడుపదిహేడునాళ్ళనుండిరణ । మాచరించెనయ్యా
అలయడుసొలయడు మనవీరులు బి । ట్టలసియుండిరయ్యా
సత్వరమీదినమందునసీవే । శల్యునెదురుమయ్యా
బంధువుండనెడు ప్రేమనుజూపక । వధింపవలెనయ్యా
అతడు సామాన్యుడనుకొనబోకుము । యతిశూరుండయ్యా
ధ॥ వినిధర్మజుడనె నీదయగల్గిన । వేగజేతుమయ్యా
కౌరవబలమను మహాసముద్రము । జేరబోతిమయ్యా
పాండవనావను తరింపజేసెడి । భారమునీదయ్యా
సం॥ అనివినుతింపగతమతమనెలవుల । కందరుజనిరయ్యా
ముదముతోడ నిద్రజెందిరంతట । యుదయమాయెనయ్యా
సర్వతోభద్రవ్యూహము శల్యుడు । సరగనిల్పెనయ్యా
కర్ణసుతుల సాయంబునుగొనియా । గ్రముననిలిచెనయ్యా
అంతపాండుసుతులఖిల సేనతో । యచటజేరిరయ్యా
అంతయుద్ధమారంభమాయెనది । యత్యద్భుతమయ్యా
కరులుకరులు హరులు హరులు యుద్ధము । కనలిచేసిరయ్యా
రథికులురథికులతోడజెనంగిరి । రణమతిఘనమయ్యా
అభిమానంబున బోరుచువారలు । హతమైరోయయ్యా
నెత్తురుకేరులుబారుచుండెరా । జోత్తమవినుమయ్యా

భీమపార్థులొకదెస నీబలముల । బీరముడిపిరయ్యా
నకులసహదేవులొకదెస సేనల । నరుకుచుండిరయ్యా
అంతటశల్యుఁడు మహాగ్రహంబున । యనినిజేసెనయ్యా
కర్ణసుతుడు చిత్రసేనుడప్పుడు । కనలివచ్చెనయ్యా
నకులునిధనువును ద్రుంచి మూడు బా । ణంబులనిడెనయ్యా
మరియునకులసూతాశ్వరథంబుల । ద్రుంచజేసెనయ్యా

# నెం. 2

అంతనకులుండుకోపించె । అతనిరథమునకు లంఘించె
ఖడ్గమునుదీసిజళిపించె । కర్ణసుతుకంఠమునుద్రుంచె
అతనితమ్ములదిగనుగొనిరి । అపుడుదుఃఖంబునొందిరి
కనలినకులునిఁదాకిరి । కఠినశరములఁ గురిపిరి
నకులునిరథంబుగూల్చిరి । నకులునకుబాధజేసిరి
యిరువురొక్కనికిదాకిరి । మరణమొందింపదలచిరి
సత్వరమునకులుడెదిరెను । శక్తినతికోపముననిడెను
అంతనాశక్తివెడలెను । అద్భుతాకారమొందెను
యిరువురినినరికి చంపెను । యెల్లరకుభీతిజేసెను
అంతశల్యుండుజనుదెంచె । అపశకునములను వీక్షించె
కురువరుడు లెక్కగొనకుండె । దురమునకువేగజనుచుండె
ధర్మజునిశల్యుడెదిరెను । త్వరగకఠినశరములనిడెను
సాత్యకి శిఖండులేగిరి । శల్యుపైశరములేసిరి
ద్రౌపదీసుతులుజేరిరి । త్వరగశరవృష్టిగురిపిరి
భీమపాంచాలులేగిరి । బిట్టుగా శల్యుదాకిరి
అందరొకసారిదలపడిరి । అస్త్రశస్త్రములగురిపిరి
అంతశల్యుండు కనలెను । అంతకునిపగిదినిలచెను
ఒకరొకరికి పదిశరములు । ఉగ్రుడైవిడచె భయదములు
అందరతిబాధజెందిరి । అచటనిలువభీతినిగొనిరి
గురుసుతుండిట్లుజేసెను । కోపమునబాధజేసెను

శల్యతనయుండువచ్చెను । సరగనకులునిందాకెను
అస్త్రశస్త్రములగురిపెను । అతనికతిబాధసల్పెను
కనలినకులుండు యురికెను । ఖడ్గమున తలను ద్రుంచెను
అంతశల్యుండు వీక్షించె । అధికదుఃఖంబు మదిగాంచె
అపుడు క్షయకాలమనియెంచె । ఆగ్రహమునొంది జనుదెంచె
పాండవులసేనపైబడెను । బలములతిబాధబారెను
భీముడతికోపమొందెను । వేగముగధనువువైచెను
శల్యహయములను జంపెను । శల్యుడతికోపమొందెను
కఠినతోమరమువైచెను । కరమునంభీముడదిగొనెను
మరలదానినేవిసరెను । త్వరగసారథినిగూల్చెను
గదనుగొని శల్యుడేతెంచె । క్షణములో భీమునెదిరించె
అఖిలసైన్యములు భీతిలెను । అపుడుఘోరరణమాయెను
కొంతవరకిట్లుబోరిరి । అంతలోరక్తమయులైరి
యిరువురతిశూరులనబడిరి । యిరువురనిలోనమూర్ఛిలిరి
అంతలోకృపుడువచ్చెను । అపుడుశల్యునిగొనిచనెను
అంతదుర్యోధనుడుజనెను । ఆగ్రహమునొందిగాంచెను
చేకితానునెదిరించెను । శీఘ్రముగగదనువైచెను
చేకితానుండుజచ్చెను । జెట్టిభీముండులేచెను
త్వరగశల్యుండుజనుదెంచె । ధర్మజునితోడనెదిరించె

## నెం. 5

శల్యుడుధర్మజుపైనవాడిగల । శరములనిగుడించె
ధర్మజుండుకోపించి శరములన్ । త్వరలోసంధించె
ఒక్కబాణమున శల్యుడుధర్మజు । నురంబుభేదించె
ధర్మజుండతనిచక్రరక్షకుల । తలలనుఖండించె
మరియునతనిదేహమునకు శరముల । త్వరనిడినొప్పించె
శల్యుడతిబాధనొంది కోపింప । సాత్యకివీక్షించె
అంతనకులాదులనుసాయముగొని । యతనినిపీడించె
అంతటశల్యుండనేకవిధముల । నందరినొప్పించె

సాత్యకికనలుచు నూరుశరంబుల । శల్యునిబాధించె
యిదేసమయమని నకులుండమ్ముల । నేడిటిసంధించె
సమయమిదియంచు శల్యునిభీముడు । చాలగబాధించె
శల్యుడొకొ్కకని దెబ్బదిమూడిట । చయ్యనవొప్పించె
ధర్మనందనుని ధనువునకమ్మిడి । త్వరలోఖండించె
అంతధర్మజుండింకొకవిలుగొని । యమ్ములసంధించె
ప్రళయకాలరుద్రుండైశల్యుడు । బాణమునిగుడించె
అంతధర్మజుడు బాణఘాతచే । యపుడుమూర్ఛగాంచె
సాత్యకిభీమాదులసాయముగొని । శల్యునినొప్పించె
అతడుభీతిలక పాండవవీరుల । కమ్ములసంధించె
ధర్మజుడులేచి చక్రరక్షకుని । త్వరలోఖండించె
గురుతనయుడుపాంచాలకుమారుల । త్వరలోహింసించే
నరుడుసంశప్తకులహతశేషుల । నాశముగావించె
ధర్మజుండు శల్యునితోబోరుచు । తనమదిచింతించె
యితనిబాణములు నాశరీరమును । యెంతోనొప్పించె
శ్రీకృష్ణుని పదములనుమనంబున । జేర్చుచుధ్యానించె
అంతటకృష్ణునిదయచేబలమున । కాధిక్యతగాంచె
అంతమధ్యాహ్నమాయెరక్తనదు । లప్పుడుప్రవహించే
శల్యునెదిరింపజాలకయోధులు । చాటుకుజనిరయ్యా
అంతధర్మజుండతికోపంబున । యతనిదాకెనయ్యా
పురహరునంతటియుగ్రమూర్తియై । చురచురజనెనయ్యా
ప్రళయాంతకమగుశక్త్యాయుధమును । బ్రయోగించెనయ్యా
భగభగమండుచు శల్యునియురముకు । వచ్చితాకెనయ్యా
ముఖమునుండి రక్తంబుగ్రక్కుచును । భూమినబడెనయ్యా
శల్యుడంతప్రాణములవీడెనా । శ్చర్యమాయెనయ్యా
శల్యునితమ్ములు కనలిధర్మజుని । సరగజుట్టిరయ్యా
క్షణములోన ధర్మజుడవ్వారల । జంపివేసెనయ్యా
అంతటమిగిలిన నీసైన్యంబులు । యర్గుచుండెనయ్యా
అరుగనీకభీమాదులు వెనుగొని । హతముజేసిరయ్యా

శకునియశ్వసైన్యంబుల గైకొని । సరగవచ్చెనయ్యా
సహదేవుండా యశ్వసైన్యముల । జంపివేసెనయ్యా
కురుపతియొక్కడు దప్పనీసుతుల । గూల్చెభీముడయ్యా
సహదేవుండా శకునికుమారుని । జంపివేసెనయ్యా
సుతునిమరణమున కేడ్చిశకునితన । మతినిదలచెనయ్యా
అన్యాయమునకు తగినఫలంబిపు । డనుభవించితయ్యా
అనికోపించుచు సహదేవునిపై । యమ్ములనిడెనయ్యా
అతనిరథాశ్వంబులసహదేవుడు । హతముజేసెనయ్యా
అంతశకుని కోపంబున ఖడ్గం । బందివచ్చెనయ్యా
ఒక్కశరంబున ఖడ్గమునాతడు । యుర్విగూల్చెనయ్యా
కఠినబాణమున శకునిశిరంబును । ఖండించినడయ్యా
భీమార్జునులామిగిలినసేనల । వేగజంపిరయ్యా
అంతటపదుకొండక్షోహిణులిటు । లంతమాయెనయ్యా
తనకువెనుకయొకడులేక తనయుడు । తరలిపోయెనయ్యా
పాండవులకు రెండువేలరథములు । బరగనిలచెనయ్యా
పదువేలగుర్రంబులు కరులొక । యేడునూరులయ్యా
కాల్బలము పదివేలుమిగిలెనిది । ఘనకార్యంబయ్యా
అపుడు సేనచటజూచుచుండ సాత్యకి । నను గనెనయ్యా
తలనుగోయదలచెనన్నుముని ప్ర । త్యక్షమాయెనయ్యా
వచ్చినవ్యాసునికపుడుమ్రొక్కు । లవ్వారుజేసిరయ్యా
జంపకుడనిమునిజెప్పివెడలెను । సత్వరవిడిరయ్యా
అంతటనీసుతుడెవరికగుపడక । యపుడువెడలెనయ్యా
త్వరగనడచియొకమడుగును గనుగొని । దాగదలచెనయ్యా
సోదరులను బందుగులను దలచుచు । శోకమందెనయ్యా
విదురునిబోధలు వినకచెడితినని । వెతనుజెందెనయ్యా
పదునొకండక్షోహిణులనాధుడిటు । బారియుండెనయ్యా
వై॥ పుత్రునివిధమును వినిధృతరాష్ట్రుడు । మూర్ఛజెందెనయ్యా
యిటులకొంతసేపటికి మేల్కగొని । యేడ్చిబలికెనయ్యా

నెం. 1

ధృ॥ నూర్వురు సుతులను బడసితిని । సర్వమునాదనిదలచితిని
విదురునిపల్కులు విననైతి । భీష్మాదులుజెప్పిరినీతి

నేనుపేక్షజేసితినయ్యా । నేడిటుల ఫలించినదయ్యా
దిక్కులేక నాతనయుండు । ఒక్కడుభీతినిగొనియుండు
యింకనేనుబ్రతుకగజాలా । యింతకేమిసేయగజాల
పాండుసుతులుబ్రతికినరయ్యా । వారికిచావికలేదయ్యా
నాసుతులందరుబడిరయ్యా । నాసుతుడొకడుండినడయ్యా
అంతసుతుండేమనెనయ్యా । ఆవార్తనుదెలుపగదయ్యా
వై॥ అనగసంజయుండిటులనెను । అపుడునేనువెడలితిననెను
సం॥ మడుగుసమీపంబునసుతుని । కడుపడిజనియటగాంచితిని
ననుగనికడుయేడ్చినడయ్యా । నాతోనిటు బల్కినడయ్యా
దు॥ నావారెల్లరుజనినారు । నాకొరకేజచ్చిరివారు
పాండుసుతులుబ్రతికినరయ్యా । బంధులుకొందరుగలరయ్యా
రాజ్యలక్ష్మివదలితినయ్యా । రానుపురంబునకోయయ్యా
యీమడుగున నుండెదలేక । యెచటికైనబోయెదగాక
తగినయుపాయము జేసెదను । త్వరగశత్రువుల దునిమెదను
అర్ధభూమినిత్తురుగాని । అనుజులులేనట్టిదిబూని
సౌఖ్యమొందమతిలేదయ్యా । జనకునికిదిజెప్పగదయ్యా
సం॥ చయ్యనవాకిటులవచించె । జలస్తంభనంబొనరించె
త్వరగనన్నుబొమ్మనెనయ్యా । తానుమడుగుజొచ్చినడయ్యా
కృపగురుసుతులతివేగమున । కృతవర్మునితో దుఃఖమున
నీతనయునివెదకుటగంటి । ఆతనిచెంతకువలదంటి
శిబిరంబులకును జేరితిమి । స్త్రీజనములనంతగంటిమి
సతులురణస్థలికిని జనిరి । మితములేనిదుఃఖముగొనిరి
నీకుమారుడు యుత్సుతుండు । శోకముతోవచ్చెఘనుండు
అధర్మఫలమిది యనిదలచి । అందలిస్త్రీలనుగనినిలచి
యు॥ అమ్మలారశోకమువలదు । అరుగుడిచటనుండగవలదు
సమరంబతముగాలేదు । సతులుండుట ధర్మముగాదు
సం॥ ధర్మరాజునాజ్ఞనుగొనెను । త్వరగవారలనువేడ్కనెను
నగరంబునకేగుచునుండె । నతుమవిదురునిజా గని యుండె
యురువురుపురికేగినరయ్యా । తమజులనటనుంచిరయ్యా

# నెం. 5

గురుసుతకృపకృతవర్మలనేనట । గూడియుంటినయ్యా
పాండుసుతులు నీతనయుని । వెదకుచు వచ్చియుండిరయ్యా
కనుగొనిగురుసుతకృపకృతవర్మలు । కదలిపోయిరయ్యా
వారితోడ మడుగుచెంతకప్పుడు । జేరియుంటిమయ్యా
అంతగురుసుతుడు నీకుమారునకు । యపుడుబలికెనయ్యా
అశ్వ॥ మాముప్పూరిసాయంబుబొందుమను । మానమొందకయ్యా
అవశ్యమాపాండవులను జంపుచు । యవనినేలుమయ్యా
జచ్చినచోస్వర్గంబుగలుగు ని । శ్చయమిదివినుమయ్యా
అతిశూరుడవై చాటుకుదాగుట । యధర్మమగునయ్యా
రమ్మధైర్యమును గొనుమువేగమె । రణముసేయుమయ్యా
సం॥ అనకురుపతియనెయలసితినేటికి । యాగుడుజనుడయ్యా
దురమురేపుజేసెద మనభీముని । దూతలువినిరయ్యా
అంతనీసుతుని వెదకుపాండవుల । కపుడుజెప్పిరయ్యా
వినిధర్మజుడతి సంతసమొందుచు । వేగవచ్చెనయ్యా
తమ్ములుపాంచాలులు శ్రీకృష్ణుడు । త్వరగవచ్చిరయ్యా
అంతనేనచట డాగివారిపలు । కాలించితినయ్యా
ధర్మజుడెల్లరతోడమడుగు స । త్వరగజేరెనయ్యా
జలములోనున్నవాడు వినునటుల । సరగబలికెనయ్యా
ధర్మ॥ ఉత్తమక్షత్రవంశంబందున । యుద్భవించితీవు
యింతవరకొకడవీభూమండల । మేలుచున్నావు
పదకొండక్షోహిణులబలంబును । బరగగూర్చినావు
మాభాగముమాకిడకయడవులకు । మమ్ముదోలినావు
సకలబంధునాశంబుజేయని । శ్చయమును గొన్నావు
అందరుజచ్చినవెనుకయీమడుగు । నాశ్రయించినావు
కౌరవవంశంబునకపకీర్తిని । గావించితివీవు
రణమునమముగెల్చినచో భూమికి । రాజయ్యెదవీవు
చచ్చిస్వర్గమునకేగదలపుమా । సౌఖ్యమందెదీవు
సం॥ అభిమానుండగు నీతనయుడువిని । యపుడుబలికెనయ్యా

దు॥ భీతిచేతమడుగుజేరలేద । వ్విధమునువినుమయ్యా
అస్త్రశస్త్రములు మీకుగలవునే । నస్త్రహీనుడయ్యా
బలములుమిగిలెను మీకునేనిపుడు । బలహీనుడనయ్యా
ఆదియుగాక యుద్ధమున డస్సితిని । యైనవత్తునయ్యా
ఒక్కడొకడురణమునకురండు మి । మ్మోర్విగూల్తునయ్యా
హరితోమిమ్మెల్లరనీనాడె । హతముజేతునయ్యా
పలుపురొకనితో బోరదలతురది । పాడియెట్టులయ్యా
సం॥ అనధర్మజుడనె అస్త్రములిత్తుము । అనికివెడలుమయ్యా
ధర్మ॥ ఒక్కరొక్కరిని రమ్మంటివి నీ । కొకటిదెల్పెదయ్యా
యేవ్వరిలో రణముసేయ నొక్కని । నీవుగోరుమయ్యా
వానినిజంపిన రాజ్యపాలనము । వరలునునీకయ్యా
వానిచేనీవుజచ్చినరాజ్యము । పాలించెదమయ్యా
అన్యాయంబొనరించితివైనను । యనుజుడవోయయ్యా
హరినితమ్ములను యడుగకనేనిటు । లంటినివినుమయ్యా
సం॥ అనదుర్యోధనుడనె ధర్మాత్ముడ । వందురునిన్నయ్యా
అటులజేతునని గదగైకొనిబహు । హర్షమొందెనయ్యా
ధర్మజునకుకృష్ణుడుగోప్యంబుగ । త్వరగబలికెనయ్యా

## నెం. 1

కృ॥ అకటయెంతజేసితివయ్యా । అమాయకుండవువీవయ్యా
సకలరిపులక్షయమొనరించి । సామ్రాజ్యముగైకొననెంచి
వివిధశ్రమలందితివయ్యా । వెర్రిమాటనాడితివయ్యా
కదనవీరుడీకురువరుడు । గదాయుద్ధమున పండితుడు
యెవ్వరిలొనొకనిగోరును । యిపుడేరణమందుజంపును
యీరాజ్యంబునుగైకొనును । యిపుడదవికిమిమ్ముబంపును
గానమొదలుభీమునిబంపు । కదనమప్పుడేగనసొంపు
శపథంబీడేరునుగాదా । సర్వమిట్లుసేయగరాద
సం॥ అనగధర్మజుండపుడనెను । అనుటయెమావంతౌననెను
ధ॥ సలుపుటనీభారంబయ్యా । సర్వేశ్వరుడవు నీవయ్యా

సం॥ అనకృష్ణుడు భీమునిగనెను । అతడు మహాశూరుండనెను
కృ॥ తెలివితోడ యుద్ధముసల్పు । అలయకనీకీర్తినినిల్పు
సం॥ అనభీముడు సంతసపడెను । అపుడుగదాదండము గొనెను
ఇరువురు యుద్ధమునకుజనిరి । ఇర్వురినిర్వురుగనుగొనిరి
తక్కినవారలుగనుగొనిరి । తగుస్థలములందు విడిసిరి

## నెం. 5

అయుద్ధముగనుగొనబలభద్రు । డంతవచ్చెనయ్యా
ప్రభాసమునవారదునిచేత నీ । వార్తవిన్నడయ్యా
శిష్యులగదారణము గనుగొనగ । జేరవచ్చెనయ్యా
కృష్ణపార్థాదులెల్లరాతనికి । కేలుమోడ్చిరయ్యా
భీమసుయోధనులకాజ్ఞసలుపుచు । విశ్రమించెనయ్యా
దుశ్శకునంబులు నీకుమారునకు । దోచుచుండెనయ్యా
పర్వముగాకయెరాహువుసూర్యుని । బట్టుకొన్నడయ్యా
భూమివడంకెను శిలావర్షమ । ప్పుడు బడెనోయయ్యా
దైవవిధినిదప్పించుకొనమనుచు । త్వరగనిలచెనయ్యా
అంతభీముడాదుర్యోధనుగని । యుపుడుబలికెనయ్యా
భీ॥ కపటద్యూతము నాటిఫలంబిక । గానుపించునయ్యా
తొలగక నిలువుము యందరుజూడగ । దునిమివేతునయ్యా
సం॥ వినిదుర్యోధనుడనె బల్కులచే । బెదరువాడగాను
అధర్మమొనరింపకున్నరణంబున । హతముజేతుననెను
అనుచుభీమసేనునితో రణమున । కపుడునిలచెనయ్యా
ఇరువురురణమును ప్రారంభించిరి । యెల్లరుగనిరయ్యా
అతిఘోరంబగుపాదఘాతచే । యువనివడకెనయ్యా
గదకుగదదాకినప్పుడు మంటలు । గలుగుచుండెనయ్యా
ధ్వనికిప్రతిధ్వనులంత గిరులలో । త్వరగబుట్టెనయ్యా
వేయేటికిశేషకూర్మరాజులు । వెతనుజెందిరయ్యా
ఇరువురాకసంబునకు జనుచుఘన । దురముజేసిరయ్యా
భూతలంబునకు దిగియుద్ధంబును । నొనరజేసిరయ్యా

ఆయుద్ధంబునుగని దేవతలపు । డద్భుతపడిరయ్యా
ఇరువురి బలముల తారతమ్యములు । నరుండడిగెనయ్యా
హరియనె యిరువురిలోదుర్యోధను । డధికుండనెనయ్యా
కృ॥ బహుకాలమాయన్నచెంతనిది । బడసియుండెనయ్యా
విధినెరింగి పదమూడేండ్లీతడు । వృద్ధిజేసెనయ్యా
యిపుడీతనితోగదాయుద్ధమున । కెవరునిలువరయ్యా
అల్పవిద్యభీముడు బలంబున । యధికుండగునయ్యా
అధర్మమొనరింపకున్న భీముడు । హతమగునోయయ్యా
గదాయుద్ధమున నాభికిందిగువ । ఘాతగూడదయ్యా
తొడలుఖండించి తలగన్నెదనని । తొల్లిబలికెనయ్యా
ఆశపథము భీముండుమరచెనిక । హానిగలుగునయ్యా
సం॥ అంతదుర్యోధనుండు కోపమున । యతనిగొట్టెనయ్యా
భీముడంతమూర్ఛిల్లెపాండవులు । విలపించినరయ్యా
క్షణమునభీముడులేచెను పాథుండు । సరగజూచెనయ్యా
అర్జునుండుతనతొడలుగొట్టుకొన । నాతడుగనెనయ్యా
గనుగొనిభీముండాతనితొడలకు । గదనువిసరెనయ్యా
తొడలువిరిగిదుర్యోధనుండపుడు । పుడమినబడెనయ్యా
సురవరులంతట భీమునిమెచ్చుచు । యరిగియుండిరయ్యా
అంతటభీముడు నీసుతుచెంతకు । యరగిబలికెనయ్యా
యేకవస్త్రయగు ద్రౌపదినీడ్చుట । కిదిఫలమనెనయ్యా
అనుభవింపుమని యాతనిశిరంబును । యపుడుదన్నెనయ్యా
తనయుడొనరించుయుపకారమ్ముల । త్వరగదలచెనయ్యా
అతిక్రోధమ్మున మరలయొకసారి । యతనిదన్నెనయ్యా

నెం. 1

అంతధర్మజుడువీక్షించె । అపుడుదుఃఖమొందివచించె
ధర్మ॥ కురురాజాయిటువినుమయ్యా । పరమధర్మమెరిగితివయ్యా
మహాకీర్తినార్జించితివి । మహావైభవములనందితివి
మూకపకారమునల్పితివి । మహారణమునకా గూలితివి

సం॥ అనుచుగోడుమని దుఃఖించె । అభీమునికిటువినిపించె
ధర్మ॥ అనేకసేనలనార్జించె । అతిభీకరరణమొనరించె
రాజరాజనుచుపేర్గాంచె । రణమునశూరుల నెదిరించె
అట్టియతని దన్నితివయ్యా । అపకీర్తినిబొందితివయ్యా
సం॥ అంతటబలరాముడులేచె । ఆగ్రహమున భీమునిజూచె
హలాయుధమునంతధరించె । అభీముని జంపగనెంచె
అంతకృష్ణుడపుడేతెంచె । హలాయుధునికరముగ్రహించె
వినయము తో నిట్లనెనయ్యా । విమశిక్షించిజనుమోయయ్యా
కృ॥ నాభిక్రిందగొట్టినడనుచు । యీభీము డు దన్నినడనుచు
అతికోపమునందితివయ్యా । ఆలింపుము దెలిపెదనయ్యా
అన్నమందువిసమిప్పించె । అతివనుసభలోకీడ్పించె
సాధ్వీవలువలనొలిపించె । సరగవీరియిలుగాల్పించె
అరణ్యంబునకు బంపించె । అభిమన్యునియిటుజంపించె
యెరిగియూరకుంటివిగాద । యిపుడు కనలగామర్యాద
భీముడుమునుశపథమునలిపె । వీరుండైశపథమునిలిపె
తగినఫలంబీతడుగొనెను । తప్పులేదు భీమునియెడను
సమీపించెకలియుగమయ్యా । చాలునీవువెడలగదయ్యా
సం॥ అనవిని బలరాముడుజనెను । హరికి నీకుమారుండనెను

## నెం. 5

కంసదాసపుత్రామోహంబును । గావించితివనెను
ననునిందించెదవేల నీగుణము । నాకుదెలియుననెను
అర్జునునకు నీవుదెల్పుసంజ్ఞను । యతడుజేసెననెను
అంతటభీముడు తొడలువిరుగనే । యంగబూనెననెను
దు॥ యీశిఖండిపేరుతోడభీష్ముని । యిలనుగూల్చితయ్యా
ధర్మజునిచే బొంకించిగురువరుని । త్వరగజంపితయ్యా
సమరమందురథముగ్రుంకకర్ణుని । జంపించితివయ్యా
భూరిశ్రవునికంఠంబుగూల్చుమని । బుద్ధిజెప్పితయ్యా
చీకటులుజేసి సైంధవునిజంప । జేసియుంటివయ్యా
సమరధర్మమునువీడి నన్నిటుల । జంపించితివయ్యా

కపటివి పాపాత్ముండవునినుగన । గలుగుపాపమయ్యా
సం॥ అనగనవ్వి హరిబల్కె నీకర్మ । మునకిఫలమయ్యా
ఒరులనిందింపలాభమేమి నీ । పూరకుండుమయ్యా
నీతనయునిపై సురలుపుష్పము ల । నేకగురిపిరయ్యా
అంతపాండవులు యన్యాయముమన । దనిచింతిలిరయ్యా
హరిగని వారికి సమాధానమపు । డాచరించెనయ్యా
అంతసూర్యుడస్తాద్రికిజనెవా । రపుడువెడలిరయ్యా
తమతమశంఖధ్వనులను సల్పుచు । త్వరగబోయిరయ్యా
హరిసాత్యకినిజ పాండుకుమారుల । నంతబిలచెనయ్యా
కొంతదూరమునకేగిరాత్రి వి । శ్రాంతిగొందుమయ్యా
తక్కినవారల శిబిరముజేరగ । త్వరగబంపెనయ్యా
అర్వురంతతమతమరథములగొని । యరుగుచుండిరయ్యా
కొంతవరకేగి నరునిగాంచిహరి । యంతబలికెనయ్యా
ధనుస్తూణీరములుగొని రథమును । త్వరలోదిగుమయ్యా
వినిహనుమంతుడు భూతంబులతో । వెడలిపోయెనయ్యా
హరినరులంతటయతివేగముతో । యరదముదిగిరయ్యా
అశ్వములతోరథముభస్మమై । యపుడుగూలెనయ్యా
నరుడద్భుతపడియిదియేమనగా । హరియిటులనెనయ్యా
కృ॥ గురుభీష్మాదులయస్త్రములిందున । గూర్చియుంచితయ్యా
హనుమంతుడు జనెనేనుదిగితినిది । యవనిగూలెనయ్యా
సం॥ అనగధర్మజాదులుశ్రీకృష్ణుని । యపుడుబొగడిరయ్యా
అంతదారకుడు శ్రీకృష్ణునిరథ । మపుడుదెచ్చెనయ్యా
వారలంతయోగవతీయనునది । జేరబోయిరయ్యా
అచట నిలచిరన జనమేజయుడా । మునిపతికనెనయ్యా
అవ్వలికథదెల్పుమనగ మునివరు । డంతదెల్పెనయ్యా
హరినిగాంచి ధర్మజుడనెకరిపురి । కరుగుమునీవయ్యా
ధర్మ॥ సుతులుజచ్చిరని గాంధారికికడు । శోకంబగునయ్యా
తనపుత్రుల జంపితిమనిశాపము । ద్వరగబెట్టునయ్యా

త్వరగనీవేగి గాంధారిని శాం । తముగ జేయుమయ్యా
మహాపతివ్రతశాపమిడినచో । మరణించెదమయ్యా
వైశ॥ అనగశ్రీకృష్ణుడతనిమెచ్చుకొని । యపుడువెడలెనయ్యా
శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రునిచెంతకు । శీఘ్రమేగెనయ్యా
గాంధారీధృతరాష్ట్రులచట దుః । ఖమున నుండిరయ్యా
అంతకుమునుపె వ్యాసుడచ్చటికి । యరుదెంచినడయ్యా
పాండవులకుశాపమిత్తురని ముని । వచ్చియుండెనయ్యా
శాంతవాక్యములతోడ వారలను । శాంతిజేసెనయ్యా
అంతహరిజేరిముగ్గురికి ప్రణుతుల । నందజేసెనయ్యా
అందరికన్నను గొప్పధ్వనితోడ । హరియేడ్చినడయ్యా
అధంపతులకువ్యాసుడువినునటు । లపుడుబలికెనయ్యా
కృ॥ భీష్మవిదురులును మీరునేననగ । వినకజెడినడయ్యా
సకలజనక్షయకాలమిదియనుచు । సరగదెలియుమయ్యా
పాండవులపైన కోపమునొందగ । భావ్యముగాదయ్యా
ఐదూళ్ళిమ్మని నేనుబల్కమీ । రాలించితిరయ్యా
అంతకైననొప్పకున్కిచేనిటు । లాయనువినుమయ్యా
వివేకవంతులు గావునమీరిక । వెతనువీడుడయ్యా
దుష్టబుద్ధిగురుసుతుడు పాండవుల । దున్మదలచునయ్యా
వై॥ అజ్ఞయొసంగుడుబోదునననవార । లపుడుబలికిరయ్యా
వ్యా ధృ॥ త్వరగబోయి పాండవులగావుమా । దయాళుండవయ్యా
వై॥ అనవినికృష్ణుడు వెడలిపాండవుల । నంతజేరెనయ్యా
శాంతమొనర్చితిననగ వారువి । శ్రాంతిజెందిరయ్యా
అంతటధృతరాష్ట్రుడుసంజయునకు । యపుడుబలికెనయ్యా

## నెం. 1

ధృ॥ పిదపనేమిజరిగినదయ్యా । వేగదెల్పువినియెదనయ్యా
సం॥ అంతసంజయుండిటులనెను । అవనిపైన సుతుడుగూలెను
అపుడుపాండవులు జనిరయ్యా । అచటికినేజేరితినయ్యా
తొడలువిరగికూలినవాని । ధూళినిండగప్పినవాని

స్మృతినివీడి యుండినవాని । జేరిపల్కరించితిబూని
అంతటస్మృతినొందినడయ్యా । అతిదుఃఖముతోననెనయ్యా
దు॥ భూమండలమేలితినయ్యా । భోగమ్ములనొందితినయ్యా
యజ్ఞంబులజేసితినయ్య । అతిథులబూజించితినయ్యా
బలములతో వచ్చితినయ్యా । బవరంబునుజేసితినయ్యా
శమంతపంచకముననేను । చావునుబొందగనున్నాను
స్వర్గంబునకేగెదనయ్యా । సతులకిట్లు దెల్పగదయ్యా
తలిదండ్రులకిటులనుమయ్యా । దైవంబిటుజేసినడయ్యా
కాలగతులుదప్పగబోవు । గడచినదినములు మరిరావు
సం॥ అనుచీవిధిబల్కినడయ్యా । అప్పుడూరకుండినడయ్యా
కృపాచార్యకృతవర్మలతో । గురుసుతుండుకడుదుఃఖముతో
అపుడచటికివచ్చినడయ్యా । అదిదుఃఖమునొందినడయ్యా
అశ్వ॥ మహాసౌఖ్యమొందితివయ్యా । మమ్మెల్లరగాచితివయ్యా
అధర్మయుద్ధంబొనరించి । అవనిగూల్చిపోయిరిమించి
అపాండవులనుదునిమెదను । అత్మశాంతినికజేసెదను
నాకభిషేకంబొనరించు । నన్నువేగముగ బంపించు
సం॥ అపుడునీసుతుడు వినెనయ్యా । అతిసంతసమునుగొనెనయ్యా
అంతకృపుడు జలములుదెచ్చి । అభిషేకించుచు మదిమెచ్చి
అంతముగురువెడలినరయ్యా । అత్మజుడటనుండినడయ్యా
శల్యపర్వమునువిన్నాడు । జనమేజయుడటులన్నాడు
జన॥ అవ్వలికథవినియెదనయ్యా । అతిదయతో దెల్పగదయ్యా

—: ఫలశ్రుతి :—

భారతవీరులచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుదీని । విరచించెను భక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడు యీసత్కృతిని
సదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని

(శల్యపర్వము)
సంపూర్ణము.

ఓం

శ్రీకృష్ణాయనమః

# తందనాన

# శ్రీ మహాభారతము

## సౌప్తికపర్వము

## నెం. 1

వైశం॥ శ్రీజనమేజయభూపాలా । చిత్తగింపుశుభగుణజాలా
సాత్యవతేయుని వినుతింతు । సౌప్తికపర్వమువినుపింతు
అంతటధృతరాష్ట్రుండనెను । ఆముప్పురుబలయుతులనెను
ధృ॥ సమరమెట్లు జేసినరయ్యా । సత్వరమది దెల్పగదయ్యా
వినగకోర్కమదిజన్మించె । అనగసంజయుడు విన్పించె
సం॥ గురుసుతాదులంతటజనిరి । కొంతవరకుబోయినిలచిరి
అంతనొక్కకొలనునుగనిరి । అచటవిశ్రమంబునుగొనిరి
అపుడురాత్రమధికంబాయె । అంధకారబంధురమాయె
కృపకృతవర్మలుశ్రమనొంది । అపుడునిద్రజెందిరిగుంది
గురుసుతుండునిద్రనువిడెను । తనువునొకటిజూచుచుండెను
అనేకకాకులు వృక్షమున । అలసినిద్రజెందెముదమున
అంత యులూకంబరుదెంచె । ఆతరువునకాకులగాంచె
నిద్రగొనెడివాటినిగొనెను । నిముసములో జంపదలచెను
కొన్నిటికాళ్ళనుఖండించె । కొన్నిటితలలను ఖండించె
అన్నిటినిటుహతమొనరించె । అతిశూరత్వముప్రకటించె
అపుడుగురుసుతుడుగనెనయ్యా । ఉపదేశంబనుకొనుమయ్యా
అశ్వ॥ శిబిరములోజేరగవలయు । శిరములు ఖండించగవలయు
యులూకంబుజెప్పినవిధము । యోర్చిజేతుననిగొనెముదము

సం॥ కృపకృతవర్మలమేల్కొలిపె । అపుడాసంకల్పముదెలిపె

## నెం. 5

కృపా॥ అదివినికృపుడనె యీపనిజేయుట । యతిపాపంబయ్యా
నిద్రించినవారలజంపుటయన । నీతిబాహ్యమయ్యా
పాండుకుమారులు ధర్మమూర్తులని । బరగదెలియుమయ్యా
శౌరిసహాయముగల్గినవారెటు । జత్తురువినుమయ్యా

సం॥ వినకగురుసుతుండంతబయనమై । వెడలుచుండెనయ్యా
శిబిరములోనికి బోవుచుండనొక । చిత్రమాయెనయ్యా
యీశ్వరుండొక్క భూతవేసమున । యెదురునిలచెనయ్యా
ఘోరరూపమునసేరుదెరచిజను । దారినిలచెనయ్యా
అనేకకృష్ణులుయతనిముఖంబున । యపుడుబుట్టిరయ్యా
గురుసుతునకన్నిదిక్కులకృష్ణులు । త్వరగనిలచిరయ్యా
వేలకొలదికృష్ణులను గాంచియతి । భీతిజెందెనయ్యా
కృపుడుజెప్పినటు వినకపోతినని । కేలుమోడ్చెనయ్యా
త్వరగకైలాసవాసునిమదిలో । ధ్యానించినడయ్యా
తనశరీరమాశివునకర్పింప । దలచినిలచెనయ్యా
అంతటభూతంబగ్నిరూపమై । యచటనిలచెనయ్యా
శివునకాహుతిగజేతుతనువునని । జేరబోయెనయ్యా
మహాదేవయని గురుసుతుడంతట । మంటలోబడెనయ్యా
కాలిభస్మమైకూలకముందర । శూలినిగనెనయ్యా
నాగభూషణుండైనశర్వునకు । నతులుజేసెనయ్యా
అంతశివుడు సంతసించిబల్కెను । యతిధీరుడవయ్యా
ఖడ్గమిచ్చెదను గొనిశత్రువులను । ఖండించగదయ్యా
కాలమాసన్నమాయెవీరికని । ఖడ్గమిచ్చెనయ్యా
అదృశుడైహరుడాతనితనువున । యపుడుజేరెనయ్యా
గురుతనయుండపుడాశిబిరంబున । త్వరగజేరెనయ్యా
అలసినిద్రించువారలనందరి । నపుడుజూచెనయ్యా
మొట్టమొదట దృష్టద్యుమ్నునిగళ । మట్టిగోసెనయ్యా

పిదపద్రౌపదీతనయులనందరి । వేగజంపెనయ్యా
అటుపైశిఖండి కంఠమునరుకుచు । యరుగుచుండెనయ్యా
ఐదువేలగుర్రంబులకంఠము । లపుడుగోసెనయ్యా
యేడునూర్లగజములకంఠమ్ముల । నిలనుగూల్చెనయ్యా
రెండువేలరథికవరులనంతట । ఖండించినడయ్యా
నెత్తురుటేరులు బారెనంతకురు । నేతావినుమయ్యా
యెల్లరినిట్టులహతముజేసియత । డేగెనువినుమయ్యా
అంతటకృపకృతవర్మలకివ్విధ । మంతజెప్పెనయ్యా
బహువేగంబునకురుపతిచెంతకు । వారుజేరిరయ్యా
వచ్చిపోవుప్రాణంబులుగల్గిన । వానిబిలచెనయ్యా
ఓదుర్యోధనపాండవబలముల । నుర్విగూల్చితయ్యా
హరిసాత్యకులును పాండవులుదక్క । యందరుబడిరయ్యా
బహుముదమునవినినీసుతుడంతట । ప్రాణమువిడెనయ్యా
అతిదుఃఖముచే గురుతనయాదులు । యపుడువెడలిరయ్యా
వ్యాసుడిడినదివ్యదృష్టినాకిపు । డంతమాయెనయ్యా
జనమేజయు డవ్వలికథనడుగగ । మునియిటువినిపించె
వై॥ అంతదెలవారెదృష్టద్యుమ్ముని । యనుచరుడేతెంచె
పాండుసుతులగని యేడ్చుచువాడీ । వార్తనువినుపించె

## నెం. 1

ధర్మరాజుయదివినెనయ్యా । త్వరగమూర్ఛజెందినడయ్యా
కొంతవరకుమేల్కనుగాంచె । కొడుకులకైయిటువిలపించె
ధర్మ॥ భీష్మాబ్ధినిదరియించితిమి । భీతినిసగమును వీడితిమి
ద్రోణాగ్నినిదాటితిమయ్యా । దొడ్డతనముగాంచితిమయ్యా
కర్ణవ్యాఘ్రము బడెనయ్యా । కదనజయము నొందితిమయ్యా
పదునెనిమిదిదినఘులు సుతులు । బవరముజేసిరి బలయుతుల
బడలినిద్రజెందినవారు । బ్రాహ్మణునకు జిక్కిరివారు
గురుసుతుడనినమ్మితిమయ్యా । కులక్షయము జేసినడయ్యా
పాంచాలులవంశక్షయము । బ్రాహ్మణుండుజేసెనునిజము
యిక్రతికినలాభములేదు । యెవరినేమనగపనిగాదు

వై॥ అనుచీవిధమేడ్చినదయ్యా । అందరుదుఃఖించినరయ్యా
ద్రౌపదిజనుదెంచినదయ్యా । తనతనయులగనఁగొనెనయ్యా
అవనింబడిమూర్ఛిలెనయ్యా । అంతలేచియిటులనెనయ్యా
ద్రౌ॥ ప్రాణనాథులారావినుడీ । వయనమైవేగమెఱనఁడీ
నాతనయులఁజంపినవాని । ప్రీతిలేక చంపుడుబూనీ
ఇటులజేయకుండితిరేని । యిపుడెజత్తు యోగముబూని
వై॥ అనవినిభీముడుకోపించె । అపుడేపయనముగావించె
సాయంబుగనకులునిగొనెను । సరగనతనిఁజంపగఁజనెను
అంతటశ్రీకృష్ణుండనెను । అతడుమహాశూరుండనెను
కృ॥ భయంకరాస్త్రముగలదయ్యా । బాధజెందుభీముండయ్యా
మునుద్వారకకతడరుదెంచె । పూజలగొని యిటువిన్పించె

## నెం. 5

నేనుధరించెడి చక్రమిడుమంచు । నిలచికోరెనయ్యా
అంతనేనంటియఁదిధరించుటకు । యర్హతలేదయ్యా
బలరాముడు ప్రద్యుమ్నుడుదీనిని । బడయకుండిరయ్యా
చక్రముధరింపజాలక పాథుఁడు । శర్వువేడెనయ్యా
పాశుపథాస్త్రముబొంచెగానియిది । బడయకుండెనయ్యా
గానదీనినికబట్టజాలవనగై । కొనుదనేనయ్యా
అనగనేనిడెదగైకొనుమనగా । గొనగనెంచెనయ్యా
చక్రమునంతటరెండురకంబుల । సరగబట్టెనయ్యా
అశక్తుడై లేపజాలకుండిన । యతనికంటినయ్యా
అడిగినచక్రంబెందుకనగ । యతడుబలికెనయ్యా
బ్రహ్మశిరోనామకాస్త్రమొక్కటి । బరగబొందితయ్యా
నీచక్రముగొని రణరంగంబున । నిన్నుగొలుతునయ్యా
ధరియించుటకై యశక్తుండనని । దరలిపోయెనయ్యా
అట్టివానిపై భీముండరిగెను । ఆపదయగునయ్యా
వై॥ అతివేగంబున బోవుదమనివా । రరుగుచుండిరయ్యా
శీఘ్రము భీముడుమునులయాశ్రమము । జేరబోయెనయ్యా
తపమొనరింపగబూనినయశ్వ । త్థామకనియెనయ్యా

కపటమూనినిద్రించువారలను । ఖండించితివయ్యా
హతముజేతునిన్నుగురుతనయుం । డపుడుజూచెనయ్యా
సమంతకంబగునాయస్త్రంబును । సరగవేసెనయ్యా
అపాండవంబొనరించుమనగనది । యపుడువెడలెనయ్యా
భగభగమంటలుగ్రక్కుచుయస్త్రము । బయనమాయెనయ్యా
భువనంబులుభస్మంబొనరింపగ । బూనియుండెనయ్యా
కృష్ణుండాయస్త్రవేగమునుగని । కిరీటికనెనయ్యా
కృ॥ అన్యాస్త్రంబులతో నీయస్త్రం । బంతముగాదయ్యా
బ్రహ్మశిరోనామకాస్త్రమిప్పుడు । బ్రయోగింపుమయ్యా
వై॥ అంతనరుడు గురునిదలచియస్త్రం । బపుడువేసెనయ్యా
ఆరెండస్త్రములతిభయదంబగు । యనినవొనర్చెనయ్యా
అంతనారదుండతివేగంబుగ । యచటజేరెనయ్యా
వ్యాసుడుమొదలగు మౌనులగని యి । ప్పగిదిబల్కెనయ్యా
నా॥ నరగురుసుతాస్త్రములచే లోకము । నశించునోయయ్యా
వై॥ శాంతినొందింపుమనగవ్యాసుడీ । సరణిబల్కెనయ్యా
వ్యా॥ పార్థాజ వీటినిశాంతిసేయుమన । బల్కెనువినుమయ్యా
అ॥ నాయస్త్రంబునుశాంతిజేయునది । నాచేగాదయ్యా
వై॥ అనితనయస్త్రము శాంతిజేయుమని । యాతనికనెనయ్యా
వ్యా॥ అశ్వత్థామాయికనీయస్త్రము । నాపవలయునయ్యా
వై॥ అతులజేయుటకు యశక్తుడైయపు । డతడుబలికెనయ్యా
అశ్వ॥ వీరినేమనదు సతులగర్భముల । జీరకవిడదయ్యా
కృ॥ శ్రీకృష్ణుండనె యుత్తర కడుపున । శిశువునిలచెనయ్యా
అతనినిగాపుమునావాక్యంబుల । నాదరించుమయ్యా
అశ్వ॥ వినిగురుసుతుడనె వీవనినట్టుల । యొనర్పనోయయ్యా
వై॥ అనగశ్రీకృష్ణుడతిక్రోధమ్మున । యపుడుబలికెనయ్యా
మూడువేలేండ్లుమహాయోగివై । పుడమినుండుమయ్యా
బాలఘాతిపతిదుష్టుడవనిశా । పంబుబెట్టెనయ్యా
కృ॥ నాపరాక్రమము జూపెంచెదగురు । నందనవినుమయ్యా
ఉత్తరాగర్భమ్మునందలి బాలుడు । యోగ్యుండగునయ్యా

నాచేరక్షితుడగు నీయస్త్రము । నశించునిజమయ్యా
నీశిరమందలిమణినిపార్థునకు । నీవిడుమోయయ్యా
యిటులజేయకుండినచోయాపద । లిపుడందెదవయ్యా
వై॥ అందరుమౌనులు యటులసేయుయో । గ్యమనిపల్కిరయ్యా
వెతనుజెందిగురుతనయుడుమణినా । విజయునకిడెనయ్యా
అంతమణినిగొని పాండవులెల్లరు । యపుడువెడలిరయ్యా
ద్రౌపదికప్పుడు మణినియొసగిశాం । తముజేసెనరయ్యా
అస్త్రముత్తరాగర్భస్థునిపై । కంతవెడలెనయ్యా
సర్వజ్ఞుండగుశ్రీకృష్ణుండది । సత్వరగనెనయ్యా
తనచక్రంబున యస్త్రఖండనము । త్వరగజేసెనయ్యా
శిశువునుగాచెను యెవరెరుగరుహరి । జెప్పకుండెనయ్యా
అంతకృష్ణుడవ్వారలశాంతము । నపుడుజేసెనయ్యా
సౌప్తికపర్వము జనమేజయునకు । సంయమివినుపించె
భక్తితోడవినువారికిహరిసం । పదలిడుదయమీర

—: ఫ ల శ్రు తి :—

భారతవీరులచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుదీని । విరచించెనుభక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడుయీసత్కృతిని
సదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని
(వాక్యములు ౩౯౦)

( సౌ ప్తి క ప ర్వ ము )

స మా ప్త ము.

ఓం

శ్రీకృష్ణాయనమః

# తందనాన

# శ్రీమహాభారతము

## స్త్రీపర్వము

వై॥ శ్రీయుత జనమేజయరాజ । చిత్తగించుయినసమతేజ
వైశంపాయను వినుతింతు । స్త్రీపర్వంబును వినుపింతు
సుతులెల్లరుజచ్చినరనుచు । బ్రతుకుపైన యాశనునిడుచు
ధృతరాష్ట్రుడుకడు విలపించె । హితమతిసంజయుడెరిగించె
సం॥ మతిమంతుండవునీవయ్యా । వెతనుబొందగాదగదయ్యా
చచ్చినవారలగనుమయ్యా । సత్కర్మనుసేయగదయ్యా
వై॥ అనధృతరాష్ట్రుండిటులనెను । అకటమందభాగ్యుడననెను
ధృ॥ శ్రీకృష్ణుడుజెప్పినడయ్యా । చెడెదవనుచుబలికినడయ్యా
విదురుడుజూదము వలదనెను । బీజముకలహంబునకనెను
సుతులెల్లరు జచ్చెదరనెను । గతిలేకయెచింతిలుదనెను
యెవరిపల్కు విననునొంటి । యీసిరిశాశ్వతమనుకొంటి
దుష్టబుద్ధినైనేనుంటి । తుదకీయనుభవమునుకొంటి
వై॥ అనగవ్యాసమునియరుదెంచె । అతనితోడనిటువివరించె
దుఃఖము తగదనుచువచించె । తొల్లిటికథయిటువినుపించె

## నెం. 5

వ్యా॥ మున్నొకదినమునస్వర్గముజేరగ । బోయియుంటినయ్యా
అచటభూదేవి సకలదేవతల । కంతబలికెనయ్యా
పాపాత్ముల భారంబుమోయుచును । బడలియుంటినయ్యా

అనగనవ్వి నారాయణుండుదా । నపుడుబలికెనయ్యా
విష్ణు॥ ధృతరాష్ట్రుండనురాజుగలడతడు । దివ్యబలుండమ్మా
ఆతనిసుతులునూర్వురు దుర్యోధను । డగ్రజుడగునమ్మా
అతనకిసాయము సకలభూపతులు । యాచరింతురమ్మా
యెందరోనీతిబోధింతురువా । డేవగించునమ్మా
కల్యంశంబునబుట్టెనుగావున । ఘనబలుడగునమ్మా
కురుక్షేత్రమున ఘోరరణంబగు । అరయుచుండుమమ్మా
పదునెన్మిదియక్షోహిణిసేనలు । భంగమొందునమ్మా
అందరుజత్తురు భూభారంబిక । యంతంబగునమ్మా
దుఃఖముజెందక వెడలుమనగనా । తొయ్యలిజనెనయ్యా
వ్యా॥ అదికారణముగ సకలజనంబులు । హతముజెందిరయ్యా
యేలదుఃఖమొందెదవుగానున్న । దేలపప్పునయ్యా
దేవరహస్యముదెల్పితిగావున । దెల్విబొందుమయ్యా
పాండుసుతులు నినుధర్మబుద్ధితో । బరగజూతురయ్యా
వారియందు వాత్సల్యముతోడుత । వరలుచుండుమయ్యా
వై॥ అనుచుదుఃఖోపశమనమొనర్చుచు । యతడువెడలెనయ్యా
నిజముదెలసిధృతరాష్ట్రుడు దుఃఖము । నిలిపివేసెనయ్యా
విదురునిగనుగొనిపోలికలనుగన । వెడలుదమనెనయ్యా
గాంధారీమొదలైనసతులతో । కలసివెడలెనయ్యా
పురవీధులలో యనేకరోదన । ములనుసలిపిరయ్యా
ధృతరాష్ట్రుడెమూలంబుచీనికని । దిట్టుచుండిరయ్యా
తమతమబంధుజనంబులకేడ్చుచు । తాముపెడలిరయ్యా
కృపగురుసుతకృతవర్మలువారికి । యపుడుబల్కిరయ్యా
యెల్లరితో నీతనయుడు స్వర్గం । బేగియుండెనయ్యా
అనుచువారేగధృతరాష్ట్రాదులు । యచటికిజనిరయ్యా
పాండుతనయులాతనినోదార్చగ । వచ్చియుండిరయ్యా
పాదంబులపైబడినధర్మజుని । బట్టిలేపెనయ్యా
కౌగలించిభీమసేనుడెననె । కడువడియునెనయ్యా

తనతనయుల జంపినడని యాతని । దునుమనెంచెనయ్యా
సర్వజ్ఞుండగుశ్రీకృష్ణుండది । సరగదెలిసెనయ్యా
త్రికాలవేదుండీవరకేయిది । దెలసియుండెనయ్యా
యినుముచేతభీమసేనుప్రతిమను । యేర్పరించెనయ్యా
దానినెవరెరుగకుండగదాచుచు । త్వరగదెచ్చెనయ్యా
అందరుజూడగ ధృతరాష్ట్రునకది । ముందునిలిపెనయ్యా
అతడేభీముండనుచు కరంబుల । కందజేసెనయ్యా
కనలుచుఘోరంబగునాప్రతిమను । కౌగలించెనయ్యా
కౌగలించివిడప్రతిమతునుకలై । క్షణమునబడెనయ్యా
అచటగలవారలదిగనియద్భుత । మందుచుండిరయ్యా
భీముడు వేయేన్గుల బలయుతుడని । పేరుపొందెనయ్యా
చచ్చెభీముడని ధృతరాష్ట్రుడుమది । సంతసపడెనయ్యా
పైకికపటమున భీమునిచావుకు । శోకమొందెనయ్యా
అంతటకృష్ణుడు నవ్వుచుకురుపతి । కపుడుబలికెనయ్యా
కృ॥ చపలచిత్తుడానీచేభీముడు । చావడువినుమయ్యా
జూదమాడుటకు వలదనిచెప్పిన । జూచుచుంటివయ్యా
సభకుద్రౌపదిని యీడ్చెడువేళల । శాంతమూనితయ్యా
యెల్లసుతులనంతమొందసేయగ । నీవెమూలమయ్యా
యీవరకొనరించినయన్యాయం । బింతకాయెనయ్యా
యిపుడె భీమునిజ బంపదలచితివి । కపటాత్ముడవయ్యా
యేనునీమనంబెరిగితిగావున । యిటులజేసితయ్యా
పాండుకుమారులెదిక్కునీకనుచు । బల్కియుంటినయ్యా
ధర్మాత్ములు నీతనయునితమ్ములు । దయనుజూడుమయ్యా
వై॥ అని శ్రీకృష్ణుడు బల్కధృతరాష్ట్రు । డపుడుబలికెనయ్యా
సత్యసంకల్పుడవునీయాజ్ఞను । సలిపెదననెనయ్యా
గాంధారికిమ్రొక్కుటకు పాండవులు । కదలిపోయిరయ్యా
సుతులుజచ్చిరను దుఃఖముచేనా । సుదతియుండెనయ్యా
ధర్మజునింగని శాపమునెట్టగ । దలచుచుండెనయ్యా
అదియెరింగివ్యాసమౌనియచటికి । యరుదెంచినడయ్యా

గాంధారినిశాంతమొందింపని । కృరణిబల్కెనయ్యా

## నెం. 1

వ్యా॥ కొడుకులకై వగవకుమమ్మా । కోపంబునుజెందకుమమ్మా
నీతనయులదీవించితివి । యీతీరునవచియించితివి
ధర్మమున్నహరికరుణించు । తప్పకజయమేప్రాప్తించు
అధర్మమునుహరికోపించు । అపజయమగునటుగావించు
గానయధర్మాత్ములు సుతులు । క్షయముజెందిరిట దుర్మతులు
స్వర్గసుఖము బొందెదరమ్మా । శాంతముమదిలోగొనుమమ్మా
పాండుసుతులుధర్మముగనిరి । పరమాత్మునిసాయముగొనిరి
యూరకశాపంబిడకమ్మా । ఉత్తములనిదెలియగదమ్మా
సుతులవిధముగణగొనుమమ్మా । సుఖమప్పుడు మాకగునమ్మా
ఊర్వసిపాథుణ నిశపియించె । ఉపకారంబనినరుడెంచె
ధార్మికులకు శాపంబిడిన । తప్పగునటుదప్పకుమమ్మా
వై॥ అంతపాండవులు జనుదెంచి । ఆపెపదములకు ప్రణుతించి
వ్యాసునిపదములకుమ్రొక్కిరి । అందరచటవిశ్రమించిరి
గాంధారీకన్నులకంత । గట్టినవస్త్రముజనెనంత
ధర్మజుపదనఖములగనెను । త్వరగనల్లదనమవిగొనెను
అంతలోనశాంతముగాంచె । అందరికటదీవనలుంచె
దివ్యదృష్టి మౌనియొసంగె । దేరిగాంచుమనసతిపొంగె
వచ్చినవారినిగనెనయ్యా । చాలాదుఃఖము గొనెనయ్యా

## నెం. 3

ఆపెహరినిగనెనయ్యా । అపుడిట్టులబల్కెనయ్యా
గాం॥ దుర్యోధనుగనుమయ్యా । దురమునందు బడెనయ్యా
వై॥ అనుచాతనిపైనబడెను । అపుడిట్టులదుఃఖపడెను
గాం॥ అవనిని పాలించితివి । అతిసుఖములనందితివి
యెందరన్నవినకుంటివి । యేమిసౌఖ్యమును గొంటివి
తనయాయిటువినుమయ్యా । తల్లినినేవచ్చితయ్యా
మాకికదిక్కెవరయ్యా । మమ్మెవ్వరుగాతురయ్యా

హంసతూలికల విడిచితివి । అకటనేలబండితివి
నీసతివచ్చినదయ్యా । నీవుబల్కరించుమయ్యా
వై॥ అనుచుదుస్ససేనుగనెను । అపుడుమూర్ఛబడిలేచెను
తక్కినతనయులగనెను । గ్రక్కునయభిమన్యుగనెను
కర్ణద్రోణులగనెను । కడువడి దుఃఖముగొనెను
భీష్మునిగనిదుఃఖించె । వేగమెశకునినిగాంచె
సైంధవునిగనుగొనెను । సత్వరముగ హరినిగనెను
అతికోపంబును గొనెను । అపుడివ్విధముగయనెను

# నెం. 5

గాం॥ శక్తియుతుడవై రణముగానటుల । సల్పకుంటివయ్యా
ఉభయవంశములనెల్లవారలను । యుర్విగూల్చితయ్యా
సాయమైపాండవులకు జయంబును । సంగ్రహించితయ్యా
బలయుతులగునాసుతులతంత్రమున । వంచించితివయ్యా
కపటనాటకము సూత్రధారివై । గావించితివయ్యా
నావంశము నిర్వంశమొనరించి । నాడవునీవయ్యా
నేటికిముప్పదియారేండ్లకు నా । మాటజరుగునయ్యా
జ్ఞాతులెల్లకలహించియిటులనే । చత్తురువినుమయ్యా
అరణ్యమందునదిక్కులేకనీవం । తమగుదువయ్యా
పాతివ్రత్యమహిమచేత శా । పంబు నిచ్చితయ్యా
వై॥ అనగనవ్విశ్రృష్ణుడు గాంధారికి । యపుడుబలికెనయ్యా
కృ॥ యాదవులీవరకే మునిశాపం । బందియుండిరమ్మా
మహాబలులు సురలైనవారిబల । మార్పజాలనమ్మా
తప్పకనేనేవారినిదునుమగ । దలచియుంటినమ్మా
నీశాపమును సహాయముగాగొని । నేనుజేతునమ్మా
ఆగ్రహమువీడియపరక్రియలను । యాచరింపవమ్మా
వై॥ అనగపాండవులుతమపాణమ్ముల । యాశవీడిరయ్యా
అంతధృతరాష్ట్రుడాధర్మజునకు । యపుడుబలికెనయ్యా
ధృ॥ యిచటమరణించువారలసంఖ్యను । యేర్పరించుమయ్యా

వై॥ అనగధర్మజుడు వినియివ్విధముగ । యపుడుబల్కెనయ్యా

ధర్మ॥ యిలబడిరరువదియారుకోట్లుమరి । యిరువదివేలయ్యా
దురమునకై మొఁటవచ్చివీరులు । మరణించినరయ్యా
మరలమధ్యలోసాయమువచ్చిన । నరులుదెల్యుమయ్యా
యిరువదినాలుగువేలమున్నూట । యిద్దరువినుమయ్యా
సకలసౌఖ్యములుగల్గినలోకము । సరగబోయిరయ్యా

వై॥ అనుచువిదురాదులనుగొని క్రియలను । యాచరించెనయ్యా
దౌమ్యుడుజెప్పినవిధముగకర్మల । త్వరగజేసెనయ్యా
అంతటకుంతీదేవి ధర్మజున । కపుడుబలికెనయ్యా

కుం॥ కర్ణుడుసూర్యాంశంబుననాకే । గలిగెను వినుమయ్యా
నీకగ్రజుఁడగువానికికర్మల । నీవుజేయుమయ్యా

వై॥ అనవినిపాండవులెల్లరు మూర్ఛల । నందిగూలిరయ్యా
గాంధారిధృతరాష్ట్రులదివినుచు । కడుయేడ్చినరయ్యా
అపల్కులువిని కౌరవకాంతలు । యపుడేడ్చినరయ్యా
కర్ణునిభార్యయు కోడండ్లదివిని । కలతజెందిరయ్యా
అంతధర్మజుండతిదుఃఖంబున । యపుడుబలికెనయ్యా

ధ॥ యింతవరకుదాచిపెట్టితల్లీ । యెంతజేసితమ్మా
అతడుదుర్యోధనునితోసౌఖ్యము । లందుచుండెనమ్మా
యిదిదెలపినచో నాడేయడవుల । కేగుచుంటిమమ్మా
అర్ధభాగమిడుమనుచుకురుపతిని । యడుగకుందుమమ్మా
భాగమడుగకుండినచోవైరము । ప్రాప్తించదుసుమ్మా
వైరములేకుండినచో యుద్ధము । వరలునెట్టులమ్మా
కులక్షయంబగుకార్యంబునకై । దలచితివేయమ్మా

వై॥ అనుచుపాండవులు హాహాకారం । బపుడుజేసిరయ్యా
అందరుగంగాతీరంబందున । యధివసించిరయ్యా
సౌప్తికపర్వము జనమేజయునకు । సంయమివినుపించె
శ్రీహరిపాదాంబుజములకియ్యది । జేరగనర్పించె

—: ఫలశ్రుతి :—

# నెం. 1

భారతవీరులచరితమ్ము । పఠియించినగలుగుశుభమ్ము
విధుమౌళివిధేయుడుదీని । విరచించెను భక్తినిబూని
భావానందగురుకృపనుగొని । వ్రాసినాడు యీసత్కృతిని
సదయుండగురామచంద్రుని । పదములకర్పించెనుకృతిని

(వాఖ్యములు ౩౧౬)

(స్త్రీ పర్వము)

సమాప్తము.

ఓం

శ్రీకృష్ణాయనమః

# తందనాన శ్రీ మహాభారతము

## శాంతి పర్వము



## నెం. 1

వై॥ శ్రీజనమేజయభూమీశ । చిత్తగించుమినసంకాశ
సాత్యవతేయుని వినుతింతు । శాంతిపర్వమును వినుపింతు
పాండుతనయులతిదుఃఖమున। బరగుచుండిర తీరమున
కర్ణుండగ్రజుడనివినిరి । ఘనశోకాంబుధినిమునిగిరి
నారదాదిమౌనులుగవిరి । జేరవచ్చిశాంతిసలిపిరి
హరియనేకవిధములయనెను । అంతధర్మజుండిటులనెను
ధ॥ అన్ననుజంపినపాపుండ । అతిలోభినిదురాత్ముండ
నాకీరాజ్యమువలదయ్య । నాకీసౌఖ్యమువలదయ్య
వనమునందు జేరెదనయ్య । మునులనచటగొలిచెదనయ్య
వై॥ అనుచుయేడ్చుచుండెడువాని । వ్యాసుడుగనియిటులనెబూని
వ్యా॥ వినుముదుఃఖమందకుమయ్యా । విధిదప్పదుదెలియగదయ్యా
సంసారంబునసౌఖ్యంబు । స్వల్పమైనలేదునిజంబు
కానిగృహస్థాశ్రమమందు । గలదుమోక్షమార్గముగందు
క్షత్రియకులమునబుట్టితివి । సామ్రాజ్యంబునుబొందితివి
అవనీపాలనమొనరించి । అఖిలధర్మములగావించి
వృద్ధులప్రేమగపోషించి । వివేకంబుమదిగ్రహియించి
సత్కర్మలనిటుగావించి । జనుముమోక్షమార్గమునెంచి
యీకృష్ణునిదయగొనుమయ్యా । యితడుపరాత్పరుడోయయ్యా

అనగధర్మజుడుశాంతించె । అగ్రజునకుశిర్యయగావించె
వై॥ అంతటకోపముగొనెనయ్యా । అపుడుతల్లికిటులనెనయ్యా

నెం. 5

యింతవరకీరహస్యముదాచుట । కిదిఫలమనెనయ్యా
సతులమదిలోరహస్యముండనటు । శాపమిచ్చెనయ్యా
అంతవ్యాసమునిధర్మరాజుగని । యపుడుబలికెనయ్యా
వ్యా॥ సకలరాజ్యపట్టాభిషేకమును । సరగనొందుమయ్యా
తదుపరిభీష్మునిగనుగొనియాతని । నయనుబొందుమయ్యా
వై॥ వినుచుధర్మజాదులునగరమునకు । వెడలుచుండిరయ్యా
శ్రీకృష్ణుండెల్లరనుదోడ్కొనుచు । జేరబోయెనయ్యా
అనేకదేశంబులగలపౌరులు । యపుడువచ్చిరయ్యా
ఆకరిపురమునకలంకారముల । నపుడుజేసిరయ్యా
వ్యాసనారదాదిమౌనులచటికి । వచ్చియుండిరయ్యా
అపుడు సభలోన సింహాసనముల । నమర్చిరోయయ్యా
అందరు సింహాసనములయందున । యపుడునిలచిరయ్యా
మంగళవాద్యంబులుమ్రోగించిరి । మహానందమయ్యా
వందిమాగధులుస్తోత్రపాఠముల । బరగజేసిరయ్యా
ధౌమ్యమౌనిపుణ్యాహవాచనము । త్వరగజేసెనయ్యా
కనకకలశమున గంగాజలముల । గొనితెచ్చినరయ్యా
స్థండిలంబందునిలపిపూజలను । సరగజేసిరయ్యా
పంచపల్లవంబులను కలశమున । నుంచజేసిరయ్యా
మునులువేదమంత్రములపఠించుచు । మోదమందిరయ్యా
చిత్రమొకటియపుడు జరిగెనయ్యది । జెప్పెదవినుమయ్యా
చార్వాకుండనుయసురుడుద్విజవే । సమునవచ్చెనయ్యా
దుర్యోధనునిసఖుండు ధర్మజుని । తోడబల్కెనయ్యా
చా॥ నిన్నుబోలుపాపాత్ముడీభువిన । యెన్నడులేడయ్యా
అతిలోభంబునసకలబంధుగుల । హతముజేసితయ్యా
గురువృనుజంపితి వబద్ధమాడుచు । కులద్రోహివయ్యా

అన్ననుజంపినపాపమతివి ని । న్నరయగూడదయ్యా
శాశ్వతనరకంబనుభవింతువిది । సత్యమువినుమయ్యా
అధర్మమున సంపాదించినరా । జ్యంబుబొందకయ్యా
ధర్మపరుడవై భిక్షమెత్తుకొన । త్వరగనేగుమయ్యా
అందరుజచ్చినవెనుక సౌఖ్యమే । మందెదవోయయ్యా
అధర్మరథమునడుపకృష్ణుని స । హాయమొందిరయ్యా
అశాశ్వతంబగుదేహముచేసుఖ । మందజూడకయ్యా
యీకృష్ణునిచే యపకీర్తిని నీ । విపుడుబొందితయ్యా
వై॥ శౌరియసురుడని తెలిసికొంతవర । కూరకుండెనయ్యా
అంతటమౌనులు తమతమమనముల । యతిచింతిలిరయ్యా
వేయియేలసభికులెల్లమదిలొ । వెతనుజెందిరయ్యా
అంతధర్మజుండతిదుఃఖంబున । యపుడుబలికెనయ్యా
ధ॥ యీయపకీర్తికరంబగురాజ్యము । మేముబొందమయ్యా
మొదలేవలదనిజెప్పినమీరే । బూనుమంటిరయ్యా
పిదపయీవిధమునిందించినచో । విహితముగాదయ్యా
వై॥ అనగమునులు దివ్యదృష్టిగనుగొని । యసురునెరిగిరయ్యా
అతిక్రోధమ్మున హుంకారమ్మును । యపుడుజేసిరయ్యా
అసురుడంతహుంకారవజ్రమున । యవనిగూలెనయ్యా
అంతధర్మజుండిదియేమనగా । హరియపుడనెనయ్యా
కృ॥ అయ్యలారవీడెవడోదెలిపెద । యాలకింపుడయ్యా
మున్నువీడుకడునిష్టతోడతప । మునుజేసినడయ్యా
విధిప్రత్యక్షంబగుచుగోరుమన । వీడుగోరెనయ్యా
సురాసురులచే మరణముజెందని । వరముగోరెనయ్యా
అనగవిధిబల్కెద్విజులతోడనీ । కంతంబగునయ్యా
వీడంతట నావరదర్పంబున । భీతివీడెనయ్యా
అనేకజనములకపకారంబును । యాచరించెనయ్యా
వీడుదుర్యోధనునకు హితుడగుచు । వెలసియుండెనయ్యా
వీడితనికిసాయమైనరణమున । కీడుగూడునయ్యా
సమరవార్తవీడెరుగకుండమో । సంబుజేసితయ్యా

సమరాంతంబునుదెలియుచుయిచటికి । సరగవచ్చెనయ్యా
పరమమునులకోపంబునవీడిట । ప్రాణమువిడెనయ్యా
చార్వాకుండనుపేరబరగురా । కీసుండువీడయ్యా
వై॥ అనగవినిసఖికులత్యానందం । బపుడుబొందిరయ్యా
వానిశవంబును దీసివేసిపని । బూనినిలచిరయ్యా
ధర్మజునంతట కనకాసనమున । త్వరగనిలిపిరయ్యా
అందరు గంగాజలాభిషేకము । లంతజేసిరయ్యా
భీమునియువరాజ్యాభిషిక్తునిగ । వేగజేసిరయ్యా
వైరిబాధలెదురింపగపార్థుఁని । వారునిల్పిరయ్యా
ధర్మకార్యములనరయగనకులుని । త్వరగనిల్పిరయ్యా
సహదేవునిధర్మజురక్షణకై । సరగనుంచిరయ్యా
విదురసంజయయుయుత్సులతగునటు । వెలయనిల్పిరయ్యా
మునులుదీవించి యనేకవిధముల । బొగడుచుండిరయ్యా
అనవరతముజయఘోషముమనుచుహరి । యపుడుబలికెనయ్యా
మీచరితమువిన్నవారికెప్పుడు । మేలగుననెనయ్యా
అంతధర్మజుండెల్లరిపదముల । కపుడుమ్రొక్కెనయ్యా
అనేకమౌనుల కనేకదానము । లపుడుజేసెనయ్యా
అనేకదీనులకన్నదానముల । నంతజేసెనయ్యా
శ్రీకృష్ణునిచెంతకుజనిమోడ్పులు । జేర్చిబలికెనయ్యా
ధ॥ ఆదిమధ్యాంతరహితుండవు వి । శ్వాత్ముడవీవయ్యా
సృష్టిస్థితిలయమూలభూతుడవు । శ్రీవిష్ణుడవీవయ్యా
అట్టినీవు భూభారముడుపనిట । యవతరించితయ్యా
పరమదయచేత నెల్లకాలమిటు । పాలింపగదయ్యా
వై॥ అనుచుపాదములపైబడకృష్ణుం । డపుడుబలికెనయ్యా
కృ॥ నన్నుస్మరించినవారలెల్లపుడు । నాకుబంధులయ్యా
వారిహృదయములయందు బ్రీతిచే । వసింతునోయయ్యా
యెల్లప్పుడుమంగళములవారల । కిచ్చిబ్రోవుమయ్యా
అన్నకన్న నాభార్యకన్న వా । రధికులు వినుమయ్యా
అతిపవిత్రమగుమీచరిత్రమేవ । రాలకింతురయ్యా
పుత్రపౌత్రధనధాన్యసుఖములిడి । పోషింపగదయ్యా

అంతమందునా సాయుజ్యముముద । మారనిత్తునయ్యా
మనమాగాంగేయునిగనవేగమె । జనవలెనోయయ్యా
అతనికియుత్తమలోకంబిడవలె । యాలసింపకయ్యా
వై॥ అనవిని పాండవులందరిదోడ్కొని । యటకుజేరిరయ్యా
అవనింబడు సూర్యునివలెవెలిగెడు । యతనిజూచితయ్యా
అందరుదూరంబుగనేనిల్చుచు । యతనిగాంచిరయ్యా
శ్రీకృష్ణుండొకడాతనిచెంతకు । జేరిముట్టెనయ్యా
హరిధ్యానతత్పరుడైకన్నుల । నతడుమూసెనయ్యా
హరికరస్పర్శచేయానందము । నందజూచెనయ్యా
అంతకృష్ణుడనె పాండుసుతులు ని । న్నరయవచ్చిరయ్యా
కృ॥ యీధర్మజునకు సకలధర్మముల । నిపుడుజెప్పుమయ్యా
వై॥ అనగభీష్ముడా శ్రీకృష్ణునిపద । ములకుమ్రొక్కెనయ్యా
అనేకధర్మంబులను ధర్మజున । కతడుదెల్పెనయ్యా
అంతమాఘమాసంబరుదెంచుచు । యాతడెరిగెనయ్యా
త్వరగశ్రీహరిని మదిలోదల్చుచు । తనువువీడెనయ్యా
గాంగేయుండుత్తమలోకమునకు । కదలిపోయెనయ్యా
పాండవులతనికి సంస్కారంబుల । భక్తిజేసిరయ్యా
అంతట సకలజనంబులుకరిపుర । మపుడుజేరిరయ్యా
అనేకభక్తిగ శ్రీహరిపదముల । నర్చించినరయ్యా
అంతటకృష్ణుడు ద్వారవతికి దా । నపుడు వెడలెనయ్యా
మాయామనుజుడుగావునసుఖముల । మరుగుచుండెనయ్యా
ఓజనమేజయరాజాయీకథ । యుత్తమమగునయ్యా
వ్యాసునిదచేమహాభక్తితో । వర్ణించితినయ్యా
అనివైశంపాయనమునిరాజున । కానతిచ్చెనయ్యా
హరిచరణంబులకర్పించెను పర । మార్థమ్ము చెలువార
యీచరితంబును వినువారికిపర । మేశుడుదయమీరా
సకలసౌఖ్యములనిచ్చిబ్రోచుమో । క్షంబిడుముదమార
కలికల్మష హరణంబొనరించును । కథమువినగగోర
హరినామస్మరణంబుకన్న ము । ఖ్యమేదిఘనులార